# GAYATHRI MAHAVIGNAN - II

# గాయత్రీ మహావిజ్ఞాన్

## ద్వితీయ భాగం

హిందీ మూలము :

వేదమూర్తి, తపోనిష్ఠ, నవయుగద్రష్ట

**పండిత శ్రీరామశర్మ ఆచార్య**

తెలుగు అనువాదం :

**శ్రీ డి.వి.యస్.బి. విశ్వనాధ్**

**శ్రీ జన్నాభట్ల వాసుదేవశాస్త్రి**

ప్రచురణ, ప్రతులకు :

**వేదమాత గాయత్రీ ట్రస్ట్**

గాయత్రీ శక్తిపీఠం, నారాకోడూరు - 522 212.

ఫోన్ : 0863 - 2534440

# గాయత్రీ మహావిజ్ఞానము
## రెండవ భాగము

విషయసూచిక

# గాయత్రీ మాహాత్మ్యము

గాయత్రివలన కలుగు గొప్ప లాభములకు కారణమును గురించి తెలిపిన ఆశ్చర్యము కలుగును. పూర్తిగ తెలిసికొనుట మనుష్యులకు కష్టము. ఒక కారణం మాత్రం చెప్పవచ్చు. ఎందరో మనస్వులైన సాధకులు చేసిన సాధనాబలం గాయత్రి వెనుక ఉన్నది. సృష్టికర్త బ్రహ్మ పర్యంతం నేటికాలానికి చెందిన ఋషులు, మునులు, సాధువులు, మహాత్ములు, శ్రేయోమార్గానచరించే వారు గాయత్రీ మంత్రాన్ని ఆశ్రయంగా పొందిన వారే. వీరందరిద్వారా ఎంతటి గాయత్రీ సాధన, జపము, అనుష్ఠానము జరిగిందో చెప్పటానికి వీలుపడనంతగా ఉన్నది. అత్యంత ఉన్నత శ్రేణికి చెందిన ఆత్మలు తమ సర్వ శ్రేష్ఠభావనలతో, సర్వాధిక ఏకాగ్రతతో, తన్మయత్వంతో గాయత్రీ సాధనచేశారు. కల్పకల్పాంతరాల నుండీ ఈ క్రమం తప్పక జరుగుతున్నది. ఈ విధంగా ఈ మంత్రం వెనుక ఉన్నత శ్రేణికి చెందిన ఆత్మ విద్యుత్తు సమ్మిశ్రితమై సూక్ష్మలోకాలలో వానియొక్క భారీశక్తిపుంజం తయారై ఉన్నది.

ఒక శబ్దం గానీయండి, ఆలోచన గానీయండి, వృథాగా పోవని విజ్ఞానశాస్త్రం తెలిపిన విషయం. ఈ రోజు మనం మాట్లాడే మాటలు, చేసే ఆలోచనలు వాటి తరంగాలతో సహా ఆకాశంలో వ్యాపించి అనంత కాలంవరకు సృష్టియొక్క అంత రిక్షంలో ఏదో ఒక రూపంలో నిండి ఉంటాయి. ఏ తరంగాలు ఎక్కువ శక్తివంతమైనవైతే అవి విశేషంగా దీప్తిస్తాయి. మహా భారతయుద్ధ కాలంనాటి సంభాషణలవి, తాన్‌సేన్‌గానాన్ని తరంగాలుండే సూక్ష్మ ఆకాశంనించి గ్రహించి రికార్డుచేయడానికి ప్రయత్నం జరుగుతున్నది. అది గనుక ఫలిస్తే ప్రాచీన కాలానికి సంబంధించిన గొప్ప విశేషాలను మనం వినదలచిన వాటిని చెవులతో వినవచ్చు. కృష్ణభగవానుని నోట స్వయంగా వెలువడిన గీతామకరందాన్ని ప్రత్యక్షంగా ఆస్వాదించవచ్చు. శబ్దాల, ఆలోచనల సూక్ష్మరూపాన్ని, స్థూలరూపంలోకి తీసుకురావటమనేది యింతకాలంగా కష్టమైనప్పటికీ వాటిఅస్తిత్వం పోలేదనేది మాత్రం నిశ్చయమైన విషయం. ఈనాటి వరకు లెక్కపెట్టటానికి వీలు లేనంతమంది మహానుభావులద్వారా గాయత్రి యెడల చూపబడిన శ్రద్ధ వారు చేసిన జపం నశించిపోక పోగా, సూక్ష్మ లోకాలలో వాటి అస్తిత్వం ప్రబలంగా ఉన్నది. "ఒకే రకమైన పక్షులు ఒకచోట గుమిగూడతాయి. (Birds of the same feather flock together) అనే సిద్ధాంతాని కనుగుణంగా సాధకులందరి శ్రద్ధ, సాధనలు, భావనలు, తపశ్చర్య ఒకే ఒక

చోట కేంద్రీకృతమై ఒక కేవల చైతన్యతాయుక్త ఆధ్యాత్మిక విద్యుద్భాండాగారంలో జమ చేయబడతాయి.

ఆలోచనా విజ్ఞానాన్ని గురించి కొద్దో, గొప్పో తెలిసిన వారందరికీ మనుష్యుడు ఏవిధంగా ఆలోచిస్తే ఆ విధంగా అయస్కాంత తరంగాలు అతని మెదడులో ఉత్పన్న మవుతాయని తెలుసు. ఆ అయస్కాంత శక్తి ఆకాశమంతటా తిరుగుతూ స్వజాతికి చెందిన ఇతర ఆలోచనలను ఆకర్షించి తమవద్ద ఒక పెద్ద పుంజాన్ని జమ చేసుకుంటాయి. సాధుప్రవర్తనను గురించి ఆలోచించేవారిలో సాధుత్వాన్ని గురించి ఆలోచనలు, గుణాలు ప్రవర్తన స్వభావం దినదినాభివృద్ధి చెంది పరిపూర్ణత కలుగుతుంది. అదేవిధంగా పాపిష్టి ఆలోచనలు చేసేవారి విషయంలో గూడా అదేవిధంగా జరుగుతుంది. ఇవన్నీ ఆకర్షణ విజ్ఞానానికి (Science of organetism) అనుగుణంగా జరుగుతాయి. ఈ విజ్ఞానాన్ననుసరించి గాయత్రీసాధకులు సృష్ట్యాదినుండి నేటి వరకూ చేసిన సదాలోచనా పుంజం ఎంతో పెద్దదిగా తయారై ఉన్నది. ఎత్తైన గోడదూకడానికి బలవంతుడై ఉండి శ్రమపడితేగాని వీలుపడదు. అదే నిచ్చెన ఉన్నదనుకోండి బలహీనుడైనా చేయగలడు. పూర్వకాలంలో ఎందరో మహానుభావులు చేసిన గాయత్రీ సాధన అనే నిచ్చెన ఆధారంగా మనం సునాయాసంగా ఎక్కిపోవచ్చు. అక్కడ సమృద్ధంగా దొరికే వాటిని తేలికగా పొందవచ్చు.

గాయత్రీ సాధనలో మనం ఎంత శ్రమపడవలసి వస్తుందో దానికి ఎన్నో రెట్ల సహాయం పూర్వకాలంలోసాధనచేసిన మహానుభావులు వదలి వెళ్ళిన సంపత్తిద్వారా లభిస్తుంది. మనం అనాయాసంగా లాభం పొందవచ్చు. దానికొరకు ఎందరు సాధకులు ఎంతగా శ్రమ పడ్డారో! కాని సూక్ష్మజగతిలో నిర్మింపబడిన సూక్ష్మ విధానంతో మనం మెట్లెక్కి సునాయాసంగా లక్ష్యంవైపు పరుగిడిపోవచ్చు. నీటిబిందువు సముద్రంలోపడితే సముద్రమై పోతుంది. ఒకసిపాయి సేనలో చేరితే అతడు సేనలో ఒక భాగమై పోతాడు. ఒక నాగరికునిమీద ప్రభుత్వశక్తి నిలిచి ఉంటుంది. అదే విధంగా ఒక సాధకుడు గాయత్రీ శక్తి పుంజం ఆధారంగా చేసుకుంటే, ఆశక్తి పుంజంద్వారా లాభాన్ని పొందే పూర్తి వీలు కలుగుతుంది. గాయత్రీమంత్రం వెనుక ఉన్నంతటి శక్తి పుంజం వేదాల వెనుకగూడా లేదు. అందువల్లనే గాయత్రీ సాధనలో స్వల్పశ్రమవల్ల అధిక లాభం కలుగుతుంది.

ఇంత తెలిసినప్పటికీ ఎందరో మనుష్యులు గాయత్రీవల్ల పొందగలిగే లాభాన్ని పొందే ప్రయత్నం చేయటం లేదు. జేబునిండా డబ్బులుంచుకుని వాటిని ఉపయోగించుకోలేక పోవటం ఎటువంటిదో అటువంటి దౌర్భాగ్యులు వారు. మనకు భగవానుడు సరళతరం చేసి అందజేసిన దైవీసంబంధ విద్య గాయత్రి. ఋషులు, మునులు, ధర్మ శాస్త్రాలలో మనను పదేపదే గాయత్రీ సాధనద్వారా లాభం పొందమని ఆదేశించగా, మనం లాభం పొందకపోతే అంతకన్న దౌర్భాగ్యం వేరే ఏముంటుంది?

గాయత్రీ మహిమ, వేదశాస్త్ర, పురాణాలలో విస్తృతంగా వర్ణింపబడింది. అధర్వ వేదంలో గాయత్రి స్తుతింపబడింది. అందులో ఆయువు, ప్రాణము, శక్తి, పశువులు, కీర్తి, ధనం, బ్రహ్మ తేజస్సు ఇచ్చే శక్తిగా చెప్పబడింది.

**స్తుతా, మయా, వరదా, వేదమాతా, ప్రచోదయంతాం, పావమానీ, ద్విజానాం, ఆయుః,ప్రాణం, ప్రజాం, పశుం, కీర్తింద్రవిణం,బ్రహ్మవర్చసం। అధర్వవేదం16-17-**

అధర్వ వేదంలో స్వయంగా వేదభగవానుని పలుకులివి. "నాచేత స్తుతింపబడిన, ద్విజులను పవిత్రులనుచేసే, వేదమాత గాయత్రి, ఆయువును, ప్రాణమును, శక్తిని, పశువు లను, కీర్తిని ధనాన్ని, బ్రహ్మతేజస్సును వారికిచ్చుగాక".

**యథామధుచ పుష్పేభ్యో ఘృతందుగ్ధా ద్రసాత్పయః**
**ఏవం హి సర్వవేదానాం గాయత్రీ సార ఉచ్యతే। – వ్యాసుడు**

ఏ విధంగా పుష్పముల సారమైన మధువు, పాలనుండి నేయి, రసముల సారమైన పాలు, కలుగుతాయో, ఆవిధంగా గాయత్రీ మంత్రము సకల వేదముల సారమై యున్నది.

**తదిత్యృచః సమోనాస్తి మంత్రో వేదచతుష్టయే**
**సర్వేవేదాశ్చ యజ్ఞాశ్చ దానానిచతపాంసిచ**
**సమాని కలయా ప్రాహుర్మునయోన తదిత్యృచః – విశ్వామిత్రుడు**

గాయత్రీ మంత్రమునకు సమానమైన మంత్రము నాలుగువేదము లందునులేదు. సంపూర్ణ వేద, యజ్ఞ, దానం, తపములు గాయత్రి యొక్క ఒక్క కళకు గూడా సమానం కావు ఈ విధంగా మునులు చెప్పారు.

**"గాయత్రీ ఛందసాం మాతేతి" – మహానారాయణోపనిషత్ *115-1***

గాయత్రి వేదములకు మాత అనగా ఆది కారణము

**త్రిభ్యః ఏవతువేదేభ్య : పాదంపాదమదూదుహత్**
**తదిత్యృచో ఽస్యాః సావిత్ర్యాః పరమేష్ఠీ ప్రజాపతిః – మను అం *2-77***

పరమేష్ఠి, ప్రజాపతియైన బ్రహ్మ "మూడు బుక్కులుగల గాయత్రియొక్క మూడు చరణములు, మూడు వేదముల సారమును గ్రహించినవి" యని తెలిపెను.

**గాయత్ర్యాస్తు పరాన్నాస్తి శోధనం పాపకర్మణామ్**
**మహావ్యాహృతి సంయుక్తాం ప్రణవేనచ సంజపేత్ । – సంవర్తస్మృ శ్లో *218***

పాపములను నశింప జేయుటకు సామర్థ్యంగల గాయత్రితో సమానమైన యితర మంత్రములు లేవు. ప్రభావముతో, మహావ్యాహృతులతో కూడిన గాయత్రీ మంత్ర జపం చేయండి.

**నాన్న తోయ సమందానం నచా హింసా పరంతపః**
**న గాయత్రీ సమంజాప్యం నవ్యాహృతి సమంహూతమ్॥**
**– మూలసంహిత – యజ్ఞవైభవఖండం – 6–30**

అన్నముతోను, జలముతోను సమానమైన దానము లేదు. అహింసతో సమాన మైన తపస్సులేదు, గాయత్రికి సమానమైన జపము లేదు. వ్యాహృతితో సమానమైన అగ్నిహోత్రం లేదు

**హస్తత్రాణ ప్రదా దేవీ పతతాం నరకార్ణవే**
**తస్మాత్తా మభ్య సేవిన్నిత్యం బ్రాహ్మణో హృదయే శుచిః**

గాయత్రి నరకరూప సముద్రంలో పడిన వారిని చేయి పట్టి రక్షిస్తుంది. అందువల్ల ద్విజులు ప్రతిదినం పవిత్ర హృదయంతో గాయత్రీ జపం చేయాలి.

**గాయత్రీ చైవ వేదాశ్చతులయా సమతోలయత్**
**వేదా ఏకత్ర సాంగాస్తు గాయత్రీ చైకతః స్థితా. – యోగీ యాజ్ఞవల్క్య**

గాయత్రిని సమస్త వేదములను తులతూచినపుడు ఒక సిబ్బిలో షడంగ సహిత వేదముల నుంచి రెండవ సిబ్బిలో గాయత్రిని ఉంచవలసి వచ్చింది.

**సారభూతాస్తు వేదానాం గుహ్యోపనిషదో మతాః**
**తాభ్యః సారస్తు గాయత్రీ తిస్రో వ్యాహృతయ స్తథా. – యోగీయాజ్ఞవల్క్య**

వేదములసారము ఉపనిషత్తులు. ఉపనిషత్తుల సారము మూడు వ్యాహృతులతో గూడిన గాయత్రి.

**గాయత్రీ వేదజననీ గాయత్రీ పాపనాశినీ**
**గాయత్ర్యాస్తు పరాన్నాస్తి దివి చేహచపావనం**

గాయత్రి వేదములకు జనని, గాయత్రి పాపములను నశింపజేయును. గాయత్రిని మించి పవిత్రము చేయుమంత్రము స్వర్గమున భువిపైన లేదు.

**యద్వ థాగ్నిర్దేవానాం, బ్రాహ్మణో మనుష్యాణామ్**
**వసంత ఋతునామియం గాయత్రీ చాన్తిఛందసామ్. – గోపథ బ్రాహ్మణము**

ఏ విధంగా దేవతలలో అగ్ని, మనుష్యులయందు బ్రాహ్మణుడు, ఋతువులందు వసంతర్తువు శ్రేష్ఠములో అదే విధముగా ఛందముల యందు గాయత్రి శ్రేష్ఠము.

**అష్టాదశసు విద్యాసు మీమాంసాతి గరీయసీ**
**తతోఽపి తర్కశాస్త్రాణి పురాణం తేభ్య ఏవచ**
**తతోఽపి ధర్మశాస్త్రాణి తేభ్యో గుర్వీ శ్రుతిః ద్విజ**

**తతోఽప్యుపనిషచ్ఛ్రేష్ఠా గాయత్రీ చ తతోఽధికా**
**దుర్లభా సర్వతంత్రేషు గాయత్రీ ప్రణవాన్వితా — వృ. సం. భా.**

పదునెనిమిది విద్యలలో మీమాంస అతిశ్రేష్ఠమైనది. మీమాంస కన్న తర్క శాస్త్రము శ్రేష్ఠము. తర్కశాస్త్రము కన్న పురాణములు శ్రేష్ఠములు. పురాణములకన్నను ధర్మశాస్త్రము శ్రేష్ఠము. ధర్మ శాస్త్రములకన్న వేదములు, వేదముల కన్న ఉపనిషత్తులు శ్రేష్ఠములు. ఉపనిషత్తులకన్నను గాయత్రి అత్యధిక శ్రేష్ఠము. ప్రణవయుక్తమగు ఆ గాయత్రి సర్వతంత్రములకంటెను దుర్లభము.

**నాస్తి గంగా సమం తీర్థం న దేవః కేశవాత్పరః**
**గాయత్ర్యాస్తు పరంజాప్యంన భూతం న భవిష్యతి.వృ.యో. యాజ్ఞ అ. 02–76**

గంగతో సమానమైన తీర్థము లేదు. కేశవునకన్న శ్రేష్ఠుడగు దేవత లేదు. గాయత్రీ మంత్ర జపమునకన్న మిన్నయైన జపము భూత భవిష్యత్తులలో లేదు.

**సర్వేషాం జపసూక్తానాం ఋచశ్చ యజుషాం తథా**
**సామ్నాం చైకాక్షరాదీనాం గాయత్రీ పరమోజప.వృ.పరాశరస్మృతి – అ – 4–4**

సమస్త జపసూక్తములందును, ఋగ్యజుస్సామ వేదము లందును. అదే విధమున ఏకాక్షరాది మంత్రములందును గాయత్రీ మంత్ర జపము పరమ శ్రేష్ఠము.

**ఏకాక్షరం పరం బ్రహ్మ ప్రాణాయామాః పరంతపాః**
**సావిత్ర్యాస్తు పరాన్నాస్తి పావనం పరమం స్మృతం.— మనుస్మృతి –అ–2–83**

ఏకాక్షరమనగా "ఓం" అక్షర పరబ్రహ్మము, ప్రాణాయామము పరమ తపము. గాయత్రీమంత్రమును మించి పవిత్ర మొనరించు మంత్రము వేరొకటి లేదు.

**గాయత్ర్యాః పరమం నాస్తి దివి చేహ చ పావనం**
**హస్తత్రాణప్రదా దేవీ పతతాం నరకార్ణవే — శంఖస్మృతి–అ–2–83**

నరకరూప సముద్రమున పడినవారి చేయిపట్టి రక్షించుటలో గాయత్రితో సమానమైన పవిత్ర మొనర్చు వస్తువుగాని, మంత్రముగాని పృథ్విపై గాని స్వర్గమందుగాని లేదు.

**గాయత్రీ చైవ వేదాశ్చ బ్రహ్మణాతోలితా పురా**
**వేదేభ్యశ్చ చతుర్భ్యోఽపి గాయత్ర్యతి గరీయసీ–వృ–పరాశర స్మృతి.అ. 5–16**

ప్రాచీన కాలంలో బ్రహ్మ గాయత్రిని వేదములతో తూచగా నాలుగు వేదములును గాయత్రితో తూగలేక పోయినవి.

**సోమాదిత్యా న్వయాః సర్వే రాఘవాః కురవస్తథా**
**పఠంతి శుచయో నిత్యం సావిత్రీపరమాం గతిమ్ః**

**—మహాభారతం—అను పర్వ.అ—15—78**

ఓ యుధిష్ఠిర ! సంపూర్ణ చంద్రవంశ, సూర్యవంశ, రఘువంశ, కురువంశజులు నిత్యము పవిత్రులై పరమగతి నిచ్చు గాయత్రీ మంత్రమును జపించెడువారు.

**బహునా కిమిహోక్తేన యథావత్ సాధు సాధితా**
**ద్విజన్మనామియం విద్యా సిద్ధి కామదుఘా స్మృతా.**

ఇంతకన్నా హెచ్చుగా చెప్పటంవల్ల లాభమేమున్నది. చక్కగా సిద్ధినిచ్చేటి గాయత్రీవిద్య ద్విజజాతి కొరకు కామధేనువుగా చెప్పబడినది.

**సర్వవేదోద్ధృతః సారో మంత్రోఽయం సముదాహృతః**
**బ్రహ్మదేవాది గాయత్రీ పరమాత్మా సమీరితః**

ఈ గాయత్రి మంత్రము సమస్త వేదముల సారముగా చెప్పబడినది. గాయత్రియే బ్రహ్మాది దేవతలు. గాయత్రియే పరమాత్మగా చెప్పబడినది.

**యా నిత్యా బ్రహ్మ గాయత్రీ సైవ గంగా నసంశయః**
**సర్వతీర్థమయీ గంగా తేన గంగా ప్రకీర్తితా.** --గాయత్రీతంత్రము

గంగ సర్వతీర్థమయియైనందున "గంగ" యని పిలువబడుచున్నది. ఆ గంగ బ్రహ్మ గాయత్రీరూపిణి.

**సర్వశాస్త్రమయీ గీతా గాయత్రీ సైవ నిశ్చితా**
**గయాతీర్థంచ గో లోకం గాయత్రీ రూపమద్భుతం.** --గాయత్రీతంత్రము

గీతయందు సర్వశాస్త్రములును ఇమిడియున్నవి. ఆ గీత నిశ్చయముగ గాయత్రీ రూపమే. గయాతీర్థము గోలోకము గూడ గాయత్రీ రూపములే.

**అశుచిర్వా శుచిర్వాపి గచ్ఛ త్తిష్ఠ న్యథాతథా**
**గాయత్రీం ప్రజపేద్ధీమాన్ జపాత్పాపాన్ని వర్తతే.** – గాయత్రీతంత్రము

అపవిత్రంగాఉన్నా, పవిత్రంగాఉన్నా, నడుస్తున్నా, కూర్చున్నా, ఏస్థితిలోనైనా ఉండనీ బుద్ధిమంతుడైన మనుష్యుడు గాయత్రిని జపిస్తాడు. ఈ జపంవల్ల పాపాలు పటాపంచలవుతాయి.

**మననాత్ పాపతస్త్రాతి మననాత్ స్వర్గమశ్నుతే**
**మననాత్ మోక్షమాప్నోతి చతుర్వర్గమయోభవేత్** – గాయత్రీతంత్రము

గాయత్రిని మననము చేసినంత మాత్రాన పాపం నశిస్తుంది. స్వర్గం లభిస్తుంది. ముక్తి కలుగుతుంది. చతుర్వర్గములు (ధర్మ, అర్థ, కామ మోక్షములు) సిద్ధిస్తాయి.

**గాయత్రీంతు పరిత్యజ్య అన్యమంత్రా నుపాసతే**
**త్యక్త్వా సిద్ధాన్న మన్యత్ర భిక్షామటతి దుర్మతిః** —వేదవ్యాసులు

గాయత్రిని వదలి యితర మంత్రాల నుపాసించేవాడు, సిద్ధంగా పక్వమై ఉన్న అన్నాన్ని వదలి అడుక్కుతిని జీవించేవాడు మూర్ఖుడు.

**నిత్యే నైమిత్తికే కామ్యే తృతీయే తపోవర్ధనే**
**గాయత్ర్యాస్తు పరం నాస్తి ఇహలోకే పరత్రచ.**

నిత్య, నైమిత్తిక, కామ్యకర్మములు సఫలం కావాలంటే, తపోవృద్ధికై ఈ లోకంలోనూ, పరలోకంలోనూ గాయత్రిని మించి వేరేదీలేదు.

**సావిత్రీ జపతే నిత్యం స్వర్గమాప్నోతి మానవః**
**తస్మాత్సర్వ ప్రయత్నేన స్నాతః ప్రయతమానసః**
**గాయత్రీంతు జపేద్భక్త్యా సర్వపాపప్రణాశినీమ్!**

గాయత్రిని తెలిసిన మనుష్యుడు స్వర్గాన్ని పొందుతాడు. ఈకారణంగాస్నానంచేసి సమస్త ప్రయత్నములతో స్థిరచిత్తుడై, సర్వ పాపముల నశింపజేసి కొనదలచినవాడు గాయత్రీ జపం చేయాలి.

S>ᏰB ¡ «dx'''f '

గాయత్రీ జపంవల్ల ఎంతటి మహత్వ పూర్ణమైన లాభాలు కలుగుతాయో క్రింది శ్లోకాలవల్ల తెలుసుకోవచ్చు. బ్రాహ్మణులకు యిది తప్పనిసరిగా చెప్పబడింది. కారణం బ్రాహ్మణత్వం యొక్క సంపూర్ణ ఆధారం సద్బుద్ధిపై ఆధారపడి ఉన్నందున ఆ సద్బుద్ధి గాయత్రివలననే కలుగుతుంది గాబట్టి

**సర్వేషాం వేదానాం గుహ్యో పనిషత్సార భూతాం**
**తతో గాయత్రీం జపేత్** —ఛాందోగ్యపరిశిష్టం.

గాయత్రి సమస్త వేదముల, రహస్యోపనిషత్తుల సారం. అందువల్ల గాయత్రీ మంత్రాన్నినిత్యం జపించాలి.

**సర్వ వేదసార భూతా గాయత్ర్యాస్తు సమర్చనా**
**బ్రహ్మాదయో ఽపి సంధ్యాయాం తాం ధ్యాయంతి జపంతిచ.**

*దే. భా. స్క.16 అ. 16–15*

గాయత్రీ మంత్రముయొక్క ఆరాధన సమస్త వేదముల సారము. బ్రహ్మాది దేవతలు గూడా సంధ్యా కాలంలో గాయత్రిని ధ్యానించి, జపిస్తారు.

**గాయత్రీమాత్ర నిష్ణాతో ద్విజోమోక్షమవాప్నుయాత్**

**దే. భా. స్క. 12 అ. 8-60**

గాయత్రీ మంత్రాన్ను పాసించే బ్రాహ్మణుడు మోక్షాన్ని పొందుతాడు

**ఐహికాముష్మికం సర్వం గాయత్రీ జపతోభవేత్ అగ్నిపురాణము.**

గాయత్రీ జపంచేసే వారికి సమస్తమైన ప్రాపంచిక, పారలౌకిక సుఖాలు గలుగుతాయి.

**యోఽధీతేఽహన్యహన్యేతాం త్రీణి వర్షాణ్యతంద్రితః**
**సబ్రహ్మపరమభ్యేతి వాయుభూతః స్వమూర్తిమాన్ – మనుస్మృతి**

మూడు సంవత్సరములకాలము గాయత్రీ మంత్రజపము చేసిన వాడు అవశ్యం బ్రహ్మప్రాప్తిని పొందుతాడు. వాయువుతో సమానంగా స్వేచ్ఛా గమనం కలవాడవుతాడు.

**కుర్యాదన్యన్నవా కుర్యాదితి ప్రాహ మనుః స్వయం**
**అక్షయం మోక్షమాప్నోతి గాయత్రీ మంత్ర భావనాత్ – శౌనకుడు**

ఈ విధంగా స్వయంగా మనువు చెప్పినమాటలు, ఇతర దేవతల ఉపాసన చేసినా సరే, చేయకపోయినా సరే, కేవలం గాయత్రిని జపించటంవల్లనే అక్షయ మోక్షమును పొందగలుగుతాడు.

**త్రిభ్య ఏవతు వేదేభ్యః పాదం పాద మదూదుహత్**
**తదిత్యృచోఽస్యాః సావిత్ర్యాః పరమేష్ఠీ ప్రజాపతిః**

పరమేష్ఠి పితామహుడైన బ్రహ్మ ఒక్కొక్క వేదముచేత సావిత్రియందలి ఒక్కొక్క పదమును రచిస్తూ, ఆ విధంగా మూడు వేదములతో మూడు పదములను సృజించాడు.

**ఏతయా జ్ఞాతయా సర్వం వాఙ్మయం విదితం భవేత్.**
**ఉపాసితం భవేత్తేన విశ్వం భువన సప్తకం. – యోగి యాజ్ఞ్య**

గాయత్రిని తెలిసినంత మాత్రాన సమస్త విద్యలపైన అధికారి కాగలడు. కేవలం గాయత్రిని మాత్రం ఉపాసన చేయడంవల్ల సప్త లోకములను ఉపాసించినట్లే.

**ఓంకార పూర్వికాత్తి స్రో గాయత్రీం యశ్చవిందతి**
**చరిత బ్రహ్మచర్యశ్చ సవై శ్రోత్రియ ఉచ్యతే– –యోగీయాజ్ఞ్య**

బ్రహ్మచర్యంతో ఓంకారసహిత వ్యాహృతులతో కూడిన గాయత్రీ మంత్ర జపం చేసినవాడు శ్రోత్రియు డనబడతాడు.

గాయత్రియొక్క ఒక్క అక్షరము సిద్ధిపొందిన మాత్రాన హరి, బ్రహ్మ, సూర్యుడు, చంద్రుడు, అగ్ని మొదలైన దేవతలతో గూడ ఎదురొ నిలువ గలడు.

**దశ సహస్రమభ్యస్తా గాయత్రీం శోధనీ పరా. – లఘు అత్రి సంహిత.**

పదివేలసార్లు జపించబడిన గాయత్రి పరమశోధనము చేయగల్గినది (పాప పరిమార్జనము చేయగలదు)

**సర్వేషాంచైవ పాపానాం సంకరే సముపస్థితే**
**దశసహస్రకాభ్యాసో గాయత్ర్యా : శోధనంపరం**

సమస్త పాపములను, సంకటములను పదివేల గాయత్రీ జపము నాశన మొనరించి పరమశుద్ధుని చేయగల్గును.

**గాయత్రీమేవ యోజ్ఞాత్వా సమ్యగుచ్చరతే పునః**
**ఇహాముత్రచ పూజ్యో ఒసౌ బ్రహ్మలోకమవాప్నుయాత్ –వ్యాస**

గాయత్రిని చక్కగా తెలిసి, ఉచ్చారణ చేసినవాడు ఈ లోకమందును పరలోక మందును పూజ్యుడు బ్రహ్మసాయుజ్యమును పొందును.

**మోక్షాయచ ముముక్షూణాం శ్రీ కామానాం శ్రియే తదా**
**విజయాయ యుయుత్సూనాం వ్యాధితానామరోగ కృత్ ! – గాయత్రీ పంచాంగము**

గాయత్రీ సాధన చేత ముముక్షువులకు మోక్షము కలుగును, సంపద కోరిన వారికి సంపద లభించును. యుద్ధమందు విజయము కోరిన వారికి విజయము లభించును. వ్యాధిగ్రస్తులు ఆరోగ్యవంతులగుదురు.

**వశ్యాయ వశ్యకామానాం విద్యాయై వేదకామినాం**
**ద్రవిణాయ దరిద్రాణాం పాపినాం పాపశాంతయే.**

వశీకరణము నాసించినవారికి వశీకరణము గల్గును, వేదార్థులకు విద్య, దరిద్రులకు ధనము, పాపులకు పాపముల నుండి శాంతి కలుగును.

**వాదినాం వాదవిజయే కవీనాం కవితా ప్రదం**
**అన్నాయ క్షుధితానాంచ స్వర్గాయ నాకమిచ్ఛతాం.**

శాస్త్రార్థులకు శాస్త్రములందు విజయము, కవులకు కావ్య లాభము, ఆకలిగొన్న వారికి అన్నము , స్వర్గమునందు కోరికగల వారికి స్వర్గము లభించును.

**పశుభ్య : పశుకామానాం పుత్రేభ్య : పుత్ర కామినాం**
**క్లేశితాంశోక శాంత్యర్థం నృణాం శత్రుభయాయచ**

పశువులు కావలసిన వారికి పశువులు, పుత్రులు కావలసిన వారికి పుత్రులు. క్లేశములు కలవారికి క్లేశశాంతి, శోకములు గల వారికి శోక శాంతి, శత్రుభయమున్నవారికి అభయము కలుగును.

**అష్టాదశసు విద్యాసు మీమాంసాఽస్తి గరీయసీ**
**తతోఽపి తర్క శాస్త్రాణి పురాణం తేభ్యఏవచ॥**

పదునెనిమిది విద్యలయందును మీమాంస శ్రేష్ఠము, అందును తర్కశాస్త్రము శ్రేష్ఠము, పురాణము దానికన్నను శ్రేష్ఠము.

**తతో ఽ పి ధర్మశాస్త్రాణి తేభ్యోగుర్వీ శ్రుతి : నృప**
**తతో హ్యుపనిషత్ శ్రేష్ఠ గాయత్రీ చ తతోధికా.**

ధర్మశాస్త్రములు పురాణములకన్నను శ్రేష్ఠము శ్రుతులు (వేదములు) వాని కన్న శ్రేష్ఠములు. శ్రుతులకన్న ఉపనిషత్తులు శ్రేష్ఠములు, గాయత్రి వానికన్న ఎక్కువ.

**తాందేవీము పఠిష్యంతే బ్రాహ్మణాయే జితేంద్రియా :**
**తే ప్రయాంతి సూర్యలోకం కామాన్ముక్తించ పార్థివ.** —పద్మ పురాణము

జితేంద్రియుడైన బ్రాహ్మణుడు ఈ గాయత్రీ ఉపాసన చేసినచో అతడ వశ్యము సూర్యలోకమును పొంది క్రమముగా ముక్తిని పొందును.

**సావిత్రి సారమాత్రేఽపి వరం విప్ర : సుమంత్రిత :**

నాలుగు వేదముల సారమైన గాయత్రినివిధి సహితముగా తెలిసిన బ్రాహ్మణుడు శ్రేష్ఠుడు.

**గాయత్రీం యస్తుజపతి కల్యముత్థాయ యోద్విజ :**
**న లింపతి న పాపేన పద్మపత్రమివాంభసా.**

ఏ బ్రాహ్మణుడు ప్రాత : కాలమున నిద్రలేచి గాయత్రీ జపము చేయునో అతడు కమల పత్రము పై జలమువలె పాపగ్రస్తుడు కానేరడు.

**అర్థోఽయం బ్రహ్మ సూత్రాణాంభారతార్థ వినిర్ణయ :**
**గాయత్రీ భాష్య రూపోఽసౌ వేదార్థ పరిబృంహిత :** —మత్స్య పురాణము.

గాయత్రీయొక్క అర్థము బ్రహ్మసూత్రములు, గాయత్రీ నిర్ణయము మహాభారతము, గాయత్రి అర్థము వేదములందు ఉన్నది.

**జపన్తి పాపసీందేవీం గాయత్రీం వేదమాతరం**
**తపసాభావితో దేవ్యా బ్రాహ్మణా : పూతకిల్బిష :** —కూర్మ పురాణము.

బ్రాహ్మణుడు వేదజనని పవిత్రయైన గాయత్రీ జపము చేయుచుండిన అనేక పాపముల నుండి విముక్తి పొందును.

**గాయత్రీ ధ్యాన పూతస్య కలాంనార్హతి షోడశీం**
**ఏవంకిల్బిషయుక్తస్య వివిర్దహతి పాతకం ।**

గాయత్రీ ధ్యానమువలన పవిత్రములైన షోడశ కళలకు విలువ ఏమీ ఉండదు. ఈ ప్రకారంగా అది పాపయుక్తమైన పాపములను దహనము చేయును.

**ఉభేసంధ్యే హ్యు పాసీతా తస్మాన్నిత్యం ద్విజోత్తమ**
**ఛంద స్తత్యాస్తు గాయంతం గాయత్రీత్యుచ్యతేతతః —మత్స్య పురాణము**

హే ద్విజ శ్రేష్ఠ ! గాయత్రినిఛందాను హారముగా ఉభయ సంధ్యల యందునుధ్యానము చేయవలెను.

గానము చేయువారికి త్రాణ (ఉపశమనము) కల్గించును గాన గాయత్రి అని పేరువచ్చినది.

**గాయంతం త్రాయతే యస్మాత్ గాయత్రీ తు తత : స్మృతా**
**మారీచ ! కారణాత్తస్మాత్ గాయత్రీ కీర్తి తామయా — లంకేశ తంత్రము**

ఓమారీచ ! గానము చేయువారలకు త్రాణము (ఉపశమనము) కల్గించెడి కారణమున నేను దీనిని గాయత్రి యందును.

**తత : బుద్ధి మతాంశ్రేష్ఠ నిత్యం సర్వేషు కర్మను**
**సవ్యాహృతిం సప్రణవాం గాయత్రీం శిరసానహ**
**జపంతి యే సదాతేషాం న భయం విద్యతే క్వచిత్**
**దశకృత్వ : ప్రజప్యా సా రాత్ర్యహ్నాపి కృతం లఘు। —నారద పురాణము.**

బుద్ధిమంతులలో శ్రేష్ఠుడా ! నీవు నిత్యనియమిత కార్యములన్ని చేయుచు, ప్రణవముతో, వ్యాహృతులతో గాయత్రీ మంత్రము నెవడు. ఎల్లప్పుడు జపించునో అతనికి భయమనేది ఉండదు. రాత్రిగాని, పగలుగాని పదిసార్లు జపంచేస్తే చిన్న దోషాలు నివారించబడతాయి.

**కాముకో లభతే కామాన్ గతి కామశ్చ సద్గ తిం**
**అకామ : సమవాప్నోతి తద్విష్ణో : పరమం పదమ్**

కామాభిలాషికి కోరికలు తీరును, మోక్షమును కోరిన వానికి మోక్షము లభించును. నిష్కామభావముతో గాయత్రినుపాసించిన విష్ణువు యొక్క పరమ పదము లభించును.

**ఏత దక్షరమేకాం చ జపన్ వ్యాహృతి పూర్వకం**
**సంధ్యయో ర్వేద విద్విప్రో వేద పుణ్యేన యుజ్యతే.**

వ్యాహృతి పూర్వకముగా ఈ గాయత్రిని ఉభయ సంధ్యల యందును జపించు బ్రాహ్మణునికి వేదపఠనముతో సమమైన పుణ్యము లభించును.

**ఇయంతు సవ్యాహృతికా ద్వారం బ్రహ్మపదాప్తయే**
**తస్మాత్ప్రతిదినం విప్రరధ్యేతవ్యాతథైవ సా.**

ఈ గాయత్రి బ్రహ్మపద ప్రాప్త ద్వారము, అందువలన బ్రాహ్మణులు వ్యాహృతితో ప్రతి దినం అధ్యయనం చేయాలి.

**యోఽధీతేఽహన్య హన్యేతాం త్రీణి వర్షాణ్య తంద్రిత :**
**స బ్రహ్మ పదమభ్యేతి వాయుభూత : స మూర్తిమాన్.**

ఎవరీ గాయత్రిని తంద్రారహితముగా( బద్ధకమును వదలి) మూడు సంవత్సరములు పర్యంతము నియమిత రూపంలో జపిస్తారో వారు బ్రహ్మను నిస్సందేహముగా పొందగలరు

**తత్పాపం ప్రణుదత్యాశు నాత్ర కార్యావిచారణా**
**శతం జప్త్వాతు సా దేవీపాపౌఘు శమనీ స్మృతా**

100 సార్లు గాయత్రీ మంత్ర జపంచేస్తే సర్వపాపములు శీఘ్రంగా నశిస్తాయి. ఇందులో సందేహంలేదు.

**విధినా నియతం ధ్యాయేత్ ప్రాప్నోతి పరమంపదం**
**యథా కథంచిజ్జపితా గాయత్రీ పాపహారిణీ,**
**సర్వకామ ప్రదాప్రోక్తా పృథ క్కర్మసు నిష్ఠితా.**

విధి పూర్వకంగా, నియమిత ధ్యానం చేస్తే పరమపదం లభిస్తుంది. ఏవిధంగా జపించినప్పటికీ గాయత్రి పాపములను నశింపజేస్తుంది. వివిధ ప్రయోజనాలను దృష్టిలో ఉంచు కొని జపిస్తే అభీష్టసిద్ధి కలుగుతుంది.

## గాయత్రి జపం వల్ల లాభాలు

గాయత్రి సాధనవల్ల అన్నిరకాలైన పాపాల నుండి, దుఃఖముల నుండి నివృత్తి కలుగుతుంది.

**బ్రహ్మహత్యాది పాపాని గురూణిచ లఘూనిచ**
**నాశయత్యచిరేణైవ గాయత్రీ జాపతో ద్విజ** — పద్మ పురాణం

గాయత్రిని జపించువారికి బ్రహ్మహత్యతో సహా అన్ని పాపములు, చిన్నవైనా వెంటనే నశిస్తాయి.

**గాయత్రీ జపకృద్భక్త్యా సర్వపాపైః ప్రముచ్యతే — పరాశరుడు**

భక్తితో గాయత్రిని జపించువాడు సర్వ పాపముల నుండి విముక్తుడగును.

**"సర్వపాపాని నశ్యంతి గాయత్రీ జపతో నృణామ్. —భవిష్య పురాణం**

గాయత్రిని జపించువాడు సర్వపాపముల నుండి విముక్తుడగును.

**గాయత్ర్యష్ట సహస్రంతు జపం కృత్వా స్థితే రవౌ**
**ముచ్యతే సర్వపాపేభ్యో యది న బ్రహ్మద్విడ్భవేత్ = అత్రి స్మృతి-3-15**

సూర్యుని ఎదుట ఎనిమిదివేల గాయత్రీ జపం చేస్తే అతడు సర్వ పాపముల నుండి విముక్తి పొందుతాడు. బ్రహ్మనింద అనగా జ్ఞానులను నిందించకపోతే !

**సహస్రకృత్వస్త్వభ్యస్య బహిరేతస్త్రికం ద్విజః**
**మహతోప్యేనసో మాసాత్వచేవాహిర్విముచ్యతే . — మను. అ. 2-76**

ఏకాంతస్థలంలో, ప్రణవ, మహావ్యాహృతి పూర్వకంగా సహస్ర గాయత్రీజపం చేసిన ద్విజుడు ఎంతటి పెద్ద పాపాల నుండియైనా విముక్తుడవుతాడు. (పాము కుబుసం విడిచినట్లు)

**"జనాయై స్తరంతి తాని తీర్థాని"**

పాపముల నుండి విముక్తులను చేసి, భవసాగరమును తరింపజేయునది తీర్థముగా చెప్పబడినది. గాయత్రి యందలి మూడు అక్షరములలో తీర్థము యిమిడి యున్నది.

గ=గంగా, య=యమునా, త్రీ=త్రివేణి

**బ్రహ్మహత్యా సురాపానం స్తేయః గుర్వంగ నాగమః**
**మహాన్తిపాతకాదీని స్మరణాన్నాశమాప్నుయుః —గాయత్రీ పు.2.2**

గాయత్రిని స్మరించినంత మాత్రాన బ్రహ్మహత్య, సురాపానము, దొంగతనము, గురుస్త్రీగమనము మొదలైన మహాపాతకములు గూడా నశిస్తాయి.

**య ఏతాం వేద గాయత్రీం పుమాన్ సర్వగుణాన్వితాం**
**తత్వేన భరత శ్రేష్ఠ ! స లోకే న ప్రణశ్యతి**

*మహాభారతం=భీష్మపర్వంలో 1. 14-16.*

ఓ యుధిష్ఠిర ! తత్వ పూర్వకమై సర్వగుణ సంపన్నమై పుణ్యమయియైన గాయత్రి నెవడు తెలుసుకుంటాడో అతడు ప్రపంచంలో దుఃఖాలను పొందడు.

**గాయత్రీ విరతం హవ్య కవ్యేషు వినియోజయేత్**
**తస్మిన్న తిష్ఠతే పాపమ బిందురివ పుష్కరే.**

గాయత్రిని జపించువారిని మాత్రమే దేవ పితృ కార్యముల యందు పిలవాలి. దానికి కారణం, వారిలో పాపం ఉండదు. కమలపత్రంలో నీరు నిలువదు గదా !

**గాయత్రీం యఃపఠేద్విప్రో న స పాపేన లిప్యతే !  – లఘు అత్రి సంహితా**

ఏ ద్విజుడు గాయత్రిని జపించునో, అతడు పాపములను పొందడు.

చరక సంహితలో గాయత్రీ సాధనతోపాటు ఉసిరికాయతినేవారు దీర్ఘాయుర్దాయాన్ని పొందుతారని చెప్పబడింది.

**సావిత్రీం మనసా ధ్యాయ న్బ్రహ్మచారీ జితేంద్రియః**
**సంవత్సరాంతే పౌషీంవా మాఘీంవా ఫాల్గుణీంతిథిం**

*– చరకచికిత్స–ఆమ్ల–రసా.శలో6*

బ్రహ్మచర్యంతో మనసులో ఒక సంవత్సరంపాటు గాయత్రిని ధ్యానించి. సంవత్సరం పూర్తయిన తరువాత పుష్యమాసం, లేదా మాఘ మాసం లేదా ఫాల్గుణ మాసంలో ఒక శుభతిథిలో మూడు రోజులు ఉపాసన చేసి, ఉసిరి చెట్టెక్కి తినగలిగినన్ని ఉసిరికాయలు తింటే, అన్ని సంవత్సరాలు జీవించవచ్చు.

**"యది హవా అప్యేవం విద్వాన్వహ్వివ ప్రతి గృహ్ణాతి న హైవ తద్గాయత్ర్యా ఏకం చ న పదం ప్రతి. స య ఇమాన్ త్రీన్లోకాన్పూర్ణాన్ ప్రతి గృహ్ణీయాత్సోస్యా ఏతత్ప్రథమం పదమవాప్నుయాచ్చ యావతీయం త్రయీవిద్యా యస్తావత్ప్రతి గృహ్ణీయాత్ సోఽస్యా ఏతద్ద్వితీయ పదమవాప్నుయాదథ యావది మే ప్రాణి నోయస్తావత్. ప్రతిగృహ్ణీయాత్సోఽస్యా ఏతత్తృతీయ పదమవాప్నుయాత్. అథాస్యాః ఏత దేవ తురీయం దర్శనం పదం పరోఽజాయ ఏషతపతి నైవకేనచనాప్య కృత ఉవీతావత్ప్రతి గృహ్ణీయాత్–**

*– బృ–5–14–5–6,*

గాయత్రిని సర్మాత్మక భావంతో జపించే మనుష్యుడు ఎంత ప్రతి గ్రహం చేసినా (దానం పట్టినా) అతడి ప్రతి గ్రహదోషము గాయత్రి యందలి మొదటి పాదం ఉచ్చారణ చేసి నంతకూడా సాటిరాదు. మూడు లోకములను దానం తీసుకున్నా దాని దోషం ప్రథమ పాదాన్ని ఉచ్చరించటంతో నశిస్తుంది. మూడు వేదములను దానం పుచ్చుకున్నా దాని దోషం ద్వితీయ పాదంతో నశిస్తుంది. విశ్వమందలి ప్రాణులం దరిని దానం తీసుకున్నప్పటికీ దాని దోషం తృతీయ పాదంతో నశిస్తుంది. అందు వల్ల గాయత్రిని జపంచేసేవారికి ఎట్టి హానీ కలుగదు. గాయత్రి యందలి నాల్గవ పాదం పరబ్రహ్మ. దానికి సాటి ప్రపంచంలో మరొకటి లేనే లేదు.

**యదహ్నాత్ కురుతే పాపం తదహ్నాత్ప్రతి ముచ్యతే**
**యద్రాత్రియాత్కురుతే పాపం తద్రాత్రియాత్ప్రతి ముచ్యతే**

**–తై.ఆ.ప్ర.10.అ.34**

హే గాయత్రీ ః నీ ప్రభావంవల్ల పగలు చేసిన పాపం పగలే నశించగా, రాత్రి చేసిన పాపం రాత్రే నశిస్తుంది.

**గాయత్రీంతు పరిత్యజ్య యోఽన్య మంత్రముపాసతే**
**ముండకర్మాస్తే తే జ్ఞేయా ఇతి వేద విదో విదుః**

ఎవరు గాయత్రి మంత్రమును వదలి యితర మంత్రముల నుపాసింతురో వారు నాస్తికులు, అని వేద విదులు చెప్పెదరు.

**గాయత్రీ చింతయేద్యస్తు హృత్పద్మే సముపస్థితాం**
**ధర్మాధర్మ వినిర్ముక్తః స యాతి పరమాం గతిం॥**

ఏ మనుష్యుడు హృదయ కమలంలో నివసించియున్న గాయత్రిని గురించి చింతించునో. అతడు ధర్మాధర్మములను ద్వంద్వముల నుండి విముక్తుడై పరమగతిని పొందును.

**సహస్రంజప్తాసా దేవీ హ్యుపపాతక నాశినీ**
**లక్షే జాప్యే తథా సాచ మహాపాతక నాశినీ**
**కోటిజప్యేన రాజేంద్ర ! యదిచ్ఛతి తదాప్నుయాత్.**

గాయత్రి సహస్రమును జపించినవారు పాతకముల నుండి విముక్తులగుదురు. లక్ష గాయత్రి జపము చేసినవారు మహాపాపముల నుండి విముక్తులగుదురు. ఒకకోటి జపము చేసిన కోరిన సిద్ధిని పొందుదురు.

## గాయత్రీ వలన పాపముల నుండి, దుఃఖముల నుండి నివృత్తి

ఒక్క తెలియని, తెలిసినా ఉపాసించని ద్విజులను శాస్త్రకారులు నిందించారు. వారలను అధోగాములుగా నిరసించారు. ఎవరైనా పొరపాటువల్ల, అశ్రద్ధవల్ల గాయత్రీ ఉపాసన మానివేస్తే వారు సావధానులై తిరిగి గాయత్రీ ఉపాసనను ప్రారంభించమని హెచ్చరిక చేయబడింది.

**గాయత్ర్యుపాసనా నిత్యా సర్వవేదైః సమీరితా**
**యయా వినా త్వధః పాతో బ్రాహ్మణస్యాస్తి సర్వథా.**

*– దేవీ భాగవతం–స్కం. 12–అ–86*

గాయత్రిని నిత్యమూ ఉపాసించాలని సమస్తవేదములందును చెప్పబడింది. గాయత్రిని ఉపాసించని బ్రాహ్మణునకు అధోగతి తప్పదు.

**సాంగాంశ్చ చతురో వేదానధీత్యాపి సవాఙ్మయాన్**
**గాయత్రీం యోన జానాతి వృథా తస్య పరిశ్రమః — యో॰ యాజ్ఞవల్క్య**

సస్వరముగా, సాంగముగా నాలుగు వేదములనూ తెలిసినప్పటికీ గాయత్రీమంత్రము తెలియనివాని శ్రమ నిష్ఫలము.

**గాయత్రీంయః పరిత్యజ్య చాన్యమంత్రముపాసతే**
**న సాఫల్యమావాప్నోతి కల్పకోటిశతైరపి వృ.సంధ్యాభాష్యే,**

ఎవరు గాయత్రి మంత్రమునువదలి ఇతర మంత్రములనుపాసింతురో వారు కోట్ల జన్మలనెత్తినప్పటికిని సాఫల్యమును పొందజాలరు.

**విహాయ తాం తు గాయత్రీం విష్ణూపాసనతత్పరః**
**శివోపాసనతో విప్రో నరకం యాంతి సర్వథా. — దేవీభాగవతం**

గాయత్రిని వదలి విష్ణువును గానీ, శివునుగానీ పూజించినప్పటికీ బ్రాహ్మణుడు నరకానికే పోతాడు.

**గాయత్ర్యా రహితో విప్రః శూద్రాదవ్యశుచిర్భవేత్**
**గాయత్రీ బ్రహ్మతత్వజ్ఞః సంపూజ్యస్తు ద్విజోత్తమః**

గాయత్రీ లేని బ్రాహ్మణుడు శూద్రునికన్న నపవిత్రుడు. గాయత్రీ రూపముగా బ్రహ్మతత్వము తెలిసినవాడు సర్వత్రా పూజ్యుడు.

**ఏతదృర్చా విసంయుక్త కాలేచ క్రియయా వినా**
**బ్రహ్మక్షత్రియ విద్యోపి గర్హణాం యా ంతి సాధుషు — మనుస్మృతి –అ–280**

ప్రణవ, వ్యాహృతి పూర్వక గాయత్రీ మంత్రజపము సంధ్యాకాలమునందుచేయని ద్విజుడు సజ్జనులయందు నిందాపాత్రుడు కాగలడు.

**ఏవంయస్తు విజానాతి గాయత్రీం బ్రాహ్మణస్తు సః**
**అన్యథాశూద్రధర్మా : స్యాద్ వేదానామపి పారగః యో, యాజ్ఞ**

ఎవరు గాయత్రీని తెలిసికొని జపిస్తారో వారు బ్రాహ్మణులు, కానిచో వేదవేదాం పారంగతుడైనను శూద్రునితో సమానము.

**అజ్ఞాత్వైతాం తు గాయత్రీం బ్రాహ్మణ్యా దేవహీయతే**
**అపవాదేన సంయుక్తో భవేచ్ఛృతి విదర్శనాత్. యో. యా**

గాయత్రి నెరుగని బ్రాహ్మణుడు. బ్రాహ్మణత్వమును కోల్పోయి పాపయుక్తుడగునని శ్రుతియందు చెప్పబడినది.

కింవేదై : పఠితైస్సర్వై : సేతిహాస పురాణకై :
**సాంగై : సావిత్రి హీనేన న వి ప్రత్వమవాప్యతే. – వృ. పరిశం, 5–24**

ఇతిహాస, పురాణములను, సకల వేదములను చదివినప్పటికిని, బ్రాహ్మణుడు గాయత్రీ మంత్రహీనుడైనచో బ్రాహ్మణత్వమును పొందజాలడు.

**న బ్రాహ్మణో వేదపాఠాన్న శాస్త్ర పఠనాదపి**
**దేవ్యాస్త్రి కాలాభ్యాసాద్బ్రాహ్మణ : స్యాద్విజో 2 న్యథా । వృ. సంధ్యాభాష్యే.**

వేదశాస్త్రములను చదివినంతనే బ్రాహ్మణత్వం కలుగదు, మూడు కాలములందును గాయత్రీ ఉపాసన చేత బ్రాహ్మణత్వము కల్గును, అన్యథా అతడు ద్విజుడుగా నుండజాలడు.

**ఓంకారం పితృరూపేణ గాయత్రిం మాతరం తథా**
**పితరౌయో న జానాతి స విప్రస్త్వన్య రేతసః । 86 ।**

ఓంకారమును పితగా, గాయత్రినిమాతగా తెలియని పురుషుడు అన్య సంతానము అనగా వ్యభిచారికి పుట్టినవాడుగా భావింపబడును.

**ఉపలభ్యచ సావిత్రీ నో పతిష్ఠతియోద్విజ :**
**కాలేత్రికాలం సప్తాహాత్ తత్పతనంనాత్ర సంశయః**

గాయత్రీ మంత్రమును తెలిసి, ద్విజుడు ఉపాసింపని యెడల అంటే త్రికాలముల యందును జపము చేయని యెడల అతడు తప్పక పతితుడగును.

## గాయత్రి ఆధ్యాత్మిక త్రివేణి యనబడును

ఇంతకు ముందు గాయత్రి మహిమ వర్ణింపబడింది. వేద శాస్త్రపురాణాలలోని వర్ణనను పూర్తిగా అందీయడం కష్టం. గంగ, గీత, గాయత్రి. గోవు ఈ నాలుగూ ఆర్య ధర్మమునకు పట్టు కొమ్మలు, భారతీయ ధర్మాన్నాదరించే వారు ఈ నాలుగింటిని తల్లిగా గౌరవిస్తారు, ఒక మాత సంతానంగా భావిస్తారు. ఏకత్వాన్ననుభవిస్తారు.

గాయత్రి ఆధ్యాత్మిక త్రివేణిగా చెప్పబడింది. గంగా యమునల కలయికవల్ల ఒక అదృశ్య, సూక్ష్మ, అలౌకిక దివ్య సవితా ఆవిర్భావం కలుగుతుంది. దాన్ని సరస్వతి అంటారు. గంగా, యమునా,సరస్వతుల సమ్మేళనమే త్రివేణి. త్రివేణి కావడంవల్ల ప్రయాగ తీర్థరాజమైనది. అదేవిధంగా ఆధ్యాత్మిక జగతిలో త్రివేణి గాయత్రి. ఆ

మూడు అక్షరాలూ త్రివేణికి సంకేతాలుగా త్రిగుణాత్మక సమ్మేళన రహస్యాన్ని తెలుపుతాయి. "గ" గంగకు "య" - యమునకు సంకేతం. "త్రి" - త్రివేణికి సంకేతం త్రయీశక్తిలో ఎన్ని త్రయాలున్నాయో : (1) సత్, చిత్ - ఆనంద (2) సత్య, శివ, సుందర (3) సత్వ, రజ, స్తమములు (4) ఈశ్వర, జీవ, ప్రకృతులు (5) ఋగ్యజుస్సామ (6) బ్రాహ్మణ, క్షత్రియ వైశ్య (7) గుణ, కర్మస్వభావములు (8) శైశవ, యౌవన, వృద్ధాప్య (9) బ్రహ్మ, విష్ణు, మహేశ్వర (10) ఉత్పత్తి, వృద్ధి, నాశము (11) చలి, వేడి, వర్షము (12) ధర్మ, అర్థ, కామములు 13) దేవ, మనుష్య, అసుర మొదలైన లెక్కింపవలవిగాని త్రికములు గాయత్రీ ఛందంలో ఇమిడి ఉన్నాయి. వానియందు శ్రవణ, మనన, చింతనముల ద్వారా ఆధ్యాత్మిక స్నానం చేస్తే త్రివేణీ సంగమంలో స్నానం చేసినంత పుణ్యం లభిస్తుంది. ఈ మూడు అక్షరాలలో మనముందు మూడు సమస్యలు ఎదురు నిలుస్తాయి. వానిని అవగాహన చేసుకుంటే జీవన్ముక్తి అనే పరమ ఫలం లభిస్తుంది.

త్రివేణి యందలి మూడుధారలను చూస్తే గొప్ప దుస్తర, భయం కర్మ, విశాల, అగాధం కనిపిస్తుంది. ఈ విధంగా గాయత్రీ యందు ఇమిడియున్న సమస్యలు చాలా కష్టమైనవి. త్రివేణిలో దిగి స్నానం చేయగానే భయం పోయినట్లు, శాంతిని, చల్లదనాన్ని, ఇచ్చినట్లు గాయత్రి యందిమిడియున్న సమస్యలను చింతన, మనన, అవగాహన చేసుకోవటంవల్ల ఎంతో తత్వజ్ఞానం లభించి, శాశ్వత శాంతి, పరమానందం కలుగుతవి. గాయత్రి నిస్సందేహంగా ఆధ్యాత్మిక త్రివేణి, తీర్థరాజము. అందలి తత్వ జ్ఞానము అతి సరళము, సుబోధకము, సుగమము, తిన్ననిది సుఖశాంతుల నిచ్చునది.

గాయత్రీ మహిమ అనంతము. వేద - పురాణ, శాస్త్ర, ఇతిహాస, ఋషి - ముని, గృహస్థ - విరాగి అన్నీ సమానంగా గాయత్రీ మహత్వమును స్వీకరిస్తారు. మన దృష్టి కోణమును మార్చే అపారశక్తి అందున్నది. మనవ్యతిరేక, ఆలోచనలు, భావనలు ఉచిత స్థానంలోకి వస్తాయి. మనుష్యుని దేవతగా మార్చి భూలోకాన్ని సురలోకం చేయగలవు. అందరికీ ఆనందాన్ని అందీయగలవు. ఈ విషమ స్థితిని తప్పించి మన మెదడును సాఫీ చేసే శక్తి గాయత్రిలో ఉన్నది. ఎవరు ఆశక్తిని ఉపయోగించుకుంటేవారు విషమ వికారములనుండి, భ్రాంతి వివాదములనుండి దుర్భావములనుండి, భవబంధనముల నుండి విడివడి జీవనము యొక్క సత్య, శివ, సుందర రూపమును దర్శింపగలుగుతారు. పరమాత్మయొక్క శాశ్వత శాంతి లభిస్తుంది. అందువలన వేద మాతయగు గాయత్రీ మహామహిమామయిగా కీర్తింపబడింది. ఆమె మాహాత్మ్యమనంతము.

# గాయత్రీ గీత

వేదమాత గాయత్రీ మంత్రం చాలా చిన్నది. అందులో ఉన్న 24 అక్షరాలలో అనంత జ్ఞానమనే సముద్రం నిండి నిబిడీ కృతమై ఉన్నది. గాయత్రీ గర్భంలో యిమిడి ఉన్న జ్ఞానం సర్వాంగపూర్ణమై పరిమార్జితమైనది. దాన్ని మనుష్యుడు చక్కగా అర్థం చేసుకుని జీవితంలో ఆచరణలో పెడితే ఇహలోకంలోనూ పరలోకంలోనూ గూడా అన్ని విధాలైన సుఖశాంతులూ లభిస్తాయి.

ఆధ్యాత్మిక, ఐహిక దృష్టికోణాలు రెంటితో చూసినా గాయత్రీ సందేశం ఎంతో అర్థంతో కూడినది. దాన్ని గంభీరతా పూర్వకంగా తెలుసుకుని, మననంచేస్తే సద్ జ్ఞానమనే అవిరళ స్రోతం ప్రస్ఫుటితమవుతుంది. క్రింద సంక్షిప్త గాయత్రీ మంత్రార్థం యివ్వబడింది. అదే గాయత్రీ గీత :

(1) ఓ మిత్యేవ సునామధేయ మనఘం విశ్వాత్మనే బ్రహ్మణః
సర్వేష్వేవ హితస్య నామసువసో రేతత్ప్రధానం మతం
యంవేదా నిగదంతి న్యాయ నిరతం శ్రీ సచ్చిదానందకం
లోకేశం సమ దర్శినం నియమనం చాకార హీనం ప్రభుం.

**అర్థం :** ఎవరిని న్యాయ నిరతునిగా, సచ్చిదానందునిగా, సర్వేశ్వరునిగా, సమ దర్శిగా, నియామకునిగా, ప్రభునిగా, నిరాకారునిగా పిలుస్తామో అతని విశ్వమందు ఆత్మ రూపమున ఆ బ్రహ్మ యొక్క సమస్త నామముల యందును శ్రేష్ఠమై పాప రహితమై పవిత్రమై, ధ్యాన యోగ్యమైన 'ఓం' కారమున భావింపదగును.

**భావార్థము :** పరమాత్మను పొందుట ఆయనను ప్రసన్నుని చేసికొనుట ఆయన నియమములపై ఆధారపడి యుండును. ఆయన నిందా, స్తుతులచేత ప్రభావితుడు కాజాలడు. కర్మల ననుసరించి ఫలము నిచ్చును. పరమాత్మను సర్వ వ్యాపకునిగాతెలిసికొని, చాటుగా కూడా పాపాలు చేయకూడదు. ప్రాణులకు సేవ చేయటం, పరమాత్మను పూజించటంలో అసలు భావం. పరమాత్మను తన అంతరంగంలో అనుభవంపొందటం వల్ల ఆత్మ పవిత్రత కలుగుతుంది. సత్యము, చైతన్యత, ఆనందము అనుభవంలోకివస్తాయి.

(2) భూర్వై ప్రాణ ఇతి బ్రువంతి మునయో వేదాంత పారంగతాః
ప్రాణః సర్వ విచేతనేషు ప్రసృతః సామాన్య రూపేణచ
ఏతేనైవ విసిద్ధ్యతేహి సకలం మానం సమానం జగత్
ద్రష్టవ్యః సకలేషు జంతుషు జనైర్నిత్యం హ్యసుశ్చాత్మవత్ I

**అర్థము :** ముని జనులు ప్రాణమును "భూః" అని పిలుస్తారు. ఆ ప్రాణము సమస్త ప్రాణులలో సామాన్య రూపంలో వ్యాపించి ఉంటుంది. దీని వల్ల మనకు అర్థమయ్యే విషయం అక్కడ అంతా సమానమే నని. అందువల్ల మనుష్యులందరూ, ప్రాణులందరూ సమానమేనని గ్రహించాలి.

**భావార్థము :** తనకు కష్టం కలిగించే విషయం అందరికీ కష్టం కలిగిస్తుంది. అందు వల్ల ఎవరికీ కష్టం కలిగించవద్దు. మనం యితరుల నుండి ఎటువంటి ప్రవర్తనను కోరుకుంటామో మన ప్రవర్తన యితరులతో ఆవిధంగానే ఉండాలి. అందరినీ సమానంగా చూడలి. కులం, వంశం, జాతి, సముదాయము, స్త్రీ పురుష వివక్ష కారణంగ ఉచ్చ నీచములు, హెచ్చు తగ్గులు అనే తారతమ్యాలను మన మనసులోనికి రానీయకూడదు. కర్మనుబట్టి ప్రవర్తనను బట్టి మాత్రమే ఉచ్చ, నీచాలను గుర్తించాలి.

(3) భువోనాశోలోకే సకల విపదాం వనిగదితః
కృతం కార్యం కర్తవ్యమితి మనసాచాస్య కరణం
ఫలాశాం మర్త్యా యేవిదదతి న వై కర్మనిరతాః
లభంతే నిత్యతే జగతిహి ప్రసాద సుమనసాం.

**అర్థం :** ప్రపంచంలో సమస్త దుఃఖముల యొక్క నాశము "భువః" అని పిలువబడుతుంది. కర్తవ్య భావనతో చేయబడిన కార్యము 'కర్మ' అని పిలువబడుతుంది. పరిణామముగా, సుఖములయందు గల కోర్కెలను వదలి, పని చేసే మనుష్యుడు సదా ప్రసన్నంగా ఉంటాడు.

**భావార్థము :** మనుష్యుని అధికారము పని చేయడం. ఫలితాన్నిచ్చేవాడు ఈశ్వరుడు. ఫలానా వస్తువు దొరికితేనే సుఖమని భావించటం మానివేసి కర్తవ్య పాలనమే మన ఆనందానికి కేంద్ర బిందువుగా భావించాలి. తన కర్తవ్య కర్మనే లక్ష్యంగా భావించే వాడే కర్మయోగి. అతడు ఎల్లప్పుడూ సుఖంగా ఉంటాడు. కోరిన ఫలం కోసం వెదుకులాడే వాని ఆశ మృగతృష్ణతో సమానం. ఎల్లప్పుడూ సత్కర్మ చేయడానికి ప్రయత్నించు. గీతలోని కర్మయోగం యొక్క తత్వం యిదే.

(4) స్వరేషా వైశబ్దో నిగదతి మనఃస్థైర్య కరణం
తథా సౌఖ్యం స్వాస్థ్యం ప్రదిశతి చిత్తస్య లోలతామ్
నిమగ్నత్వం సత్యవ్రత సరసి చాచక్షతి ఉత
త్రిధాశాంతిం హ్యేతాంభు విచల భతే సంయమ రతః

**అర్థం :** 'స్వః' అనే శబ్దం మనఃస్థిరత్వము యొక్క నిర్దేశము. చంచలమైన మనస్సుకు సుస్థిరతను, స్వాస్థ్యమును చేకూర్చుకో అనే ఉపదేశం యిందులో ఉన్నది. సత్యంలో నిమగ్నం కమ్మంటున్నది. ఈ ఉపాయంతో సంయమం కలిగిన పురుషుడు మూడు రకములైన శాంతులనూ పొందగలడు.

**భావార్థము :** అనిశ్చిత పరిస్థితి కలిగినపుడు మనుష్యుడు శోక, దుఃఖ, క్రోధ, ద్వేష, దైన్య, నిరాశా, చింతా, భయ, వ్యాకులతలతో ఉద్విగ్నుడై తన మానసిక సంతులనాన్ని (MENTAL BALANCE) పోగొట్టుకుంటాడు. అనుకూల పరిస్థితులు కలిగినపుడు, అహంకారము, మదము, గర్వము, పొగరు, ఆనందము పెంచుకొని స్వాభావికమైన ఆచరణను ప్రారంభిస్తాడు. నిక్కు, అపవ్యయం, బడాయి పెరిగిపోతాయి. ఈ రెండు రకాల పరిస్థితులనూ మత్తుతోనూ, జ్వరంతోనూ పోల్చవచ్చు. ఇవి వివేకమనే వెలుగును మూసివేస్తాయి. ఆలోచనలలో, ఆచరణలో ఉచితానుచితాలను మరపింప జేస్తాయి. మనుష్యుడు పిచ్చివాడుగా, అంధుడుగా మారిపోతాడు. ఈ సత్య వినాశకర మైన గాలివాన నుండి ఆత్మను రక్షించుకోవటానికి మనస్సుకు స్థిరత్వము (స్థైర్యము) సంతులనము (BALANCE), స్వాస్థ్యము కలిగించి సత్యప్రేమిగా తయారు చేయాలి. అప్పుడు మాత్రమే మనుష్యుని ఆత్మకు, బుద్ధికి, శరీరానికిగూడా శాంతి లభిస్తుంది.

(5) తత్‌వైనిష్పత్తిః సభువిమతిమాన్ పండితవరః
విజానన్ గుహ్యం యో మరణ జీవనయోస్త దఖిలం
అనంతే సంసారే విచరతి భయాసక్తి రహిత
స్తధా నిర్మాణం వైనిజ గతి విధీనాం ప్రకురుతే

**అర్థం :** ప్రపంచంలో బుద్ధిమంతుడైనవాడు జీవన, మరణ రహస్యాన్ని తెలిసి ఉంటాడని 'తత్' శబ్దం తెలియజేస్తున్నది. అతడు భయమును, ఆసక్తిని విడచి ప్రపంచంలో తన గతి విధులను నిర్వర్తించుకుంటూ ఉంటాడు.

**భావార్థము :** మృత్యువు శిరస్సుపై ఎప్పుడూ తాండవ మాడతూనే ఉంటుంది. ఒక క్షణం శ్వాస నడుస్తున్నా మరుక్షణం శ్వాస ఆగిపోవచ్చు. నమ్మకమేమిటి ? ఈ విషయాన్ని గ్రహించి సుర దుర్లభమైన మానవ జీవితాన్ని శ్రేష్ఠతమంగా ఉపయోగించు కోవాలి. కొద్ది జీవిత కాలంలో క్షణిక సుఖాల కోసం పాపాల నెందుకు చేయాలి ? అందుకుగాను చిరకాలం దుఃఖాలనెందుకు అనుభవించాలి అని ఆలోచించుకుంటూ ఉండాలి.

విద్యాధ్యయనము, సమాజ కల్యాణము, ధర్మ ప్రచారము మొదలైన శ్రేష్ఠమైన పనులు చేసేటప్పుడు జీవితం అఖండమని ఆలోచిస్తూ ఉండాలి. ఈ శరీరంతో ఆ పనులు పూర్తికాక పోతే మరో శరీరంతో, మరో జీవితకాలంలో పూర్తి చేయవచ్చు. ఇది నిర్వివాదంశం. జీవితాన్ని సదుపయోగం చేసుకుంటే మృత్యువు అనంతరం ఆనందం లభిస్తుంది. పరలోకంలోనూ, పునర్జన్మలోనూ సుఖమే కలుగుతుంది. ఈ జీవిత క్షణాలను దురుపయోగం చేసుకుంటే అతగాని భవిష్యత్తు అంధకారమయమే. అందువల్ల, జరిగిందేదో జరిగిపోయింది! దాని కోసం దుఃఖపడక శేషజీవితాన్ని సదుపయోగం చేసుకోవాలి.

(6) సవితుస్త పదం వితనోతిధ్రువం మనుజోబలవాన్ సవితేత్ర భవేత్
విషయా అనుభూతిం పరిస్థితయోవై సదాత్మన్ ఏవగణోదితిసః ।

**అర్థము :** 'సవితుః' అనే పదం మనుష్యుని సూర్యునితో సమానమైన బలాన్ని పొందమంటున్నది. అన్ని విషయాలూ, అనుభూతులూ తన ఆత్మకు మాత్రమే సంబంధించినవి అని ఆలోచించాలి.

**బావార్థము :** సూర్యుని వీర్యముగా, పృథ్వి రజముగా తెలియబడుతున్నది. సూర్యుని శక్తితో విశ్వములోని అన్ని క్రియా కలాపాలూ జరుగుతున్నాయి. ఈ విధంగానే ఆత్మ తన క్రియాశీలత ద్వారా వివిధ ప్రకారములుగా పరిస్థితులను ఉత్పత్తి చేస్తున్నది. ప్రారబ్ధము, భాగ్యము, దైవము మొదలైనవి గూడా తన పూర్వ కర్మపరిపాకములు మాత్రమే. అందువల్ల ఏ పరిస్థితులు మంచిగా ఉంటయో వాటికి తగిన యోగ్యతను తానే ఆపాదించు కోవాలి. మనుష్యుడు తన భాగ్యమునకు తానే కర్త. అందుకే, ఆత్మ నిర్మాణమును గురించి అన్నిటికన్న ఎక్కువ ప్రాధాన్యత నీయాలి. బయటి సహాయం కూడా తన అంతరంగానికి అనుగుణంగా మాత్రమే ఉంటుంది.

మనుష్యుని తేజస్విగా, బలవంతుడుగా, క్రియాశీలుడుగా తయారు చేయాలి. స్వాస్థ్యము, విద్య, ధనము, చాతుర్యము, సంఘటన (ORGANIZATION), యశస్సు, సాహసము,సత్యము అనే ఎనిమిది బలములతో ఎల్లప్పుడూ బలవంతునిగా తయారుచేసే ప్రయత్నం జరుగుతూ ఉండాలి.

(7) వేణ్యాంచ ప్రకట యతి శ్రేష్ఠత్వమనిశం
సదే పశ్యే చ్ఛ్రేష్ఠం మననమపి శ్రేష్ఠస్య విదధేత్
తథా లోకే శ్రేష్ఠం సరళమనసా కర్మచ భజేత్
తదిత్థం శ్రేష్ఠత్వం వ్రజతి మనుజః శోభిత గుణైః ।

**అర్థము :** 'వరేణ్యం' అనే శబ్దం ప్రతిమనుష్యునీ, నిత్య శ్రేష్ఠతవైపుకు నడవమని నిర్దేశిస్తుంది. శ్రేష్ఠతను చూడటం, శ్రేష్ఠంగా ఆలోచించటం, శ్రేష్ఠంగా చింతన చేయటం, శ్రేష్ఠమైన పనులనుచేయటం, ఈ విధంగా మనుష్యుడు శ్రేష్ఠతను పొందుతాడు.

**భావార్థము : మనుష్యుడు తన ఆలోచనలనుబట్టి తాను తయారవుతాడు.** ఆలోచనలు అచ్చులైతే జీవితం తడి మన్ను వంటిది. ఎట్టి ఆలోచనలలో మనం మునిగి ఉంటామో మన జీవితం అట్టి ఆకృతినే పొందుతుంది. అదే విధంగా ఆచరణ ఉంటుంది. అదే విధమైన తోడు దొరుకుతుంది. అటువంటి దిశలోనే జ్ఞానము, రుచి, ప్రేరణ కలుగుతాయి. అందువల్ల తను శ్రేష్ఠుడు కావాలంటే శ్రేష్ఠులైన మనుష్యుల సహవాసం కలిగి వుంటూ, శ్రేష్ఠమైన గ్రంథాలను చదువుతూ, శ్రేష్ఠమైన విషయములను గురించి ఆలోచిస్తూ, శ్రేష్ఠమైన దృశ్యాలను చూస్తూ, శ్రేష్ఠమైన పనులను చేయటం అవసరం. ఇతరులలో ఉన్న శ్రేష్ఠతను గ్రహించి దాన్ని సొంతం చేసుకోవటం, శ్రేష్ఠతయెడ శ్రద్ధను కలిగి ఉండటము, అనేవి ప్రజలు అవశ్యం చేయవలసి ఉంది. ఆవిధంగా శ్రేష్ఠులు కావటానికి ప్రయత్నించాలి.

(8) భర్గో వ్యాహరతి పదం హి నితరాంలోకః సులోకోభవేత్
పాపే పాప వినాశనేత్వ విరతం దత్తావధానో వసేత్
దృష్ట్వాదుష్కృతి దుర్విపాక నిచయంతే భ్యోజుగుప్సేద్ధిచ
తన్నాశాయ విధీయతాంచ సతతం సంఘర్షణేభిస్సహ I.

**అర్థము :** 'భర్గో' అనే పదం మనుష్యులను నిష్పాపులను కమ్మని నిర్దేశిస్తున్నది. పాపములయెడ సావధానంగా ఉండాలి. పాపముల యొక్క దుష్పరిణామములను చూచి వానియెడ అసహ్యాన్ని పొంది నిరంతరము వానిని నశింపజేసుకోటానికి సంఘర్షణ చేయాలి.

**భావార్థము :** ప్రపంచంలో ఉన్న దుఃఖమంతటికి కారణం పాపం. హాస్పిటల్లలో, జైళ్ళలో, యితర చోట్ల నానా విధములైన కష్టాలతో మనుష్యులు పీడింపబడటం వారి వారి పురాకృత పాప కర్మ వల్లనే. నరకంలో గూడా పాపి మాత్రమే కష్టాల ననుభవిస్తాడు. భక్తులు, పరోపకారులు, ఇతరుల పాపాలను తమ తలలపైన పెట్టుకుని యితరుల దుఃఖాలను నివృత్తి చేస్తారు. వారిని పరిశుద్ధులను చేస్తారు. పాపుల దుఃఖాలను భక్తులు భరించినా, స్వయంగా పాపులు భరించినా దుఃఖాలకు కారణం పాపాలే. అందువల్ల దుఃఖమునెడ భయము, సుఖము మీద కోరిక కలిగిన వారు పాపములకు దూరంగా

వుంటూ, చేసిన పాపములకు ప్రాయశ్చిత్తాన్ననుభవించాలి. పాపములయెడ జాగ్రత్త కలిగి ఉండాలి. లోపల, బయట, పాపములను నశింపజేయటానికి సంఘర్షణ చేయాలి. అది గొప్ప పుణ్యకార్యం. అందువల్ల లెక్కింప నలవికాని ప్రాణులు దుఃఖ నివృత్తిపొంది సుఖింప గల్గుతారు. పాప రాహిత్యంలోనే నిజమైన ఆనందం నివసిస్తుంది.

(9) దేవస్యేతితి వ్యాకరోత్యమరతాం మర్త్యోపి సంప్రాప్యతే
దేవానా మివ శుద్ధ దృష్టి కరుణాత్సేవాపచారాద్భువి
నిస్వార్థం పరమార్థ కర్మ కరణా ద్దీనాయదానాత్త థా
బాహ్యే భ్యంతర మస్యదేవభువనం సంయుజ్యతేచైవ హి ।

**అర్థము :** 'దేవస్య' అనే పదం మరణధర్మం గల మనుష్యుడుగూడా అమరత్వం అంటే దేవత్వం పొందవచ్చునని సూచిస్తున్నది. దేవతలతో సమానమైన శుద్ధ దృష్టి కలిగి, ప్రాణులకు సేవ చేయటంవల్ల , పరమార్థ కర్మ చేయటంవల్ల, నిర్బలులకు సహాయం చేయటంవల్ల, మనుష్యునిలోపల, వెలుపలా కూడా దేవలోకం సృష్టింపబడుతుంది.

**భావార్థము :** పరమాత్మచే సృష్టింపబడ్డ ఈ పవిత్ర సృష్టిలో ఉన్నదంతా పవిత్రమూ, ఆనందమయమూ మాత్రమే. ఈ సృష్టినీ, ప్రపంచాన్నీ ప్రసన్నదృష్టితో చూడటం, అందు మనుష్యులచేత ఉత్పత్తి చేయబడిన చెడును దూరం చేయటం, ఈశ్వరీయ శ్రేష్ఠతను వికసింపజేయటం, ప్రచారనం చేయటం దేవకర్మ క్రిందికి వస్తుంది. ఈ దేవదృష్టిని ధరించడంవల్ల మనుష్యుడు దేవత అవుతాడు. ఎవడు తన శరీరాన్ని మరచి ఆత్మానుభవాన్ని పొందుతాడో, అతడు అమరుడు. అతనివద్ద మృత్యు భయం ఉండదు. ప్రాణులను ప్రేమతో ఆత్మీయతతో చూడటం, తన ఆచరణ పవిత్రంగా ఉంచుకోవటం, నిర్బలులకు చేయూతనిచ్చి పైకి తీసుకు రావటం కోసం తన శక్తిని వినియోగించటం, దేవతా లక్షణాలు. అట్టి గుణములు కలవారికి భూలోకమే దేవలోకంతో సమానంగా ఆనందమయం కాగలదు.

(10) ధీమహి భవేమ సర్వ విధంశుచిం శక్తిచయం వయ మిత్యుపదిష్టాఃఖిలు
నోమనుజో లభతే సుఖశాంతి మేన వినేతి వదంతి హి వేదాః

**అర్థము :** 'ధీమహి' యొక్క ఆశయము మనమందరమూ హృదయంలో అన్ని విధాలా పవిత్రశక్తులను ధరించాలనే వేదం చెప్పేది! "ఇది తప్ప మనుష్యునికి సుఖ శాంతులు కలిగేదారి వేరు లేదు" అని.

**భావార్థము :** ప్రపంచంలో భౌతిక శక్తులనేకం ఉన్నాయి. ధనం, పదవి, వైభవం, రాజ్యం, శరీరబలం, సంఘటన, శస్త్ర విద్య, బుద్ధి, చాతుర్యాది అనేక విశేష యోగ్యతలతో లోకులకు ఐశ్వర్యం, ప్రశంస కలుగుతుంది. ఇదంతా స్థాయి కల్గినదిగాదు. ఇందువల్ల సుఖం కలుగవచ్చు. కాని చిన్న చిన్న దెబ్బలతోనే అది నష్టం కావచ్చు. స్థాయీ సుఖం అనేది ఆధ్యాత్మిక, పవిత్ర గుణాలలో ఉంటుంది. దీనినే దైవ సంపత్తి అనీ దివ్యశక్తులనీ పిలుస్తారు. నిర్భృతి, వివేకము, స్థిరత, ఔదార్యము, సంయమము, పరమార్థము, స్వాధ్యాయము, తపశ్చర్య, దయ, సత్యము, అహింస, నమ్రత, ధైర్యము, అ ద్రోహము, ప్రేమ, న్యాయ శీలత, నిరాలస్యము మొదలైనవి దైవ గుణములు. వానివలన కలిగే సుఖంతో సమానమైన భౌతిక సంపద లేనేలేదు. అందువల్ల మనలో దైవ సంపద అనే ధనాగారాన్ని పెంచుకునే ప్రయత్నం చేయాలి.

(11) ధియో మత్యో న్మధ్యాగమ నిగమ మంత్రాన్ సుమతిమాన్
విజానీయత్తత్వ విమల నవనీతం పరమివ
యతో౾స్మిన్ లోకే వం సంశయగత విచార స్థలశతే
మదిః శుద్ధై వాంఛా ప్రకటయతి సత్యం సుమనసే ।

**అర్థం :** "బుద్ధిమంతులైనటువంటి వారు వేదశాస్త్రాలను బుద్ధితోడ మధించి వెన్నవంటి ఉత్కృష్ట తత్వాన్ని తెలియాలి. శుద్ధబుద్ధితో మాత్రమే సత్యం తెలుస్తుంది" అని 'ధియో' అనే పదం వివరిస్తుంది.

**భావార్థము :** ప్రపంచంలో అనేక రకాల ఆలోచనా ప్రవాహాలున్నాయి. అందులో ఎక్కువ భాగం ఒకదానితో ఒకటి ఢీకొట్టుకుంటూ ఉంటాయి.

ఒక శాస్త్రం ప్రకారం సిద్ధాంతం, ఇంకో శాస్త్రం ప్రకారం తప్పవుతుంది.

అందువలన ఒక విద్వాంసుడుగాని ఋషిగానీ ఆలోచించే పద్ధతి ఇంకొక ఋషి గానీ విద్వాంసుడుగానీ ఆలోచించే విధానంతో సంపూర్ణంగా పొత్తు కుదరక పోవచ్చును. ఇట్టి పరిస్థితులలో విచలచిత్తులు కానవసరంలేదు. దేశకాల, పాత్ర, పరిస్థితులనుసరించి ఒక విషయం ఒక సమయంలో కరెక్టుగా ఉంటుంది. అదే విషయం ఇంకో పరిస్థితిలో మరో సమయంలో పూర్తిగా అసంగతంగా కనిపిస్తుంది. చలికాలంలో ఉపయోగకరమైన దుస్తులు వేసవి కాలంలో యిబ్బంది కలిగిస్తాయి. అట్లే ఒక పరిస్థితిలో ఉచితమైనది, ఇంకో పరిస్థితిలో అనుచితం కావచ్చు. అందువల్ల ఒక ఋషిని గాని, విద్వాంసునిగాని, నాయకునిగానీ నిందించటంమాని, నేటిస్థితికి అనుకూలంగా ఉండే విషయాన్ని గ్రహించాలి

ఈ ఉచితానుచితాల నిర్ణయం, తర్కం, వివేకం, న్యాయం ఆధారంగా వర్తమాన పరిస్థితులను ధ్యానంలో ఉంచుకుని చేయాలి.

(12) యోనో వాస్తితు శక్తి సాధన చయోన్యూనాధికాశ్చాధవా
భాగం న్యూనతమం హి తస్య విదధే మాత్మ ప్రసాదా యచ
యత్పశ్చాదవ శిష్ట భాగమఖిలం త్యక్త్వా ఫలాశాం హృది
తదధీవేత్యభిలాప వస్తు వితరయే శక్తి హీనాః స్వయం.

**అర్థము :** 'యోనః' పదముయొక్క తాత్పర్యము, మన శక్తులు, సాధనలు ఏవైతే ఉన్నాయో అవి కొద్దిగాని, గొప్పగానీ వానిలో అతితక్కువ భాగాన్ని మాత్రమే తన ఆవశ్యకత కొరకు ఉపయోగించుకోవాలి. మిగిలినవాటిని నిస్వార్థ భావంతో ఆ శక్తుల కోసం వాడాలి.

**భావార్థము :** మనుష్యునకు జ్ఞానము, బలము, వైభవము ఒక ధరావతు (DEPOSIT) రూపంలో యివ్వబడ్డాయి. ఈ విభూతులతో సుసజ్జితుడై తన మానము, యశస్సు, సుఖము, పుణ్యము, శ్రేయస్సు పొందాలి. కాని ఈ లాభంలో అధిక భాగాన్ని పరులనుద్ధరించటానికి ఉపయోగించాలి. తన యశము, విశ్రాంతి, భోగము, సంచయము లేదా అహంకారముల కొరకు వీనిని ఉపయోగించవద్దు. లోకహితం కోసం బలహీనుల సహాయం కోసం వీనిని ఉపయోగించాలి. విద్వాంసుడుగానీ, బలవంతుడుగానీ, ధనవంతుడుగానీ, వాని వలన విద్యాహీనులకు నిర్ధనులకు ఉన్నతి కలిగించేటందుకు ఉపయోగపడాలి. చెట్లు పెంచడం, చెరువులు త్రవ్వించడం, బావులు త్రవ్వించడం, ఉద్యానాలను పెంచడం, బాష్ప, అగ్ని, జల, వాయు, విద్యుచ్ఛక్తులను లోకహితం కోసం ఎల్లప్పుడూ వితరణ చేయడం వలెనే మనం గూడ మన వనరులలో జీవన నిర్వహణకు మాత్రమే కొంత భాగము వినియోగించుకుంటూ తక్కిన అంతటినీ పరజనహితం కొరకు వినియోగించాలి.

(13) ప్రచోదయాత్ స్వయం త్వితరంశ్చ మానవాన్
నరః ప్రయాణాయ చ సత్య వర్త్మని
కృతం హి కర్మాఖిల మిత్థమంగి నా
వదంతి ధర్మ ఇతి హి పపశ్చితః ।

**అర్థం :** 'ప్రచోదయాత్' అనే పదానికి అర్థం మనుష్యుడు తనంతటతాను ఆచరిస్తూ, పరులను సత్యమార్గాన నడవడానికి ప్రేరణ నీయాలి. ఈ విధంగా చేయబడిన కార్యములను విద్వాంసులైనవారు ధర్మమని పిలుస్తారు.

**భావార్థము :** ప్రేరణ అనేది విశ్వంలో అన్నిటికీ మించిన గొప్పశక్తి. ఇది లేక సాధన సామాగ్రి మొత్తం నిష్ఫలమవుతుంది. అది కొద్ది గానీ, గొప్పకానీ ప్రేరణతో ఉత్సాహితులై, ప్రవృత్తులవుతున్న మనుష్యులు కార్యాన్నారంభించినపుడు సాధన సామగ్రి తనంత తానే సమకూరుతుంది. అనేకుల సహకారం, ఈశ్వరసహాయం, లభించి తీరుతుంది. అందువల్ల తమంత తాము సన్మార్గంలో నడచేటందుకు ప్రేరణ, ప్రోత్సాహము పొంది యితరులను శ్రేష్ఠతవైపుకు ముందుకు సాగేంటందుకు ప్రేరణ, ప్రోత్సాహల నందీయాలి. వస్తువులనిచ్చి అట్టి ఉపకారాన్నెవరికీ అందీయ జాలము. సత్కార్యముల కొరకు ప్రేరణ నందీయటం ఎంతో గొప్ప పుణ్యకార్యం. దీంతో పోలిస్తే చిన్న చిన్న పుణ్యకార్యాలు తుచ్ఛంగా కన్పిస్తాయి.

(14) గాయత్రీ గీతాం హ్యేతాం యోనరో వేత్తి తత్వతః
సముక్త్వా సర్వ దుఃఖేభ్యః సదానందే నిమజ్జతి ॥

**అర్థం :** ఏ మనుష్యుడు ఈ గాయత్రీ గీతను చక్కగా అర్థంచేసుకుంటాడో అతడు సర్వ విధములైన దుఃఖములనుండి నివృత్తుడై సదా ఆనందమగ్నుడు కాగలడు.

గాయత్రీ గీత యందలి ఉపయుక్తమైన 14 శ్లోకములు సమస్త వేదశాస్త్రముల యందును చెప్పబడిన జ్ఞానమంతటికీ సారము. సముద్ర మథనము వలన 14 రత్నములు లభించెను. శాస్త్రములనే సముద్ర మథనము ఈ 14 శ్లోకముల రూపంలో 14 రత్నాలను వెలువరించింది. ఏ వ్యక్తి ఈ శ్లోకార్థములను చక్కగా హృదయంగమం చేసుకుంటాడో అతడు ఎట్టి దుఃఖములను పొందజాలడు. ఎల్లప్పుడూ ఆనందమే. ఆనందంలో తేలియాడుతూ ఉంటాడు.

**రచన :** వేదమూర్తి, తపోనిష్ఠ పండిత శ్రీరామశర్మ ఆచార్య

**అనువాదం :** విశ్వనాథ్.

# గాయత్రీ స్మృతి

## ఓం భూర్భువః స్వః

భూర్భువఃస్వస్త్రయో లోకా, వ్యాప్తమోం బ్రహ్మ తేషు హి,
న ఏవ తథ్యతో జ్ఞానీ, యస్తద్ వేత్తి విచక్షణః।

భూః, భువః, స్వః ఇవి మూడు లోకములు. ఈ మూడు లోకముల యందును "ఓం" అనే బ్రహ్మ వ్యాపించి యున్నాడు. ఏ బుద్ధిమంతుడు "అది" బ్రహ్మమని తెలిసికొనునో అతడు వాస్తవముగా జ్ఞానియే.

పరమాత్మ యొక్క వైదిక సంజ్ఞ "ఓం". బ్రహ్మస్ఫురణము యొక్క దెబ్బ సూక్ష్మ ప్రకృతిపై నిరంతరము తగులుచుండును. ఈ దెబ్బల వలన సృష్టిలో గతిశీలత (గమనము) ఉత్పన్నమగుచుండును. కంచుపైన దెబ్బలు వేసి లోహకారుడు త్రిప్పుచు పాత్రలను తయారు చేసినట్లు బ్రహ్మ ప్రకృతి పరస్పర మిలన, స్పందనములపై ఓంకార శబ్దము ఉత్పత్తి యగుచుండును. అందువలన ఓంకారము పరమేశ్వరుని స్వయం ప్రకటిత నామముగా వ్యవహరింపబడుచున్నది.

ఈ ఓంకారము మూడు లోకములందును వ్యాపించి యున్నది. భూః అన పృథ్వి, భువః యన పాతాళము, స్వఃయన స్వర్గము - ఈ మూడు లోకములును పరమాత్మచే పరిపూర్ణములు. "భూః" అన శరీరం, "భువః" యన సంసారము, (ప్రపంచము) "స్వః" యన ఆత్మ ఈ మూడును పరమాత్మ యొక్క క్రీడాస్థలములు. ఈ మూడు ప్రదేశములను నిఖిల బ్రహ్మాండమును భగవానుని విరాడ్రూపముగ తెలిసికొని అట్టి ఆధ్యాత్మిక ఉన్నత భూమిక ప్రాప్తమగుటకు ప్రయత్నము చేయవలె. అట్టి విరాడ్రూపమునే గీత యందలి ఏకాదశాధ్యాయమునందు కృష్ణుడు అర్జునునకు విశ్వరూపముగా చూపించెను. పరమాత్మ సర్వత్ర, సర్వవ్యాపకునిగ, సర్వేశ్వరునిగ, సర్వాత్మగ తిలకించిన మానవుడు మాయ, మోహము, మమత సంకీర్ణత, ఔదార్యము లేకపోవుట, చెడు తలంపులు మొదలుగాగల చెడు సంస్కారములను అగ్ని యందు

భస్మీపటలముచేసి రక్షింపగల్గును. నిరంతరము పరమాత్మ యొక్క దర్శనము చేయుట వలన పరమానంద సుఖమున నోలలాడుచుండును. "ఓం భూర్భువః స్వః" యను నక్షరముల యందలి తత్త్వజ్ఞానము నెరిగినవాడు బ్రహ్మజ్ఞానియై జీవన్ముక్తుడు కాగలడు.

తత్–తత్త్వజ్ఞాస్తు విద్వాంసో, బ్రాహ్మణాః స్వతపోబలైః
అంతకారమపాకుర్యూ, లోకాదజ్ఞానసంభవమ్ । (1)

తత్త్వదర్శి, విద్వాంసుడునైన బ్రాహ్మణుడు సమకూర్చబడినల తన తపస్సు ద్వారా, సంసారమందలి అజ్ఞానము వల్ల ఉత్పన్నమైన అంధకారమును తొలగించుకొన వచ్చును.

బ్రాహ్మణుడన తత్త్వమును, వాస్తవికతను, పరిణామమును దర్శించు వాడు.. భాష, సాహిత్యము, శిల్పము, విజ్ఞానము, మొదలైన విద్యలెన్ని చదివి పండితుడైనను, జీవితము యొక్క ఉద్దేశ్యమును, ఆనందమును, సాఫల్యమును పొందు విద్యతెలియనిదే నిరర్థకము. చదువు నేర్చినవారు సందుల గొందుల ఈగలు దోమల వలె నిండియున్నారు. ఎవరు నిజమైన విద్వాంసులో వారే బ్రాహ్మణులు.

భగవానుడు ఎవరిని తత్త్వదర్శిగా, విద్వాంసునిగా చేసే ఏర్పాట్లు, ప్రేరణ ఇచ్చినాడో ఆ బ్రాహ్మణులు తమ బాధ్యత తెలుసుకొనవలసి ఉంటుంది. ఎందుకంటె వాళ్లు అందరికంటే ఎక్కువ ధనవంతులు, అందరూ డబ్బు ఎక్కువగా ఉండటమే సుఖానికి కారణమని ఆలోచిస్తారు. సత్యమేమంటే సద్జ్ఞానం లేనివాడు సుఖశాంతులతో జీవించలేడు. అతని వద్ద కోట్ల రూపాయలు ఉండవచ్చుగాక, భారతీయుడు సద్జ్ఞానము యొక్క మహత్తు ఆదికాలము నుండి తెలుసుకుంటూ వచ్చాడు. అందువల్ల ఇక్కడ సద్జ్ఞానము యొక్క, బ్రహ్మజ్ఞానము యొక్క సంపన్నతగల బ్రాహ్మణుల పరువు, ప్రతిష్ఠలు అందరికన్న మిన్నగా భావించబడ్డాయి. ఈ నికృష్టమైన కాలంలో గూడా బ్రాహ్మణవంశంలో పుట్టినంత మాత్రాన అర్హత లేకపోయినా బ్రాహ్మణులుగా పూజింపబడ్డారు.

బ్రాహ్మణత్వము విశ్వములో అన్నింటికన్న మిన్నయైన సంపద. రత్నాగారము పెద్దదైన, విలువైన, దృఢమైన పేటికలో ఉంచబడుతుంది. ఏ శరీరం తపస్సు చేత పవిత్రమో, తపస్సుతో, సంయమముతో, తితీక్షతో, త్యాగముయొక్క అగ్నిలో తపింపబడి శరీరమనే పేటిక గట్టిగా భద్రపరచబడినచో అందులోనే బ్రాహ్మణత్వం నిలిచి ఉంటుంది. సంయమము లేని వాడు. భోగి, స్వార్థపరుడు, తపస్సుచేయనివాడు, వేదములను, శాస్త్రములను చిలుక పలుకులవలె పలుకువాడు, కొంగజపం చేసే వాడేగాని వానియందు

బ్రాహ్మణత్వం సురక్షితంగా స్థిరంగా ఉండదు. అందువల్ల బ్రాహ్మణుడు సద్జ్ఞాన సంపన్నుడు, తనను తాను తపస్సుచేత పునీతం చేసుకొన్నవాడు అయి ఉండాలి, తపస్సు మరియు బ్రాహ్మణత్వం యొక్క కలయికతోనే బంగారానికి తావి అబ్బినట్లన్న లోకోక్తి చరితార్థం కాగలదు.

బ్రాహ్మణుని భూసురునిగా పిలుస్తారు. భూసురుడనిన భూమిపైనున్న దేవత. ఇవ్వగల వాడే దేవత, బ్రాహ్మణుడు ప్రపంచంలో సర్వ శ్రేష్ఠమైన సంపద గలవాడు అతని సంపద సద్ జ్ఞానము. అతని వద్ద తరిగిపోని సంపద ఉన్నది. అది లేక పోవటం వలననే సమస్త ప్రజలూ దుఃఖముల పాలగుతున్నారు. అజ్ఞానమును అవిద్యను మించి దుఃఖానికి కారణం వేరేమీలేదు. కరుణామయుడైన ధనికుడు ఆకలితో అలమటిస్తున్న ప్రజలను చూచి దానమివ్వకుండా ఎలా ఉండలేడో, అదే విధంగా అవిద్య అనే అంధకారంలో దారి తప్పి తిరుగుచున్న ప్రజలకు నిజమైన బ్రాహ్మణుడు తన సద్ జ్ఞాన సంపదను ఇవ్వకుండ ఉండలేడు. ఈ కర్తవ్యము అవసరమైనదే గాక అనివార్యం గూడా. ఇది బ్రాహ్మణుని స్వాభావికమైన బాధ్యత.

గాయత్రీ మంత్రమందలి మొదటిశబ్దము "తత్" బ్రాహ్మణత్వంయొక్క ఈ గొప్ప బాధ్యత వైపు చూపిస్తుంది. తత్త్వ దర్శనమూ, విద్య, తపస్సు ఎంత ప్రమాణంలో ఉంటుందో వ్యక్తి యొక్క బ్రాహ్మణత్వం అంత ప్రమాణం కలిగి ఉంటుంది. ఈ బ్రాహ్మణత్వం ఏ వర్ణము, కులము, వంశములకు చెందిన మనుష్యులలో ఉంటుందో వారు అజ్ఞానాంధకారాన్ని దూరం చేయడానికి ఎంత కృషి చేయగలరో అంత చేయవలసిఉంటుంది.

**శ్లో: సత్త్వావన్తస్తథా శూరాః క్షత్రియా లోక రక్షకాః**
**అన్యాయాశక్తి సంభూతాన్ ధ్వంసయేయుర్హి త్వాపదః**

శక్తివంతుడైన వీరుడు ప్రపంచమును రక్షించుటకుగాను క్షత్రియుడై అన్యాయము వలన , అశక్తత వలన కలిగిన ఆపదలను నశింప జేయవలయును.

జనబలము, శరీరబలము, బుద్ధిబలము, సత్తాశక్తి, పదవి, శాసన గౌరవము, గొప్పదనము, సంఘటన (Organization). తేజస్సు. పురుషార్థము. చాతుర్యము, సాధన, సాహసము, శౌర్యము అనునవి క్షత్రియుల లక్షణములు. ఈ లక్షణముల పరిమితిని బట్టి అతనిలోని క్షత్రియత్వాన్ని కొలవాలి.

ఈ లక్షణాలు అనధికారి చేతిలోనికి వస్తే. అతనిలో అహంకారము మదము బలిసిపోతాయి. అహంకారాన్ని గొప్పతనంగా భావించి దాన్ని నిలబెట్టుకోవడం కోసం అనేకమైన అనవసరపు ఖర్చులు, ఆడంబరాలు పెంచుకుంటాడు. అందుకు ఎక్కువగా ధనం అవసరం అవుతుంది. ఆధన సంపాదన కోసం అవినీతి, అన్యాయం, ఇతరులను

బాధపెట్టడం దొంగతనం చేయడం మొదలైన కార్య క్రమాలను చేపడతారు. అందుకు ఇతరులను సతాయించడం పరాక్రమంగా భావిస్తాడు. వ్యసనాలకు ఇంద్రియలోలత్వానికి బానిస అవుతాడు. ఈదిశలో పయనించినప్పుడు అతడు తేజస్విగాను, మహాపురుషుడుగాను మారడానికి బదులు అహంకారి, గర్వి, అత్యాచారీ, వ్యసనపరుడు, దురాచారి కావడం తథ్యం. అందువల్ల ఆ లక్షణాల వైపు కన్నెత్తిచూడకూడదు.

దుఃఖితులను, బలహీనులను చేయిపట్టి లేవదీసి సహాయంచేసి, వారిని సతాయించే దుష్టులకు బుద్ధిచెప్పడానికి తన శక్తిని వినియోగించాలని గాయత్రీ మంత్రంలోని "స" అనే శబ్దం వివరిస్తుంది. చెడును ఎదుర్కొనడానికి, మంచిని పెంచటానికి భగవంతుడు మనకు శక్తిని ప్రసాదించాడు. దానిని సద్వినియోగంచేసుకోవాలి.

వి :— విత్తశక్త్యాతు కర్తవ్యా ఉచితాభావపూర్తయః
సతు శక్త్యాతయా కార్యం దర్పోద్ధత్య ప్రదర్శనమ్ (3)

ధనము యొక్క శక్తిద్వారా తనలోని లోటుపాట్లను పూరించుకోవడానికి ప్రయత్నించాలి. ధనము యొక్క శక్తితో అహంకారము, ఉద్దండత ప్రదర్శించవద్దు.

విద్యవలె, బలమువలె, ధనంకూడా ఒక మహత్వపూర్ణశక్తి. తన యొక్క, ఇతరులయొక్క, ఉచితమైన అవసరాలను తీర్చుకోవడానికి మాత్రమే ధనం సంపాదించాలి.

శరీరము, మనస్సు, బుద్ధి ఆత్మలయొక్క వికాసమునకు, సంసార అవసరాలకు తగినంతగా మాత్రమే ధనాన్ని వినియోగించాలి. అంతవరకు మాత్రమే ఆశించాలి.

కొందరు వ్యక్తులు ధనము కూడ బెట్టటమే పరమావధిగా భావిస్తారు. గొప్ప ధనవంతుడు కావడమే ప్రతిష్ఠగా భావిస్తారు. ఎక్కువఖరీదుగల వస్తువులుఉపయోగిచటం. ఎక్కువగా ఖర్చు పెట్టటం, అధికభోగాలు అధికవిలాసాలు, జీవనసఫలతకు చిహ్నంగా భావిస్తారు. అందువల్ల ధనము ఎలా అయినా సంపాదించాలన్న కాంక్ష పెరుగుతుంది. దీనికోసము ధర్మాధర్మము లను, ఉచితానుచితములను వదలి పెట్టేస్తాడు. ఇలా ధన సంపాదనతో తన్మయుడైపోయి, ఆరోగ్యము,మానసోల్లాసము, స్వాధ్యాయము, ఆత్మోన్నతి, లోకసేవ, ఈశ్వరా రాధనము మున్నగు ప్రయోజన కారియైన దిశల నుంచి ముఖము త్రిప్పేస్తాడు. మన వాస్తవికమైన అవసరాలను తీర్చుకోవడానికి, ధనాన్ని కోరటం సమంజసమే.తగు ప్రయత్నముతోను, పరిశ్రమతోను, ధనసంపాదన చేయమని గాయత్రీ మంత్రమందలి "వి" అనే శబ్దం సంకేతాన్నిస్తుంది.

తు :— తుషారాణాం ప్రపాతేఽపి, యత్నో ధర్మో తు చాత్మనః
మహిమా చ ప్రతిష్ఠాచ, ప్రోక్తా పరిశ్రమస్య హి (4)

మంచు పడుతున్నప్పుడు గూడా ప్రయత్నం చెయ్యడం ఆత్మ యొక్క ధర్మం. శ్రమయొక్క మహిమ. ప్రతిష్ఠ అపార మైనవని ఇక్కడ చెప్పబడుతున్నది.

మానవ జీవనంలో విపత్తులు, కష్టాలు, విపరీతపరిస్థితులు హాని, కష్టకాలము వచ్చిపోతూ ఉంటాయి. రాత్రి, పగలు ఏ విధంగా వస్తూపోతూ ఉంటాయో అదే విధంగా సంపద - లేమి, సుఖము-దుఃఖముజీవనరథానికి రెండు చక్రాలవంటివి. ఈ రెండు విషయముల కోసం మానవుడు ధైర్యంగా, సంసిద్ధముగా ఉండాలి. సంపద వచ్చినప్పుడు ఉప్పొంగిపోవడం, ఆపదవచ్చినపుడు క్రుంగిపోవడం సరికాదు.

కష్ట సమయాలలో మానవునికి నాలుగు సహచరులున్నాయి. (1) వివేకం (2) ధైర్యం (3)సాహసం (4) ప్రయత్నం. కష్ట సమయాలలో ఈ నాలుగు గుణాలనూ కలిగి ఉండటం వల్ల చెడ్డరోజులు నెమ్మది నెమ్మదిగా తొలగిపోతాయి. అంతేగాక అనేక అనుభవాలు, గుణాలు, యోగ్యత, శక్తి కానుకలుగా పొందవచ్చు. కత్తిని సానపడితే పదును తేలుతుంది. బంగారు అగ్నిలో పుటంపెడితే శుద్ధిపొందుతుంది. మానవుడు కష్టకాలంలో పొందిన అనుభవాన్ని పదిమంది గురువులు కలిసినా నేర్పలేరు అందువల్ల కష్టాలకు భయపడవద్దు. పైనాలుగు సాధనల ద్వారా ఓరిమితో వాటిని అంతమొందించాలి.

పరిశ్రమ, ప్రయత్నము, కర్తవ్యము ఈ మూడు మానవునికి గౌరవమూ, వైభవము ప్రాప్తింపచేస్తాయి. సోమరి, అంతా తలవ్రాత అనుకునేవాడూ, పనిచేయనివాడు, సంఘర్షణకు భయపడేవాడూ, లౌక్యం తెలియనివాడూఎల్లప్పుడూ అపజయాన్నిపొందుతూ ఉంటారు. కష్టాల నుండి విజయాన్ని పొందదలచినవాడూ, ఆనందమయజీవనముయొక్క రసాస్వాదనచేయదలచినవాడూ, ఈ గాయత్రీ మంత్రములోని "తు" అక్షరాన్ని ఉపదేశం పొందాలి అంటే ప్రయత్నంచెయ్యాలి, పరిశ్రమ చెయ్యాలి. కర్తవ్యపథంలో తలెత్తి అడుగువేయ్యాలి, పురుషార్థం యొక్క మహిమ అపారమైనది. పురుషార్థం కలవాడే అని ఈ "తు" శబ్దం ఉపదేశిస్తున్నది.

వి : వరనారీం వినా కోఽన్యో, నిర్మాతా మనుసంతతేః
మహత్వం రచనాశక్తేః స్వస్యాః నార్యా హి జ్ఞాయతాం (5)

మనుష్యులను తయారుచేయడానికి స్త్రీ కన్న వేరెవరు న్నారు ? మనుష్యులను నిర్మించడం, స్త్రీ యొక్క రచనా శక్తి మహత్వమేనని తెలుసుకోవాలి.

సమాజం స్త్రీ, పురుషులుగా విభజింపబడి ఉన్నది. ప్రతి పురుషుని ఉన్నతి, సౌలభ్యం, క్షేమం వెనుక ప్రతిక్షేత్రంలోనూ స్త్రీ యొక్క ప్రయత్నం ఉండితీరుతుంది. మన అర్థ సంసారం అర్ధ పరివారం. అర్థ జీవనం మన వెనుక ఉంటూ ఉండడమే ఫలితం. ఈ రెండు రథ చక్రాలలో ఒకటి పెద్ద, ఒకటి చిన్నది అయినప్పుడు నడక సక్రమంగా ఉండదు. ఎప్పుడయితే మనదేశం. మన సమాజం, స్త్రీకి సమాన గౌరవం ఇచ్చి. వారిక్రియాశీలత ప్రతిభమాపేందుకు అవకాశము ఇస్తుందో, అప్పుడే అన్ని రంగములలోను ప్రగతి సాధ్యము.

నారి వల్లనే నరుడు ఉత్పన్నమవుతాడు. బాలకుని మొదటి గురువు వాని తల్లియే. తండ్రి పాత్ర ఒక బిందువు వంటిది మాత్రమే. బాలకుని అంగప్రత్యంగాలన్నీ తల్లి రక్తమాంసాలతో ఏర్పడినవి మాత్రమే. తల్లి రక్తంలో ఎటువంటి స్థిరత్వము, ప్రతిభ, ఆలోచనలు ఉంటాయో వాటిని బట్టి బాలకుని శరీరము, మేధస్సు, స్వభావం ఏర్పడతాయి. స్త్రీలు ఎంతటి అనారోగ్యం చదువులేమి, వికాసం లేక పోవడం కూపస్థమండూకంవలె ప్రపంచజ్ఞానశూన్యత మొదలైనవానితో వెనుకబడి ఉంటారో వారికి కలిగిన సంతానం గూడా అటువంటి దోషాలనే కలిగి ఉంటుంది. చవిటినేలలో విత్తనాలు మొలకెత్తవు. మంచితోట వేయాలంటే సారవంతమైన భూమి అవసరం.

గాయత్రీ మంత్రంలోని "చ" అక్షరం తెలిపేదేమంటే మనుష్య జాతి ఉన్నతిని కోరుకున్నంటే ముందు స్త్రీలలో శారీరక బౌద్ధిక, సామాజిక, ఆర్థిక రంగాలలో పాటవాన్ని పెరపొందించాలి. అప్పుడే సమాజం లో బలము, తెలివితేటలు, సమృద్ధి, సద్బుద్ధి సద్గుణములు మహనీయత ఆదిగాగల సంస్కారాలు వికసిస్తాయి. స్త్రీలను వెనుక బడేటట్లు చేయడం తమ పాదాలమీద తాము నిప్పులు పోసుకున్నట్లే.

రే : రేవేవ నిర్మలా నారీ పూజనీయా సతా సదా
యతో హి సర్వ లోకేఽస్మిన్ సాక్షాల్లక్ష్మీర్మతా బుధైః (6)

సజ్జనపురుషులు సదా నర్మదానదివలె నిర్మలమైన స్త్రీలను పూజించాలి. స్త్రీలను ఈ ప్రపంచములో సాక్షాత్తు లక్ష్మీదేవిగా విద్వాంసులు గౌరవించారు.

స్త్రీ లక్ష్మి యొక్క అవతారము ఎక్కడ స్త్రీ మంచి లక్షణములు గలిగి బుద్ధిమతియై సహయోగినిగా ఉంటుందో అక్కడ దారిద్ర్యంతో తలమునకలవుతూన్నా, సంపన్నులకన్న అధికంగా ఆనందం వెల్లివిరుస్తుంది. ధనము, ఆభరణములు, జీవములేని లక్ష్మి స్వరూపాలు. స్త్రీ లక్ష్మీదేవియొక్క సజీవ ప్రతిమ. వారికి తగినంత ఆదరము, సత్కారము తృప్తి కలుగజేయడం ఆవశ్యకము

నర్మదానది ఎల్లప్పుడూ నిర్మలంగా ఉంటుంది. అదే విధంగా ఈశ్వరుడు నారీ అంతఃకరణను పరిశుద్ధంగా ఉంచాడు. పరిస్థితుల ప్రభావంవల్ల, దుష్టుల సాంగత్యంవల్ల అప్పుడప్పుడు ఆమె అంతఃకరణలో వికారాలు కలిగినా ఆవికారాలు తొలగిన తరువాత తిరిగి ఆమె అంతఃకరణ పరిశుద్ధంగానే ఉంటుంది. స్ఫటికమణి ముందు ఏ రంగు వస్తువులు ఉంచితే స్ఫటికం ఆరంగుకు మారుతుంది. ఆ వస్తువులను తీసివేస్తే స్ఫటికమణి స్వచ్ఛంగా మెరుస్తూనే వుంటుంది. అదే విధంగా స్త్రీ హృదయం తాత్కాలికంగా వికారం చెందినా ఆ వికారం తొలగింపజేస్తే స్ఫటికమణివలె యథా స్థితికి వస్తుంది.

వైధవ్యం, ఎవరికో మృత్యువు సంభవించడం లాంటిది దుర్ఘటనలు కలిగినప్పుడు అవి అప్పుడే అడుగుపెట్టిన నవవధువు వల్ల కలిగాయని భావించడం చాలా అనుచితం.

అవి జరగవలసి ఉండబట్టి జరుగుతాయి. స్త్రీ లక్ష్మి యొక్క అవతారం కాబట్టి ఆమె ఎల్లప్పుడూ కల్యాణకారిణిగా, మంగళమయిగా నిలచి ఉంటుంది. గాయత్రి మంత్రంలోని "రే" అనే అక్షరం నారీ సమానత యొక్క అభివృద్ధిని కాంక్షిస్తుంది. అందువల్ల ప్రజలకు మంగళమయ వరము ప్రాప్తిస్తుంది.

**'ణం": న్యస్తే మే నరాః పాదాన్ప్రకృత్యాజ్ఞానసారతః**
**స్వస్థాః సంతస్తు తే నూనం రోగముక్తా భవంతి హి (7)**

ఏ మనుష్యుడు ప్రకృతియొక్క ఆజ్ఞానుసారము అడుగులు వేస్తాడో ఆ మనుష్యుడు ఆరోగ్యవంతుడై నిశ్చయముగా రోగాల నుండి విముక్తుడు కాగలడు.

ప్రకృతి ఆదేశానుసారంగా నడవడం, ప్రకృతి అనుగుణంగా, ఆహారవిహారాలు. ప్రకృతిననుసరించి జీవించడం, మన ఆరోగ్యము పెంపొందించుకోవటానికి రాజమార్గాలు. ప్రకృతి విరుద్ధంగా, అస్వాభావికంగా, ఆడంబరాలతో, విలాసంగా జీవించడంవల్ల మానవుడు రోగగ్రస్తుడై అల్పాయుష్కుడవుతున్నాడు.

(1) ఆకలిగా ఉన్నపుడు, ప్రసన్నచిత్తంతో, నిదానంగా నమిలి తినుట, కడుపులో కొంత భాగం ఖాళీగా ఉంచి భోజనం చేయుట (2) పండ్లు కూరగాయలు, పాలు, పెరుగు, పాలిష్ చెయ్యని బియ్యం, పప్పులు, తాజాగా సాత్వికాహారాన్ని తీసుకోవాలి. (3) మత్తు పదార్థాలు, మిర్చి మసాలాలు పిండివంటలు, మిఠాయిలు మాంసం మొదలైన తినగూడనివి తినకుండా ఉండటం (4) సామర్థ్యానికి తగినట్లు శ్రమ, వ్యాయామము. (5) శరీరము, దుస్తులు, గృహము, ఉపయోగించే సామానులు శుభ్రంగా ఉంచుకోవడం. (6) పెందలడ నిద్రపోయి పెందలకడ నిద్రలేవడం (7) ఉల్లాసము, వినోదపర్యటన మొదలైన కార్యక్రమాలని తరచుగా పెట్టుకోవటం (8) కాముకత్వము భోగలాలస, అన్యాయము, అగౌరవము, ఈర్ష్య అసూయ, చింత క్రోధము, పాపము మొదలైన చెడ్డపనులను మనస్సు నుండి తొలగించి ప్రసన్నత, సాత్వికత మొదలైన మంచి గుణాలను కలిగి ఉండటం, (9) స్వచ్ఛమైన వాతావరణంలో ఉండటం (10) ఉపవాసము, ఎనీమా, ఫలహారము, నీరు, మట్టి మొదలైన ప్రాకృతిక ఉపచారాలతో రోగాల నుంచి విముక్తి పొందటం.

ఈ పది నియమాలు పాటించి జీవనం గడపడంవల్ల పోగొట్టుకున్న ఆరోగ్యాన్ని తిరిగి పొందటం. పొందిన ఆరోగ్యాన్ని సురక్షితంగా ఉంచుకోవడం, చాలా తేలిక. గాయత్రి యందలి "ణ్య" అనే అక్షరం ఈ ఉపదేశాన్ని ఇస్తుంది.

**"భ" : భవోద్విగ్న మనా నైవ హృదుద్వేగం పరిత్యజ**
**కురు సర్వవ్యవస్థాను, శాంతం సంతులితం మనః (8)**

మానసిక ఉత్తేజాలను విడిచిపెట్టు. సర్వకాల సర్వావస్థలయందునూ మనస్సును శాంతితోనూ, సామర్థ్యంతోనూ నింపు.

శరీరంలో వేడిమి అధికంగా ఉన్నప్పుడు జ్వరంగా పరిణమిస్తుంది. దానివల్ల చాలా దుష్పరిణామాలు సంభవిస్తాయి. అలాగే ఉద్వేగము, ఆవేశము, ఉత్తేజము, మదము, ఆతురత మొదలైన లక్షణాలు మానసిక జ్వరానికి సంబంధించినవి. ఆవేశమనే తుఫాను మనస్సులో ప్రవేశించినప్పుడు జ్ఞానము, ఆలోచన, వివేకము లోపిస్తాయి. అటువంటి సన్నిపాతంలో పడ్డ వ్యక్తి అర్థంలేని మాటలు మాట్లాడతాడు. పిచ్చిపనులు చేస్తాడు. అటువంటి పరిస్థితి మానవ జీవితంలో కోరదగినదిగాదు.

విపత్కర పరిస్థితులలో మానవుడు చింత, శోకము, నిరాశ, భయము, గాభరా, కోపము మొదలైన విషాదాత్మక ఆవేశాలకు లోనవుతాడు. సంపాదన పెరిగినకొలదీ అహంకారము. మదము, మాత్సర్యము, అతి సంతోషము, అమర్యాద, నాస్తికత ,భోగలాలస, ఈర్ష్యా ద్వేషములు మొదలైన విధ్వంసక ఉత్తేజనాలకు లోనవుతాడు. అంధునివలె ప్రవర్తిస్తాడు అతడు ఆరోగ్యముగా కనిపించినప్పటికీ అతని అంతరంగస్థితి పిచ్చిపిల్ల వానివలె. బాలుని వలె, రోగివలె, ఉన్మత్తునివలె ఉంటుంది. వీటివల్ల మానవునికి విపత్తి భయము, అనిష్టము, అనర్థము సంభవిస్తాయి. అందువల్ల "భ" శబ్దము మానవులను ఈ ఆవేశాలకు లోనుకావద్దని హెచ్చరిస్తుంది. ముందు చూపు, వివేకము, శాంతి, నిలకడతో పని చేయాలి. క్షణక్షణానికి రంగులు మారినట్లు మారుతున్న పరిస్థితులవల్ల మానసిక శాంతిని పోగొట్టుకోకూడదు. మెదడును ఆరోగ్యంగా ఉంచుకోవాలి. చిత్తాన్ని శాంతితో నింపాలి. ఆవేశాలకులోనుగాకుండా వివేకంతో ముందుచూపుతో ఆలోచనలను ప్రణాళికలను రూపొందించుకోవాలి.

"గో": గోప్యాః స్వీయా మనోవృత్తిర్నాసహిష్ణుర్నరో భవేత్
స్థిత మన్యస్య చ వీక్ష్య తదనురూపతాం చరేత్ (9)

మన మనోభావాలను గోప్యంగా ఉంచుకోరాదు. సహనాన్ని కోలుపోకూడదు. ఇతరుల స్థితిననుసరించి వారిపట్ల ప్రవర్తించాలి.

మనస్సులోని భావాలను దాచుకోవడం మోసము, కపటము, పాపముకూడా. లోపల ఒకటి బయట ఒకటి ఉండకూడదు. కల్లాకపటం లేనిది పాపనివృత్తికి రాజమార్గం వంటిది.

స్పష్టంగా, నిజంగా లోపల ఉన్నదే పైకి మాట్లాడటం, ఎవరికీనొప్పి కలగకుండా ప్రవర్తించడం అనే లక్షణాలు మానవుని తన ఆత్మ ఎదుట, పరమాత్మ ఎదుట అపరాధిగా నించోపెట్టవు. మనసులో అసత్యాన్ని దాచుకొవడం ఆత్మహత్య వంటిది. కొందరు వ్యక్తులు రహస్యంగా సంచరిస్తారు. అపరాధిగా నిలబెట్టే పనులు చేస్తారు. వారికి

ఆత్మీయులు విశ్వసించగలవారి ఆవశ్యకత వున్నది. వారివద్ద మనస్సులోని భావాలను బహిర్గతము చేసి మనసును తేలికపరచుకోవచ్చు. అటువంటి ఆత్మీయులు గురుజనులు అందరికి అవసరము.

దృష్టికోణము, ఆలోచన, అనుభవము, అభ్యాసము, జ్ఞానము, స్వార్థము, రుచి ఎవరిది వారికి ప్రత్యేకముగా ఉంటుంది.అందరి ఆలోచనలూ ఒకటిగా ఉండవు. అందువల్ల ఇతరులను సహించడం అవసరం. తన ఇష్ట ప్రకారం ప్రవర్తించనివారిని మూర్ఖులుగా, అజ్ఞానులుగా, దురాచారులుగా, విరోధులుగా భావించడం మంచిదికాదు. ఎవరి ఆలోచనల ననుసరించి వారు ప్రవర్తిస్తారు. అందువల్ల సంఘర్షణ దూరంచేయాలి. భేదభావాలువచ్చినపుడ సర్దుకు పోవడం నేర్చుకోవాలి.

ప్రపంచంలో ఎన్నోరకాల మనుష్యులుంటారు. మూర్ఖులు విద్వాంసులు, రోగులు ఆరోగ్యవంతులు, పాపులు, పుణ్యవంతులు, పిరికివారు, వీరులు, కటువుగా మాట్లాడేవారు, వినయంగా మాట్లాడేవారు. చోరులు, గౌరవనీయులు, నిందితులు, ఆదరం పొందదగినవారు, స్వధర్మంలో మెలగే వారు. ఇతర ధర్మాలను అనుసరించేవారు. దయాపాత్రులు, దండనీయులు, నీరసులు, సరసులు, భోగులు, త్యాగులు మొదలైన పరస్పర వ్యతిరేకమైన లక్షణాలు కలిగి ఉంటారు. వారి లక్షణాలననుసరించి వారితో మాట్లాడాలి.వ్యవహరించాలి. సహవాసంచేయాలి. వారికి తగిన సహకారాల నందజేయాలి. అందరితో ఒకే రకంగా ప్రవర్తించటం కూడదు. అందరు ఒకే మార్గంలో పయనించటం సాధ్యముకాదు. ఈ విషయాలన్నింటినీ మనకు "గో" అనే అక్షరం వివరిస్తుంది.

"దే": దేయాని స్వవశే పుంసాం స్వేన్ద్రి యాణ్యఖిలాని వై
ఆసంయతాని ఖాదన్తీన్ద్రియాణ్యేతాని స్వామినమ్ (10)

మనుష్యుడు తన ఇంద్రియములన్నింటిని తనవశంలో ఉంచుకోవాలి. లేకపోతే ఇంద్రియాలు మనుష్యుని తినివేస్తాయి.

ఇంద్రియములు ఆత్మకు ఆయుధములు గుఱ్ఱములు, సేవకులు, పరమాత్మ, ఆత్మ యొక్క ఆవశ్యకతలకై, తద్వారా సుఖప్రాప్తి కొరకు ఇంద్రియాలను ప్రసాదించాడు. ఇంద్రియాలన్ని ఎంతో ఉపయోగంచేసి జీవునికి ఉత్కర్ష ఆనందము కలిగించటమే వీటిపని అంటే వీటి సదుపయోగములో క్షణక్షణము మానవజీవనము మధురంగామారి భాగ్యశీలురు అవగలరు.

ఏ ఇంద్రియములోను భోగాలను అనుభవించటం పాపం కాదు. అంతః కరణం యొక్క కోరికను తీర్చుకోవటానికి ఇంద్రియాలు పరికరాల వంటివి. ఎలాగయితే ఆకలి, దాహము తీర్చకపోతే శరీరము కృశించి పోతుందో అలాగే సూక్ష్మశరీరము యొక్క కోరికలు ఉచితరీతిలో తీర్చకపోతే అనేక మానసిక రోగాలు తలఎత్తుతాయి.

ఇంద్రియభోగాలను నిరసించి, వాసనలను అరికట్టాలనిఉపదేశం చేస్తుంటారు. దీని అసలు అర్థము ఏమంటే ఇంద్రియ భోగాలను విచ్చల విడిగా అనుభవించటం మంచిది కాదు, వాటితో చేయవలసిన పనులనే చేయాలి, లేకపోతే ధర్మానికి కీడుగలిగి అనేకమయిన సంకట పరిస్థితులు ఉత్పన్నమవుతున్నాయి. ఈ రోజుల్లో మానవజాతిలో అధికభాగం ఇంద్రియాలకు గులాములు ,వాసనలను అదుపులో ఉంచకపోతే ఇంద్రియాలు వాటి స్వామినే తినివేస్తాయి.

గాయత్రీలోని "దే" అనే అక్షరము ఆత్మ నియంత్రణను ఉపదేశిస్తుంది. ఇంద్రియాలు మన వశంలో ఉండాలి. నిగ్రహింపబడిన ఇంద్రియాలు మంచిమిత్రులు. వశంలో లేని ఇంద్రియాలు శత్రువులు.

**"వ": వన విత్యం పవిత్రః సన్ బాహ్యాభ్యంతరత స్తథా**
**యతః పవిత్రతాయాం హి రాజతేతి ప్రసన్నతా. (11)**

మానవుడు లోపల బయటకూడా పవిత్రత తోనే ప్రసన్నత ఉంటుంది.

ఆహా పవిత్రత ఎంతటి చల్లని, శాంతినిచ్చే, చిత్తానికి ప్రసన్నత నందించే శబ్దం. మురికి, చెత్త, మైల, వికారము, పాపము, అపవిత్రత, దుర్గంధము,. అవ్యవస్థలను దగ్ధముచేసి వీటిస్థానమున స్వచ్ఛత, నిర్మలత్వం, పవిత్రతలను నింపాలి.

మలినత గుడ్డితనానికీ, తామసప్రవృత్తికి ప్రతీక. ఆలస్యము, ధారిద్ర్యము, పాపము, పతనము ఇవి ఎక్కడుంటే అక్కడ మాలిన్యం ఉంటుంది. ఎవరిపరిస్థితుల్లో ఇవి ఉంటాయో వారివస్త్రములు, గృహం, సామానులు, శరీరము, మనస్సు మాలిన్యంతో కూడి ఉంటాయి. వీటికి, వ్యతిరేకంగా ఎక్కడ చైతన్యం, మెలుకువ, మంచిఅభిరుచి, సాత్వికత ఉంటాయో, అక్కడ ముఖ్యంగా స్వచ్ఛతవైపు ధ్యానం తప్పని సరిగా ఉంటుంది. పరిశుభ్రత, నిరాడంబరత, అలంకరణలతో గూడిన వ్యవస్థ పవిత్రతగా పిలువబడుతుంది.

మలినత్వాన్ని అసహ్యంచుకోవాలి, కానిదానిని తొలగించటంలో ఆసక్తి ఉండాలి. మురికి ముట్టుకోవటానికి, పారవెయ్యటానికి సందేహించేవారు శుభ్రతను పాటించలేరు. మనస్సులో, శరీరంలో, వస్త్రాలలో, గంటగంటకి మురికి ఏర్పడుతుంది. నిరంతరం జీర్ణమయ్యే లక్షణాలు కనిపిస్తాయి. మాటిమాటికి ఆమలినాన్ని కడిగివేసే ప్రయత్నం చేయకపోతే, శుభ్రంగా ఉండటం అనేది కల్పనగానే మిగిలిపోతుంది.

గాయత్రీ మంత్రం యొక్క "వ" అక్షరం స్వచ్ఛతను సూచిస్తుంది. స్వచ్ఛశరీరము, వస్త్రాలు, స్వచ్ఛమైన ఇల్లు. "స్వచ్ఛమైన సామానులు, స్వచ్ఛమైన జీవితం, ఆలోచనలు స్వచ్ఛతగల వ్యవహారం మొదలైనవి మూర్తీభవించిన మానవుడు, నిష్పాప జీవనము గడుపుతూ పుణ్యగతిని పొందుతాడు.

"స్య": స్యందనం పరమార్థస్య పరార్థో హి బుధై ర్మతః
యోఽన్యాన్ సుఖయతే విద్వాన్ తస్య దుఃఖం వినశ్యతి. (12)

ఇతరులకు ప్రయోజనం కలిగించటం పరమార్థమని పెద్దలు చెపుతారు. ఆలోచనగలవారు ఇతరులకు ఆనందాన్ని కలిగించటం వల్ల తమ కష్టాలు పోగొట్టుకుంటారు.

లోకవ్యవహారానికి మూడుమార్గాలున్నాయి. 1. అర్థము– ఇందులో ఇరుపక్షాల వారు సమానంగా ఇచ్చిపుచ్చుకోవటాలు జరుగుతాయి. 2. స్వార్థం– ఇతరులకు నష్టం కలిగించి తమలాభం చూసుకోవటం 3. పరమార్థం– తమకై హాని కలిగించుకొని యితరులకు లాభం కలిగించటం. స్వార్థంలో దొంగతనం, మోసం, అగౌరవం మొదలైనవి ఉంటాయి. పరమార్థంలో దానం, సేవ, సహాయత, శిక్షణ మొదలైన పనులుచెప్పబడతాయి.

అర్థం మన నిత్యకర్మ. అదిలేకుండా జీవనంగడవదు. ఆహారం, నిద్ర, మలవిసర్జన మొదలైనవి స్వాభావికమైనవి కావటంవల్ల వాటిని నిషేధించలేము, అవి ప్రతివారూ చేయవలసినపని, స్వార్థాన్నిత్యజించాలి. స్వార్థమూ పాపమూలకమయినది. పరమార్థం ధర్మకార్యము, దీని వల్ల మనకు త్యాగం; ఉదారతల అభ్యాసం అవుతుంది. ఆత్మ కల్యాణమునకు ధర్మ మార్గం ప్రశస్తమైనది. దానివల్ల ఇతరులకు లాభిస్తుంది. అందువల్ల వారు ప్రసన్నులై దానికి బదులుగా ప్రత్యుపకారం చేస్తారు. ప్రశంసిస్తారు. కృతజ్ఞులుగా ఉంటారు.

గాయత్రీ మంత్రంలోని "స్య" అక్షరం పరమార్థంకొరకు ప్రేరణ ఇస్తుంది. ప్రతి మనిషి ధనం సంపాదిస్తూనే త్యాగాన్ని అవలంబించి, స్వార్థాన్ని విడిచి పెట్టాలి, పరమార్థం కోసం ప్రయత్న శీలురు కావాలి. పొట్టనింపుకోవటమనేది పశువులు పక్షులు గూడా చేస్తాయి. కాని దాని వల్ల ఇతరులకు కొంత ప్రయోజనం చేకూర్చటమేప్రశంసనీయం.

"ధీ": ధీరస్తుష్టో భజేన్నైవ హ్యేకస్యాం హి సమున్నతౌ
క్రియతాముణ్నతిస్తేన సర్వాస్వాశాసు జీవనే (13)

ధీరుడైన పురుషునికి ఒకే విధమైన ఉన్నతివల్ల తృప్తి కలగ కూడదు. మనిషికి జీవితంలో అన్ని దిశలలో ఉన్నతి లభించాలి.

శరీరంలో అనేక అంగాలున్నాయి. అవన్నీ పుష్టిగా ఉండటం ఎంత అవసరమో, మనిషికి అన్నిదిశలలోను ఉన్నతి లభించటం అంత అవసరం. అదే సర్వతో ముఖమైన ఔన్నత్యము. పొట్ట పెద్దదై కాళ్ళు చేతులు సన్నబడితే ఆనందానికి బదులు దిగులు ఏర్పడుతుంది. ఇదే విధంగా ఒక వ్యక్తి ధనవంతుడు కాని విద్వాంసుడుకాని పహిల్వాన్‌గాని కావటంవల్ల అతనికి ఉన్నతి లభించినట్లు కాదు. ఆ పహిల్వాను దరిద్రుడు కావటంవల్ల లాభంలేదు. రోగాలతో మగ్గుతున్న విద్వాంసుడు పనికిరాడు. ధనవంతునికి ఆరోగ్యం విద్య లేకపోవుట వల్ల లాభం ఏముంది ?

కేవలం ఒకే దిశలో ఉన్నతికోసం ప్రయత్నించి మిగతా అన్ని దిశలను ఉపేక్షించటం, వాటివైపు ఉదాసీనత చూపటం ఉచితంకాదు. తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం, ఈశాన్యం, వాయవ్యం, నైరృతి, ఆగ్నేయాలనే ఎనిమిది దిక్కులున్నట్లే, జీవితానికి 8 దిశలు. బలాలు ఉన్నాయి. అవి 1. ఆరోగ్యబలం 2. విద్యాబలం 3. ధనబలం 4. మిత్రబలం 5. ప్రతిష్ఠాబలం 6. చతురతాబలం 7. సాహసబలం 8. ఆత్మబలం ఈ ఎనిమిదింటిని ఒకేచోట సంచయంచేయాలి. వ్యవసాయదారుడు పొలాన్ని అన్నివైపుల నుంచి రక్షించినట్లు, జీవిత యుద్ధంలోని ఎనిమిది మూలలను రక్షించాలి. ఏ మూల రక్షణ తక్కువగా ఉంటే ఆ మూలనుంచి శత్రువులు ఆక్రమణ చేయటం ఓడించే భయాలుంటాయి.

గాయత్రీ మంత్రం యొక్క "ధీ" శబ్దం మనకు తెలిపేదే మంటే ఎనిమిదిబలాలను పెంచుకో, ఎనిమిదిమూలలను మెలకువగా వుంచుకో. ఎనిమిది చేతుల దుర్గాదేవిని ఉపాసనచేయి. ఎనిమిది దిశలను రక్షించు. అప్పుడే అన్ని అంగాల ఉన్నతి జరుగుతుంది. అన్ని అంగాల ఉన్నతే ఆరోగ్యకరమైనది. ఒకే అంగాన్ని బలంగా ఉంచుకోవటం మిగతా, వాటిని దుర్బలంగా ఉంచటం లక్షణం కాదు.

"మ": మహేశ్వరస్య విజ్ఞాయ నియమాన్న్యాయ సంయుతాన్
తస్య సత్తాం చ స్వీకుర్వన్ కర్మణా తముపాసయేత్ (14)

పరమాత్మయొక్క న్యాయపూర్ణమైన నియమాలను అర్థం చేసుకొని వాని సత్తా స్వీకరిస్తూ ఈ పరమాత్ముని ఉపాసనచేయాలి.

పరమాత్ముని నియమాలు న్యాయమైనవి. సృష్టిలో అతి ప్రధానమైన పనులు రెండే రెండు. 1. ప్రపంచాన్ని నియమ బద్ధంగా ఉంచటం 2. పనులకు తగిన ఫలితాన్నివ్వటం. ఈ రెండు పరమాత్ముని పనులని అర్థంచేసుకొని, ప్రకృతి నియమాలను ధ్యానంలో ఉంచుకొని, సామాజిక, రాజకీయ, ధార్మిక, లోకహితమైన చట్టాలను, పిర్యాదులను అంగీకరించేవాడు ఈశ్వరుని ఒక విధంగా ప్రసన్న చేసుకోగలుగుతాడు. ఇదే విధంగా, న్యాయస్థానంలో నిలబడటం పాప, పుణ్య కార్యాలను అనుసరించి సుఖ దుఃఖాలను అనుభవించటం అనివార్యము. ఇవే ఈశ్వరునికి దగ్గరచేస్తాయి. పనిచేసిన వానికే దాని ఫలితం లభిస్తుంది. చెమటకార్చి శ్రమించినవానికే పురుషార్థమైన పరిశ్రమ, చతురత చూపినవారికే వారి ప్రయత్నాన్ని అనుసరించి సాధన సామాగ్రి ఏర్పరుచుకోవటంలో విజయం లభిస్తుంది.

పరమాత్ముని పూజకు ఉపాసనకు ఎన్నో సాధనలున్నాయి, ఎన్నో కర్మకాండలున్నాయి. వాటి తాత్పర్యం సాధకుడు పరమాత్ముని ఉనికిపైన. ఆయన సర్వజ్ఞత, సర్వవ్యాపకతపైన నమ్మకం ఉంచటమే. ఈ విశ్వాసం ఎంత దృఢంగా ఉంటే,

అంతవరకే భగవంతుని నియమాలు మరియు న్యాయాలస్మరణ ఉంటుంది. ఈ రెండింటి కఠోరత, నిశ్చింతతపైన విశ్వాసము ఉండటం, సన్మార్గంలో నడిచే వారి ప్రేరణకు హేతువు. ఒకరి కర్మలకు కొంచము వెనుక ముందుగా ఫలితం లభించినచో అతడు బద్ధకస్తునిగా, చెడ్డపనుల చేసేవాడుగా భావింపబడడు. సోమరి తనంనుంచి, చెడ్డపనులు నుంచి ఎంతగాతప్పుకుంటాడో, అంతగా అతడు భగవంతుని భక్తుడు. గాయత్రీ మంత్రంయొక్క "మ" అక్షరం ఈశ్వరోపాసనలోని రహస్యాన్ని స్పష్టంచేస్తుంది. ఈశ్వరుని నియమాలను న్యాయాలను ధ్యానంలో ఉంచుకొని మంచి మార్గంలో నడవాలని చెపుతుంది.

"హి" : హితం మత్వాజ్ఞాన కేంద్రం స్వాతంత్ర్యేణ విచారయేత్
నాంధానుసరణంకుర్యాత్ కదాచిత్ కోఽపి కస్యచిత్ (5)

హితకారి జ్ఞానకేంద్రాన్ని అర్థం చేసుకొని స్వతంత్రంగా ఆలోచించాలి. ఎప్పుడూ ఇతరులను గుడ్డిగా అనుసరించరాదు.

దేశం, కాలం, పాత్ర, అధికారం, పరిస్థితులను అనుసరించి మానవజాతి సౌకర్యం కోసం వివిధ రకాలైన నియమాలు,, ధర్మాదేశాలు, చట్టాలు మరియుఆచారాలు నిర్మించటం జరుగుతుంది. పరిస్థితుల మార్పుతోపాటే ఈ ఆచారాల, మాన్యతల పరివర్తన జరుగుతూ ఉంటుంది. ఆదికాలం నుంచి ఇప్పటి వరకు అనేకరకాలైన శాసన పద్ధతులు, ధర్మధారణలు, రీతి రివాజులు, పరంపరల మార్పులు జరిగినాయి, అనేకానేక సమయాలలో జరిగిన మార్పులగురించి ప్రాచీన గ్రంథాలలో వ్రాయబడి ఉన్నది. వాటిలో పరస్పర విరుద్ధమైన మాటలు కనబడతాయి. వాస్తవంగా విరోధము ఏమీలేదు. విభిన్న సమయాల్లో విభిన్న కారణాల వల్ల రీతి-నీతులలో జరిగే మార్పులే, పుస్తకాలలో వ్రాయబడి ఉన్నప్పటికి అవి ఏయే కాలాలలో వ్రాయబడ్డాయో స్పష్టంగా లేదు. ఒక వేళ ఏ ఏ కాలాలలో వ్రాయబడినవో తెలిస్తే అవి పరస్పర విరుద్ధంగా కనిపించవు దేశకాల పరిస్థితులను బట్టి అది భేదమేకాని విరోధం కాదని పాఠకులు తెలుసుకొంటారు.

సమాజం సక్రమంగా ఉండటానికి ఆచారాలు ఉన్నాయి. మనుష్యజాతి మనుగడ కోసం అవి ఏర్పడ్డాయి. ప్రపంచంలో ఆదికాలం నుంచి అనేకమైన పరివర్తనలు జరుగుతున్నాయి. అనేక రివాజులు ఈ కాలానికి సరిపోయేవి కావు. పరంపర, మోహం కారణంగా వాటిని గుడ్డిగా అనుసరించితీరాలని అనుకోవటం మంచిది కాదు.

గాయత్రీ మంత్రంలోని "హి" అక్షరం చెప్పేదేమంటే మనుష్య సమాజం యొక్క హితం దృష్టిలో ఉంచుకొని దేశం, కాలం మరియు వివేకాలను అనుసరించి ఆచారాలను, పరంపరలను మార్చవచ్చు. ప్రస్తుతం హిందూ సమాజంలోని లెక్కలేనన్ని ఆచారాలను మార్చవలసిన అవసరం ఉంది.

ధర్మం ప్రపంచానికి ఆధారం. దానిపై విశ్వంయొక్క సమస్త భారమంతా మోపబడింది. ధర్మాచరణలేక, అందరూపరిపూర్ణంగా అధర్మంగల వారై పోయినప్పుడు ఏ ప్రాణికూడా ఒక్కక్షణం శాంతిగా ఉండలేదు. అందరికీ తమ ప్రాణాలు రక్షించుకోవటానికి ఇతరులను బాధించవలసి వస్తుంది. ఈనాడు అనేక మంది చాటుగా అధర్మాచరణ చేస్తారు. కాని వారికి అందరిముందు అలా ఒప్పుకోగల ధైర్యం ఉండదు. అ ధర్మాన్ని ఆశ్రయించి అధర్మంచేయగలంత పటిష్ఠమైనది ధర్మమని, ఆపటానికి కూడా ధైర్యం ఉండదు. చెడ్డపనులు కూడా మంచిని అడ్డం పెట్టుకొని చేయబడతాయి. ఇందువల్ల అర్థమయ్యేదేమంటే దుష్టులు కూడ ధర్మాన్ని, అలాంటి దృఢమైన ఆధారాన్నే మనం అవలంబించాలి.

చాలామంది ధర్మమంటే కర్మకాండ, పూజాపాఠం, తీర్థవ్రతాలు, దానాలు మొదలైన వాటికి సంబంధించిన విషయంగా అనుకుంటారు. కొంత సమయం వీటిలో గడిపి మిగతా సమయం నైతిక, అనైతిక కార్యాలను చేయవచ్చునని అనుకుంటారు. ఇది భ్రాంతి మాత్రమే. ధర్మం పూజాపాఠాల వరకే పరిమితమయ్యే వస్తువు కాదు. దాని ఉపయోగం ప్రతి ఆలోచనలోను, పనిలోను పూర్తిగా ఉండాలి.

గాయత్రీ మంత్రంలోని "యో" అక్షరం చెప్పేది ఏమంటే ధర్మాన్ని ఎగతాళి చేయకు, దానిని ఆడంబరంగా ఆచరించకు, అంటే దాన్ని జీవితంలోకి గుచ్చుకుపోయేలా చేయాలి. ఏది చేసినా, ఆలోచించినా అదిధర్మానికి అనుకూలంగా ఉండాలి. "రక్షింపబడిన ధర్మం మనలను రక్షిస్తుంది. ధర్మాన్ని చంపిన వాడిని ధర్మం చంపుతుంది " అని శాస్త్రాలలో చెప్పబడింది. ఈ సత్యాన్ని గుర్తుంచుకొని మన జీవితంలో ధర్మాన్నే పూర్తిగా ఆచరించాలి.

**"యో" :    యోజనం వ్యసనేభ్యః స్యాత్తాని పుంసస్తు శత్రవః**

**మిలిత్వైతాని సర్వాణి సమయే ఘ్నన్తిమానవమ్**
**(18)**

వ్యసనాలనుంచి యోజనమంత దూరంలో ఉండాలి. అంటే వ్యసనాలనుంచి రక్షింపబడాలి, ఎందుకంటే అవి మనుష్యులకు శత్రువులు. ఈ వ్యసనాలన్నీ సమయం చూసి మనుష్యులను చంపివేస్తాయి.

వ్యసనం మనిషికి ప్రాణాపాయమైన శత్రువు. మాదక ద్రవ్యాలు వ్యసనాలలో ప్రధానమైనవి. పొగాకు, గంజాయి, భంగు, సారాయి మొదలైన మత్తుపదార్థాలు ఒకదానిని మించి ఒకటి హానికరమైనవి. వీటివల్ల క్షణికమైన ఉత్తేజం కలుగుతుంది. జీవన శక్తి క్షీణించి, దుర్బలమైనవారు. తమని తాము అశక్తులుగా అనుకుంటారు వారి

ఉపచారాలను ఆచార వ్యవహారాలు మార్చి, వారిని శక్తిమంతులుగా చేయవచ్చు. కాని పిరికి మనుషులు వేరేమార్గాన్ని అవలంబిస్తారు. వారు అలసిన గుర్రాన్ని కొరడాతో కొట్టికొట్టి, పరుగెత్తించి, ఆకొరడాలో పరుగెత్తించే శక్తి ఉందని భ్రమపడతారు. మత్తుపదార్థాలు మెదడును మూర్ఛిల్లజేస్తాయి. మూర్ఛకాలంలో బాధలు తెలియకుండా చేస్తాయి. మత్తు పదార్థాలు తీసుకొనేవాడు. అవితనను బలవంతుడిగా చేస్తున్నాయనుకొంటాడు. నిజానికి బలంరాదు. అంతకు ముందు మిగిలిఉన్న బలం ఉబికివచ్చి పూర్తయి పోతుంది. అందువల్ల మత్తుమందు తినేవాడు రోజు రోజుకూ క్షీణిస్తూ అకాల మృత్యుముఖానికి దగ్గరవుతాడు. వ్యసనాలు మిత్రులవేషంలో శరీరంలో చేరి శత్రువులై అతనిని చంపుతాయి.

మత్తుపదార్థాలే కాక ఇంకా శరీరానికి, మనస్సుకి హాని కలిగించే వ్యసనాలు ఉన్నాయి. ఆకర్షణ, అలవాటులవల్ల మనిషి వాటికి బానిస అవుతాడు. అవి వదలుకుందామన్నా వదలవు. సినిమా, వ్యభిచారం కోడి పందాలు, గుర్రపు పందాలు మొదలైన వాటిని ఆనందం అనుకొని వాటిపై ధనం, సమయం అన్నింటినీ వృధా చేసుకుంటున్నారు.

గాయత్రీ మంత్రంలోని "యో" అక్షరం వ్యసనాలను దూరం చేసుకోవాలని ఆదేశమిస్తుంది. ఎందుకంటే ఇవి శరారాన్ని, మనస్సుని నాశనం చేస్తాయి. వ్యసన పరుని పనులు నీచమార్గాన పడతాయి.

"న" : నః శణ్వేకామిమాం వార్తాం " జాగృత త్వ్యం సదా భవ"
సప్రమాదం నరం నూనం హ్యాక్రామన్తి విపక్షిణః (19)

మా ఈ ఒక్కమాట విను. ఏదంటే నీవు ఎల్లప్పుడూ జాగరూకుడివైవుండు. ఎందుకంటే నిద్రపోతున్న మనిషిపై శత్రువులు నిశ్చయంగా ఆక్రమణచేస్తారు. దూరాలోచన లేని వాడు. ఆపదలను ఎదుర్కోవలసి వస్తుంది. లక్ష్యంలేని మనిషిపై నాలుగువైపులనుంచి ఆక్రమణచేస్తారు. సావధానములేక పోవుటవల్ల అనేక విపత్తులు ఆకర్షింపబడతాయి. అజాగ్రత్త పరుడు, సోమరి అయిన పురుషుడు సగము చచ్చిన వానితో సమానము. చచ్చిన శవముపై గ్రద్దలు, కాకులు, రాబందులు, కుక్కలు దూరం నుంచి వచ్చి ఎలా పడతాయో అలాగే సావధానము లేని పురుషుని పై ఆక్రమణ చేసే తత్వాలు, ఎక్కడెక్కడినుండో వచ్చి , వాటి శక్తిని ప్రదర్శిస్తాయి.

ఆరోగ్యరక్షణ మీద జాగరూకతలేని వానిపై రోగాలు దాడి చేస్తాయి. మానసిక శత్రువులైన కామ, క్రోధ, మోహ, లోభ, మద, మాత్సర్యాల గతి విధానాలను గమనించనివాడు చెడుఆలోచనల, చెడుకర్మల గుంటలో పడక మానడు. ప్రపంచంలోని మోసము, అబద్ధం, అన్యాయం, స్వార్థం, దొంగతనాలనుంచి దూరంగా ఉండక పోతే , అతనిని సతాయించేవారు, వెర్రివాడిని చేసేవారు అనేక మంది ఉద్భవిస్తారు. జాగరూకతలేని వాడని ప్రపంచంలోని సైతాని తత్వాలు కొల్లగొట్టి తినివేస్తాయి.

ఇందువల్ల గాయత్రీ మంత్రములోని "నః" అక్షరము మనను సావధానంగా వుండమని, మేలుకొని వుండమని, శత్రువుల ఆక్రమణ చేయనీయ వద్దనిచెపుతుంది. వివేకపూర్వకంగా త్యాగం చేయటం, ఉదారతతో పరోపకారం చేయటం మంచిదే, కాని వెర్రితనంతో మోసగాళ్ళను గుర్తించ లేకపోవడం అవాంఛనీయం. పాపమూలం అవుతుంది.

"ప్ర": ప్రకృత్యాతు భవోదారో నానుదారః కదాచన
చిన్తయోదార దృష్ట్యైవ తేన చిత్తం విశుద్ధ్యతి (20)

స్వభావసిద్ధంగా ఉదారంగా ఉండు, ఎప్పుడూ ఉదారత లేకుండా ఉండకు. ఉదారదృష్టితోనే ఆలోచించటంవల్ల చిత్తము పరిశుభ్రంగా ఉంటుంది.

తమ మాటలు , రీతి, రివాజులు, మాన్యత మొదలైనవాటిని సరియైనవని, ఇతరులను మూర్ఖులు, భ్రాంతులు, అనుకోవటం అనుదారత యొక్క లక్షణములు, తమ లోభం కొరకు మొత్తం ప్రపంచమే నాశనమయినా ఫరవాలేదకునేవారినే అనుదారులు అంటారు. వారుకేవలం తమ ఇష్టం, సౌకర్యాలను అన్నిటికంటే మిన్నగా భావిస్తారు. ఇతరుల అసౌకర్యం, కష్టం గురించి వారికి గుర్తింపు ఉండదు.

అలాంటి అనుదారత పశుత్వానికి సూచన, పెంకి, దురాగ్రహం, గర్వం మొదలైన గుణాలున్న వ్యక్తులమాట కరుకుగా ఆలోచన శుష్కంగా, చేతలు కర్కశంగా ఉంటాయి, గాయత్రీ సందేశం విని అర్థముచేసుకొనే వారికి అలాంటి లక్షణం ఉండరాదు. ఇతరుల ఆలోచనలు తర్కాలు, స్వార్థాలు, పరిస్థితులను ఇతర మతస్థులైనప్పటికి అర్థంచేసుకోవటం నేర్చుకోవాలి. ఇతరులు తమ సౌకర్యాన్ని, స్థితిని అనుసరించి ఆలోచనలు చేస్తారు. మన మాటలు సరియైనవని దృఢమైన అభిప్రాయం మనకు ఉన్నప్పుడు, అలాంటి ఇతరుల దృఢత్వాన్ని విమర్శించటం ఎందుకు ?

గాయత్రీ మంత్రంలోని "ప్ర" అక్షరం ఇతరుల తప్పులు లోట్లను ఎంచకుండా, ఉదారంగా చూడాలని చెపుతుంది. ఇతరుల కోరికలు అవసరాలనుసరించి మన సానుభూతి ఉండాలి. ఇతరుల పరిస్థితిలో మనమే ఉంటే మనమేమికోరతాము అనేది దృష్టిలో ఉంచుకొని వ్యవహరించాలి మతభేదాలను పాటించటం, ఇతరుతో ఎంతవరకు ఏకీభవించగలిగితే, అంతవరకు ఏకీభవించటం మంచిది,

"చో": చోదయత్యేవ సత్సంగో ధియమస్య ఫలం మహత్
స్వమతో సజ్జనైర్విద్వాన్ కుర్యాత్పర్యావృతం సదా (21)

సత్సంగం బుద్ధిని ప్రేరేపిస్తుంది. ఈ సత్సంగం యొక్క ఫలం చాలా గొప్పది. అందువల్ల విద్వాంసులు తమచుట్టూ ఎప్పుడూ సత్పురుషులను ఉంచుకుంటారు.

మనిషిమస్తిష్కం నిర్మలజలంతో సమానం. వాతావరణం, సంస్కారం, అనుసరణలు

దానిని వివిధ దిశలలోకి తిప్పుతాయి, నీటి ప్రవాహం దానిలోని పడవను తనలో తీసుకెళ్ళుతుంది. గాలి ఎటువైపువీస్తే, గాలిపటంకూడా అటే వెళుతుంది. మనిషి ఏవాతావరణంలో ఉంటే అతని మనః ప్రవృత్తులు అదే విధంగా వుంటాయి. మెల్లిమెల్లిగా ఆకారిమి లోనే అతడు రూపుదిద్దుకుంటాడు. ఇద్దరు బాలకులు, ఒకడు కసాయివాడిఇంట, ఒకడు బ్రాహ్మణుని ఇంట పుట్టి పెరిగి పెద్దఅయినపుడు, వారి గుణములలో, కర్మలలో స్వభావములో,భూమికి ఆకాశానికి ఉన్నంత తేడా ఉంటుంది. ఇది స్నేహం యొక్క ప్రభావమే.

ఎవరైతే మంచిదిశవైపు ఉన్నతి కోరుకుంటాడో, వారు మంచి వాతావరణంలో ఉండటం, మంచి స్నేహితులను ఏర్పరచుకోవటం, అలాంటి వారితో సంబంధ బాంధవ్యాలు పెంచుకోవటం అవసరం. వీలయితే పరామర్శ, ఉపదేశం, మార్గదర్శనం వీరినుండి పొందాలి. ఇలాంటి స్థితిలో ఉపదేశం, మార్గదర్శనం వీరినుండి పొందాలి. అలాంటి ప్రభావము పడి, ఆ దిశలోనే పయనించటానికి ప్రేరణ లభిస్తుంది. కుసంపర్కంవల్ల, చెడ్డవాతావరణంలో ఉండటంవల్ల మలినత్వం పెరుగుతుంది. అందువల్ల వీటిపట్ల విముఖత్వమే మంచిది.

సాధ్యమైనంతవరకు మంచి వ్యక్తులతో సంపర్కంతోపాటుమంచి పుస్తకాలు చదవటం అలవర్చుకోవాలి. సత్సంగం దొరకనప్పుడు మంచి పుస్తకాలు చదివి సత్సంగంయొక్క లాభం పొందవచ్చు. ఏకాంతములో మంచి ఆలోచనలు మననం చేసుకోవటంవల్ల ఆత్మ సంత్సంగం జరుగుతుంది. ఈ అన్ని సత్సంగాలు ఆత్మోన్నతికి అవసరం. గాయత్రీ మంత్రములోని "చో" అక్షరం ఈ సంత్సంగం యొక్క మహత్వము తెలుపుతుంది. దానికోసమే ప్రయత్నంచేయమని ఉపదేశిస్తుంది.

"ద" : దర్శనం హ్యాత్మనః కృత్వా జానీయాదాత్మగౌరవమ్
జ్ఞాత్వాతు తత్తదాత్మానం పూర్ణోన్నతిపథం నయేత్

ఆత్మను దర్శించు ఆత్మగౌరవాన్ని గుర్తించి. అది తెలుసుకొని ఆత్మను పూర్ణోన్నతి యొక్క మార్గంలోనికి తీసుకువెళ్ళు.

మానవశరీరం నాశనమైయ్యేది, తుచ్ఛమైనది. దాని లాభము లేక హని కూడా తుచ్ఛము, మహత్వహీనము. కాని అతని ఆత్మ ఈశ్వర అంశకలది కావటంవల్ల మహనీయమైనది. అది ఎంత మహనీయమైనదంటే, దానితో మరి దేనిని పోల్చలేము. మనిషి యొక్క గౌరవం అతని శరీరంవల్ల రాదు. ఆత్మోన్నతివల్ల వస్తుంది. ఆత్మ ఎంత బలముగా వుంటే అతను అంత మహాపురుషుడుగా చెప్పబడతాడు.

ఏ పనులవల్ల మన ప్రతిష్ఠ గౌరవం, ఆదరం, శ్రద్ధ పెరుగుతుందో, అవే, ఆత్మగౌరవాన్ని పెంచేవి. ప్రతిష్ఠఅన్నిటికంటే ఎక్కువ సంపన్నమైనది. ఆత్మ యొక్క ప్రతిష్ఠకు మూల్యమే లేదు. ఇంతపెద్ద విలువ ఉన్న దానిని అన్ని విధముల మనం

సురక్షితంగా ఉంచుకోవాలి. మనుష్యులు సంపత్తివల్ల వచ్చిన ప్రతిష్ఠ పడిపోయినప్పుడు దుఃఖిస్తారు. దానివల్ల కొందరు ఆత్మహత్య చేసుకొనేందుకు సిద్ధమవుతారు. కాని ఆత్మప్రతిష్ఠ, ఆత్మగౌరవం, ఆత్మసమ్మానం అనేవి ఇంకా ఉన్నతమైనవి. వాటిని పడిపోయేలాగు చేయరాదు.

ఆత్మగౌరవంతగ్గి, ఆత్మగ్లాని పెరిగేటటువంటి ధనం, సుఖం, భోగం, పదవి పొందేకన్నా ఆకలితో దీనంగా ఉండటం మంచిది. గాయత్రీ మంత్రంలోని"ద" అక్షరం అటువంటి ఆత్మగౌరవాన్ని రక్షించటానికి ఎంతటి త్యాగం చేయటానికైనా వెనుకాడరాదని బోధిస్తుంది. ఎవరివద్ద ఆత్మధనం ఉంటుందో అతడే అందరికంటె ధనవంతుడు. ఎవరివద్ద ఆత్మగౌరవం సురక్షితంగా ఉంటుందో, ఇతడే ఇంద్రుడంతటి పదవీ ధనం ఉన్నవాడు: బంగారం. వజ్రాలు అతని ముందుమూల్యం లేనివి.

**"యా" : యాయాత్స్వోత్తరదాయిత్వ నిర్వహన్ జీవనే పితా**
**కుపితాపి తథా పాపః కుపుత్రోపి యథా మతః (23)**

తండ్రి తన ఉత్తరదాయిత్వాన్ని నిర్వహిస్తూ జీవించాలి, ఎందుకంటె చెడ్డతండ్రి, కుపుత్రునివలె పాపి.

ఎవరిచేతిలో వ్యవస్థ, శాసనం. స్వామిత్వం, బలం ఉన్నదో వారు వాటిని యథోచితంగా ఉపయోగించుటలేదు. స్వార్థపరత్వం, అనుచిత రీతిలో లాభం పొందాలనే నీతి లాగే, అస్తవ్యస్తం శిథిలత్వంకూడ చెడ్డవి. దీని పరిణామము చెడ్డగానే ఉంటుంది. పుత్రుడు; శిష్యుడు, స్త్రీ ప్రజ్ఞాజనులు. సేవకులు మొదలైన వారు చెడిపోవటం క్రమశిక్షణా రహితంగా కావటం లాంటి ఉదాహరణలు వినేవుంటాము. ఈ తప్పులకు లోపాలకు తండ్రి గురువు, భర్త, శాసకుడు, స్వామి మొదలైన వారిపైకూడ బాధ్యత ఉంటుంది. ఎందుకంటే నేర్పుశక్తి వీరిచేతుల్లో ఉన్నది కనుక. బుద్ధి అనుభవం అధికంగా ఉండటంవల్ల ఉత్తరదాయిత్వం అధికంగానే ఉంటుంది. వ్యవస్థలో శిథిలత్వం వచ్చేందుకు చెడుమార్గంలో పయనించటానికి కారణము క్రమశిక్షణపై శ్రద్ధ లేకపోవటమే.

ప్రతి సంబంధంలోను రెండు పక్షాలుంటాయి. ఇరుపక్షాలు యథోచితంగా కర్తవ్యపాలన వల్ల సంబంధం స్థిరంగా, దృఢంగా ఉంటుంది. అయినప్పటికి నేర్పరులైన పక్షము యొక్క ఉత్తర దాయిత్వము విశేష ప్రభావం కలిగి ఉంటుంది. తన పక్షం వైపు బాధ్యతలో నిలుచుని. చిన్న పక్షంవైపు ఉదారప్రవర్తనకలిగి వుండాలి. ప్రజలు తమతమ అధికారాలకు, హక్కులకు ప్రాముఖ్యత ఇచ్చి, తమ కర్తవ్యాలను విస్మరిస్తారు. అదే కలహాలకుకారణము. ఇరుపక్షాలవారు తమతమ బాధ్యతలను ఉపేక్షించకపోతే, సంఘర్షణ అవసరమే ఉండక వారి సంబంధం మధురంగా ఉంటుంది.

"యా " అక్షరం పితా-పుత్రుల, పెద్ద-చిన్నల సత్ సంబంధాలను ఎలా పటిష్ఠం

చేసుకోవాలో చెపుతుంది. ఇద్దరు వారి అధికారాలతో వచ్చే హక్కులను, కోరికలను తగ్గించుకొని, కర్తవ్యపాలన దృఢంగా చేయాలి.

"త్" : తథాచరేత్పదాన్యేభ్యో వాంఛత్యన్యైర్యథా నరః
నమ్రః శిష్టః కృతజ్ఞశ్చ సత్యసాహాయ్యవాన్ భవేత్ (24)

మనిషి ఇతరులు తనతో ఎలా ప్రవర్తించాలనుకుంటాడో, అదే విధంగా తను ఇతరులతో ప్రవర్తించాలి. వ్యక్తికి కృతజ్ఞత, వినమ్రత, సత్యం పలుకుటతో పాటు ఇతరుల గురించి "సహాయోగి" అనే భావన వుండాలి.

ఇతరులపట్ల ప్రవర్తించే విధానానికి గీటురాయి ఏదంటే "మనము ఇతరులనుండి ఎలాంటి వ్యవహారాన్ని ఆశిస్తామో, ఇతరులపట్ల మన వ్యవహారం అలాగే వుండాలి " ప్రపంచం బావిలోని శబ్దం వంటిది. భావిలో ముఖముంచి మనము ఎలాంటి శబ్దంచేస్తే , బదులుగా అలాంటి ప్రతిధ్వని ఇంకొక దిక్కునుంచి వస్తుంది.

ప్రతిమనిషి, ఇతరులు తనతో నమ్రతగా మాట్లాడాలని, సభ్యతగా వ్యవహరించాలని, తనవస్తువులు దొంగిలించరాదని, ఆపద వచ్చినపుడు సహాయము చేయాలని, మర్యాదగా ప్రవర్తించాలని, ఏదైన అప్పుచేసిన సహించాలని, మార్గములో రౌడీలు తనను అటకాయించకూడదని, తనచెల్లెళ్ళపై పిల్లలపై చెడుదృష్టి వెయ్యరాదని, ఉదారత, సహాయశీలతతో ఉండాలని ఇతరుల నుంచి కోరుకుంటాడు. మనము ఇతరులనుంచి ఇలాంటి వ్యవహారము కోరుకున్నపుడు, మనముకూడ ఇతరులతో ఇలాగేప్రవర్తించాలి. ఎందుకంటె, ఎల్లప్పుడు క్రియకు ప్రతిక్రియ ఉత్పన్నమవుతుంది. మనము అప్పుచేస్తే ఎదుటివారి మనస్సులో దాని ముద్రపడి, ప్రతిక్రియ జరిగి దానిలోనుంచి అలాంటి ఆలోచన మరియు వ్యవహారము ఉత్పన్నమవుతుంది. ఈ విధంగా చెడ్డపనులు చేస్తే, తనకు, ఇతరులకు దీని యొక్క చెడ్డ ప్రతిఫలం లభిస్తుంది. కాని మంచిపనులు చేస్తేసుఖశాంతులు లభిస్తాయి. ఇతరులలో ఎలాంటి భావన రావాలని కోరతామో అలాంటితత్వాన్ని మనఆలోచనలో, కార్యములలో నింపి ఉంటే ప్రపంచములో సుఖశాంతుల స్థాపన చేయగలము.

"గాయత్రీ మంత్రంలోని చివరి అక్షరం "త్". శాస్త్రకారులు చెప్పిన సూక్తి "ఆత్మనః ప్రతికూలాని పరేషాం న సమాచరేత్" ని ఉద్ఘోషిస్తుంది. దీనిని క్రియాత్మక రూపంలోనికి తీసుకురావటం గాయత్రీ శిక్షణకు ఒక మహత్వ పూర్ణమైన ముందడుగు అవుతుంది.

# గాయత్రీ ఉపనిషద్

వేదములనుండి బ్రాహ్మణములు ఆవిర్భవించాయి. ప్రతియొక్క వేదానికి కొన్ని కొన్ని బ్రాహ్మణములున్నవి. అందులో కొన్ని మాత్రమే అందుబాటులో ఉన్నాయి. కాలము యొక్క కుటిలగతి వల్ల ఎన్నో నశించి పోయినవి.

ఋగ్వేదమునకు రెండు బ్రాహ్మణాలున్నాయి. వానిపేర్లు సాంఖ్యాయనము, ఐతరేయము. సాంఖ్యాయనాన్నే కౌపీతకి యనిగూడ పిలుస్తారు. యజుర్వేదమునకు మూడు బ్రాహ్మణాలున్నాయి. అవి శతపథ బ్రాహ్మణము, కాణ్వ బ్రాహ్మణము, తైత్తిరీయ బ్రాహ్మణము.

సామ వేదమునకు 11 బ్రాహ్మణాలు దొరుకుతాయి. అవి ఆర్షేయ బ్రాహ్మణము, జైమినీ ఆర్షేయ బ్రాహ్మణము, సంహితోపనిషద్బ్రాహ్మణము, మంత్ర బ్రాహ్మణము, వంశ బ్రాహ్మణము, సామ విధాన బ్రాహ్మణము, షడ్వింశ బ్రాహ్మణము, దేవద్బ్రాహ్మణము, తాండ్య బ్రాహ్మణము, జైమినీయ బ్రాహ్మణము, జైమినీయ ఉపనిషద్బ్రాహ్మణము.

అథర్వ వేదమునకు కేవలం ఒకే బ్రాహ్మణం లభ్యమవుతున్నది. దానిపేరు గోపథ బ్రాహ్మణము. గోపథ మందలి 31 నుండి 38 వరకు గల ఎనిమిది ఖండిక లను గాయత్రీ ఉపనిషత్తుగా పిలుస్తారు. వానిలో మైత్రేయ-మౌద్గల్య పరస్పర వివాదం ద్వారా గాయత్రియొక్క మహత్వ పూర్ణ రహస్యం తెలుస్తుంది. సాధారణ శబ్దార్థముల ననుసరించి బుద్ధి-ప్రేరణాత్మక ప్రార్థనయే గాయత్రి యందలి తాత్పర్యము. కాని ఈ ఉపనిషత్తునందు బ్రహ్మ విద్య యనబడే పరమార్థ విద్యతో సంబంధాన్నేర్పాటు చేసే రహస్యాలు తెలుస్తాయి.

ఏతద్ధస్మ ఏతద్విద్వాంసమేకా దశాక్షం
మౌద్గల్యంగ్లావో మైత్రే యోఽభ్యాజగాం.

ఏక దశాక్షుడైన మౌద్గల్యుని వద్దకు గ్లావుడైన మైత్రేయుడు వెళ్ళాడు.

సత స్మిన్ బ్రహ్మచర్య వసతీతి విజ్ఞయో వాచ
-కింమస్మి న్మర్యో అథ తన్మౌద్గల్యో ధ్యేతి
యదస్మిద్బ్రహ్మచర్య వస తీతి-

మౌద్గల్యుని, బ్రహ్మచారిని చూచి వాని మాటలువిని గ్లావుడు (చిరునవ్వుతో, అన్నాడు. "మౌద్గల్యుడు ఈ బ్రహ్మచారికి ఏమి చదువు చెప్పుతున్నాడు (అంటే ఏమీ చెప్పటంలేదు అని).

-తద్ధి మౌద్గల్య స్సంతే వాగీ శుశ్రావ
స ఆచార్యాయాబ్రజ్యాచ చష్టే-

మౌద్గల్యుని బ్రహ్మచారి ఈ మాటలను విని తన ఆచార్యుని వద్దకు పోయి ఈ విధంగా అన్నాడు.

"దురధీయానం వా అయంభవంత బోధద్య యమధాతిధిర్భవతి"

"ఈనాడు వున్నట్టి అతిధి మిమ్ములను మూర్ఖులని పిలిచాడు"

కిం సౌమ్య విద్వనితి-

"అతడు విద్వాంసుడేనా" అని మౌద్గల్యుడడిగాడు.

త్రీన్ వేదాన్ బ్రూతే భో ఇతి

"అవును స్వామీ, అతడు మూడు వేదములను గురించీ ప్రవచించాడు" అన్నాడు శిష్యుడు.

"తస్య సౌమ్య యోవిద్వాన్ విపష్టో విజీగీషోఽన్తే వాసీతం మే ఽఽ హ్వయేతి"

హే సౌమ్య! విద్వాంసుడై, సూక్ష్మదర్శియై విజయాన్ని కోరే అతడెవరి శిష్యుడో! అతన్ని నావద్దకు పిలు!

"తమాజిహోవ. తమభ్యువాచా సాధితి భోఇతి"

అప్పుడు శిష్యుడు మైత్రేయుని పిలచుకొని వచ్చి గురువుగారికి పరిచయం చేశాడు.

"కిం సౌమ్య తవాచా ర్యోఽధ్యేతీతి ?"

మౌద్గల్యుడు అడిగాడు "ఓ సౌమ్యుడా! మీ ఆచార్యులు నీకు నేర్పిన దేమిటి ?
-త్రీన్ వేదాన్ బ్రూతే సోఇతి-

యన్నుణిలు సౌమ్యాస్మాభిః సర్వేవేదా ముఖతో గృహీతాః, కథత ఏవామంర్యోచా భాషతే, కథంను సచేత్సౌమ్య దురధీయానోభవిష్యతి, ఆచార్యో బాల బ్రహ్మచారీ బ్రహ్మచారిణ సావిత్రీం, ప్రాహ ఇతి వక్ష్యతి.

హే సౌమ్యుడా ! ఇది తెలిస్తే చెప్పు. ఆచార్యుడు తన బ్రహ్మచారికి దేనిని ఉపదేశిస్తాడో, అది సావిత్రి. అంటే, గాయత్రి యొక్క శబ్దార్థము; స్థూలార్థము అది గూడా చెప్పు!

-తత్వ బ్రూయాద్దురధీ యాన తం వైభవాన్మౌద్గల్య మవోచత్, సత్వాం యం ప్రశ్నమ ప్రాక్షీన్న తం వ్యవవోచః. పూరా సంత్సరాదార్తి మారిష్య సీతి-

నీవు మా ఆచార్యులైన మౌద్గల్యుని మూర్ఖుడని పిలిచావు. నీకు ఆయన వేసిన ప్రశ్నకు సమాధానం చెప్పలేక పోతే ఒక సంవత్సరం లోపల నీవు కొన్ని కష్టాలలో పడతావు.

-శిష్యాః శిష్టేభ్య ఏవంభాషేరన్. యహ్యేనమహం ప్రశ్నం పృచ్ఛామి నతం వివక్ష్యతి నహ్యేన మధ్యే తీతి-

ఓ సౌమ్యుడా! మేము గూడా వేదముల నన్నిటినీ అధ్యయనం చేశాము. అయినప్పటికీ మీ ఆచార్యులు నన్ను మూర్ఖునిగా ఎందుకు పిలిచినట్లు ? శిష్యులు, శిష్యులతో ఈ విధంగా మాట్లాడ వచ్చునా ? మేము వేసిన ప్రశ్నకు జవాబు చెప్పకపోతే ఆయన మీకు చెప్పలేదనే అనుకోవాలి.

-సహ మౌద్గల్యః స్వయమంతే వాసీన మువాచ పరేహి సౌమ్య గ్లావం మైత్రేయముపాసీత్ అధీహి భోః సావిత్రీం, గాయత్రీం చతుర్వింశతి యోనిం ద్వాదశస్యామిధునాం, యస్యాంభృగ్వంగిరశ్చ క్షుర్యస్యాం సర్వమిదంశ్రుతం తాంభవాన్ ప్రబ్రవీత్వితి-

అప్పుడు మౌద్గల్యుడు తన శిష్యునితో అన్నాడు 'సౌమ్యుడా! నీవు వెళ్ళు. గ్లావమైత్రేయుని సమక్షంలో కూర్చొని అడుగు "12 మిధునములు, 24 యోనులు గల భృగ్వంగిరసులు ఎవరి నేత్రములో, అందరును నెవరికి ఆశ్రితులో అట్టి గాయత్రీ సావిత్రిని మాకు నేర్పండి" అని.

ఈ ఖండికలో మౌద్గల్యుడు మైత్రేయుని గాయత్రి యందలి రహస్యాన్ని గురించి అడుగుతాడు. మామూలు అర్థం అందరికీ తెలుసు. ఇందులో మా అందరికీ సద్బుద్ధి నివ్వమని ప్రార్థన ఉన్నది. ఇటువంటి మంత్రములు శ్రుతి, స్మృతులలో అనేకం ఉన్నాయి. వానిలో ఈ మంత్రంతో సమానంగా, యింతకంటె ఎక్కువగాకూడా బుద్ధి, వివేకముల కై ప్రార్థనలు చేయబడి ఉన్నాయి. కాని గాయత్రియందలి విశిష్టత కారణంగా వేదమాతగా పిలువబడింది. సమస్త శ్రుతి క్షేత్రములలో ఎంతో మహత్వం యివ్వబడింది. ఇందుకు ఏదో ఒక గొప్ప కారణం ఉండి తీరాలి. ఆ రహస్యాన్ని మైత్రేయు నడిగాడు.

సగ్రాద్రాజితమ యత్రేతరో బభూవతేన ప్రపచ్ఛ సహ నప్రతిపదే

మౌద్గల్యుని శిష్యుడు మైత్రేయునివద్దకు వెళ్ళాడు. ప్రశ్న వేశాడు. కాని జవాబు లేదు.

-తం హోవాచ దురధీయానంతం వైభవాన్మౌద్గల్య మహోచత్స త్వాయం
ప్రశ్నమప్రాక్షీన్నతం త్యహోదః పురా సంబత్సరాదార్తి మా రిష్య సీతి-

అతడన్నాడు "మీరు మౌద్గల్యుని మూర్ఖుడన్నారు. మిమ్ము ఆయన అడిగిన విషయాన్ని మీరుచెప్పటం లేదు. అందువల్ల మీకు ఒక సంవత్సరం లోపల కష్టాలు కలుగవచ్చు.

-సహమైత్రేయః స్వామంతేవాసీన ఉవాచ. యథార్థం
భిన్నోయథా గృహం యథామహో విప్ర పృజ్యతాందురధీయానం
హా అహం మౌద్గల్యమహోచం సయం ప్రశ్న మాత్రాక్షీన్నతం
వ్యహోచ, తముపైశ్యామి, శాంతిం కరిష్యామితి । -

అప్పుడు మైత్రేయుడు శిష్యులతో ఈ విధంగా అన్నాడు. -ఇప్పుడు మీరు మీ మీ యిష్టం వచ్చిన రీతిని యిళ్ళకు వెళ్ళండి. నేను మౌద్గల్యుని మూర్ఖుడని నిందించాను. కాని ఆయన అడిగిన ప్రశ్నకు నేను జవాబీయ లేక పోయాను. నేను ఆయన వద్దకు స్వయంగా వెళ్ళి శాంతింప జేస్తాను.

-సహమైత్రేయః ప్రాతః సమిత్పాణి మౌద్గల్య
ముప ససాదా సావ అహంభో మైత్రేయ ఇతి-

మరునాడు ఉదయం సమిత్పాణియై మైత్రేయుడు మౌద్గల్య ఋషి వద్దకు వెళ్లి "నేను మైత్రేయుడను. తమ సేవకే వచ్చాను" అన్నాడు.

కిమర్థమితి - ?

ఎందులకు - అని ఆయన ప్రశ్నించాడు.

-దురధీయానం వా అహం భవంతమవోచం త్వ మాయప్రశ్న మ ప్రాక్షీన్నతీం వ్యవోచం, తముపైష్యామి, శాంతిం కరిష్యామితి-

మైత్రేయుడన్నాడు- "నేను మిమ్ము మూర్ఖులని నిందించాను. మీరడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పలేక పోయినాను. నేను మిమ్ము సేవించి సంతుష్టులను చేస్తాను.

-సహోవాచ అత్రవా ఉపేతంచ సర్వచకృతం పాపకేన త్వాయానేన చరంతమాహుః అథోఽవం మమ కల్యాణస్తం తే దదామి తేవ యాహీతి-

మౌద్గల్యుడన్నాడు- మీరు యిక్కడికి వచ్చారు. కాని లోకులనేది మీరు శుద్ధ భావనతో రాలేదని. కాని నేను మీకు కల్యాణకరమైన భావననే యిస్తాను. అది తీసికొని వెళ్లండి-

సహోవాచ-ఏయదేవా త్రాత్థించా నృశస్యచ యథా భవానాహ. ఉపాయామి త్వేవ భవంత మితి-

మైత్రేయుడన్నాడు-మీరు చెప్పిన మాటలు భయమును పోగొట్టువవి. దయలో కూడినవి. మీ సేవలో నేను సమిధలను చేతిలో నుంచుకొని కూర్చొనుచున్నాను.

-తం హోతేధాయ-

అప్పుడాయన విధిపూర్వకంగా సేవలో కూర్చున్నాడు.

-తంహోపేత్య పప్రచ్ఛ-

కూర్చొని ఈ విధంగా ప్రశ్నించాడు.

-కిం స్విదాహుర్భోః సవితుర్వరేణ్యం భర్గో దేవస్య కవయః కిమాహుః. ధియో విచక్షయదితః ప్రవేత్త ప్రచోదయన్సవితాయాభిరేతి-

(1) సవితను వరేణ్యుడని ఎందుకన్నారు ?

(2) ఆ దేవుని భర్గుడెవరు ?

(3) తమకు తెలిస్తే "ధీ" సంజ్ఞగల తత్వాన్ని వివరించండి.
అందరకు ప్రేరణ నిచ్చే సవిత దేనితో విచరణ చేయును ?

-తస్మా ఏతత్ప్రో వాచ-

ఆయన జవాబిచ్చాడు.

-వేదాశ్ఛందాంసి సవితుర్వరేణ్యం భర్గోదేవస్య కవయోఽన్నమాహుః
కర్మాణి ధియస్తదుతే బ్రవీమి ప్రచోదాయ స్సవితా యాభిరేతి-

(1) వేదములు, ఛందములు సవిత యొక్క వరేణ్యములు

(2) విద్వాంసులు అన్నమునే దేవునియొక్క భర్గునిగా తెలుసుకున్నారు.

(3) 'కర్మ' యే ఆ 'ధీ' తత్వము. దాని ద్వారానే అందరకు ప్రేరణ నిచ్చు 'సవిత' విచరణ చేయును.

-తముప సంగృహ్య పప్రచ్ఛా ధీహి భోః, కః సవితా, కా సావిత్రీ-

అదివిని మరల ప్రశ్నించాడు-సవిత ఎవరు ? సావిత్రి ఎవరు ?

మౌద్గల్యుని అభిప్రాయాన్ని మైత్రేయుడు చక్కగా అర్థం చేసుకున్నాడు. అతడు నిజం తెలుసుకోవాలని ఆలోచించి తెలుసుకున్నది-నేను గాయత్రి యొక్క ఆ రహస్యాన్ని, తెలుసుకోలేదు-దేనివల్ల దానికి అంతటి మహత్వం కలిగిందీనూ-అతడు ఆలోచించాడు-ఆ మూల కారణం తెలియకపోతే గాయత్రి యొక్క బాహ్య ప్రతీకలను తెలుసున్నంత మాత్రాన కించిత్తు లాభం కూడా లేదు. అందువలన, వేద ప్రవచనములు ఎంత చేసినప్పటికినీ మూలకారణం తెలియనంత వరకూ ఉపయోగం కలుగదు. అందువలన ముందు గాయత్రీ రహస్యాన్ని తెలుసుకుని, తరువాత తక్కిన పనులు చేస్తాను. అతడు తన విద్యార్థులందరకూ సెలవిచ్చి పంపి తాను స్వయంగా నమ్రతతో, సమిధలను చేతిలోఉంచుకొని శిష్య భావంతోమౌద్గల్యునివద్దకు వెళ్ళాడు. విద్యను పొందటానికి-విశేషంగా ఆధ్యాత్మ విద్యను పొందటానికి- విద్యార్థి తన అధ్యాపకుని వద్దకు వెళ్లేటప్పుడు నమ్రతత, శ్రద్ధ మనసున నింపుకొని, వెళ్లడం పరిపాటి. ఇటువంటి ఆర్ష ప్రణాళికను పలిపెట్టి నేడు విద్యార్జన చేయడం, విచ్చలవిడితనం క్రిందికి మారిపోయింది. గురువు ఆశీర్వాదంలేనిదే చదివిన విద్య నిష్ఫలమై పోతుంది.

మైత్రేయుడడిగాడు "గాయత్రి యొక్క మొదటి పదమందువచ్చే శబ్దముల రహస్యంచెప్పమని" (1) సవిత యొక్క వరేణ్యమేమి ? అంటే అర్థం–ఆ తేజస్వి యైన పరమాత్మ ఎందువలన వరేణ్యుడు(శ్రేష్ఠుడు). ఏ ఉపాయంతో ఈశ్వరుని పొందవచ్చును. (2) ఆ దేవుని యొక్క భర్గుడెవరు ? (శ్రేష్ఠుని దేవత అంటారు. బలంకలవానిని భర్గుడంటారు) (3) దేని ద్వారా పరమాత్మ సర్వులకు ప్రేరణ చేస్తాడు. అంటే ఆ మాధ్యమం (MEDIUM) ఎవరు ?

ఈ మూడు తత్వములను గురించీ, మైత్రేయుడు మౌద్గల్యుని ప్రశ్నించాడు. దీనికి జవాబును మౌద్గల్యుడు టూకీగా యిచ్చాడు. కాని దానిని చాలా గంభీర పూర్వక విచారణ చేయాలి. అప్పుడే దాని మహత్వం తెలుస్తుంది.

మౌద్గల్యుడంటాడు–

(1) వేదములు, ఛందములు సవిత యొక్క వరేణ్యములు.

(2) అన్నమునే దేవత యొక్క భర్గునిగా పేర్కొన్నారు.

(3) కర్మయే ధీతత్వము. దాని ద్వారానే ఈశ్వరుడు సర్వులకు ప్రేరణ నిస్తాడు. అందరికీ వికాసం కలుగుతుంది.

ఇప్పుడు వివరంగా తెలుసుకుందాం

(1) వేదము అంటే జ్ఞానము, ఛందము అంటే అనుభవం.నిజానికి ఆత్మజ్ఞానంతో పరమాత్మ లభిస్తాడు. కాని ఆ జ్ఞానము కేవలము వాచికమే కాదు. బరువును మోసే గాడిదవలె అనేక పుస్తకాలను చదవటం వల్ల, చిలకలవలె, గోరువంకలవలె, గొప్ప మాటలతో ప్రవచనాలు చేయడంవల్ల ఉపయోగంలేదు. మన తత్వజ్ఞానము అనుభవ సిద్ధమై ఉండాలి. ఆ కారణంగా తర్కము, ప్రమాణము, ఉదాహరణలతో సత్యాన్ని తెలుసుకోవాలి. ఆ సత్యమును గురించి ప్రతి మనుష్యుని మనస్సులోనూ అగాధమైన శ్రద్ధ ఉండాలి. ఆ శ్రద్ధ జీవితంలో ఆచరణ పూర్వకంగా ఉండాలి. మొదట పూర్తి తత్పరత, సత్యము, నిష్పాక్షికతగల దృష్టి ఉండాలి. ఏఏ సిద్ధాంతములు ఉచితములో, మంగళకరములో గ్రహించాలి. అప్పుడు సత్యము, పరోపకారము, సంయమము, నమ్మదగి వుండటం(విశ్వాసము) మొదలైన గుణములు అన్ని విధాలా శ్రేయస్కరములని తెలుస్తుంది. ఆ సిద్ధాంతాలను జీవితంలో ఆచరణలో పెట్టాలి. సద్ జ్ఞానము శ్రద్ధా భూమియందు పరిపక్వం కావాలి. అది ఈశ్వర ప్రాప్తికి ప్రధానోపాయము. సిద్ధాంతాలు లేకుండా కేవలం అనుభవం బలహీనమైనది. అనుభవం లేకుండా జ్ఞానం నిష్ఫలం.

ఎప్పుడు మనుష్యుని జ్ఞానము శ్రద్ధయందు పరిణతమవుతుందో, అప్పుడు డంబము, ఛలము, మాత్సర్యము, కపటము, ధూర్తత్వము, దాపరికము వదలిపెట్టి సమస్త మనోభూమి గూడా ఒకే జాతికి చెందిన శ్రద్ధలో పరిణతి కలుగుతుంది. అప్పుడు పరమాత్మ లభిస్తాడు. వేద, ఛందముల సమ్మిశ్రణమునందు సవిత యొక్క వర్ణన చేయబడింది. జ్ఞానముతో అనుభవంతో పరమాత్మను పొంద వచ్చునని చెప్పబడింది.

(2) ఈ ప్రశ్నకు సమాధానంగా మౌద్గల్యుడు ఈ విధంగా అన్నాడు. దేవుని భర్గము అన్నము. శ్రేష్టుడు కావడానికి బలవంతుడు కావాలి. అందుకు అన్నం కావాలి, అర్థాత్ సాధన కావాలి. సాధన, సామాగ్రి లక్ష్మి కలసి ఒక శక్తి. ఈ శక్తి అసురుల చేతిలో పడితే అసురత పెరుగుతుంది. దేవతల చేతిలో పడితే దేవత్వం పెరుగుతుంది. దేవతలు బలవంతులవుతారు. శాసనశక్తి క్రూరుల, దుష్టుల చేతికి చిక్కితే దుర్మార్గం అంతటా విస్తరిస్తుంది. పూర్వ కాలంలో భారతదేశంలో రాజశక్తి విదేశీయుల చేతుల్లో ఉన్నది. అందువలన భారతదేశం ఎంత దిగజారిందీ అందరికీ తెలిసిన విషయమే. అదే రాజశక్తి మంచివారి చేతిలో పడితే మనదేశం గూడా అమెరికాతో సమానంగా ఎంతో ఉన్నత స్థితికి రాగలుగుంది. అరవిందయోగి తన 'గీతాపుస్తకం'లో ఈ విధంగా వ్రాశారు "లక్ష్మిపై (సంపదపై) శ్రేష్ఠ జనుల ఆధిపత్యం ఉండాలి. అందువల్ల ప్రపంచంలో సుఖశాంతులు కలుగుతాయి. అదే లక్ష్మి అసురుల చేతిలో పడితే విశ్వానికే ప్రమాదం కలుగు తుంది. దేవతలకు సంపద భోగం కొరకు కాదు, లోభం కొరకు కాదు సంగ్రహం కొరకు కాదు, అహంకార ప్రదర్శన కొరకు కాదు, అన్యాయం చేయటానికి కాదు, ధనంతో, సాధన సామగ్రితో దైవత్వము యొక్క రక్ష, వృద్ధి చేయవచ్చునని తన్ను తాను బలవంతునిగా, క్రియాశీలునిగా, సాధన సంపన్నునిగా రూపొందించుకొన వచ్చునని. అన్నమును అంటే సాధనను, సామగ్రిని లక్ష్మియొక్క ప్రతీకగా గ్రహించాలి. మౌద్గల్యుని జవాబు దేవుని యొక్క భర్గము అన్నము- అంటే శ్రేష్ఠునియొక్క బలము సాధన. లేకపోతే బలహీనుడుగా ఉండి పోతాడు.

(3) మౌద్గల్యుని మూడవజవాబు-కర్మయే 'ధీ' తత్వము అని. దీని ద్వారా పరమాత్మ అందరిలోనూ వికాసమును కలిగిస్తాడు. పరమాత్మయొక్క కృపవలనే అందరికీ వికాసం కలుగుననేది తిరుగులేని సత్యము. పరమాత్మ అందరినీపైకి, ఉన్నతివైపునకు ప్రేరేపిస్తాడు. కాని ఆ ప్రేరణయే 'ధీ' అని తెలుసుకోవాలి. 'ధీ' అంటే అర్థము బుద్ధి. కర్మ చేయటానికి ప్రేరేపించేటటువంటిది. ప్రోత్సహించేది. కర్మ చేయటంలో సంలగ్నంచేసేది. పరమాత్మకు ఎవరిపై కృప కలిగితే, వారికి ఆ విధమైన

బుద్ధి లభిస్తుంది. మనుష్యునిపై పరమాత్మని కృప ఉన్నదా లేదా అనే విషయం ప్రగతి కావాలంటే ఆ మనుష్యుడు ఉత్సాహంతో తన్మయతతో, జాగరూకతతో, యిష్టతతో పనిచేస్తున్నాడా అనే దాని మీద ఆధారపడి ఉంటుంది. అతని స్వభావంలో ఈ రుచి ఉంటే అతనిని వికసింప జేయటానికి పరమాత్మ 'ధీ' శక్తిని యిచ్చినట్లే తెలుసుకోవచ్చు.

ఎంతమంది సోమరులుగా, పనిపాటలు లేని వారుగా, అనుచిత కార్యములు చేసేవారుగా ఉంటూ, నిరాశతో నిండి, నిండు మనసుతో పనిచేయక, యిష్టంలేక వెట్టిచాకిరీ చేసినట్లు చేస్తున్నారు ? వారికి ఎంత చిన్న పని యిచ్చినా పర్వతాన్ని మోస్తున్నట్లు భావిస్తారు. కొద్ది శ్రమపడ్డా ఎంతో అలసిపోతారు. వీరంతా ఈశ్వరుని కృపకు అపాత్రులు. కర్మ ప్రేరకమైన బుద్ధిలేక పోవటం వలన వీరు అభావగ్రస్తులుగానే (దరిద్రులుగానే) ఉండిపోతున్నారు.

మౌద్గల్యుని ఉపయుక్త కథనము గంభీర సత్యము. దీనిని కొట్టివేయడానికి ఆస్కారమే లేదు. భాగ్యం కోసం ఏడ్చేవారు, తలవ్రాత అని నెత్తిబాదుకునేవారు, తమ దోషాలకు యితరులపై నెపంవేసి సంతోషించే వారు ఈశ్వరుని కృపకు పాత్రులు కానివారు మాత్రమే. ఈ కృప పొందటం అందరికీ సులభమే. అదివారి చేతులలోనే ఉన్నది. ధీతత్వము అంటే కర్మశీలత అలవరచుకొని ఎవరైనా ఈశ్వరుని కృపకు, ఉన్నతికి అధికారులు కావచ్చును. పరమాత్మ తన కృపనుండి ఎవరినీ వంచితులను చేయడు. మనుష్యుడు తన దుర్బుద్ధి కారణంగా వానిని తానే వదలుకుంటున్నాడు.

-మనలువసవితావాక్ సావిత్రీ యత్రహ్యేవ మనస్తద్వాక్
యత్రవైవాక్తన్మన ఇతి ఏతేద్వేయోనీ ఏకం మిధునం ॥ 1 ॥

మనస్సే సవిత, వాక్కు సావిత్రి. ఎక్కడ మనస్సు ఉంటుందో, అక్కడ వాక్కు ఉంటుంది. ఎక్కడ వాక్కు ఉంటుందో అక్కడ మనస్సు ఉంటుంది.

-అగ్నిరేవ సవితా పృధివీ సావిత్రీ యత్రహ్యే వాస్త త్పృధివీ
యత్రవై పృథివీ తదగ్నిరితి ఏతేద్వేయోనీ ఏకం మిధునం ॥ 2 ॥

అగ్ని సవిత, పృధ్వి సావిత్రి. ఎక్కడ అగ్ని ఉంటుందో అక్కడ పృధివి ఉన్నది. ఎక్కడ పృధ్వి ఉన్నదో అక్కడ అగ్ని ఉన్నది

-వాయురేవ పవితా అంతరిక్షం సావిత్రీయత్ర హ్యేవ వాయు స్తతంత రిక్షం
యత్రవా అంతరిక్షం తద్వాయురితి ఏతే ద్వేయోనీ ఏకం మిధునం.-

వాయువు సవిత, అంతరిక్షము సావిత్రి ఎక్కడ వాయువు ఉన్నదో అక్కడ అంతరిక్షం ఉన్నది. ఎక్కడ అంతరిక్షం ఉన్నదో అక్కడ వాయువు ఉంటుంది.

-ఆదిత్య ఏవ సవితా ద్యౌః సావిత్రీ యత్రహ్యేవాదిత్య స్తద్ ద్యౌఃయత్ర వైద్యౌస్తదాదిత్య ఇతి. ఏతే ద్వేయోనీ ఏకం మిధునం.-

ఆదిత్యుడే సవిత- ద్యౌ సావిత్రి - ఎక్కడ ఆదిత్యుడున్నాడో అక్కడ ద్యౌలోకం (ద్యులోకం) ఉన్నది. ఎక్కడ ద్యులోకం ఉన్నదో అక్కడ ఆదిత్యుడున్నాడు.

-చంద్రమా ఏవ పవితా నక్షత్రాణాం సావిత్రీ యత్రహ్యేవ చంద్రమాత్రా స్తన్నక్షత్రాణి. యత్రవై నక్షత్రాణితచ్చంద్రమా ఇతి ఏతేద్వేయోనీ ఏకం మిధునం.-

చంద్రుడే సవిత నక్షత్రములు సావిత్రి. ఎక్కడ చంద్రుడున్నాడో అక్కడ నక్షత్రాలున్నాయి. ఎక్కడ నక్షత్రాలున్నవో అక్కడ చంద్రుడున్నాడు.

-అహోధ సవితా రాత్రిః సావిత్రీ యత్రహ్యేవాహ స్తద్రాత్రిః యత్రవై రాత్రి స్తదహరితి ఏతేద్వే యోనీ ఏకం మిధునం.-

పగలు సవిత రాత్రి సావిత్రి. ఎక్కడ దినమున్నదో అక్కడ రాత్రి ఉన్నది ఎక్కడరాత్రి ఉన్నదో అక్కడ పగలు ఉన్నది.

-ఉష్ణమేవ సవితాశీతం సావిత్రీ యత్రహ్యేవోష్ణమ్ తత్రశీతం యత్రవైశీతం తదుష్ణమితి ఏతేద్వే యోనీ ఏకం మిధునం.-

ఉష్ణము సవిత శీతము సావిత్రి. ఎక్కడ ఉష్ణమున్నదో అక్కడ శీతమున్నది ఎక్కడ శీతమున్నదో అక్కడ ఉష్ణమున్నది.

-అభ్రమేవ సవితా వర్షం సావిత్రీ యత్రహ్యేవాభ్రం తద్వర్షంతత్రవైవర్షం తదభ్రమితి ఏతే ద్వే యోనీ ఏకం మిధునం-

మేఘములు సవిత వర్షము సావిత్రి. ఎక్కడ మేఘములున్నవో అక్కడ వర్షం ఉన్నదిఎక్కడ వర్షమున్నదో అక్కడ మేఘములున్నవి.

-విద్యుదేవ సవితాస్తనయిత్నుః సావిత్రీ. యత్రహ్యేవ విద్యుత్తత్ స్తనయిత్నుః యత్రవై స్తన్నయిత్ను స్తద్విద్యు దితి ఏతేద్వే యోనీ ఏకం మిధునం.-

విద్యుత్తు సవిత మెరుపు సావిత్రి. ఎక్కడ విద్యుత్తు ఉన్నదో అక్కడ మెరుపు ఉన్నది. ఎక్కడ మెరుపు ఉన్నదో అక్కడ విద్యుత్తు ఉన్నది.

-ప్రాణ ఏవ సవితా అన్నం సావిత్రీ యజ్ఞహ్యేవ ప్రాణ స్తదన్నం యత్రవా అన్నం తత్ర్రాణ ఇతి. ఏతేద్వే యోనీ ఏకం మిధునం.-

ప్రాణము సవిత అన్నము సావిత్రి. ఎక్కడ ప్రాణమున్నదో అక్కడ అన్నమున్నది ఎక్కడ అన్నమున్నదో అక్కడ ప్రాణమున్నది.

-వేదా ఏవసవితాఛందాంసి సావిత్రీ యత్రహ్యేవ వేదాస్తత్ర ఛందాంసి యత్రవై ఛందాంసి తత్ర వేదా ఇతి ఏతేద్వే యోనీ ఏకం మిధునం.-

వేదములు సవిత ఛందము సావిత్రి. ఎక్కడ వేదములున్నవో అక్కడ ఛందములున్నవి. ఎక్కడ ఛందములున్నవో అక్కడ వేదములున్నవి.

-యజ్ఞ ఏవ సవితా దక్షిణా సావిత్రీ యజ్ఞ హ్యేవా యజ్ఞస్త ద్దక్షిణా తత్రవై దక్షిణా తద్యజ్ఞం ఇతిద్వేయోనీ ఏకం మిధునం.-

యజ్ఞము సవిత, దక్షిణసావిత్రి. ఎక్కడ యజ్ఞం ఉంటుందో అక్కడ దక్షిణ ఉంటుంది. ఎక్కడ దక్షిణ ఉంటుందో అక్కడ యజ్ఞం ఉంటుంది.

-ఏతదస్మై తద్వి ద్వాంసము పకారీ మాసస్తు బ్రహ్మచారీ తే సంస్థిత ఇతి-

విద్వాంసుడవు పరోపకారివీ యైన ఓ మహారాజా తమ సేవకైఈ బ్రహ్మచారి వచ్చాడు.

-అధైత ఆసస్తురాచితి ఇవిచితో బభూవ అధోత్థాయ ప్రావాజేదితి.-

ఈ బ్రహ్మచారి మీ వద్దకు వచ్చి జ్ఞానము వలన పరిపూర్ణుడైనాడు అని ఆయన వెళ్లిపోయాడు

-ఏతద్వా అహం వేద నైతాసు యోనిష్వత ఏతేభ్యా దా మిధునే భ్యః సంభవతో బ్రహ్మచారీ మమ పురాయుషః ప్రేయాదితి-

ఆయన యింకా యిలా అన్నారు ఆయోనుల యందు, అధవా ఈ మిధునముల యందునుండి వచ్చిన బ్రహ్మచారు లెవ్వరును అల్పాయువులుకారు.

ఇక్కడి ప్రశ్న సవిత ఎవ్వరనీ సావిత్రిఎవ్వరని గాయత్రి యొక్క దేవత సవితయని తెలిసింది. ప్రతి ఒక్క మంత్రానికి ఒక దేవత ఉంటుంది. అందువలన

ఈమంత్రము యొక్క విషయమేమి అనేది తెలుస్తుంది. గాయత్రి యొక్క మంత్రాధిష్ఠాన దేవత సవిత అయినందు వల్ల మనకు తెలిసేది ఈ మంత్రము యొక్కవిషయము సవితయని సవితయొక్క ప్రాధాన్యత వల్ల ఈ మంత్రానికి సావిత్రి అని గూడా రెండవ పేరు వచ్చింది. మైత్రేయుడడుగుతాడు- ధనవంతుడైన సవిత ఎవ్వరని, ఆ సావిత్రి ఏమని మహర్షి మౌద్గల్యుడు సమాధానం మిస్తాడు - సవితకు, సావిత్రికి విడదీయరాని సంబంధం ఉన్నదని ఒకటి ఎక్కడ ఉంటే అక్కడ రెండవది గూడా ఉండితీరుతుందనీ - రెండూ కలసి ఒక జోడూ (మిధునం అవుతుందనీ- ఒకటి కేంద్రమైతే రెండవది శక్తియనీ- ఒకటి రెండవదానికి పూరకమనీ -

శక్తి మార్గము యొక్క మహత్వము ఆ శక్తి యొక్క విస్తరణ వల్ల కలుగుతుంది. ప్రతి యొక్క పరమాణువు గూడా అనంత శక్తి యొక్కపుంజమే ఒకపరమాణువు విస్ఫోటం చెందటం వల్ల ప్రళయమే కలుగుతుంది. కాని ఆ శక్తి యొక్క విస్తరణ, ప్రకటీకరణ ఎలా జరుగుతుందీఅనేది ముఖ్యవిషయం. ప్రకటీకరణం జరగకపోతే అంతటి అనంత శక్తి శాలియైన పదార్థము గూడా అస్తిత్వం లేనిదే అవుతుంది. దాని సంగతిఎవరికీ తెలియదు గూడా తేజస్వియైన పరమాత్మను సవిత అనే పదం ప్రకటిస్తే ఆయనశక్తినిసావిత్రి అనే పదం ప్రకటిస్తుంది. సావిత్రి సవితకు భిన్నం కాదు, కాగా పూరకం వాని మిధునము విడదీయరాని జోడి, సావిత్రి వల్లనే అంచిత్య అజ్ఞేయ, నిరాకార నిర్లిప్తుడైన పరమాత్మ నుండి లాభం పొంద గల్గుతాము.

ఈ విషయము అతి సూక్ష్మంగా గంభీరంగా ఆలోచిస్తే మాత్రమే అర్థమవు తుంది అందువల్లనే ఉపనిషత్కారులు ఎన్నో ఉదాహరణలిచ్చి చక్కగా అర్థమయ్యే టట్లు వర్ణించారు.

మనస్సు సవిత - వాక్కు సావిత్రి. ఎక్కడమనస్సు ఉంటే అక్కడ వాక్కు ఉంటుంది ఆ రెండు యోనులు ఒక మిధునము. ఈ విధంగా అగ్ని పృధ్వి, వాయువు- అంతరిక్షము, ఆదిత్యుడు-ద్యులోకము, చంద్రుడు-నక్షత్రములు, పగలు-రాత్రి, వేడి చల్లదనము.

వర్షము - వరుణుడు, విద్యుత్తు-మెరుపు, ప్రాణము-అన్నము వేదములు- ఛందములు, యజ్ఞము -దక్షిణ, అనే వివిధ మిధునాలు చెప్పబడ్డాయి. ఇవి ఏహో కొన్ని ఉదాహరణలు మాత్రమే ఈ ఉదాహరణలు చెప్పి ఉపనిషత్కారుడు చెప్పేది ఒంటరిగా ఏవస్తువూ మనజాలదనీ, వెలుగులోకి రాదనీ విస్తరణ పొందదనీను. అవ్యక్తమైన పదార్థం ఎప్పుడు వ్యక్తమవుతుందో అప్పుడు దాని శక్తి ప్రకటీకృత మవుతుంది. కేవలం

పరమాత్మ అయితే బుద్ధికీ, మర్యాదకూ అతీతుడు. ఆయనను గూర్చిమ..ం ఆలోచించలేము. ఆయనను సమీపించనూలేము. లాభం పొందనూలేము. ఆ అవ్యక్త పరమాత్మ సవిత, తనశక్తి సావిత్రి ద్వారా అందరికీ ప్రకటితమవుతుంది. ఆ శక్తి యొక్క ఉపాసనద్వారా మాత్రమే ఆయన ప్రకటిత మవుతాడు ఆయనను పొందగల్గుతాం

లక్ష్మినారాయణులు, సీతారాములు, రాధాకృష్ణులు, ఉమాశంకరులు, సవితా-సావిత్రులు ప్రకృతీ పరమేశ్వరులు మిధునములు. ఒకదానికి ఒకటి పూరకములు, ప్రకటీకృతం కావడానికి కారణ భూతములు. జీవుడు కూడా మాయవలన అవ్యక్తము నుండి వ్యక్తుడవుతాడు. ఈ మిధునములు హేయములు, త్యాజ్యములు కావు. కాగా క్రియాశీలత విస్తారం కావడానికి తోడ్పడతాయి. మనుష్యుని వికాసం గూడా ఏకాంగి కాదు. అతడు తన శక్తులను విస్తరింప జేసుకోవలసి ఉన్నది. ఎవరు తమ శక్తులను పెంచుకుంటారో వారు ఉన్నతిని పొందుతారు.

శక్తికి, శక్తిమంతునికి అన్యోన్యాశ్రయ సంబంధంఉన్నది. ఏవిధంగా సవిత, సావిత్రితో ఓతప్రోతమై ఉన్నదో అదేవిధంగా మనం గూడా మన యొక్క బహు ముఖమైన శక్తులతో పరిపూర్ణులం కావాలి. మనతో పాటు అనేకులను సహయోగంతో సంఘటితం చేయాలి. ఆ మిధునములు ఎంత ఎక్కువైతే అంత సుఖం.

ఈ శక్తి - శక్తి మంతుల రహస్యం తెలిసిన తరువాత మైత్రేయుడు సంతుష్టుడైనాడు. ఆయన అంటారు గదా - నేను, నీ శిష్యుడనైన నేను, ఈజ్ఞానముయొక్క వాస్తవిక సంగతిని తెలిసి పరిపూర్ణుడనైనాను. ఈ మిధునములు- యోనుల రహస్యం తెలిసి నంతనే నాశిష్యులెవరూ అల్పాయువులు కారు అని. ఆశక్తినితన అవిచ్ఛిన్న అంగంగా తెలిసి, దురుపయోగంచేయకపోతే పైగా సదుపయోగం చేస్తే అన్ని విధాలా లాభాన్ని పొందగలరు. ఈవిధంగా శక్తియొక్క మహత్వం తెలిసి, సదుపయోగం చేసే వారు అల్పాయువులు కారు.

-బ్రహ్మ వేదం శ్రియం ప్రతిష్ఠా మాయతన మైక్షత తత్తయైన్కా యది తద్వ్రతే ధ్రియేత్ సత్యయేవ ప్రత్యతిష్ఠతి-

బ్రహ్మ శ్రీ యొక్కప్రతిష్ఠ యొక్క ఆయతనమును చూచాడు. తపము చెయ్యవలసిందిగా ఆదేశించాడు. తపముయొక్క వ్రతధారణ చేసినందువల్ల సత్యమున ప్రతిష్ఠతులవుతారు.

-స సవితాం సావిత్ర్యా బ్రాహ్మణం స్రష్టవా తత్సావిత్రీం పర్యదధాత్ -

ఆ సవిత సావిత్రితో బ్రాహ్మణులను సృష్టించి సావిత్రిని వారిచే ఆవరింప చేశాడు.

-తత్సవితుర్వరేణ్యం ఇతిసావిత్ర్యాః ప్రథమఃపాదః-

తత్సవితుర్వరేణ్యం అనేది సావిత్రి యొక్క మొదటిపాదం.

-పృధి వ్యర్చ సమద్ధాత్ ఋచా అగ్నిమ్ అగ్నినా
శ్రియం. శ్రియాస్త్రియం. స్త్రియో మిధునమ్
మిధునేన ప్రభామ్ ప్రజయా కర్మం కర్మణాతపం
తపసా సత్యం సత్యేన బ్రహ్మ బ్రహ్మణా బ్రాహ్మణం.
బ్రాహ్మణే న వ్రతం వ్రతేన వై బ్రాహ్మణఃసంశితో భవతి.
అశూన్యో భవతి, అవిచ్ఛిన్నో భవతి-

పృధ్వి శుక్రునితో కలుపబడి యుక్తమైనది. శుక్రునితో అగ్నికి, అగ్నితో శ్రీకి, శ్రీతోస్త్రీకి,స్త్రీతో మిధునమునకు,మిధునముతో సంతానమునకు, సంతానముతో కర్మకు, కర్మవలన తపమునకు, తపము వలన సత్యమునకు, సత్యముతో బ్రహ్మకు బ్రహ్మతో బ్రాహ్మణమునకు బ్రాహ్మణులతో వ్రతమునకు. బ్రాహ్మణుడు వ్రతము తోడనే తీక్షణుడవుతాడు, పూర్ణుడవుతాడు, అవిచ్ఛిన్నుడవుతాడు.

- అవిచ్ఛి న్నోఽ స్యతంతు రవిచ్ఛిన్నంజీవనం భవతి,య ఏవంవదేత్ యశ్చైవం విద్వానేవే మేతం సావిత్ర్యా ప్రథమపాదం వ్యాచష్టే -

ఎవరు ఈ ప్రకారం తెలుసుకుంటారో, తెలుసుకున్న ఏ విద్వాంసుడు ఈ ప్రకారం వ్యాఖ్యానం చేస్తాడో అతడు అతని వంశము, అతని జీవితము అవిచ్ఛిన్నమవుతాయి.

బ్రహ్మ తనలో తానుకేంద్రితుడై యున్నంత వరకూ ఎట్టి పదార్ధమూలేదు. ఎప్పుడైతే ఆయన ఏకోహం బహుశ్యామ అని కోరాడో ఒకటి నుండి అనేకం కావటం ప్రారంభమైనది. ఆ ఇచ్ఛాశక్తి వలననే సృష్టి ఉత్పన్నమైనది. బ్రహ్మ సృష్టిని సాక్షాత్కరింప జేసినప్పుడు మూడు వస్తువులు ప్రధానంగా కనిపించాయి. (1) శ్రీ (2) ప్రతిష్ఠ (3) ఆయతనము అంటే జ్ఞానము. ఈ విలక్షణమైన సుఖ సామగ్రిని ఏవిధంగా పొందగలుగుతాము? ఈ రహస్యాన్ని ఉద్ఘాటిస్తూబ్రహ్మ యిలా అన్నాడు - తపస్సు చెయ్యి, అంటే తన్మయత్వంతో శ్రమించు అని, అది ఏవిధంగా సంభవం? తపస్సుతో కోరిన వస్తువులు ఏవిధంగా లభిస్తాయి? ఆ విషయాన్ని గూడా బ్రహ్మ బహు సుందరమైన

రీతిలో స్పష్టం చేశాడు. ఎప్పుడైతే తపస్సు యొక్క వ్రతధారణ చేస్తామో తపస్సు యొక్క రుచి పూర్వకమైన శ్రమశీలతను తమ స్వభావంగా మలుచు కుంటామో అప్పుడు అవశ్యం సత్యమందు ప్రతిష్ఠితులమవుతాము. తప్పక సరియైనమార్గం దొరుకుతుంది. ఆ మార్గాన పయనిస్తూ ప్రాణులు తమ అభీష్టమును పొందగలుగుతాయి.

శ్రీ కి, ప్రతిష్టకు జ్ఞానమునకు అధికారులను ఎవరు నియుక్తులనుచేశారు? ఈ విలక్షణ సుఖ సంపత్తి సాధనకు ప్రతి ఒక్కరూ అధికారులు కాజాలరు. సవిత అంటే పరమాత్మ సత్‌శక్తితో బ్రాహ్మణుని నిర్మించి అతనిని సావిత్రితో ఆవరింపజేశారు ఎవని యందు 'సత్' తత్వం విశేషంగా ఉంటుందో అతడు బ్రహ్మపరాయణుడు అంటే బ్రాహ్మణుడు. అట్టి వ్యక్తి, ఈశ్వరీయ దివ్యభావములతో, దివ్యశక్తితో ఆవరింపబడి ఉంటాడు. అతడు మాత్రమే శ్రీ ప్రతిష్ట జ్ఞానము అను సుఖ సంపత్తిని పొందగలుగుతాడు అతడు మాత్రమే వానిని సదుపయోగంచేసికొని లాభాన్వితుడవుతాడు. బలవంతంగా, అనధికారికంగా, వీనిని పొందినవానికి ఆ వస్తువులు విపత్తుగా పరిణమిస్తాయి.

ఆసురీ భావములతో ఆచ్ఛాదితుడైన వ్యక్తి తపస్వికాజాలడు. ఉచిత మార్గమున, తపస్సుతో, విశ్వాసంతో ఈ వస్తువులను పొందవలసి వుండగా, అతడు అవైధానిక, అనుచిత మార్గంతో టక్కుటమారంతో పొందుతాడు. అట్టివాడు తన శ్రీని, ప్రతిష్ఠను, జ్ఞానమును తనకు, యితరులకూ విపత్తి తేవడానికి మాత్రమే ఉపయోగిస్తాడు. మనం రోజూ చూస్తున్న విషయమే. ధనికులు ధన సంగ్రహం కొరకు ఎంతటి అనుచిత కార్యములను చేస్తున్నారో, ఆ సంచిత ధనాన్ని ఎట్టి అనుచిత మార్గాలలో వినియో గిస్తున్నారో, తమ ప్రతిష్ఠను దురుపయోగం చేసే నాయకులు, మహాత్ములు, సాధు సన్యాసులు అధికాధికంగా ఉన్నారు. జ్ఞానాన్ని దుర్వినియోగం చేసేవారి సంఖ్య గూడా తక్కువేమీ కాదు.

అబద్ధాన్ని నిజంగా, నిజాన్ని అబద్ధంగా నిరూపించే వకీళ్ల సంఖ్య నేడు తక్కువేమీగాదు. అశ్లీలంగా, అసహ్యంగా రచించే రయితల సంఖ్య, చిత్రీకరించే చిత్రకారుల సంఖ్య నేడు తక్కువేమీ కాదు. తప్పుడు సాక్ష్యాలతో, విజ్ఞాపనలతో తమ జ్ఞానాన్ని దుర్వినియోగం చేసేవారు అసంఖ్యాకంగా ఉన్నారు. అట్టి అసత్ శక్తి అధికంగా కలవారికి పై మూడు సంపదలూ ( శ్రీ, ప్రతిష్ఠ, జ్ఞానము) లభిస్తే తప్పనిసరిగా వాటి దుర్వినియోగం జరుగుతుంది. దురుపయోగము యొక్క నిశ్చిత పరిణామం అవి నశించి పోవటం. అయోగ్యుడైన వాని చేతిలో ఎట్టి వస్తువూ ఎక్కువ కాలం నిలువక పోవడమనేది ప్రకృతి నియమం.

ఎవడు బ్రాహ్మణుడో, ఎవడు బ్రహ్మ ప్రకృతి గలవాడో అతనిని మాత్రమే బ్రహ్మ శ్రీ, ప్రతిష్ఠ, జ్ఞాన సంపదలను పొందటానికి అర్హునిచేశాడు. అదియే ఈశ్వరీయ నియమము. స్థాయీ రూపంలో ఎవరు శ్రీ ప్రతిష్ఠ, జ్ఞానములకు అధికారులవుతారో, శాశ్వతంగా వాని రసాస్వాదన చేసుంటారో వారే బ్రాహ్మణులు కావాలి. తమ గుణ, కర్మ, స్వభావముల యందు బ్రాహ్మీభావనలను ప్రధానంగా నింపుకోవాలి. అట్టివారి వద్దనేపై మూడు రకాల సంపదలూ శాశ్వతంగా ఉంటాయి. సవిత, అంటే పరమాత్మ తన సావిత్రితో, అంటే సత్మక్తితో బ్రాహ్మణునికి వరము నిచ్చాడు. మనం తపస్సుతో, యోగంతో, యజ్ఞములతో, ప్రేమతో, న్యాయముతో బ్రాహ్మణులం కావడానికి ప్రయత్నించి ఈ మూడు సంపదలను పొందాలి.

బ్రాహ్మణుని వద్ద అంటే సన్మార్గగామి వద్ద వైభవం ఏవిధంగా చేరి, నిలకడగా ఉంటుందో వివేచనం చేస్తూ ఉపనిషత్కారుడు పరస్పర సంబంధాన్ని ఏకరువు పెట్టారు. ఆ పరస్పర సంబంధ శృంఖల ఏవిధంగా సంపన్నతనందీయటానికి సమర్థత కలిగి ఉన్నాయో వివరించాడు.

గాయత్రి యందలి ప్రథమ పాదము 'తత్సవితుర్వరేణ్యం' యొక్క భూఃప్రతినిధిగా చెప్పబడింది. మూడు వ్యాహృతులతో "భూర్భువఃస్వః"తో గాయత్రియందలి మూడు పాదాలు ఉద్భవించాయి. భూః అంటే పృథ్వీలోకము. పృథ్వికి, పృథ్వీ నివాసులకు శుక్రము జ్ఞానముతో సంబద్ధం చేయబడింది. జ్ఞానము అగ్నితో అంటే క్రియతో సంబద్ధం చేయబడింది. అగ్నితో శ్రీకి, అంటే క్రియతో వైభవం ముడివేయబడింది. అగ్నితో శ్రీకి, అంటే క్రియతో వైభవం ముడి వేయబడింది. వైభవం స్త్రీతో అంటే తృప్తితో జోడించబడింది. తృప్తితో మిథునం అంటే జోడీ అంటే మైత్రికలిగింది. మైత్రితో ప్రజా, అంటే బహు జనులతో సంబంధం కలిగింది. బహుజన సహయోగంతో కర్మ జరిగింది. సత్కర్మతో తపస్సు చేసేటందుకు సాహసం కలిగింది. తపస్సుతో సత్య మార్గం తెలిసింది. సత్య మార్గంతో బ్రహ్మ ప్రాప్తి కలిగింది. బ్రహ్మ ప్రాప్తి కలిగినవాడు బ్రాహ్మణుడని పిలువ బడతాడు. బ్రాహ్మణుడు వ్రతమును పొందాడు. అంటే ఆదర్శ వంతంగా ఆచరించే ప్రతిజ్ఞ తీసుకున్నాడు. ఈ ప్రకారంగా ఎవని జీవనము ఆదర్శవాద ఆచరణతో ఓత ప్రోతమై యున్నదో ఆ బ్రాహ్మణుడు సుతీక్షణత పరిపూర్ణత, అఖండత కలిగి ఉంటాడు. అతని తీక్షణతలో, క్రియాశీలతలో పూర్ణతలో, ఏమీలోటు ఉండదు.

ఎవరు ఈ జ్ఞానమును కలిగి వుంటారో, ఎవరు ఈ విధంగా వ్యాఖ్యానం చేస్తారో, వారి జీవనమూ, వంశమూ కూడా అవిచ్ఛిన్నంగా ఉంటాయి.

గాయత్రీ ప్రథమ పాదము యొక్క శబ్దార్థము చాలా మామూలుగా ఉంటుంది. అవి తెలిసినంతమాత్రాన కావలసినంత లాభం కలుగదు. బ్రహ్మ ఎవనిని శ్రీ, ప్రతిష్ఠ, జ్ఞానము అను మూడు రత్నములకు అధికారిని చేశాడో అతడు గాయత్రితో ఆవరింపబడి ఉంటాడు. దాని తాత్పర్యం గాయత్రీ నియమముల ఆచరణలో ఎవరు బ్రాహ్మణత్వం కలుగజేశారో, వారే భౌతిక, ఆత్మిక ఆనందములను కూడా కలుగ జేస్తారు. ఎవరి జఠరాగ్ని తీవ్రంగా ఉంటుందో, వారే సామాన్య పదార్థాలను గూడా రుచికరంగా, పుష్టికరంగా చేసుకో గలుగుతారు. ఎవరి జఠరాగ్ని మందంగా ఉంటుందో, వారు ఎంతటి రుచికరమైన, బలమైన పదార్థాలను తిన్నా రోగం కలుగుతుంది.

గాయత్రిచే ఆచ్ఛాదితుడై, బ్రహ్మ కర్మనిష్ఠుడైన వాని ఆత్మిక జఠరాగ్ని ఎంతటి తీవ్రంగా ఉంటుందంటే, అతడు తేలికగా, కొలదిగా దొరికే పదార్థాలతో గూడా మిక్కిలిగా రసాస్వాదన చేయగల్గుతాడు.

గాయత్రీ ప్రథమ పాదమందలి వాస్తవిక ఉద్దేశ్యము మానవ జీవితమును ఆదర్శవాద ప్రతిజ్ఞతో ఓతప్రోతం చేయడమని తెలిసినవారు మాత్రమే వాస్తవిక తాత్పర్యాన్ని తెలుసుకున్నవాడవుతాడు. ఈ జ్ఞానమును ఆచరణలోనికి తీసికొన్న వాడు, అంటే సాక్షాత్తుగా జీవితాన్ని ఆవిధంగా మలచుకొన్నవాడు తన జీవితమును అవిచ్ఛిన్నం చేసుకున్నట్లే (అమరుడు). అతడు జీవితమంతా పదభ్రష్టుడు కాడు. అతని వంశము నశింపదు. ఈ అవిచ్ఛిన్నతవల్ల అతని శ్రీ, ప్రతిష్ఠ, జ్ఞానమూగూడా పుష్కలంగా ఉంటాయి.

-"భర్గోదేవస్య ధీమహి సవిత్ర్యా ద్వితీయః పాదః"-

భర్గోదేవస్య ధీమహి అనేది సావిత్రి యందలి ద్వితీయపాదము.

-అంతరిక్షేణ యజుః సమదధాత్, యజుషా వాయుమ్, వాయునా అభ్రం, అభ్రేణ వర్షం, వర్షేణౌషధి వనస్పతీన్, ఔషధి వనస్పతిభిః పశూన్ పశుభిఃకర్మ, కర్మణాతపః, తపసా సత్యం, సత్యేన బ్రహ్మ, బ్రహ్మణా బ్రాహ్మణమ్, బ్రహ్మణేన వ్రతేన బ్రాహ్మణః సంజ్ఞితో భవతి, అశూన్యో భవత్య విచ్ఛిన్నో భవతి-

అంతరిక్షముతో యజావు యక్తముకాగా, యజుర్వేదమునుండి వాయువు నకు, వాయువు నుండి మేఘమునకు, మేఘమునుండి వర్షమునకు, వర్షమునుండి ఔషధి వనస్పతులకు ఔషధి వనస్పతులనుండి పశువులకు, పశువులనుండి కర్మకు, కర్మ నుండి

తపస్సునకు, తపస్సునుండి బ్రహ్మకు, బ్రహ్మనుండి బ్రాహ్మణునకు, బ్రాహ్మణునుండి వ్రతమునకు, వ్రతము వలన బ్రాహ్మణుడు తీక్షణుడు, పూర్ణుడు, అవిచ్ఛిన్నుడుఅవుతాడు.

"అవిచ్ఛిన్నోఽస్యతంతు రవిచ్ఛిన్నంభవతి, ఏవం వేద యస్త్వైవ విద్వానేవమేతం సావిత్ర్యా ద్వితీయం పాదం వ్యాచష్టే"-

ఏ విద్వాంసుడు ఈ విధంగా తెలిసి సావిత్రియొక్క ద్వితీయ పాదముయొక్క వ్యాఖ్య చేస్తాడో అతని వంశము, జీవితము అవిచ్ఛిన్నమవుతాయి.

వెనుకటి ఖండికయందు 'భూః' కు శుక్రునితో సంబంధమేర్పరచి ప్రథమ పాదముయొక్క రహస్యం తెలుపబడింది. ఈ ఖండికయందు గాయత్రియొక్క రెండవ పాదము వివేచింపబడింది. 'భువః' తో (అంతరిక్షముతో) యజుస్సుకు సంబంధం ఏర్పరుపబడింది. యజుర్వేదము యజ్ఞములను గురించి వివరిస్తుంది. యజ్ఞము పరమార్థాన్ని తెలుపుతుంది. మొదటి ఖండికలో జ్ఞానముద్వారా ఆదర్శ జీవనమును పొందు మార్గం వివరింపబడింది. ఇక్కడ యజ్ఞముతో వ్రతమయ జీవనం కలిగే శృంఖల వర్ణింపబడింది.

భువః-అంతరిక్షమందు యజుస్సుతో కలుపబడింది. యజుస్సు వాయువుతో, వాయువునండి మేఘమునకు, మేఘమునుండి వర్షమునకు, వర్షమునుండి ఔషధి వనస్పతులకు, వనస్పతినుండి పశువులకు కలయిక ఏర్పాటు చేయబడింది. గీతలోకూడా యజ్ఞానికి యిటువంటి వివరణ యవ్వబడింది. యజ్ఞమువలన వాయువు శుద్ధంకాగా, వాయువుతో కలయిక కలిగిన జలం వర్షింపబడతుంది, అందువలన వృక్షములు, వనస్పతులు, పశువులు శ్రేష్ఠ తత్వమును పొందుతాయి. వానిని ఉపయోగించుకొని మనుష్యుని మనస్సు శ్రేష్ఠమవుతుంది. శ్రేష్ఠమైన మనస్సుతో శ్రేష్ఠమైన కర్మ జరుగుతుంది.

కర్మవలన మనస్సునకు, మనస్సువలన సత్యమునకు, సత్యమువలన బ్రహ్మకు, బ్రహ్మనుండి బ్రాహ్మణునకు బ్రాహ్మణునకు వ్రతముతోను బంధం ఏర్పడుతుంది. చివరికి వ్రతధారణ వలన బ్రహ్మణుడు సతీక్షణుడు, పరిపూర్ణుడు, అవిచ్ఛిన్నమైన వంశం కలవాడూ కాగలడు.

జ్ఞానమువలన కలిగేది ఏదైనా అది యజ్ఞముద్వారా అంటే శ్రేష్ఠకర్మలతో కూడా లభిస్తుంది. ఉన్నత అంతఃకరణనుండి వచ్చే సద్భావనలు సమస్త ఆకాశమందు, వాతావరణమందు వ్యాపించి సన్మయం చేస్తాయి. అట్టి వాతావరణం వల్ల మనుష్యుడు వ్రతపరాయణుడు, వ్రతవంతుడై అవిచ్ఛన్న జీవనమును పొందుతాడు. అది ఈ రెండవ ఖండికయొక్క తాత్పర్యము.

-"ధియో యోనః ప్రచోదయాదితి సావిత్ర్యాస్తృతీయః పాదః"-

"ధియో, యోనః ప్రచోదయాత్" అనేది సావిత్రియొక్క మూడవ పాదము.

-దివా సాం సమద్ధాతు సామ్నాఽఽదిత్యం, ఆదిత్యేన రశ్మిన్ రశ్మిభిర్వర్షం, వర్షేణౌషధి వనస్పతీన్,ఔషధి వనస్పతిభిః పశూన్, పశుభిః కర్మ, కర్మణ్యః తపం, తపసాసత్యం, సత్యేన బ్రహ్మ, బ్రహ్మణా బ్రాహ్మణాం, బ్రాహ్మణేన వ్రతం, వ్రతేనవై బ్రాహ్మణాః సంశితో భవత్యవిచ్ఛిన్నో భవతి. అవిచ్ఛిన్నాఽస్య తంతు రవిచ్ఛిన్నం జీవనం భవతి యేవం వేద; యశ్చైవ విద్వానేవమేతం సావిత్ర్యా స్తృతీయం పాద వ్యాచష్టే-

ద్యులోకమునుండి సామము పుట్టినది. సామమునుండి ఆదిత్యునికి, ఆదిత్యునినుండి రశ్మికి, రశ్మినుండి వర్షమునకు, వర్షమునుండి ఔషధి వనస్పతులకు, ఔషధి వనస్పతులనుండి పశువులకు, పశువులనుండ, కర్మకు, కర్మనుండి తపమునకు, తపమునుండి సత్యమునకు, సత్యమునుండి బ్రహ్మకు, బ్రహ్మనుండి బ్రాహ్మణునకు, బ్రాహ్మణునుండి వ్రతమునకు; వ్రతమువలన బ్రాహ్మణుడు తీక్షణుడు, పూర్ణుడు, అవిచిన్నమైన వంశము కలవాడు కాగలడు. ఏ విద్వాంసుడు ఇది తెలిసి సావిత్రియొక్క తృతీయ పాదమునకు వ్యాఖ్యచేస్తాడో అతడు, అతని వంశము, జీవితమూ కూడా అవిచ్ఛిన్నం అవుతాయి.

గాయత్రియొక్క మూడవ పాదము 'స స్వః' నుండి వచ్చింది. స్వః అంటే ద్యులోకము. ద్యులోకము సామ వేదంతో కలుపబడి ఉన్నది. సామమునుండి ఆదిత్యుడు, ఆదిత్యుని నుండి రశ్మి, రశ్మి నుండి వర్షము, వర్షము నుండి ఓషదులు, వనస్పతులు అందు నుండి పశువులకు సంబంధం కలుగుతుంది. ఈ ప్రయోగం చెయ్యటంవల్ల యింతకు ముందు వర్ణించినట్లు గానే మనుష్యుడు బ్రహ్మచారీ, వ్రతధారీ కావడంవల్ల అతని జీవితమూ, వంశమూ గూడా అవిచ్ఛిన్నంగా ఉంటాయి.

గాయత్రి యందలి మూడుపాదములలో నిక్షిప్తమై ఉన్న విజ్ఞానం వల్ల మనుష్యునకు శ్రీ ప్రతిష్ఠ, జ్ఞానమూ కలుగుతాయి. ఈ మూడు పాదములు వేదములలో కూర్చబడినవి. ప్రతిఒక్క పాదమూ ఒక్కొక్క లోకమునకు ప్రతీక, ఈ మూడులోకముల నుండి ఈ మూడు వేదమంత్రములూ సామగ్రిని లాక్కుని వచ్చి గాయత్రీ సాధకునికి, అన్నివిధాలా సుఖాలు కలుగజేస్తుంది. అందువల్ల వ్యక్తిగత లాభమే కాకుండా సామూహిక లాభం కూడా కలుగుతుంది. యజ్ఞము చేయడంవల్ల ఏ విధంగా వాయువు శుద్ధమై ఉత్తమమైన వర్షము, అందువల్ల ఉత్తమమైన వనస్పతులు పాలు ఉత్పత్తి అవుతాయో గాయత్రివల్ల కూడా అదేవిధమైన ప్రక్రియ జరుగుతుంది.

దీనికి సంబంధించిన శృంఖలలో ఒక గొప్ప పదార్థ విజ్ఞానానికి సంబంధించిన రహస్యం దాగిఉన్నది. ఒకపదార్థంతో రెండవ పదార్థం సంబంధం ఏవిధంగా ఉంటుందో ఈ సూక్ష్మమైన వివేచన మనం ఆధ్యాత్మిక శైలిలో చేశాము. కాని యిందులో యింతకంటె విస్తృతమైన రహస్యం యిమిడి ఉన్నది. అందువల్ల గాయత్రీ సాధకుడు మూడు లాభములతో అంటే శ్రీప్రతిష్ఠా, జ్ఞానములతో తగినంతగా లాభాన్వితుడు కాగలడు. చివరికి ఈశ్వర ప్రాప్తి కలిగి అవిచ్ఛిన్న జీవనము – అంటే – అమరత్వాన్ని పొందగలడు. అతడు జరా, మృత్యువులతో కూడిన జీవితంతో బంధింపబడడు. అదీ త్రిపదా గాయత్రి యొక్క రహస్యములు

–తేనాహవా ఏవం బ్రాహ్మణేన బ్రహ్మాభి పన్నం గ్రసితం పరామృష్టం.–

సావిత్రి యొక్క మూడు పాదములను అర్థంచేసుకున్న బ్రాహ్మణుడు బ్రహ్మప్రాప్తి పొంది గ్రసితుడై పరామృష్టుడవుతాడు.

ప్రాప్తుడు–

గ్రసితుడు–

పరామృష్టుడు–

–బ్రహ్మణా ఆకాశమభిపన్నం, గ్రసితం, పరామృష్టం, ఆకాశేన వాయు రభిపన్నా గ్రసితః పరామృష్టః, వాయు నాజ్యోతి రభిపన్నో గ్రసితః పరామృష్టః, జ్యోతిషాపోఽ భిపన్నో గ్రసితః పరామృష్టః, అదే భిర్భూమిరభిపన్నా గ్రసితా పరామృష్టా, భూభ్యాఽన్నమభిపన్నం గ్రసితం పరామృష్టం, అన్నేన ప్రాణోఽభిపన్నో గ్రసితః పరామృష్టః. ప్రాణేన మనఽభిపన్నం గ్రసితం పరామృష్టం. మనసావాగభిపన్నా గ్రసితా పరామృష్టా. వాచావేదా అభిపన్నా గ్రసితాః పరామృష్టాః వేదైర్యజ్ఞోఽభిపన్నో గ్రసితః పరామృష్టః తానిహవా ఏతాని ద్వాదశ మహాభూతాన్యేవం విధి ప్రతిష్ఠితాని. తేషాంయజ్ఞ ఏవ పరార్ధ్యః.–

బ్రహ్మవలన ప్రకాశ ప్రాప్తి, గ్రసితము, పరామృష్టము. ఆకాశము నుండి వాయు ప్రాప్తి, గ్రసితము, పరామృష్టము. వాయువు వలన జ్యోతి అభిపన్నము గ్రసితము, పరామృష్టము జ్యోతి నుండిజలప్రాప్తి, గ్రసితము, పరామృష్టము. జలము నుండి పృథివి ప్రాప్తిము, గ్రసితము, పరామృష్టము. భూమి నుండి అన్నము అభిపన్నము, గ్రసితము, పరామృష్టము. అన్నము నుండి ప్రాణము అభిపన్నము, గ్రసితము, పరామృష్టము. ప్రాణము వలన మనస్సు అభిపన్నము. వాక్కు నుండి వేదము అభిపన్నము, గ్రసితము, పరామృష్టము వేదము నుండి యజ్ఞప్రాప్తి, గ్రసితము, పరామృష్టము. ఈ విధమైన

జ్ఞానము కలిగిన వానియందు ఈ పన్నెండు (ద్వాదశ) మహాభూతములు ప్రతిష్ఠతమై ఉంటాయి. వీనియందు యజ్ఞము అన్నిటికన్న శ్రేష్ఠము.

వెనుకటి మూడు ఖండికల యందును వర్ణింపబడిన గాయత్రి యందలి మూడు పాదముల రహస్యమును చక్కగా గ్రహించినవాడు బ్రాహ్మణుడు. బ్రహ్మ ప్రాప్తి గ్రసితుడు పరామృష్టుడు అవుతాడు. అంటే ఆ బ్రాహ్మణుడు బ్రహ్మమును పొందుతాడు; (గ్రసితుడు)- జీర్ణంచేసు కుంటాడు, పరామృష్టుడు అంటే ఆచ్ఛాదితుడవుతాడు. (ఆవరింప బడతాడు). అతనిలోపలా, బయటా అన్ని దిక్కులా బ్రహ్మము యొక్కశక్తియే పనిచేస్తుంది.

ఇప్పుడు అట్టి 12 పాదములు చెప్పబడ్డాయి. వానిని చక్కగా విచారణ చేయటంవల్ల పంచభూతములు. అంతఃకరణ చతుష్టయము, వేదములు, యజ్ఞములు అన్నిటి యొక్క మూలము బ్రహ్మమేనని అర్థమవుతుంది. బ్రహ్మతో ఒకగొళ్లెం, యింకొక గొళ్లెంతో ముడిపడి ఉన్నట్లు అన్నీజోడింపబడి ఓతప్రోతమై ఉన్నవి.

బ్రహ్మము నుండి ఆకాశము ఆకాశము నుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి జలము, జలము నుండి పృథ్వి, పృథ్వి నుండి, అన్నము, అన్నము నుండి ప్రాణము, ప్రాణము నుండి మనస్సు, మనస్సు నుండి వాక్కు, వాక్కు నుండి వేదము, వేదము నుండి యజ్ఞము లభిస్తాయని చెప్పబడింది. జీర్ణం చేసుకోబడి, ఆవరింపబడుతుంది.

బ్రహ్మము పదార్థ రూపంలో కళ్లకు కనిపించదు. అల్పజ్ఞానం కలిగిన మనుష్యుడు పంచభూతములతో కూడిన ఈ బొమ్మయే అన్నీ చేస్తున్నదని భావిస్తాడు. కాని పంచ భూతములూ, నీలో పనిచేస్తున్న మనస్సు, బుద్ధి, చైతన్యము బ్రహ్మమునండి అన్యము కాదు. బ్రహ్మముచే ఆవరింపబడి యున్నవి. బ్రహ్మముయొక్క ఆచ్ఛాదన లేకపోయి నట్లయితే వాని క్రియా శీలత సమాప్తమై ఏ తత్వమూ, ఏ కొంచెంకూడా పనిచేసే సమర్థతన కలిగి ఉండదు.

ఎవరు ప్రకృతియందు, పంచభూతములయందు, శరీరమందు బ్రహ్మము యొక్క, పరమాత్మయొక్క ఆచ్ఛాదనను చూడగల్గుతారో, వారు బ్రాహ్మణులుగా పిలువబడతారు. వారు వేదములచేత, యజ్ఞములచేత ఆవరింపబడతారు. అంటేవారి కణ కణములోనూ సద్జ్ఞానము, సత్కర్మనిండి ఉంటుంది. ఈ జ్ఞానమంతటిలో యజ్ఞము అంటే సత్కర్మ సర్వోత్తమము. ఎందవలనసంటే ఈ జ్ఞానముయొక్క తాత్పర్యము మనుష్యుడు సత్కర్మలో నిమగ్నుడై ఉండాలీ అని. ఎవరు ఈ రహస్యాన్ని అర్థంచేసుకుంటారో, వారిలో సర్వభూతములు ప్రతిష్ఠతమై ఉంటాయి. అంటే సమస్త సృష్టిని గురించి అతని అంతరంగమందే తెలుసుకుంటాడు.

-తహాస్మైతమేవ విద్వాంసో మన్యంతే విద్యైనమితి యథా తథ్య విద్వాంసః-

ఏ విద్వాంసుడు ఈ యజ్ఞాన్ని గురించి తెలుసకున్నాననుకుంటాడో అతడికేమీ తెలియదు.

-అయం యజ్ఞో వేదేషు ప్రతిష్ఠితః. వేదా వాదాంప్రతిష్ఠితః వాఙ్మనసి ప్రతిష్ఠితా. మనః ప్రాణో ప్రతిష్ఠితం ప్రాణోఽన్నే ప్రతిష్ఠితః. అన్నం భూమౌ ప్రతిష్ఠితం. భూమిరప్సు ప్రతిష్ఠితా. ఆపోజ్యోతిషి ప్రతిష్ఠితః. జ్యోతిర్వాయౌ ప్రతిష్ఠితం. బ్రహ్మ బ్రాహ్మణే బ్రహ్మవిది ప్రతిష్ఠితం.-

-యోహ వాఆ ఏవం విత్ సబ్రహ్మ విత్పుణ్యంచ కీర్తిం లభతే సరభీంశ్చ గంధాన్. సోఽపహత పాప్మానంతాం శ్రియ మశ్నుతేయ ఏవం వేద, యశ్చైవం విద్వానేవమేతాం మాతరం సావిత్రీం, సంపద ముపనిషదముపాస్త ఇతి బ్రాహ్మణం.-

ఈ యజ్ఞము వేదమునందు ప్రతిష్ఠితమై యున్నది. వేదము వాక్కు నందు ప్రతిష్ఠితమై యున్నది. వాక్కు మనస్సునందు ప్రతిష్ఠితమై యున్నది. ప్రాణము అన్నమునందు ప్రతిష్ఠితమై యున్నది. భూమి జలముపై ప్రతిష్ఠితమై యున్నది. జలము తేజస్సుపై ప్రతిష్ఠితమై యన్నది. తేజస్సు వాయువుపై ప్రతిష్ఠితమై యున్నది. వాయువు ఆకాశముపై ప్రతిష్ఠితమై యున్నది. ఆకాశము బ్రహ్మముపై ప్రతిష్ఠితమై యన్నది. బ్రహ్మము బ్రహ్మవేత్తయైన బ్రాహ్మణనిపై ప్రతిష్ఠితము. ఈ విధంగా తెలిసిన బ్రహ్మజ్ఞాని పుణ్యమును, కీర్తిని పొంది సురక్షితంగా ఉంటాడు. అతడు పాపహీనుడై అనంతైశ్వర్యమును పొందగలడు.

పూర్వఖండికల యందు యజ్ఞము సర్వోత్తమమైనదిగా చెప్పబడినది. కాని యజ్ఞమును గురించి నాకు బాగా తెలుసు, అనుకునే వారికి నిజానికియజ్ఞమును గురించి ఏమీ తెలియదని గ్రహించాలి. దానికి కారణం, రెండవవ్యక్తి ఏ పనినైనా బాహ్యరూపంలో చూచి దాని మంచి చెడులను గురించి తెలుసుకుంటాడు. కాని నిజానికి కార్యముయొక్క **బాహ్యరూపంతో యజ్ఞానికి సంబంధంలేదు. అదిపూర్తిగా ఆంతరిక భావనలకు సంబంధించినది.** ఒకానొక వ్యక్తి గొప్పగొప్ప దానములు, పుణ్యము హోమములు, అగ్నిహోత్రము, బ్రాహ్మణ భోజనము, తీర్థ యాత్రలూ మొదలైనవి చేయవచ్చు కాని అతని ఉద్దేశ్యం మాత్రం కీర్తిని పొందటమో, మరేదో కోరికతోచేసి ఉండవచ్చు. అదే విధంగా ఒక డాక్టరు ఆపరేషను చేయటంవంటి కొన్ని కార్యముల చూడటానికి

హింసాత్మకంగా, పాపంగా కనిపించినప్పటికీ, కర్తయొక్క సద్భావనల కారణంగా అవి శ్రేష్ఠ కర్మలే అవుతాయి. అందువలన ఏ వ్యక్తి యజ్ఞం చేస్తున్నాడు, ఎవరు చేయటం లేదు అనే విషయాన్ని నిర్ణయింపగలిగేది అతని అంతరాత్మ మాత్రమే. బయటనించి చూచే వారికి చాలా విషయాలలో అర్థమైనప్పటికీ కొన్ని విషయాలను తెలుసుకోవడం మాత్రం అసంభవం.

పూర్వ ఖండికల యందు 12 భాగములను ఒక వేపు నుండి మాత్రమే లెక్కించటం జరిగింది. రెండవవేపునుండి పరిశీలించటం, అంటేతారుమారుగాపరిశీలించాలి.

ఈ యజ్ఞము వేదమునందు, వేదము వాక్కునందు, వాక్కు మనస్సునందు, మనస్సు ప్రాణమునందు, ప్రాణము అన్నము నందు, అన్నము భూమియందు భూమిజలము నందు, జలము తేజస్సునందు 'తేజస్సు వాయువు నందు, వాయువాకాశ మందు, ఆకాశము బ్రహ్మము నందు, బ్రహ్మము బ్రాహ్మణునందు ప్రతిష్ఠితమై ఉన్నాయి. ఈ విధంగా **ఈ శృంఖలయొక్క ఒక కొన బ్రాహ్మణుడైతే రెండవకొన యజ్ఞము. ఒక చివర యజ్ఞమైతే, రెండవది బ్రాహ్మణుడు. బ్రాహ్మణుడెక్కడ ఉంటే అక్కడ సద్జ్ఞానము, సత్కర్మలు ఓతప్రోతమై ఉంటాయి. అదే విధంగా ఎవనివద్దసద్జ్ఞానము, సత్కర్మలు ఓతప్రోతమై ఉంటాయో, అతడే బ్రాహ్మణుడు.**

ఎవరు ఈ విధంగా గ్రహిస్తారో, వారు బ్రహ్మజ్ఞానులు. వారు సుగంధము రీతిని వ్యాపించే కీర్తిని పొందుతారు. వారు పాప రహితులు. అనంతైశ్వర్యమును పొందుతారు. వారు జ్ఞానము ఉపాసన చేస్తూ వేదమాత గాయత్రీ ఉపనిషత్తుయొక్క ఉపాసకులై అంటే ఈ ఉపనిషత్తునందు వర్ణింపబడిన మహా జ్ఞానమును తమ అంతఃకరణయందు ధారణ చేసుకుని వానిచే తమ జీవితమును ఓత ప్రోతం చేసుకుంటారు. అట్టి వ్యక్తి మాత్రమే బ్రాహ్మణుడని శాస్త్రములు అభివర్ణించడం జరిగింది.

- ఓం తత్ సత్

**హిందీ మూలము : వేదమూర్తి, తపోనిష్ఠ, యుగద్రష్ట, పండిత శ్రీరామశర్మ ఆచార్య**

**అనువాదం : శ్రీ డి.వి.యస్.బి. విశ్వనాథ్**

❃ ❃ ❃

# గాయత్రీ రామాయణము

వాల్మీకి రామాయణానికి మూలాధారము గాయత్రీమంత్రమేనని అందరూ ఎరుగుదురు. గాయత్రీ మంత్రానికి వ్యాఖ్య రూపంలో ఈ మహత్తరమైన గ్రంథ రచన జరిగింది.

వాల్మీకి రామయణంలో 24వేల శ్లోకాలు రాయబడ్డాయి. ఒక్కొక్క అక్షరానికి వ్యాఖ్యగా ఒక్కొక్క వెయ్యి శ్లోకాలున్నాయి. ఒక్కొక్క వెయ్యి శ్లోకాలపై ఒక్కొక్క అక్షరం యొక్క సంపుటీకరణ చేయబడిందని చెప్పవచ్చు.

ఈనాడు మనకు దొరికే వాల్మీకి రామాయణం యొక్క సంస్కరణలలో శ్లోకాలు సమానంగా లేవు. వాటిలో చాలా భేదం కూడా ఉంటుంది. మధ్యలో జరిగినఅంధకార యుగంలో, యవనుల కాలంలో చాలా శ్లోకాలు నష్టమై పోయినవని దీని వలన తెలుస్తుంది. ఇతర గ్రంథాల వలెనే కొన్ని శ్లోకాలను తీసివేయటం, కొన్నిటిని కలపడం కూడా జరిగి ఉండవచ్చు. రామచంద్రుడు మాంసం తిన్నాడని వ్రాయడం కూడా ఇటువంటి ప్రయోగమే. వారేమని రాశారంటే, వనవాసం చేస్తూ మునివలె జీవిస్తున్న రామచంద్రుడు, లక్ష్మణునిచే మాంసం వండించి సీతాసమేతంగా ఆరగించాడని, దీనిని నమ్మటానికి వీలులేదు.

ఈవిధమైన గడబిడలో శ్లోకాల సంఖ్య కూడా తప్పిపోయింది. ప్రతి ఒక్క వెయ్యి శ్లోకాల తరువాత గాయత్రీలోని ఒక అక్షరానికి సంపుటాన్నిచ్చి, మహర్షి వాల్మీకి దానిని తన గ్రంథంలో కలుపకుండా ఉంచాలనుకొన్నాడు. కాని ఉంచలేకపోయాడు. ఇప్పుడు మనకు సగమే సక్రంగా ఉన్న పుస్తకాలు దొరుకుతాయి. అక్కడక్కడా 5 లేక 6 శ్లోకాలే ఎత్తివేయబడి, కొన్నిచోట్ల కొన్ని వందల శ్లోకాలే ఎత్తివేయటం కనిపిస్తాయి.

ఇంత అయినప్పటికీ ప్రతివెయ్యిపైన గాయత్రీయొక్క ఒక అక్షరం ఉండటం వలన ఈ క్రమాన్ని ఆకస్మికం అనలేము. ఎందుకంటే మరే ఇతర గ్రంథంలోనూ ఈవిధంగా లేదు. తెలియకుండా ఇలాంటివి రాయలేరు. మహర్షి వాల్మీకి దీనిని బాగా అర్థంచేసుకొని వ్రాశాడు.

ఈ గాయత్రీ సంపుటానికి ఎన్ని రహస్యాలు, కారణాలున్నవో తెలియదు. అవన్నీ ఇపుడు తెలుకోవటం కష్టం. కాని ఆ సంపుట శ్లోకాన్ని పరిశీలిస్తే చాలా మహత్వపూర్ణమైనవని తెలుస్తుంది. వాటిలో చాలావరకు ఘటనాత్మకమైనవి ప్రతిపాత్రనూ, వార్తనూ, పరిచయమిస్తూ రచింపబడిన శ్లోకాలలోను బాగా పరిశీలిస్తే చాలా మహత్వ, పూర్ణమైన విద్యనేర్పే ప్రయత్నం కనిపిస్తుంది. ఆ విద్యను సక్రమపద్ధతిలో నేర్చుకొంటే మానవ జీవితం అసాధారణమయిన విశేషాలతో పరిపూర్ణమవుతుంది.

ఈ 24 అక్షరాల ముందున్న 24 శ్లోకాలను "గాయత్రీ రామాయణము" అంటారు. ఈ శ్లోకాల సంక్షిప్త రూపాన్ని, దానిలో దాగి ఉన్న మర్మాన్ని అర్థం చేసుకొని హృదయంలో భద్రపరచుకొంటే, ఆ మనిషి సంపూర్ణ వాల్మీకి రామాయణములోని సారాన్ని గ్రహించినవాడవుతాడు. ముందు ఆ 24 శ్లోకాల వివరణను చూద్దాము.

1. తపస్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరమ్
నారదం పరిప్రపచ్ఛ వాల్మీకిర్ముని పుంగవమ్ *(బాలకాండ–11)*

భావము : తపస్సు, స్వాధ్యాయము చేసే సర్వమునులలో ప్రథముడైన నారదుని తపస్వి వాల్మీకి అడిగినాడు.

ఈ శ్లోకంలో రెండు విషయములపై కేంద్రీకృతం జరిగింది. నారదునికి రెండు పదవులిచ్చి ఆ పదవులు ఇవ్వటానికి కారణంకూడా చెప్పబడింది. నారదుడు సర్వప్రధాన విద్వాంసుడు మునులలో శ్రేష్ఠుడుగా చెప్పబడినాడు. సర్వప్రధాన విద్వాంసుడు అతడని ఎందుకని చెప్పబడింది? నారదుడు వ్యాసునివలే 18 పురాణాలను రాశాడా? లేక ఇతర విద్వాంసులలో లేని విశేషతను ఏదైనా కనిపింపజేశాడా? అలా కాకపోతే మరి అతనిని సర్వశ్రేష్ఠ విద్వాంసుడని ఎందుకన్నారు? లేక నారదుడిని అత్యుక్తితో పొగడినందుకు వాల్మీకి అబద్ధాలాడేవాడా?

ఎందుకు అతడు సర్వశ్రేష్ఠ విద్వాంసుడుగా చెప్పబడ్డాడో ఆకారణం కూడా ఇదే శ్లోకంలో ఉన్నది. అదేశాస్త్ర చింతన. పుస్తకాలు చదివేవారు, జీవితమంతా పుస్తకాలు చదవడంలోనే గడిపినవారు ఒకరిని మించి ఒకరు చాలామంది ఉన్నారు. వేలకొలదీ పుస్తకాలు చదివిన వాడిని సర్వశ్రేష్ఠ విద్వాంసుడిగా చెప్పవచ్చా? కాదు. అలా చెప్పటానికి వీలులేదు. పుస్తకాలు చదవడంవల్ల అతనికి చాలా విజ్ఞానం రావచ్చు కాని ఆత్మిక విజ్ఞానం పెరగదు. వ్యక్తి కొన్ని శాస్త్రాలు చదివినా, వాని చింతనలోనే గడుపుతాడు. శాస్త్రం యొక్క అర్థంపై, ఆదేశంపై, మర్మంపై గంభీరతతో మననం, చేయటం తన ఆత్మాధ్యయనం చేయటం ఆత్మసాక్షాత్కారాన్ని పొందటం, ఇదే స్వాధ్యాయము యొక్క అర్థము. ఈ రకంగా శాస్త్రాలకు సేవ చేసిన వాడే సర్వశ్రేష్ఠ విద్వాంసుడు. అందువల్లే నారదుడు విద్వాంసులలో సర్వశ్రేష్ఠుడు.

రెండవ పదవి మునులలో శ్రేష్ఠుడని ఇవ్వబడింది. ఎందుకు చెప్పబడింది? దీని సమాధానం కూడా పక్కనేవున్నది. అదే "తపము". మననం చేసేవాడిని ముని అంటారు. అలాంటి మననం చేసేవారు చాలా మంది ఉన్నారు. కాని కేవలం మననం చేయటంవల్ల పనిజరుగదు. ఎవనిలో ఆదర్శం కోసం ఎన్ని పెద్ద కష్టాలైనా ఎదుర్కొగల సాహసం వుందో, ఆ తపస్వినే మునులలో శ్రేష్ఠుడు అంటారు. నారదుడు ఒక్కక్షణమైనా విశ్రాంతి లేకుండా తన ఉద్దేశ్య పూర్తికోసం ఇటూ అటూ తిరుగుతూ ఉంటాడు. లోకసేవకోసం తన జీవితాన్నంతటినీ అంకితం చేశాడు.

ఈశ్లోకంలో నారదుని అడ్డం వుంచుకొని స్వాధ్యాయము, తపస్సుల సర్వశ్రేష్ఠత వర్ణింపబడింది. గాయత్రీ రామాయణంలోని మొదటి శ్లోకం మనలను తపస్వులుగా స్వాధ్యాయశీలురుగా కావటానికి ఉపదేశిస్తుంది.

2. సహత్వా రాక్షసాన్ సర్వాన్ యజ్ఞఘ్నాన్ రఘునందన :
ఋషిభిః పూజిత స్తత్ర యథేంద్రో విజయే పురా (బాలకాండ 20/24)

అర్థము : యజ్ఞనాశకులైన రాక్షసులందరినీ రామచంద్రుడు వధించాడు . అసురవిజయంకోసం ఇంద్రుని పూజించిన విధంగా రాముని మునులు పూజించారు.

ఈ రెండవ శ్లోకంలో మూడు అర్థాలున్నాయి. (1) యజ్ఞ నాశకులను రాక్షసు లనడం (2) రాక్షసులను చంపడం (3) రాక్షసులను చంపటానికి వివేక శీలుర ద్వారా ప్రోత్సాహితుడవ్వటం.

ప్రజల సుఖశాంతులలో విఘ్నాలు ఏర్పరచేవారు, పుణ్యవిధానాన్ని వీడి పాప ప్రణాళికలను నడిపేవారు, లోకకంటకులైన రాక్షసులు, ప్రజలకు శత్రువులు. అలాంటి వారిపై అసహ్యాన్ని పెంచుకోవడం అవసరం. లేకపోతే వారు మన మంచితనాన్ని అర్థంచేసుకొని నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తారు. నిర్భయులై ద్విగుణీకృతోత్సాహంతో తమపని చేస్తారు. అందువల్ల సంఘవిద్రోహులు, దేశద్రోహులు లోకకంటకులు వంటివారిపైన మన తీవ్రదృష్టి ఉండాలి. ఇతరులను జాగ్రత్తగా ఉండేలా చేయాలి. అలాంటి పనులు చేసేవారిలో ఆ పనులంటే అసహ్యభావం పెంపొందించి వారిని సక్రమ మార్గంలో నడిపించాలి.

ఇలాంటివారికోసం రెండవ ఉపాయంవుంది. వారిని అణచి వేయటం, వ్యక్తిగతంగా బాగుచేయటం అనివార్యమైతే వారికి రాజ్యంద్వారా శిక్షవేయించాలి. విదేశ శాసనంవెళ్ళిపోయిన తర్వాత ఇప్పుడు ప్రభుత్వం ప్రజలకు ప్రతినిధిగా ఉంటుంది. అందువల్ల శిక్ష విధించే పని ప్రజల శిక్షణా సామర్థ్యం ప్రభుత్వంద్వారా వారిని అణచి వేయాలి, ఋషులు రాక్షసులను స్వయంగా చంపలేదు, విశ్వామిత్రుడు రామలక్ష్మణులను వెంటతెచ్చుకొని వారికి విలువిద్య నేర్పివారిద్వారా రాక్షసులను చంపించాడు, విశ్వామిత్రుడు

రాక్షసులను చంపగలడు. కాని ప్రజలద్వారా ప్రజలను చంపించటం ఉచితంగా భావించక రాజపుత్రులచే చంపించాడు. మనంకూడా దుష్టులను అణచి వేయటానికి ప్రభుత్వాన్నే ఆశ్రయించాలి.

మూడవ విషయం ఋషులద్వారా రాజ్యశక్తిని పూజించాలి. దుష్టులతో పోరాడే శక్తులపట్ల మన సహకారం వుండాలి. మనకు ఎవరితోనో, ఏకారణంవల్లగాని విరోధంవుంటే ఏదైనా అసంతోషం లేక ద్వేషం ఉన్నప్పుడు, రాక్షసత్వాన్ని అణచవలసి వచ్చినపుడు విరోధినికూడా పూర్తిగా సమర్థించాలి, సహకారంఇవ్వాలి, అసురత్వాన్ని నాశనం చేయాలి. సైద్ధాంతిక, వ్యక్తిగత విరోధాల అవసరం ఈ పరిస్థితిలో ఉండరాదు. వీరపూజ ఆచారం ప్రాచీనమైనది. ఇంద్రుడు మొదలైనవారిని అసుర విజయం కోసం పూజించటంకూడా ఉండేది. విఘ్నాలతో ముళ్ళవంటి అడ్డంకులతో, రాక్షసత్వంతో పోరాడే వారికి మన ప్రశంస, ప్రోత్సాహం, సహకారం ఇవ్వాలి.

3. విశ్వామిత్రః సరామస్తు శ్రుత్వా జనక భాషితమ్
- వత్సరామ ధనుః పశ్య ఇతి రాఘవమబ్రవీత్ *(బాలకాండ 68/12)*

భావము : రామునితోపాటు విశ్వామిత్రుడు జనకుని మాటలు విన్నాడు. ఆయన రామునితో వత్సారామా! ధనస్సుని చూడు అన్నారు.

ఈ కఠినమైనపని చాలామంది చేయలేక పోయినందువల్ల నావల్లకూడా కాదు, అనే భావంతో చాలామంది సుయోగ్యులు కూడా తమ ప్రతిభను మరచిపోతారు. హీనత్వం పొందుతారు. అలాకావడం మంచిదికాదు. చాలాసార్లు పెద్దవారు పూర్తి చేయలేని పనిని చిన్నవారు చేసిన సందర్భాలున్నాయి. విశ్వామిత్రుడు ఈ జంకు రామునికికూడా అంటుకుంటే సగంపని విఫలమవుతుందని తలచాడు. అందువల్ల ఉత్సాహపరుస్తూ రామా! ఆధనుస్సును చూడుఅన్నాడు.

మనం ఎదుర్కొనే కష్టాలను ఊహించుకుంటే వాటిరూపం భయపెట్టేదిగా ఉంటుంది. ఈకష్టాలు మనను ఏమిచేస్తాయో అనిపిస్తుంది. కాని మనిషి సాహసంతో వాటిని ఎదుర్కోవటానికి సిద్ధమైనపుడు కష్టాలే సరళమవుతాయి. ఎలాగంటే రామునికి ధనస్సు సరళమైనట్లు. ఊర్దూలో సామెత "హిమ్మతే మరదా మదదేఖుదా" అంటే సాహసవంతుడైన పురుషునికి ఈశ్వరుడు సహాయం చేస్తాడు. కష్టాలను చూచి వెనుకాడడం, భయపడటం, జంకటం కూడదు, దృఢత్వంతో వాటికి ఎదురు నిలవాలి. ఇదే ఈ శ్లోకం యొక్క భావం.

4. 'తుష్టా వాస్య తథా వంశం ప్రవిశ్య స విశాంపతేః
శతపీయం నరేంద్రస్య తదాసాద్య వ్యతిష్ఠత *(అయోధ్యాకాండ 25/6)*

**భావము :** రాజుగారి శయనాగారం వరకు ఆ సుమంతుడు నడచి వెళ్ళాడు. అక్కడ వారివంశాన్ని ప్రశంసించాడు.

మనం చేరలేని కఠినమైన స్థానాలను, అతన్ని పొగడినందున చేరగలము. రాజుగారి శయన మందిరంలోకి అందరినీ అంగీకరించరు. కాని సుమంతుడు అక్కడికి కూడా చేరుకున్నాడు. ఆయన వారి వంశాన్ని, అహంకారం లేని స్వభావాన్ని పొగిడాడు.

అహంకారము, కామము రెండూ ప్రపంచంలోని రెండు ప్రముఖ విలాసాలు, మనస్సుకు సంబంధించిన ప్రియ విలాసం ప్రశంస విని ప్రజలు మోహితులవుతారు. మంచి మరియు చెడ్డ ఫలితాలు రెండూ ఇవ్వగల ఇది ఒకరకమైన అస్త్రం వంటిది. సర్పాలు, మృగాలు సంగీత ధ్వనివిని ముగ్ధమైనట్లు, మనిషి ఆత్మప్రశంసవల్ల ముగ్ధుడవుతాడు.

ఈ శ్లోకంలో ప్రశంస యొక్క ప్రభావం వర్ణింపబడింది. ముఖ స్తుతికారులు, ధూర్తులు, మోసగాళ్ళు మొదలైనవారు అనుచిత ప్రశంస చేసి తమ మార్గాన్ని సుగమం చేసుకొంటారు. అనుచిత ప్రశంసవల్ల ఆనందించే వాని పరిస్థితి చెడుతుంది. అతను వారు పొగిడిన విధంగానే ఉన్నాను అనే భ్రమలో పడతాడు. తన చెడు పనులు కనిపించవు. మంచి పనులు బాగాపెద్దగా కనిపిస్తాయి. దానివల్ల అతని మనస్సు అజ్ఞానగ్రస్తం భ్రాంతము అవుతుంది. ఫలితంగా తన పనులనే తాను మరిచిపోతాడు. రాజులు, ధనవంతులు, ఆఫీసర్లు మొదలైన వారిలో ఈ విధమైన పొగడ్తలవల్ల ఉత్పన్నమయ్యే అనేక వికారాలు కనిపిస్తాయి.

కాని ప్రశంసను సదుపయోగంచేస్తే, ఉచితరీతిలో ఎవరిఉత్సాహమునైనా పెంపొందింప చేయటం. వారి వాస్తవిక గుణాలను మంచి రూపంతో తీసుకొని, వాటిని ఎక్కువ చేసే మంచి ఆలోచనతో ఉంటే అతనిలో ఉత్సాహము, ఆత్మబలము పెంపొంది ప్రశంసరక్షణతోనే చెడుతనాన్నించి బయటపడతాడు. తెల్లని బట్టలు వేసుకొన్న వ్యక్తి చాలాసావధానంగా ఉంటాడు. కూర్చునిలేచే సమయంలో బట్టలు మురికికాకుండా ఉండటానికి దానిపైనే ధ్యానం ఉంచుతాడు: కాని మురికి బట్టలే వేసుకున్న వ్యక్తికి అలాంటిబాధే ఉండదు. ప్రశంస స్వచ్ఛమైన దుప్పటి. నింద మురికిలాంటిది. మనం మన పరిచితులందరినీ తెల్ల బట్టలు ధరించేలా చేయాలి. దానివల్ల వారు నిత్యజీవనంలో సావధానంగా, ఆనందంగా ఉంటారు.

5. వనవాసంహి సంఖ్యాయ వాసాంస్యా భరణానిచ
భర్తారమను గచ్ఛన్త్యై సీతాయై శ్వశురో దదౌ (అయోధ్యాకాండ 40/25)

**భావము :** వనవాసం చేసే దినాలను లెక్కించుకొని, పతితో వెళ్ళే సీతకు దశరథుడు వస్త్రములు, ఆభరణాలు ఇచ్చెను.

భవిష్యత్తులో వచ్చే కష్టాలను దృష్టిలో ఉంచుకొని వాటి కోసం సముచితమైన ఏర్పాట్లు చేసుకోవటం ఈ శ్లోకంలోని రహస్యం, పూర్వకర్మముల ఫలస్వరూపం ఈనాడు మనకున్న పరిస్థితులు కాని ఇపుడు ఏదైనా మంచి ఏర్పాటే చేసుకోకపోతే భవిష్యత్తు అంధకారమయము. బుద్ధిమంతులైన మనుష్యులు భవిష్యత్తును గురించి ఆలోచిస్తారు. రాబోయే జీవితం సుఖశాంతులతో, ఆనందోల్లాసాలతో గడపటానికి, మంచిపనులు చేసి ఎక్కువ పుణ్యాన్ని ప్రోగుచేసుకుంటారు. అలాగే మనం కూడా చేయాలి.

**6. రాజా సత్యంచ ధర్మశ్చ రాజా కులవతాం కులమ్**
**రాజా మాతా-పితా చైవరాజా హితకరోనృణామ్ *(అయోధ్యాకాండ 67/35)***

రాజు సత్యం మాట్లాడేవాడు, ధర్మంచేసేవాడు, కులీనుడు, తల్లి దండ్రులతో సమానుడు మరియు మనుష్యులకు హితకారి.

రాజుద్వారా ప్రజల హితం కోసం సత్యాన్ని ఆధారం చేసుకొని నడిచే రాజ్యాన్ని సురాజ్యం అని, దాని నుంచి వేరుగా ఉండే రాజ్యాన్ని కురాజ్యమని అంటారు. ఈ శ్లోకంలో సురాజ్యం యొక్క ప్రశంస ఉన్నది. దాని శ్రేష్ఠతను తెలుపుతూ సురాజ్యంద్వారా నిర్ధారిత నియమాలను అనుసరించమని ప్రోత్సహిస్తుంది. ప్రతి ఒక్క సభ్యనాగరికుడి కర్తవ్యం, సమాజహితం కోసం రాజ్యనియమాలను ఈశ్వరుని, ధర్మం యొక్క ఆజ్ఞలతో సమానంగా పూజించాలి. దానిని ఆచరించాలి. రాజభక్తి అంటే దేశభక్తి, సమాజభక్తి అని తాత్పర్యం ఈ దేశభక్తి కోసం ఈ శ్లోకం ప్రేరణనిస్తుంది.

**7. వీక్ష్య సముహూర్తం తు దదర్శ భరతోగురుమ్**
**ఉటజే రామమాసీనం జటామండల ధారిణం *(అయోధ్యాకాండ 66/25)***

**భావము :** భరతుడు ఆ క్షణంలోనే జటాధారి యగు రాముని ఆకుటీరంలో కూర్చుని ఉండగా చూశాడు.

ఈశ్వరుని ఐశర్యము, పెద్ద వైభవంగల భవనాలు ఖజానాలు భండారాలలో కూడా ఉంటుంది. వైభవంగల ఈశ్వరుడు ప్రతి ఒక్క వైభవంగల, తళ తళలాడుతున్న ప్రతి పదార్థంలోనూ కనిపిస్తాడు. కాని ఈశ్వరుని సత్వగుణ స్వరూపమును, బ్రహ్మను జటాధారి, త్యాగమూర్తి యగురాముని దర్శించాలంటే ఆ కుటీరంలోనే దొరుకుతాడు.

మహాత్మాగాంధీ, దరిద్ర ప్రజలను దరిద్రనారాయణులని పిలిచేవారు. ఆయనకు ఈశ్వరుని ప్రతిబింబం వారిలోనే కనిపించేది., ఆ దీనుల గుడిసెలే భగవంతుని ఆలయాలుగా ఆయనకు కనిపించేవి. కుటీరం నిరాడంబరత, అపరిగ్రహత. త్యాగవృత్తికి ప్రతినిధిత్వం మొదలైన వాటిని ఎత్తిచూపుతుంది. ఎక్కడ ఈ గుణాలుంటాయో అక్కడ జటాధారి రాముడు మంచి శక్తులతో కూడిన బ్రహ్మయొక్క దర్శనం అవుతుంది.

భరతుడివలె సరళంగా, నిర్మలంగా సరళమైన అంతఃకరణ కలవారికి ఈ దర్శనం అవుతుంది. ఈ శ్లోకంలో ఈశ్వరుని పరిపూర్ణ ప్రతిబింబాన్ని స్పష్టీకరించటానికి కుటీరం, జటాధారి రాముడు, భరతుడు మొదలైన వారిని వాల్మీకి సహాయం చేసుకొన్నాడు. వివేకవంతుడైన వ్యక్తి తన దృష్టి కోణాన్ని భరతునివలె, తన అంతఃకరణను సరళత్వంగల కుటీరం వలె తయారుచేసుకున్నపుడు అతనికి జటాధారి రాముని అనుగ్రహం కలుగుతుంది. కిరీటధారి రాముని ఇతరులు కూడ చూడగలరు. ఆయన ప్రతిబింబం అయోధ్యలోని రాజభవనాలలో కనబడుతుంది. కాని జటాధారి రాముని ఇల్లు కుటీరం మాత్రమే.

8. యది బుద్ధిః కృతా ద్రష్టుమగ స్త్యంతం మహామునిమ్
అద్యైవ గమనే బుద్ధిం రోచయస్వ మహామతే (అరణ్యకాండ 11/43)

భావము : ఓ బుద్ధిమతి ! నీకు అగస్త్యుని దర్శించాలనే కోరిక ఉంటే, ఈరోజే వెళ్ళు.

అగస్త్యుడు కల్యాణము గురించి చెపుతాడు. బుద్ధిమంతుడైన వాడు కళ్యాణాన్ని దర్శించాలంటే, ఆత్మసాక్షాత్కారం పొందాలంటే ఈశ్వరుని పొందాలంటే అనగా ఏదో ఒక రకమైన భౌతిక మానసిక సఫలత్వం కావాలంటే, ఉద్దేశ్యపూర్తి కొరకు ఈ రోజే ప్రయత్నించవలసి ఉంటుంది. రేపటికోసం ఎదురుచూస్తే ఏ పని కానేరదు. ఎందుకంటే రేపు ఎప్పటికిరాదు.

వర్తమానం అన్నింటికంటే విలువైన సమయం. గడిచి పోయింది తిరిగి రానేరాదు. దానికోసం చింతించి, శోకించిన లాభంలేదు. జీవితం యొక్క అతివిలువైన పెట్టుబడులు, వర్తమానాన్ని చూపే గడియారాలు. వర్తమాన సమయాన్ని అత్యుత్తమమైన పనికి వినియోగించుటయే సమయం యొక్క సదుపయోగము. అనుకున్న పనిని ఆలస్యం చేయక, సమయాన్ని నాశనం చేయక వర్తమానంలోనే దాని కోసం ప్రయత్నం ఆరంభించాలి ఇదే ఈ శ్లోకంలోని భావం.

9. భరతస్యార్యపుత్రస్య శ్వశ్రూణాం మమ చ ప్రభో
మృగ : రూపమిదం దివ్యం విస్మయం జనయిష్యతి (అరణ్యకాండ 53/21)

భావము : భరతునికి, మీకు, నా అత్తగార్లకు దివ్య మృగ రూపంలో ఉన్న బొమ్మ విస్మయం కలుగ జేస్తుంది. దానిని సజీవంగా పట్టుకొనలేక పోయినా, ఏదో విధంగా సంపాదించండి దాని చర్మము చాలా సుందరమైనది.

అందరినీ అలరించే అందమైన పదార్థం పూర్తిగా దొరకక పోతే దానిలోని కొంతభాగమైన పొందటానికి ప్రయత్నించాలి. సద్గుణాలు మాత్రం మీలో ఎంత ఎక్కువ ఉంటే అంత మంచిది. పూర్తిగా ఉంటే అన్నిటికంటే మంచిది. కాని పురుషుడు

పరిపూర్ణమైన సదాచార సంపన్నుడు కాలేకపోతే ధైర్యం కోల్పోయి కూర్చోవటం కంటే చాలా చిన్న సఫలత లభించటానికైనా ప్రయత్నించటం మంచిది.

శిల్పము, సంగీతము, కళాకౌశలము, వ్యాయామము, ఉపన్యాసము, వక్తృత్వము, ఇతర భాషల జ్ఞానము ఇలాంటి ఎంత తక్కువ లభించినమా, ప్రపంచంలోనిఎన్ని ఇతర విషయాలలో ఎంత ఎక్కువ పరిచయం లభిస్తే అంతగా లాభిస్తుంది. "పూర్తిగా లేక కొంచెంకూడా లేదు" అనే దురాగ్రహపూరితమైన నీతి స్థానంలో "ఎంత దొరికితే అంత తీసుకో, ఇంకా ఎక్కువ కోసమై ప్రయత్నించు" అనే నీతిని నేర్చుకోమని ఈ శ్లోకం బోధిస్తుంది, "సర్వనాశే సముత్పన్నే అర్థం త్యజతి పండితః" లోని భావార్థం ఇదే.

10. గచ్ఛ శీఘ్రమితో వీర సుగ్రీవం చ మహాబలమ్
వయస్యం తం కురు క్షిప్ర మితో గత్వాద్య రాఘవ. *(అరణ్యకాండ 72/17)*

**భావము :** ఓ రాఘవా ! నీవు ఇక్కడ నుంచి వెంటనే సుగ్రీవుని వద్దకు వెళ్ళి త్వరగా అతనిని మిత్రుని చేసుకో.

బలవంతుని తనమిత్రునిగా చేసుకోవటంలో ఆలస్యం చేయరాదనే విద్య ఈ శ్లోకం చెపుతుంది. లోకవ్యవహారానికి బలము, బలవంతుల సహకారం చాలా అవసరం. దానివల్ల పెద్ద పెద్ద ఆపదల నుంచి తప్పించు కోవచ్చు. ఉన్నత శిఖరాల ద్వారాలు తెరవవచ్చు. స్నేహఫలం ప్రసిద్ధమైనది. మనకంటె బలవంతులతో స్నేహం చేసి వారి బలంలో కొంతభాగం పొందటం స్వాభావికమైనది. ఆధ్యాత్మిక రంగంలో కూడా ఇదే విషయం ఉంది. జీవాత్మ తనకంటే బలమైన దైవీశక్తులతో మైత్రికలుపుకొని దైవికలాభాలను పొందుతుంది. ఎవరికి ఎటువంటి వారి నుంచి లాభం పొందాలని ఉంటుందో, వారు అటువంటి వారితో స్నేహం చేసుకొని త్వరగా లాభాన్ని పొందగలరు.

11. దేశ కాలౌ భజస్వాద్య క్షీయమాణం ప్రియా ప్రియే
సుఖ – దుఃఖ సహః కాలే సుగ్రీవవశగో భవ *(కిష్కింధాకాండ 22/20)*

**భావము :** దేశాన్ని, కాలాన్ని అర్థం చేసుకో, ప్రియ, అప్రియాలను, సుఖ దుఃఖాలను భరించి సుగ్రీవుని ఆధీనంలో వుండు.

మనిషి ఎలాంటి స్థితిని కోరతాడో, ఎలాంటి కోరికలు కోరతాడో, అలాంటి స్థితి దొరకటం సాధ్యం కాదు. దేశకాలాల విచిత్రత కారణంగా, ప్రారబ్ధంకారణంగా మనిషి సౌకర్యంగాలేని కష్ట కారణమైన చోట్ల నివసించవలసి వస్తుంది. అలాంటి స్థితిని ధైర్యంగా సహిస్తూ వాటి నుంచి విముక్తుడవటానికి ప్రయత్నించాలి. ప్రియా ప్రియాలలో, సుఖదుఃఖాలలో మనిషి విచలితుడు కారాదు. మనస్సు స్థిరీకరించి, తన మానసిక స్వస్థతను చేకూర్చుకోవాలి.

12. వందిత్వాన్తత : సిద్ధాన్తపసాం వీత కల్మషా :
ప్రష్టవ్యా చాపి సీతాయా : ప్రవృత్తిర్వినయాన్వితై : (కిష్కింధకాండ 43/31)
భావము : నిష్పాపులకు, సిద్ధులకు తపస్వులకు నమస్కరించి వారిని వినయ పూర్వకంగా సీతను గురించి అడగాలి.

ఆత్మజ్ఞానం అనే విద్య ఎవరో ఒకరి దగ్గర నేర్చుకోరాదు. గురువు అంటే మనం అతని వద్ద మూడు గుణాలు ఉన్నవా లేవా అనేది ఆలోచించాలి. (1) నిష్పాపము (2) అనుభవం కలిగి సఫలత్వం ప్రాప్తించుట. (3) తపస్సంపన్నత. ఎవరిలో ఈ మూడు గుణాలు ఉంటాయో వారు విద్య నేర్పటానికి అర్హులు. పాపి, అనుభవహీనుడు. భోగపరాయణుడు అయిన వ్యక్తి ఎంత మాటకారి, పండితుడు అయినప్పటికీ అతని వద్ద విద్య నేర్వటంవల్ల పదభ్రష్టులు, మోసకారులు అయ్యే ప్రమాదం ఉంటుంది.

విశ్వసనీయుడైన, మార్గదర్శకుడు దొరికినపుడు, ఆయనకు ప్రణామంకావించి వినయపూర్వకంగా ప్రశ్నించాలి. ఈ రకంగా ఉచిత జిజ్ఞాసతో శిష్టాచారముతో, శిష్యభావంతో అడిగినపుడు అధికారులు, గురువులు మార్గం చూపుతారు. ఈ శ్లోకంలో ఆత్మజ్ఞాని అయిన గురువు లక్షణాలు, శిష్యులు అడుగవలసిన పద్ధతి గురించి చెప్పబడింది.

13. స నిర్జిత్య పురీం లంకాం శ్రేష్ఠాం తాం కామరూపిణీం
విక్రమేణ మహాతేజా హనుమాన్ కపిసత్తమ : (సుందర కాండ 41)
భావము : కపికులశ్రేష్ఠుడు మహాతేజస్వియైన హనుమంతుడు పరాక్రమంతో కామరూపిణియగు లంకను ఓడించాడు.

కామవాసనల రూపం లంక, చూపులను ఆకర్షింపచేసే స్వర్ణకాంతులతో నయనాభిరామంగా ఉంటుంది. దానిని గెలవటం కష్టంగా అని పిస్తుంది. ఈ కామవాసనగల స్వర్ణకాంతుల లంకలో అసురకులం వారు ఆనందంగా జీవిస్తుంటారు. అసురులు, ఆంతరిక శత్రువులు. తమ లంక క్షేమంగా ఉన్నంతవరకూ క్షేమంగా ఉంటారు. దానిని అర్థం చేసుకొన్న హనుమంతుడు లంకను జయించటం అవసరమని భావించాడు. తవ పరాక్రమంతో బ్రహ్మచర్యంతో శీల, సదాచార, సంయమాలతో ఆ స్వర్ణకాంతుల లంకను జయించాడు. అసురత్వాన్ని జయించాలంటే కామవాసనలను జయించాలి. ఈ విషయం బ్రహ్మచర్యం ద్వారానే సంభవము. హనుమంతుని వలెనే మనము కూడా చెడురూపమైన లంకను జయించ ప్రయత్నించాలి.

14. ధన్యా దేవా : సగంధర్వా : సిద్ధాశ్చ యే మహర్షయ :
మమ పశ్యంతి యే వీరం రామం రాజీవలోచనమ్ (సుందరకాండ 26/37)
భావము : నా రాజీవలోచనుడైన రాముని చూడగలిగినందుకు దేవతలు, గంధర్వులు, సిద్ధులు, ఋషిగణాలు ధన్యులు.

వారందరూ పరమాత్మను చూసారు. కాబట్టి వారు ధన్యులు: పరమాత్మ అందరికీ దగ్గరవాడు, వేరైనవాడు. నలువైపులా ఉండేవాడు. అతనినుంచి ఒక అంగుళపుభూమికూడా తప్పించుకొనలేదు. అయినప్పటికి మాయాగ్రస్తమైన వారందరూ ఆయనను చూడలేరు. పరమాత్మ తన నుంచి చాలా దూరముగా ఉన్నాడని అతనిని దర్శించుట, కలుసుకొనుట ఎంత కఠినమో తెలియదు కదా ! అని భావిస్తారు. వారు తమ గ్రుడ్డికళ్ళతో ఈశ్వరుని చూడలేక చెడు భావనలలో మునిగి ఉంటారు. ఎవరి దివ్యనేత్రాలు తెరుచుకొని ఉంటాయో, వారికి తమ నలువైపులా, అణువణువులో పరమాత్మ దర్శనం అవుతుంది. ఆ దివ్య ప్రతిబింబము వలన వారి అంతఃకరణ పరిశుద్ధమవుతుంది. సాత్వికకర్మస్వభావాల కస్తూరీసుగంధం వారిని చుట్టుముడుతుంది. అటువంటి దివ్యదర్శనభాగ్యులైన వ్యక్తులకు దేవగంధర్వులు, సిద్ధులు, ఋషులనే పదవులిస్తూ ఈశ్లోకంలో వారు ధన్యులుగా చెప్పబడింది.

15. మంగళాభిముఖీ తస్య తదాసీనమహా కపేః
ఉపతస్థే విశాలాక్షీ ప్రయతీ హవ్యవాహనమ్ (సుందరకాండ 53/27)

**భావము :** అప్పుడా సతీదేవి ఆ హనుమంతునకు శుభము చేకూర్పదలచినది. విశాలాక్షి అయిన సీత అగ్నిదేవుని స్తుతించింది

మంగళమయమైన కోరికల కోసం అగ్నిదేవుని పూజించటం వైదికరీతులతో ప్రసిద్ధమైనది. అగ్నిహోత్రము, హోమము యజ్ఞములతో పాటు, శుభకార్యాలు చేసేవారు. సదా సత్పరిణామాలు పొందుతారు. యజ్ఞాలమహిమ అసాధారణమైనది. వాటి ద్వారా రోగ ముక్తులు కాగలరు. వర్షము, పుత్రప్రాప్తి వంటి అనేక కోరికల నుంచి ఆత్మశుద్ధి వరకు పొందగలరు. ఇతరులకు మంగళము, అమంగళ విధానాలు కూడ అగ్నిపూజ ద్వారా కాగలవు.

అగ్నిని జీవన శక్తి అనికూడా అంటారు. జీవన శక్తి వృద్ధివలన మంగళమయమగుట తెలిసినదే. దేనిలో పర్యాప్తమైనంతవరకు వేడి, తేజస్వత ఉందో దానితో అన్నిరకాలైన మంచిపనులు జరుగుతాయి. క్రియాశక్తి ఎక్కువ ఉండటంవల్ల పనులు సఫలం అవుతాయి.

16. హితం మహార్థం మృదు హేతుసంహితం అతీతకాలాయతి సంప్రతిక్షణమ్
నిశమ్య యద్వాక్యము పస్థితజ్వరః ప్రసంగవానుత్తర మే తద బ్రవీత్
(లంకాకాండ 10/27)

**భావము :** మూడు కాలాలలో హితకారి, కోమలము, అర్థయుక్తమైన విభీషణుని వచనములు విని రావణునికి చాలా క్రోధం కలిగింది. ఆయన అన్నాడు.

ఈ వ్యక్తులకు ఏది ఉచితము, ఏది అనుచితమనే విషయాలు అర్థ విహీనంగా

కనిపిస్తాయి. అలాగే ఏది శుభప్రదము, ఏది అమంగళము అనేవి కూడా. వారికి తమ అహంకారము తమ స్వార్థము అన్నివైపులా ప్రతీతమవుతుంది. వారికి తమకు అనుకూలమైన మాటలను తప్పించి, ఇతరమైనవి లక్ష్యపెట్టే ఉద్దేశ్యం ఉండదు. రావణునిపై విభీషణుని హితకారి, కోమలమైన అర్థయుక్తమయిన మాటలు మంచి ప్రభావం ఇవ్వలేక పోయినాయి. పైగా కుపితుడై ప్రత్యుత్తరమివ్వబోయాడు.

"అంధేకే ఆగే రోవే అపనే నయనా ఖోవే" (గ్రుడ్డివాని ముందు ఏడ్చి తమ కళ్ళు పోగొట్టుకోవటము) అనే లోకోక్తిని ఈ శ్లోకం వచన రూపంలో చెప్పింది. మదోన్మత్తులైనవారికి ఇతరులు చెప్పే నీతులు సహించవు. వారికి చెప్పే మార్గము వేరేగా ఉంటుంది.

17. ధర్మాత్మా రాక్షస శ్రేష్ఠః సంప్రాప్తోయం విభీషణః
లంకా శ్రేయమిదం శ్రీ మాన్ధ్రువం ప్రాప్నోత్యకంటకం.

(లంకాకాండ 42/69)

భావము : రాక్షస శ్రేష్ఠుడు ధర్మాత్ముడైన విభీషణుడు వస్తున్నాడు. అతడు మాత్రమే శత్రువిహీనమైన లంకారాజ్యాన్ని ఉపయోగించుకోగలడు.

శాసకుని పరివారానికి గాని, వైభవయుక్తికి గాని, రాజ్యానికి గాని విరోధులు చాలామంది ఉంటారు. వారందరూ ధర్మాత్ములకు, దుష్టత్వంలేనివారికి, న్యాయానికి అపవాదుతెస్తూ ఉంటురు. కొంతమంది ఉన్నత స్థానంలో ఉన్నప్పటికీ, నేతృత్వం, శాసనం చేస్తూ, న్యాయమనే కళ్ళెమును తమచేతిలో ఉంచుకున్నప్పటికీ ఎవరికీ శత్రువులు కారు విభీషణునివలె న్యాయపూర్ణమైన దృష్టి ఉంటే మనం సర్వ ప్రియులం కాగలము, వారి హృదయాలపై శాసనం చేయగలము.

18. యో వజ్రపాతానల సన్నిపాతాన్న చుక్షుభం నాపి చచాల రాజా
రాజా సరామబాణాభిహతో భృశార్తశ్చచాల చాపం చ ముమోచ వీరః

(లంకాకాండం 59/39)

భావము : వజ్రపాతం, అగ్నిప్రహారం వంటివాటివల్ల చలించని రావణుడు. రాముని బాణాలకు చాలాబాధపడి, తానూ బాణాలు కురిపించాడు.

సాహసులు, యుద్ధవీరులు, యోధులైనవారు సాంసారిక బాధలను లక్ష్యపెట్టరు. గట్టిగా దెబ్బతిన్నప్పటికీ తమ పరాక్రమం చూపాలను కుంటారు. అలాంటి వీర ప్రవృత్తిగల వారికి కూడా రాముని బాణాలతో, అంతరాత్మ శాపాలతో వ్యధితులుకాక తప్పదు. అణగ ద్రొక్కబడిన ఆత్మ ఎపుడు ఆక్రందిస్తుందో జీవనధనాన్ని చెడుగా పాడుచేసే దుర్బుద్ధికి శాపం ఇస్తుందో, అపుడు అంతఃకరణం హాహాకారాలు చేస్తుంది. ఆత్మ తాడనం వలన పెద్ద పాషాణ హృదయం కూడా విచలితమవుతుంది.

తమ బాహుబలంతో మనుష్యులు, బలహీనులను సతాయిస్తారు. వారిని దోచుకొని, ఓడించి తమ విజయంపట్ల ఆనందిస్తారు. చిన్న చిన్న పరాక్రమాలపట్ల వారికి అభిమానముంటుంది. తమకంటె బలమైన ఒకశక్తి ఉన్నదని బలవంతులు గుర్తుంచుకోవాలి. అతని ఒకే దెబ్బతో శక్తులన్నీ హరించి పడవేయగల శక్తి ఉందని కూడ గుర్తుంచుకోవాలి. అందువలన ఈశ్వరుని కోపాన్ని, దండశక్తిని గుర్తుంచుకొని ఆచరించాలి.

19. యస్య విక్రమమాసాద్యరాక్షసా నిధనం గతాః
తం మన్యే రాఘవం వీరం నారాయణమపాతకమ్ (లంకాకాండ 72/11)

భావము : ఎవరి పరాక్రమంవల్ల రాక్షసులు చనిపోయారో, అలాంటి నిష్కల్మషవీరుడు, రాముడు ధన్యుడు.

ఆ వీరపురుషుని పరాక్రమం ధన్యమైనది. స్వయంగా పాపాలు చేయనివాడు, కషాయ-కల్మషాలను తరిమి కొడతాడు. స్వార్థం కోసం కొంతమంది పరాక్రమాన్ని చూపుతారు. పరాక్రమంవల్ల అహంకారులవుతారు. అలాంటివి సాధారణ వ్యక్తులలో కనిపిస్తాయి. తమ పరాక్రమాన్ని అసురత్వాన్ని నాశనం చేయటానికి, ఆ పరాక్రమాన్ని కొంచెం కూడ దురుపయోగం చేయకుండా ఉండటానికి ప్రయత్నం చేసేవారు, తమనుకొంతకూడా పాపపంకంలోకి జారనివ్వరు. పరాక్రమము, వీరత్వాలకు ఇదే శ్రేష్ఠతమము.

20. నతేదదృశిరే రామం దహన్తమపి వాహినీమ్
మోహితాః పరమాస్త్రేణ గంధర్వేణ మహాత్మనః (లంకాకాండ 94/26)

భావము : మహాత్ముడగు రాముడు దివ్యగంధర్వాస్త్రం ద్వారా రాక్షసులను మోహింపజేసాడు. అందువల్లవారు సైన్యాన్ని నష్టం చేస్తున్న రాముని చూడలేకపోయారు.

అజ్ఞానుల బుద్ధి, తమ సైన్యాన్ని ఎవరు నష్టం చేస్తున్నారో తెలియనంత విమోహితమవుతుంది. వారికి కష్టం ఎవరు కలిగిస్తున్నారనే విషయానికి కారణం వారికి తెలియదు. వారు తమశత్రువులు తమకు హాని కలిగిస్తున్నారని భావిస్తారు. కాని అసలు విషయం ఏమంటే, తమ అసత్ ప్రణాళిక ఫలించి విపత్తికి కారణం అవుతోందనేది. ఈశ్వరీ ప్రక్రియయల్ల ఆపాపాలే కష్టాలవుతాయి. అజ్ఞానులు తమ కష్టాలకు కారణం ప్రపంచ పరిస్థితులనుకుంటారు. కాని వారిపాపాలే వారి కష్టాలుగా రూపాంతరం చెందినవి అని వారికి తెలియదు. అదృశ్య ఈశ్వరుడు ఆపాపాలనే గంధర్వ బాణాలుగా మార్చి వారిపై ప్రయోగిస్తేవారు మూర్ఛితులవుతారు.

21. ప్రణమ్య దైవతేభ్యశ్చ బ్రాహ్మణేభ్యశ్చ మైథిలీ
బద్ధాంజలిపుటా చేదమువాచాగ్ని-సమీపతః (లంకాకాండ 119/23)

**భావము :** దేవతలకు, బ్రాహ్మణులకు సీత చేతులు జోడించి ప్రణామంచేసి అగ్నివద్దకు వెళ్ళిచెప్పింది.

సజ్జనులైన మనుషులు ఏ విషయాన్నైనా ప్రకటించే ముందు దేవతలకు బ్రాహ్మణులకు నమస్కరించి శ్రద్ధాపూర్వకంగా ధ్యానిస్తారు. ఈ కథనంవల్ల శ్రేష్ఠులందరూ ఏమంటారోనని వారు ఆలోచిస్తారు. ప్రపంచంలోని మూర్ఖులందరూ ఏదో ఒక విషయాన్నిఇష్టపడవచ్చుగాక, కొద్దిమంది దేవతలు, బ్రాహ్మణులు అంటే శ్రేష్ఠపురుషులు వానిని త్యజిస్తారు. అయితే ఆకార్యం నిజమైన మనుష్యులకొరకు త్యాజ్యమే అవుతుంది.

సత్వగుణముగల అంతఃకరణంగల మనుష్యులకు వైభవం ఎంతైనా ఉండవచ్చు. కానివారు బ్రహ్మకర్ములైన వ్యక్తులకు లొంగి ఉంటారు.

సీత అగ్నివద్దకు వెళ్ళి చెప్పింది. మనం ఏ విషయం చెప్పవలసి వచ్చినా, అంతఃకరణలో నివసించే జ్యోతిముందు నిలబడి చెప్పవలసి ఉంటుంది. మోసం, కపటం, అసత్యం మొదలైన లక్షణాలు గలవాణి ఈశ్వరునినుంచి దూరంగా ఉండేవారి నోటి నుంచే వెలువడుతుంది. అగ్నివద్దకు వెళ్ళి, మనస్సులోని జ్యోతిముందునిలబడివెళ్ళి మనం నోరువిప్పి మాట్లాడితే సత్యమే వెలువడుతుంది.

**22. చాలానాత్పర్వతాస్త్రైతే గణా దేవస్య కంపితాః**
**చచాల పార్వతీ చాపి తదాశ్లిష్టా మహేశ్వరమ్** **(ఉత్తరకాండ 13/26)**

**భావము :** పర్వతం చలించడంవల్ల శివగణాలు కూడా వొణికిపోయినవి. పార్వతీదేవి కూడా శివుడిని ఆలింగనం చేసికొన్నది.

ఆధారం విచలితంకాగానే దానిపై ఉన్న అన్ని ఇతర వస్తువులుకూడా చలిస్తాయి. అవి ఎంతపెద్ద వస్తువులైనప్పటికి. భూకంపంవల్ల భూమిపై నుండే ఇతరవస్తువులు తల్లక్రిందులవుతాయి.

మనిషి తన దృష్టికోణాన్ని ఒక విధంగా నిర్ధారితం చేసుకుంటాడు. దాని ననుసరించి భూమిపైని వస్తువులు, పనులు, ఘటనలు, పరిస్థితులు మంచిగా లేక చెడ్డగా అనిపిస్తాయి. కాని వెనుకటి దృష్టికోణం మారి, దాని స్థానంలో కొత్తరకమైన ఆలోచనల ప్రణాళిక వస్తే మొదటి రుచిమారిపోవటంవల్ల, అంతా మారిపోయినట్లు కనిపిస్తుంది. ఈరోజు ఒకవ్యక్తి లోభి, కపటుడుగా కనిపించితే దృష్టి మారిపోగానే అతడు ఉన్నత శ్రేణిలోని వాడిగా కనిపించవచ్చు. ఇలాగే ప్రవర్తన తల్లక్రిందులైతే లోభి త్యాగిగా మారవచ్చు. తాత్పర్యం ఏమంటే జీవన పరివర్తనానికి ముఖ్యకారణం, మనం నిలబడి ఆలోచించే విధానం.

ప్రపంచంలోని చాలామంది వ్యక్తులలో సామూహిక పరివర్తనం రావటానికి కారణం వారి దృష్టికోణంలోని మార్పే. మనం మనలన్ను మన సమాజాన్ని, ఎలా

పరివర్తనం చేయాలనుకుంటామో, అలాగే ఆతని దృష్టి, ఆలోచనా ప్రణాళిక, ఆధారాలను పరివర్తనం చేసుకొని తీరాలి. పర్వతం చలించటంవల్ల శివుడు, పార్వతి చలించారు. దృష్టి చలించటంవల్ల బాహ్యజీవనంలోని అన్ని భావాలు చలిస్తాయి.

23. దారాః పుత్రాః పురం రాష్ట్రం భోగాచ్ఛాదన-భోజనమ్
సర్వమేవావిభక్తంనో భవిష్యతి హరీశ్వర : (ఉత్తర కాండ 34/41)

**భావము :** వానరరాజా ! స్త్రీ, పుత్రులు; నగరము, రాష్ట్రము, భోగము, వస్త్రము, భోజనము మొదలైనవి మన అవిభక్త సంపత్తులవుతాయి.

సంపత్తిని, రాష్ట్రాన్ని , భోజనపదార్థాలను అవిభక్త మనిచెపుతూ ఈ శ్లోకం, వర్తమాన సమాజము యొక్క సిద్ధాంతాన్ని ప్రతిపాదించింది. ఈశ్వర ప్రసాదితమైన ఎంత సంపద ఇక్కడ వున్నదో, వాటిపై మానవులందరికీ సమానాధికారం ఉంది. ఈ సిద్ధాంతాలపైనే సమాజవాదం యొక్క శిల్పం మొత్తం చెక్కబడినది. సంపత్తిని పంచి తన వ్యక్తిగత అధికారం లోనికి తీసుకోవడమనేది ఈ శ్లోకంలో నిషేధింపబడింది. సమాజమును వ్యక్తులను, సమ్మిళితం చేయాలనే సమర్థన కూడా ఉన్నది. ఈ శ్లోకం సమాజవాద సిద్ధాంతానికి సూక్ష్మరూపము.

24. యామేవ రాత్రిం శత్రుఘ్నః పర్ణశాలాం సమావిశత్
తామేవ రాత్రిం సీతాపి ప్రసూతా దారకద్వయమ్ (ఉత్తరకాండ 65/1)

**భావము :** ఏరాత్రి శత్రుఘ్నుడు, వాల్మీకి ఆశ్రమం యొక్క పర్ణశాలకు వెళ్ళాడో, ఆరాత్రే సీత ఇద్దరుపుత్రులకు జన్మనిచ్చింది.

ఏరోజు శత్రువులను నాశనం చేసే ప్రేమ లోభము అనే మహలులను విడిచి. ఋషి భావనకు ప్రతీక అయిన, త్యాగరూపమయిన పర్ణశాలను చేరతాడో, అందులోనే ఆత్మరూపమైన సీత ఇద్దరు పుత్రులను ప్రసవించుతుంది. 1. లవుడనగా జ్ఞానము 2. కుశుడనగా కర్మ .ఎప్పుడయితే మానవుని నిస్వార్థ, నిర్మల ప్రేమ ప్రపంచంలోశత్రుత్వాన్ని నాశనం చేస్తుందో, అందరినీ తమవారలను కొని సద్భావనమధారణ చేస్తాడో, అప్పుడు స్వాభావిక ఫలితం ఎలా ఉంటుందంటే. ఆవ్యక్తి భోగసంగ్రహ వాసనలను త్యాగంచేసి సంయమం త్యాగం అనే నీతిని స్వంతం చేసుకొంటాడు. అదే శత్రుఘ్నుడు వాల్మీకి ఆశ్రమంలో ప్రవేశించడమనేది.

అలాంటి స్థితి ప్రాప్తించినపుడు ఆత్మలో సత్‌జ్ఞానం ప్రకాశిస్తుంది. అది సత్‌కర్మలలో లీనమవుతుంది. అదే సీత ఇద్దరు పుత్రులను ప్రసవించటమనేది. ఇదే ఆత్మకున్న రెండు ఉత్తమస్థితులు.

గాయత్రీ రామాయణంలోని వెనుకటి 24శ్లోకాలలో ధర్మం నీతి, సమాజం స్వాస్థ్యం, ఆధ్యాత్మికత మొదలైన రహస్యాల ఉద్ఘాటన జరిగింది. మార్గం చూపబడింది. ఈ చివరి శ్లోకంలో వాటిని ఆచరించటం వలన అంతిమస్థితిలో ఏపరిణామాలు కలుగుతాయో వివరించబడింది. చివరలో సీతకు ఇద్దరు పుత్రులు కలిగారు. ఆత్మ ఒడిలో సత్‌జ్ఞానము. సత్కర్మలు లభించిన వానికి హృదయమంతా ఆనందం నిండి ఉంటుంది, ఆ ఆనందానికి హద్దునెవడు నిర్ధారించగలడు ? ఈ పరమానందమే గాయత్రీ సిద్ధి

ఈ 24 శ్లోకాలను మహర్షివాల్మీకి తన అనుభవంతో, జ్ఞానంతో నింపివేశాడు. పైచెప్పిన పంక్తులలో ఆ రహస్యం వైపు వేలు చూపబడింది. విజ్ఞుడైన ఆలోచనాపరుడు ఈ 24 సూత్రాలలో దాగి ఉన్న రహస్యాలపై స్వతంత్రంగా ఆలోచించితే, వారికి అద్భుతమైన జ్ఞానరత్నాలు వాటిలో దొరుకుతాయి.

# గాయత్రీ హృదయము

ఈ గాయత్రీ హృదయమునే కొన్ని గ్రంథాలలో గాయత్రీ ఉపనిషత్తుగా గూడా పేర్కొన్నారు. ఉపనిషత్తులలో బ్రహ్మజ్ఞానమును గురించి అంటేతత్వజ్ఞానమును గురించి ఛర్చజరుగుతుంది. వాని వివేచనవల్ల ఆత్మ వివేచన. ఆత్మతత్వం అభిప్రాయి. ఆదృష్టిలో ఇది ఉపనిషత్తుగా భావించదగినదే.

ఇదేగాక గోపథ బ్రాహ్మణములో కొన్ని ఖండికలను తీసికొని గాయత్రీ ఉపనిషత్తుగా ప్రచురితమైనది. ఆవిధంగా రెండు గ్రంథాలు ఒకే పేరుతో ప్రసిద్ధిపొందటం జరిగింది. ఈలాంటి విషయంలో పొరపాటుపడకుండా ఒకదానికి గాయత్రీ ఉపనిషత్తని, దీనికి గాయత్రీ హృదయమని నామకరణం చేయబడింది.

అదే విధానాన్ని మేము అనుసరించాము. దీనిని గాయత్రీ హృదయమనీ. గోపథ బ్రాహ్మణంలో వర్ణింపబడిన ఖండికలను గాయత్రీ ఉపనిషత్తనీ పేర్కొన్నాము. అయినప్పటికీ గాయత్రీ హృదయాన్ని ఉపనిషత్తుగానే చెప్పుకోవచ్చు. ఇందులో మహత్వపూర్ణమైన తత్వ చర్చ జరిగింది.

**ఓం నమస్కృత్య భగవాన్ యాజ్ఞవల్క్యః స్వయం**
**భువం పరిపృచ్ఛతి. త్వం బ్రూహి బ్రహ్మన్ గాయ**
**త్ర్యుత్పత్తిం శ్రోతు మిచ్ఛామి. బ్రహ్మజ్ఞానోత్పత్తిం ప్రకృతింపరిపృచ్ఛామి.**

యాజ్ఞవల్క్యుడు బ్రహ్మను అడిగాడు. గాయత్రీ ఉత్పత్తి ఎటుల జరిగింది ? చెప్పండి అని. అది వినటానికి కోరిక కలగటానికి కారణం ఆఉత్పత్తి విజ్ఞానం పొందటంవల్ల బ్రహ్మజ్ఞానంగూడా ఉత్పత్తి అవుతుంది. దీనికి స్పష్టమైన తాత్పర్యం. గాయత్రీ ఉత్పత్తికి కారణమేమిటో అదే బ్రహ్మజ్ఞానోత్పత్తికి కూడా కారణం. ఒకే వస్తువునకు అవి రెండు పేర్లవంటివి. ఇందు ఒకదాన్ని తెలుసుకోవటంతో రెండవది దానంతట అదే అర్థం అవుతుంది.

శ్రీ భగవానువాచ !

ప్రణవేన వ్యాహృతిభిః ప్రవర్తతే తమసస్తు పరంజ్యోతిః.
కః పురుషః? స్వయంభూర్విష్ణురితి. సోఽపి సృజతి .అథ
తాన్వ్యక్యగుల్యా మథ్నాతి. మథ్యమానాత్ ఫేనోభవతి
ఫేనాద్బుద్బుదోభవతి. బుద్బుదాదండం భవతి. అండా
ద్వాయుర్భవతి. వాయోరగ్నిర్భవతి. అగ్నేరోం కారో భవతి.
ఓంకారాద్వ్యాహృతిర్భవతీ వ్యాహృత్యా గాయత్రీ భవతి
గాయత్ర్యా సావిత్రీ భవతి. సావిత్ర్యా సరస్వతీ భవతి. సరస్వత్యా
వేదాః భవన్తి. తస్మాల్లోకా ః ప్రవర్తన్తే.చత్వారో వేదా ః
సోపనిషద్సేతిహాసాః. సర్వేతే గాయత్ర్యా ః ప్రవర్తంతే
యథాగ్నిర్దేవానాం బ్రాహ్మణో మనుష్యాణాం మేరుఃశిఖరిణాం
గంగా నదీనాం వసంత ఋతూనాం బ్రహ్మ ప్రజాపతీనాం
ఏవమసాముఖ్యా. గాయత్ర్యా గాయత్రీ ఛందో భవతి

భగవానుడీవిధంగా వివరిస్తున్నాడు. ఓంకారంతో భూర్భువఃస్వఃతో ఆపరంజ్యోతికి సంబంధం ఉన్నది. ఆపరంజ్యోతి ప్రకృతి యందలి సత్వ. రజోగుణములను మాత్రమే స్పృశిస్తున్నది. తమోగుణానికి ఎల్లప్పుడూ దూరంగానే ఉన్నది. మొదటిది సత్వగుణము. దానిని ఉపాసించేవారిలో సత్వగుణ ప్రవృత్తి పెరుగుతుంది. దాంతోపాటు రజో గుణసంబంధమైన వైభవంగూడా కలుగుతుంది. ఎవని హృదయముందు ఆత్మజ్ఞానము. సంయమము. ఆదర్శధర్మము. సేవ. ఉదారత. ప్రేమ. ఆత్మీయత మొదలైన సాత్విక భావములు కలుగుతాయో వానికి బాహ్య జీవితంలో యజ్ఞము. ఐశ్వర్యము. సుఖము వైభవము. ప్రతిష్ఠ. స్వస్థత మొదలైన రాజస సమృద్ధిగూడ కలగడం సహజం. ప్రణవ. వ్యాహృతుల కలయికకూడా ఆత్మజ్ఞానము-సుఖశాంతుల కలయిక వంటిదే. ఎక్కడ ఆరెండూ ఉంటాయో అక్కడ దుఃఖము, దారిద్ర్యము-క్లేశము అసంతోషము, దైన్యము, హీనత, క్రూరత్వము, పాపము, పతనము వంటి తమోప్రధానలక్షణాలు నిలువజాలవు. ఎక్కడ ప్రకాశించే పరం జ్యోతివుంటుందో అక్కడ తమస్సు-అంధకారం నిలిబడలేవుగదా!

ఏజ్యోతిర్మయ పురుషునిగూర్చి ఏఅఖండజ్యోతిని గురించిపైన వర్ణింపబడినదో అది ఎవరు? అదియే నిజమైన పరమాత్మ. పరమాత్మ ప్రకాశస్వరూపుడు. ఎక్కడ పరమాత్మ యొక్క ఉనికి ఉంటుందో అక్కడ అజ్ఞానముయొక్క అంధకారము ఉండజాలదు. భగవద్భక్తుని అంతఃకరణం ఎల్లప్పుడూ జ్ఞాన జ్యోతితో ప్రకాశిస్తూ వుంటుంది.

సృష్టి నిర్మాణం ఏవిధంగా జరిగింది ? ఇప్పుడు ఈ ప్రశ్నపై విచారణ చేయబడుచున్నది. పరంజ్యోతియైన పరమాత్మ మున్ముందు జలాన్ని సృష్టించాడు. ఆజలమును వ్రేళ్లతో చిలకరించగా నురుగు వచ్చింది. నురుగునుండి బుడగలు వచ్చాయి. బుడగనుండి అండము అంటే పార్థివ పరమాణువు తయారయింది. పరమాణువు నుండి వాయువు తయారయింది. వాయువుయొక్క చలనం వల్ల పరమాణువులమధ్య సంఘర్షణ కలిగింది. ఆవేడిమివలన అగ్ని ఉద్భవించింది. అగ్నినుండి ఓంకారము అంటే శబ్దం ఉత్పన్నమైనది. శబ్దాన్నే ఆకాశమని గూడా అంటారు. ఈవిధంగా ఈశ్వరుని యిచ్ఛ వలన ఒక్కొక్కటిగా పంచతత్వములు తయారయ్యాయి. స్థూలసృష్టిలో పంచతత్వాలు ఏవిధంగా తయారయినవో అదేవిధముగా సూక్ష్మ చైతన్యానికి గూడా పంచకోశాలు తయారయ్యాయి.

రసమును జలమని పిలుస్తారు. రసముయొక్క గుణములు రుచి. అనుభూతి మొట్టమొదట రసస్వాదన చేసే భాగమే మనిషిలో పెరిగింది. దానివల్ల అనుభూతి కలిగి రసం వస్తుంది. స్థూల సూక్ష్మరంగాలలో రుచిని అనుభవించే శక్తి లేనివానికి చైతన్యత వికసించడం అసంభవం. అన్నిట్లోకీ మొదటి ప్రాణిజలము-పరిధానము ఆవరణము తయారు చేయబడింది. దానినే ఆనందమయ కోశమని పిలుస్తారు.

దానియొక్క మధనం జరిగింది. మధించడంవల్ల నురుగు వచ్చింది. నురుగునుండి బుడగలు వచ్చాయి. ఈ బుడగలతో పార్థివ పరమాణువు తయారయింది: అంటే దాని అనుభూతివల్ల. తన అభీష్ట వస్తువు కొరకు అన్వేషించటం వల్ల. మంథన జరిగింది. ప్రాప్త పదార్థముల యిచ్ఛనే ఫేనము (నురుగు) అన్నారు. ఇచ్ఛ అనేది పదార్థములను కల్పించింది. దాన్నే బుద్బుదము (బుడగ) అన్నారు. ఈ అన్వేషణ, కల్పనలతో పాటు రచింపబడిన (తయారుచేయబడిన) పార్థివ ఆవరణమును. ఆచైతన్య సృష్టియందు విజ్ఞానమయ కోశమని పిలుస్తారు.

అండమునుండి, అంటే పరమాణవువల్ల వాయువు వచ్చింది. వాయువు యొక్క అర్థము-గతి-విజ్ఞానము కోశముయొక్క సూక్ష్మతను కొంచెం అధికంగా స్థూలంగా, సఫలంగా చేయటానికి గతియొక్క అవశ్యకత ఉంటుంది. అది గతిమయము. పరమాణువుతో వాయువు తయారయింది. విజ్ఞానమయ కోశమునుండి మనోమయ కోశం తయారయింది.

వాయువుయొక్క రాపిడివల్ల అగ్నిపుట్టింది. అంటే మనస్సులోని సంఘర్షణ పెరిగిపోయింది. సూక్ష్మమును స్థూలములోనికి తీసుకురావటానికి. అప్రత్యక్షానుభూతిని. ప్రత్యక్షంగా అనుభవంలోనికి తీసుకురావటానికి సాధన సామాగ్రి కావాలి. యింద్రియాలు కావాలి. వానిద్వారా ప్రకృతియొక్క స్థూలపరమాణువులతో తనకుతాను సంబంధం

ఏర్పరచుకోవలసి ఉన్నది. ఈ అవశ్యకత అవిష్కారమును ఉత్పన్నం చేసింది. ఒక ఉష్ణతాగుణం కలిగిన. వికాసోన్ముఖమైన. క్రియాశీలమైన శరీరము ఉత్పత్తి అయింది. దానినే సూక్ష్మ శరీరము లేదా ప్రాణమయ కోశము అని పిలుస్తారు. మనస్సు బుద్ధి అహంకారములతోపాటు దశేంద్రియములు అగ్నిగుణం కలిగిన ప్రాణమయ కోశంలో వినిర్మితమయ్యాయి.

అగ్నివలన ఓంకారము. అంటే శబ్దము. అంటే అకాశము వచ్చింది. అది ఈశ్వరుని ప్రత్యక్ష నివాసస్థానము. బ్రహ్మాండము యొక్క బీజరూపమైన పిండముగా పిలువబడుతుంది. దీనినే స్థూల శరీరమని పిలుస్తారు. ఈ అన్నమయకోశము ధ్యానావస్థయందు ప్రకృతి యొక్క అంతరాళంలో నిరంతరం ధ్వనించే ఓంకార ధ్వనిని వింటుంది. ఓంకారము ఇందే ప్రకటితమవుతుంది. అందువలననే శరీరమును అన్నమయ కోశము (ఓంకారము) అనిపిలుస్తారు.

పంచతత్వములు, పంచకోశములు తయారైన తరువాత వాని విధివిధానములు నిర్ణయింపబడ్డాయి, పంచతత్వములుఎక్కడివరకూ పనిచేస్తాయి. పంచకోశమందు శరీరము ఎన్ని క్షేత్రములలో తన గతివిధులను భారీచేస్తుందీ. ఈ సీమయొక్క నిర్ధారణయే భూలోకము. భువర్లోకము స్వర్లోకములు. శరీరము భూలోకము. మస్తిష్కము భువర్లోకము. అంతఃకరణ స్వర్లోకము. అకాశము పాతాళము, పృథ్వి. ఈమూడు స్థూలలోకములుగా చెప్పబడినవి. దాంతోపాటు చైతన్య ప్రాణికొరకు మూడు వ్యాహృతులు అంతే నివసిస్తాయి. శరీరము మస్తిష్కము అంతఃకరణ వ్యాహృతి మయములు,

వ్యాహృతులనుండి గాయత్రి ఉత్పన్నమయినది. మూడు లోకములలో పనిచేసే మూడు రకాలైన శక్తులు ఉత్పన్నమైనవి. గాయత్రి కారణశక్తి. సావిత్రి సూక్ష్మశక్తి. సరస్వతి స్థూలశక్తి. ఒకే ఈశ్వరశక్తి భిన్నభిన్న స్థితులలో ఉన్నప్పుడు భిన్నభిన్న నామములతో పిలువబడుతుంది. జ్ఞానముయొక్క స్థూలశక్తిపేరు వేదము. అవేదశక్తి బ్రహ్మరూపమున అవతీర్ణమైనది. బ్రహ్మఆశక్తికి అవస్థితి రూపాన్నిచ్చి అందరకూ సులభసాధ్యమూ. ఉపయోగకరమూ అయేటట్లు నాలుగు భాగాలుగా విభజించాడు.

ఆ బ్రహ్మ వేదములతోపాటు లోకములనుగూడా తయారుచేశాడు. అంటే లోకములను వేదజ్ఞానమునందు సుసజ్జితం చేశాడు. ధర్మ,ధర్మ అర్థ. కామ. మోక్షచతుష్టయముగూడా జ్ఞానమయంచేశాడు. వేదముల యొక్క తథ్యములను (Facts) విస్తృతంగా ఉపనిషత్తులలోనూ, ఇతిహాసాలలోనూ గమనించవచ్చు. ఈ మొత్తమంతా గూడా గాయత్రీమయమే.

ప్రతియొక్క జాతియందునూ తరగతులయందును ఏ ప్రత్యేకత ఉన్నదో అది ప్రశంసనీయము. దానికి వైభవం ఉంటుంది. దాని మహత్వంవల్ల అజాతికి. లేదా తరగతికి గౌరవం కలుగుతుంది. దేవతలలో అగ్నికి. మనుష్యులలో బ్రాహ్మణునికి. పర్వతములలో సుమేరువుకు. నదులలో గంగకు. ఋతువులలో వసంతమునకు. ప్రజాపతులలో బ్రహ్మకు ఈవిశిష్టత కలిగింది. అదేవిధంగా ఛందములన్నిటిలో జ్ఞానములన్నిటిలో శక్తులన్నిటిలో గాయత్రి శ్రేష్ఠము. విశిష్టము.

కింవైభూః ? కింభువః ?కింస్వః కింమహః?
కింజనః ? కింతపః? కింసత్యం? కింతత్? కింసవితుః?
కింవరేణ్యం? కింభర్గః? కిందేవస్య? కింధిమహి?
కింధియః. కింయః. కింనః. కింప్రచోదయాత్ 3?
2 భూరితి భూలోకో భువఃఇత్యంతరిక్షలోకః
స్వరితిస్వర్లోకో. మహరితిమహర్లోకో. జనఇతి
జనలోకః, తపఇతి తపోలోకః. సత్యమితి సత్యలోక :.
భూర్భువ : స్వరితిత్రైలోక్యం. తదితితేజః యత్తేజః
సోగ్నిః సవితాదిత్యోఽయ వై రేణ్యం. అన్నమేవ
ప్రజాపతిః. భర్గఇత్యాపోవై భర్గః యదాపస్తత
సర్వదేవతాః. దేవస్యసవితుర్దేవా యః పురుషః
సవిష్ణుః, ధీమహీత్యైశ్వరం, యదైశ్వర్యం సప్రాణ
ఇత్యాధ్యాత్మం. దయాధ్యాత్మ్మ,తత్పరమంపదం.
తన్మహేశ్వరః, ధియఇతిమహీతి. పృథివీమహిం.
యోనః ప్రచోదయాదితికామః.
కామఇమాన్లోకాన్ ప్రచ్యావయతే. యోఽనన్యశంసో.
యోఽనన్యశంసః సపరోధర్మ ఇత్యేషావైగాయత్రీ 4

గాయత్రి యొక్క ప్రతిశబ్దాన్నీ ఏమిటి అనే విషయం చక్కగా తెలుసుకోవలసి ఉన్నది. ఒక్కసారిగా విహంగావలోకనం చేసినంత మాత్రాన తెలియదు ఒక్కొక్కశబ్దాన్ని గంభీరదృష్టితో ఆ శబ్ద గర్భంలో దాగియున్న అర్థాన్ని రహస్యాన్నీ వివేచనచేయాలి. అందుకుగాను ప్రతిశబ్దాన్ని గురించి ఒక్కొక్క ప్రశ్న వేయబడింది. భూఃఏమిటి? భువః ఏమిటి? స్వః ఏమిటి? తత్ ఏమిటి? సవితుః ఏమిటి? అని ప్రతియొక్క పదమును గురించి ఒక్కొక్క ప్రశ్న వేసి ప్రతిపదానికి సంబంధించి ప్రత్యేకంగావిచారణ జరపడం జరిగింది.

గాయత్రియొక్క సప్తవ్యాహృతుల, యితరశబ్దముల గురించి స్పష్టంచేయబడింది. దాని తాత్పర్యమేమిటి? అది ఈ విధంగాఅర్థం చేసుకోవాలి. భూఃపృథ్వీలోకము; భువః ఆకాశలోకము; స్వరి స్వర్గలోకము; మహః మహర్లోకము; జనః జనలోకము; తపః తపో లోకము; సతః సత్యలోకము; తత్ అంటే తేజము యొక్క తాత్పర్యం అగ్ని,, సవితా అంటే సూర్యుడు. వరేణ్యం అంటే అన్నము. అన్నము అంటే ప్ర.జాపాలనశక్తి. భర్గః తపస్సు. అంటే దేవశక్తుల సమూహము; దేవస్య సవితా దేవత; దేవపురుషుడు, విష్ణువు. ధీమహి ఐశ్వర్యము యొక్క ధ్యానం చేస్తున్నాము. ఐశ్వర్యము అంటే ప్రాణము. ఆధ్యాత్మ, పరమ పదము, మహేశ్వరుడు , యోనః ప్రచోదయాత్-కామము. ఏకామముయొక్క కారణమున లోక సంచాలనము జరుగుతుందో, అంటే చెడుపనులు సంహారంచేయాలనే అలోచనలు నృశంసములు అంటే గర్హితములు. సత్కర్మలను ప్రేరేపించే కామనలు గ్రాహ్యములు- తీసుకోదగినవి అవి. ఈ ప్రణాళికను పరిచాలనం చేయటం గాయత్రి యొక్క విశేషధర్మము. ఇదియే గాయత్రి యొక్క స్వరూపము

భూ, భువః, స్వః, మహః, జనః, తపః, సత్యం అనేవి ఏడులోకములు. ఈ ఏడులోకములను స్మరించడం యొక్క అవశ్యకత మనుష్యుడుతన సమస్యలవంక. కష్టములవంక, స్వార్థమువంక, లాంభమువంక, చూస్తూండే సంకుచితత్వము నుండి ఎదిగి విశ్వబ్రహ్మాండం వంకకుచూచి, దాని సమస్యలను తన సమస్యలుగాతెలిసి. విశ్వమానవుని యొక్క ఒక ఘటికుడుగా తన్నుతాను తెలిసి, ఆదృష్టితో పనులు చేయాలి.

తత్, సవితుః, వరేణ్యం, భర్గో, దేవస్య-ఈఐదు శబ్దములద్వారా తేజస్సు, వేడిమి, అన్నము, దివ్యత, పరమాత్మ-ఈ అయిదు అవశ్యకతలవైపు ధ్యానం నిగుడించే అవసరం, ఈ ఐదు పదార్థాలు జీవితంలోఅనివార్యమైన అవశ్యకతలు. వీనిని అధికాధికంగా సంచితం చేసుకోవటం అవసరం.తేజస్విత, ప్రతిభ, శాలీనత, పురుషార్థము, పరాక్రమము. ఈ తత్-శబ్దంలో యిమిడి ఉన్నాయి. వేడిమి. స్ఫూర్తి. పాచనశక్తి. నిరోగిత సుదృఢత- ఈ శబ్దాలు సవితతో సంబంధం కలిగినవి, అన్నము, వస్త్రము, పాలిచ్చే పశువులు, గృహిణి, సంతతి యితర సమస్తజీవనోపయోగ్య వస్తువులు వరేణ్య శబ్దములో యిమిడి ఉన్నాయి. దివ్యత. అనేక సద్గుణములు యోగ్యతలు, శక్తులు, సామర్థ్యము భర్గ శబ్దానికి సంబంధించినవి. గాయత్రి ధరించేటటు వంటివాడు ఈ అయిదిటిఅవశ్యకతను అనుభవిస్తాడు. తన పురుషార్థముతో దైవీసహాయతను జోడించి వానినిపొందుతాడు.

ధీమహి చెప్పేది-ధ్యానమునుగురించి. ఎవరినిగురించి ధ్యానము? ఆమంగళమయ పరమాత్మనుగూర్చి ధ్యానము-ఎవరిని హృదయమందు ధారణ చేయుటవలన వాని నియమముల ననుసరించి ప్రవర్తించుట వలన, అన్ని విధములైన సుఖశాంతులు

లభిస్తాయి. ఈశ్వరుని ఈ ధారణ పృథ్వియొక్క ధారణవలె నిశ్చితం కావాలని కోరుకోవాలి.

"యోనః ప్రచోదయాత్" లో కామనల వేపు సంకేతం చూపబడింది. మనుష్యుడు కామనలతో తయారుచేయబడినవాడు. కామనలు లేక అతడు లేడు. కామము అతని స్వభావము. కామనల కారణముననే ఇచ్ఛయొక్క కారణముననే ఈ ప్రపంచం నడుస్తున్నది. కాని మన కామము గర్హింపదగినవిగా ఉండకూడదు. స్వార్థము, లోలుపత, నిర్దయత భాగము మొదలైన నృశంసతులనుండి రక్షించుకుంటూ సేవించాలి. ధర్మమూలకములైన, అందరికీ ప్రయోజనకరమైన కోరికలు ఉండవచ్చు. అది గాయత్రి స్వరూపము, ఈ లక్ష్యమును స్థిరంగా ఉంచడం. ఈ మార్గాన చర్చిడం అనేవి గాయత్రియొక్క అసాధారణ ఉపాసన.

**కింగోత్రా? కత్యక్షరా? కతిపదా? కతికుక్షిః? కతిశీర్షా? 5**
**సాంఖ్యాయన గోత్రా. చతుర్వింశత్యక్షరావై గాయత్రీ, త్రిపదా, షట్కుక్షిః, పంచశీర్షా6**
**కేఽస్యాస్త్రయః పాదా, భవంతి? కా అస్యాః షట్కుక్షయః?**

**కానిచ పంచశీర్షాణి ? 7**
**ఋగ్వేదోఽస్యాః ప్రథమః పాదోభవతి, యజుర్వేదో**
**ద్వితీయః, సామవేద స్తృతీయః, పూర్వాదికా ప్రథమా**
**కుక్షిర్భవతి. దక్షిణాద్వితీయా, పశ్చిమా తృతీయా ఉత్తరా**
**చతుర్థీ, ఊర్ధ్వా పంచమీ, అధోఽస్యాః షష్ఠీ, వ్యాకరణ**
**మస్యాః ప్రథమం శీర్షంభవతి, శిక్షాద్వితీయం, కల్పస్తృతీయం,**
**నిరుక్తంచతుర్థం, జ్యోతిషామయనమితి పంచమమ్. 8**
**కింలక్షణా? కిం విచేష్టితం. కిముదాహృతా ? 9**
**లక్షణం మీమాంసా. అథర్వవేదో విచేష్టితం. ఛందో**
***విచితిఃఉదాహృతః 10***

**కోవర్ణః? కస్స్వరః? శ్వేతోవర్ణః, షట్స్వరః 11**

గాయత్రియొక్క గోత్రమేమిటి అనే ప్రశ్న యిక్కడ ఉదయించింది. ఎన్ని అక్షరములు? ఎన్ని పాదములు ? ఎన్ని కుక్షులు, ఎన్ని శీర్షములు-వీటికి జవాబులు-గాయత్రిది సాంఖ్యయన గోత్రము,-ఆత్మకల్యాణమునకు రెండు మార్గాలు-ఒకటి యోగము, రెండవది సాంఖ్యము-గీతలో ఈ రెండూ ఒకటేనని చెప్పబడింది. "యోగ సాంఖ్యౌపృథగ్బాలాః ప్రవదంతిన పండితాః" అని-యోగము అనాసక్తిని పెంచుకోమంటుంది. ప్రాపంచిక పదార్థములను త్యజించి, వానినుండి విముఖులై

ఆత్మను పొందుట యోగమార్గము. రెండవ మార్గము-ప్రాపంచిక పదార్థములను ఉత్సాహపూర్వకముగ ఏకత్రిత మొనరించి ఉదారంగా వానిని సన్మార్గంలో వ్యయంచేయటం. రెండవ మార్గమే సాంఖ్యమార్గము. గాయత్రిని సాంఖ్యాయనముని అని అంటే సాంఖ్యముయొక్క గృహమని అంటారు. ఆ సాంఖ్యాయన ప్రాధాన్యత జాటు జీవితం గడపటం గురించి సంకేత మీయబడింది. అది గాయత్రి గోత్రం. గాయత్రిలో 24 అక్షరాలున్నాయి. మూడు పాదాలున్నాయి, ఆరు కుక్షులున్నాయి. అయిదు శీర్షములున్నాయి. వాటి వివరణ యివ్వబడింది. ఋగ్వేదము, యజుర్వేదము. సామవేదము అనేవి మూడు పాదములు, వానిపై గాయత్రి నిలిచి ఉంటుంది. ఈ వేదములు ఆమెకు ఆధారములు, నాలుగవదైన అథర్వణవేదము ఈ మూడు వేదములకు వ్యాఖ్యామాత్రమే , ఆరుకుక్షులూ ఆరు దిక్కులు తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం, పైన, క్రింద-ఈ ఆరుదిశలలో అంటే సర్వత్రా గాయత్రి వ్యాపించియున్నది. అనిఅర్థము (శక్తి) వేదముయొక్క ఆరు అంగములు శీర్షములు. గాయత్రీ ఛందము యొక్క మిగిలిన అయిదు వేదాంగములైన వ్యాకరణము. శిక్ష, కల్పము, నిరుక్తము, జ్యోతిషము-పంచశీర్షములు ఈ వేదాంగములలో అంతర్గతంగా గొప్పభావన యిమిడి ఉన్నది. దానినే గాయత్రియొక్క శిరస్సులుగా అంటే మస్తకంగా అర్థంచేసుకోవాలి. గాయత్రీ శక్తి యందు వేదాంగముల యందున్న భావనలు విద్యమానమై ఉన్నాయి.(ప్రకాశిస్తున్నాయి)

ఇప్పుడు గాయత్రి యొక్క లక్షణమేమి? అనేది తెలుసుకోవాలి? చేష్ట తెలుసుకోవాలి. ఉదాహరణేమిటి అవి తెలుసుకోవాలి.మీమాంస అంటే విచారణ. గాయత్రియొక్క లక్షణము విచారణ. గాయత్రి మహాశక్తి ఆవిర్భవించిందా లేదా అనేది ఆవ్యక్తియొక్క ఆలోచనలను బట్టి గ్రహించవచ్చు. ఎవని అంతఃకరణమందు గాయత్రి అవతరించినదో, వాని ఆలోచనలలో మార్పు కనిపిస్తుంది. అతని ఆలోచనా, వివేచనలు, నిర్ణయములు ఒక ఆత్మశక్తి, సంపన్నశక్తియొక్క గౌరవమునకు అనుకూలంగా ఉంటాయి. అది గాయత్రి లక్షణము, లక్షణమునుబట్టియే ఒక వస్తువు యొక్క అస్తిత్వం గుర్తుపట్టు వీలవుతుంది. గాయత్రి యొక్క మనుగడయొక్క లక్షణము గాయత్రీ సాధకుని ఉన్నతాలోచనా పరిశీలిబట్టి గ్రహించాలి. గాయత్రి యొక్క చేష్ట అథర్వణ వేదంగా చెప్పబడింది. ఆథర్వణవేదంలో వ్యావహారికజ్ఞానం ఉన్నది. శిల్పకళ, రసాయనశాస్త్రము విజ్ఞానము, చికిత్స, కామశాస్త్రము మొదలైన వ్యవహారిక జీవనంలో ఉండే విద్యలు ఆధర్వణవేదంలో వర్ణింపబడ్డాయి. గాయత్రి ఎక్కడ ఉంటుందో అక్కడ ఆథర్వణవేద సంబంధమైన చేష్టలు కనిపిస్తాయి. పరిశ్రమలు, ప్రయోగాలు, ఉత్పాదన, నిర్మాణము, కళాకౌశలము, వ్యవస్థ, పరివర్తన, గ్రహణము, విసర్జన (పట్టువిడుపు) మొదలైన చేష్టలు ప్రయత్నరూపంలో పరిరక్షితమవుతాయి. అభీష్టప్రాప్తి కొరకు ఎక్కడ ప్రచండ ప్రయత్నం జరుగుతున్నదో. అది గాయత్రి చేష్ట అని తెలుసుకోవాలి.

గాయత్రియొక్క ఉదాహరణ ఛందము. ఛందము అంటే పదార్థము. అక్షణ-చేష్టలతో అంటే అలోచన, కర్మలలో అభీష్టపదార్థం లభిస్తుంది. అందుకు సందేహంలేదు. ఉదాహరణ అంటే నమూనా. గాయత్రి స్థితి ఎలా ఉంటుంది? అనేదానికి ఉదాహరణ, ఉత్తమోత్తమ పదార్థములను, పరిస్థితులనుచూచి చెప్పబడిన విషయము-తెలిసిగానీ. తెలియకగానీ గాయత్రి కృపగల్గినచోట బాహ్యవాతావరణము శ్రేష్ఠతతో పరిపూర్ణమై ఉంటుంది

ఇప్పుడు తెలుసుకొనవలసిన విషయములు-గాయత్రి వర్ణమేమిటి? స్వరమేమిటి? అని. వర్ణము తెలుపు. సత్వగుణము యొక్క శుభ్రతయొక్క. ఉజ్వలతయొక్క, పవిత్రతయొక్క ప్రతీక, స్వరములు ఆరు, హ్రస్వము, దీర్ఘము, ప్లుతము, ఉదాత్తము, అనుదాత్తము స్వరితము అవి. ప్రతిఒక్క స్వరమునకూ విజ్ఞానము మహత్తున్నాయి. శబ్దముయొక్క శక్తి అనంతము. శబ్దముద్వారా కలిగే కంపనవల్ల సృష్టియందు వివిధరకాలైన వాతావరణం తయారవుతుంది. ఈ ఆరు స్వరములూ, ధ్యానముయొక్క ఆరు భేదములు. వీనిద్వారా పంచతత్వములు, సూక్ష్మ చతుర్వింశతి (24) తత్త్వములు, వీనియందు గతియొక్క సంచారం కలుగుతుంది. దీనినిగురించి గాయత్రీ మహావిజ్ఞానమందలి తృతీయభాగంలో విస్తృతంగా వర్ణింపబడింది. ఇక్కడ మనం తెలుసుకోదగిన విషయం ప్రపంచముయొక్క సంపూర్ణప్రయత్నము ప్రేరణ నిచ్చేటటువంటి అన్నిస్వరములూ గాయత్రియందు యిమిడి ఉన్నాయి, ఈ రహస్యం తెలిసిన సాధకుడు ఏరాగం పాడినా, వాయించినా మనోరంజకమైన పరిణామం కలిగి తీరుతుంది.

**పూర్వాభవతి గాయత్రీ, మధ్యమా సావిత్రీ, పశ్చిమా**
**సంధ్యాసరస్వతీ, రక్తా గాయత్రీ, శ్వేతా సావిత్రీ.**
**కృష్ణా సరస్వతీ.12**

**ప్రణవే నిత్యయుక్తాస్యాద్వ్యాహృతిషుచ**
**సప్తసు. సర్వేషామేవ పాపానాం సంకరే సముప**
**స్థితే. శతసాహస్రమభ్యస్తా గాయత్రీ పావనంమహత్.13**

**ఉషఃకాలే రక్తా మధ్యాహ్నే శ్వేతాఽపరాహ్నే కృష్ణా.**
**పూర్వసంధి బ్రాహ్మీ, మధ్యసంధి మాహేశ్వరీ, పరా**
**సంధి వైష్ణవీ. హంసవాహినీ బ్రాహ్మీ, వృష వాహినీ**
**మాహేశ్వరీ, గరుడవాహినీ వైష్ణవీ.14**

**పూర్వాహ్నే కాలే సంధ్యా గాయత్రీ, కుమారీ, రక్తాంగీ రక్త**
**వాసా త్రినేత్రా పాశాంకుశాక్షమాలా కమండలు కరా**

**హంసారూఢా ఋగ్వేద సహితా, బ్రహ్మదైవత్యా,**
**భూర్లోకవ్యవస్థితాదిత్యపథ గామినీ.15**
**మధ్యాహ్నకాలే సంధ్యాసావిత్రీ యువతీ శ్వేతాంగీ**
**శ్వేతవాసాస్త్రినేత్రాం పాశాంకుశ త్రిశూలడమరుహస్తా**
**వృషభారూఢా యజుర్వేదసహితా రుద్రదైవత్యాభువ**
**ర్లోక వ్యవస్థితాదిత్యపథగామినీ.16**
**సాయాహ్నకాలే సంధ్యాసరస్వతీ, వృద్ధా, కృష్ణాంగీ,**
**కృష్ణవాసాస్త్రినేత్రా, శంఖ చక్ర పద్మహస్తా, గరుడారూఢా**
**సామవేదసహితా, విష్ణుదైవత్యా స్వర్లోక వ్యవస్థితాదిత్య**
**పథగామినీ.17**

గాయత్రిని మూడు పేర్లతో పిలుస్తారు. ఆరంభావస్థలో గాయత్రి, మధ్యావస్థలో సావిత్రి. అంత్యావస్థలో సర్వతి. ప్రారంభము,తారుణ్యము, పరిపక్వత అనేమూడు భేదాల కారణంగా ఒకే శక్తి కి మూడు పేర్లు ఇవ్వబడ్డాయి. గాయత్రియొక్క కాంతి ఎరుపు,సావిత్రి తెలుపు, సరస్వతి నలుపుగా, మసకగా ఉంటుంది. సూర్యుడు శ్వేతవర్ణం కలిగి ఉన్నా ఉదయం ఎర్రగా, మధ్యాహ్నం తెల్లగా, సాయంత్రం మసకగా కనిపించినట్లే సాధనాకాలంలో సాధకునకు తన స్థితిని అనుసరించి ఈ మూడు వర్ణములు ధ్యానావస్థయందు కనిపిస్తాయి. గాయత్రి ఎల్లప్పుడూ ప్రణవంతోకూడి ఉంటుంది. ఉచ్చారణ ఎల్లపుడూ ఓంకారంతో ఉండితీరాలి. సాధరణ సాధనలోనూ, వివేచనలోనూ, మూడు వ్యాహృతులు ప్రయోగింపబడతాయి. కాని బ్రహ్మవివేచనకొరకు. ఉపనిషద్విజ్ఞానము కొరకు ఏడు వ్యాహృతులు ప్రయోగింప బడాతాయి. సర్వపాపములు గుట్టపడి ఉన్నప్పటికీ. శతసహస్ర గాయత్రీ (లక్ష) మంత్రజపంతో నశించిపోతాయి. లక్ష అని సాధరణంగా చెప్పినా అందులో సూక్ష్మరహస్యం యిమిడి ఉన్నది. శతము అంటే నిశ్చిత భావము. సహస్రము అంటే సహస్రమందు-బ్రహ్మరంధ్రమునందు గాయత్రిని ధారణచేసే అభ్యాసం చేయటంవల్ల పాపాలు దూరమౌతాయి. నిశ్చిత విధిలో షట్చక్ర భేదనముచేసి బ్రహ్మరంధ్రంవరకూ గాయత్రిని నడిపించేవిధి గాయత్రీమహావిజ్ఞానమందలి ప్రధమ భాగంలో వర్ణింపబడింది. ఆసాధన వలన సాధకుడు అగ్నిలో పుంట పెట్టబడిన సువర్ణములె పాపరహితుడౌతాడు. "శత సహస్ర" అనే పదంలో ఆసాధన సంకేతం యివ్వబడింది.

పూర్వసంధ్య అంటూ ప్రాతఃకాల సంధ్యను బ్రాహ్మి అని పిలుస్తారు. ఆమె సింహవాహిని, కుమారి, రక్తవర్ణ, రక్తవస్త్రధారిణి, త్రినేత్రములు కలది, పాశ, అంకుశజపమాలా,

కమండలమును ధరించునది. ఋగ్వేద సహిత, బ్రహ్మదైవత్య భూలోకమందు నివశించునది. సూర్యపథమునుండి గమనము చేయునది.

ఇప్పుడు మనం అవసరమైన అలంకారిక వర్ణనయందలి గూఢ రహస్యాన్ని విచారిద్దాము. ప్రాతఃకాలమును బ్రహ్మ ముహూర్తమని పిలుస్తాం. ఆసమయంలో బ్రహ్మత్వం విశేషంగా ఉండటంవల్ల గాయత్రి బ్రాహ్మిగా పిలువబడుతుంది. హంస ప్రాణానికి సంకేతం. హంసారూఢ అంటే ప్రాణం మీద ఆసీనయైనది. బ్రాహ్మి గాయత్రిప్రాణంమీద విశేష ప్రభావాన్ని కలిగి ఉంటుంది. కుమారి అంటే అర్థం బాల్యచాపల్యం (చంచలత్వం) కలది అని అర్థం. రక్తము గతిశీలతకు, వికాసవిద్యుత్తుకు ప్రతీక. ప్రాతఃకాలగాయత్రియందు గతిశీలతయొక్క వికాసవిద్యుత్తుయొక్క సంచారం గౌణంగా ఉంటుంది. అందువలన ఆమె రక్తాంగీ, రక్తవసనా అయింది. త్రినయనీ- మూడు దృష్టులు కలది-మూడు లోకములను దృష్టిలోనుంచుకొన్నది- శరీరాన్ని, మస్తిష్కాన్ని అంతఃకరణనూ గూడా చూచేది. పాశము-అంటే-బంధనము. అంకుశము అంటే నియంత్రణ. అక్షమాల అంటే శబ్దమాతృకలు, కమండలము-అంటే - ధారణ, ఋగ్వేదము-అంటే జ్ఞానము. బ్రహ్మదైవత్య-అంటే-బ్రహ్మయొక్కదైవీశక్తి. ఈలక్షణాలన్నీ గుణములతో, సాధనతో, సంపన్నమైనందున ప్రాతఃకాలమందు గాయత్రి తన సాధకునిపై ఈ ఉపచారములనన్నిటినీ ప్రయోగిస్తుంది. అతడు ఈ సాధనలన్నిటివలన తపించి బ్రహ్మ భూతుడు కాగలుగుతాడు. బ్రహ్మగాయత్రి భూలోక నివాసిని. ఆమె వలన ఈ భూలోకంలోని ప్రాణులన్నిటికీ ఎక్కువ ఉపయోగం కలుగుతుంది. భూలోకమంటే శరీరమనిగూడా అర్థం. బ్రాహ్మిగాయత్రి శరీరాన్ని గూడా స్వస్థంగా ఉంచుతుంది. ఆమెసూర్యగామిని. సూర్యుడు ఏవిధంగా తన తేజోవంతమైన కిరణములతో మనుష్యుని విశేష రూపంలో ప్రభావితం చేస్తాడో ఆదేవిధంగా గాయత్రియొక్క శక్తులు గూడా పనిచేస్తాయి. సూర్యుని కిరణములు ప్రాతఃకాలమునందలి గాయత్రీ శక్తిని పలువిధాల పోలి ఉంటాయి.

ఇప్పుడు మధ్యాహ్న గాయత్రీ లక్షణాలను గమనిద్దాం. ఆమె సావిత్రీనామము కలిగిఉంటుంది. యువతి, శ్వేతాంగి, శ్వేతవస్త్ర, త్రినయన, పాశ, అంకుశ, త్రిమాల - డమరువులను కలిగిఉంటుంది. వృషభారూఢ - యజుర్వేదసహిత, రుద్రదైవత్య, భువర్లోకస్థిత, సూర్యపద్రగామిని. ఇందులో కొన్ని విశేషాలు బ్రాహ్మిని పోలిఉన్నవి. త్రినయన, పాశాంకుశధర - సూర్యపథగామిని. ఈ నాలుగూ యింతకుముందే వివరించబడినవి. తక్కిన లక్షణాలను విచారణచేద్దాం. యువతి=ప్రౌఢ, వికసిత = పరిపుష్టస్థిర, సుదృఢ, శ్వేతవర్ణ= ప్రకాశవతి, విస్తృత, వ్యాపించినది. వెలుగుతోకూడినది. పరిపుష్టస్థిర, సుదృఢ, తన పూర్ణావస్థలో నున్న తేజస్సుతో ప్రకాశించే గాయత్రిని

శ్వేతవర్ణంగా శ్వేతవస్త్రగా వర్ణించారు. సవితా- సూర్యునితో సమానమైన తేజస్సును కలిగియున్నందున ఆమెకు సావిత్రియని పేరు. త్రిశూల ధారిణీ అంటే మూడు రకాల దుఃఖాలను అజ్ఞానము, అభావము, అశక్తత, వీటిని తన చేతిలో అంటే తన పిడికిలిలో ఉంచుకున్నది. అంటే ఈ మూడు శూలములూ ఆమె నియంత్రణలో ఉన్నవి. డమరు ధ్వని ప్రతీక. వృషభము ధర్మమునకు ప్రతీక. తరుణయైన సావిత్రి ధర్మముపై ఆసీనమై యున్నది. యజుర్వేదము కర్మకాండకు ప్రతీక. ఆమె కర్మవైపు ప్రేరేపిస్తుంది. రుద్రదైవత్యా = భయంకర ఉగ్ర, దివ్య శక్తులను కలిగియున్నది. భువర్లోకంలో నివసించేది. భువః అంటే మానసలోకం. మస్తిష్కము, విచారము, తర్కము, బుద్ధి, వీనిని శుభ్రం చేస్తుంది.

ఇప్పుడు సంధ్యాకాల మందలి గాయత్రీ లక్షణాలను గమనిద్దాం. ఆమె సర్వతి అనే పేరు గలది. వృద్ధ కృష్ణాంగీ, కృష్ణావస్త్రా, త్రినేత్ర, శంఖ, చక్ర, గద, పద్మములను చేతులయందు ధరించినది. గరుడారూఢ, సామవేదసహిత, విష్ణుదైవత్య, స్వర్లోక నివాసిని, సూర్యపథగామిని, త్రినయని అంటే మనకు యింతకు ముందే తెలుసు. స+రస+వతి=సరస్వతి; సరసతను కలిగినది, సంగీతము, కళలు, కవిత్వము యితర సూక్ష్మ రసములలో నిర్ఝరిణి, (ప్రవహించేది) కాబట్టి పరిపక్వమైన సాంధ్య కాలీన గాయత్రిని సరస్వతి యని పిలుస్తారు. వృద్ధా అంటే పరిపక్వమైన, సంపూర్ణంగా వికసించిన, కృష్ణవర్ణామసకగా ఉండేది. మిశ్రమవర్ణం కలది. పాదరసం తెల్లగా ఉంటుంది. గంధకం పచ్చగా ఉంటుంది. ఈవిధంగా బ్రహ్మ తెల్లగా ఉంటే, ప్రకృతి పసుపుపచ్చగా ఉంది. రెండింటి కలయికవల్ల నలుపు వస్తుంది. రాముడు, కృష్ణుడు నల్లగా ఉండడానికి కారణం ఇదే. సాంధ్యకాలీన గాయత్రియందు బ్రహ్మ-ప్రకృతుల సమ్మిశ్రణము వలన నలుపురంగు కలది. నల్లని వస్త్రములను ధరించినదిగా చెప్పబడింది. సరస్వతి చేతులలో నాలుగు వస్తువులున్నాయి. శంఖము అంటే వాణి, చక్రము=తేజస్సు, గద=వినాశము, పద్మము అంటే వైభవము. ఈ నాలుగు శక్తులూ సరస్వతి ఆధిపత్యంలో ఉన్నవి. గరుడుడు అంటే క్రియ. గతశీలత అని అర్థం. సరస్వతి యొక్క కార్యక్షేత్రము ఆలోచనలకే పరిమితముకాక క్రియాశీలతనుగూడా కలిగిఉన్నది. సామవేదమంటే బాహ్యగానము. విష్ణువుయొక్క సేవకులు దివ్యశక్తులకు ప్రాతినిధ్యము వహించినందున ఆమె విష్ణుదైవత్యగా చెప్పబడింది. స్వర్లోకము అంటే హృదయము; అంతఃకరణ. సరస్వతి వీణాతంత్రులను మీటుతూ ఉంటుంది. అంతఃకరణ యందు వివేకమును జాగృతం చేస్తుంటుంది.

పైన బ్రహ్మ, సావిత్రీ, సరస్వతీ వివేచన చేయబడింది. అవి కసిత, వికసిత, పరిపుష్ట అనే భేదములతో మూడు రూపములు చెప్పబడినవి. వీనిని ప్రాతః, మధ్యాహ్న,

సంధ్యాకాలీనములుగా వర్ణింపబడినవి. ఈ మూడు భేదముల వలన సాధకునకు ఏ శక్తుల ఆవశ్యకత ఉన్నదో ఈ మూడు శక్తుల (గాయత్రి, సావిత్రి,సరస్వతి)లో ఒక దానిని ఎన్నుకునే అవకాశం ఉన్నది.

"కాన్యక్షర దైవతాని భవంతి" 18

ప్రథయ మాగ్నేయం, ద్వితీయం ప్రాజాపత్యం, తృతీయం సౌమ్యం, చతుర్థ మైశానం, పంచ మాదిత్యం, షష్ఠంబార్హస్పత్యం , సప్తమం భర్గదైవత్యం, అష్టమం పితృదైవత్యం, నవమమర్యమణం, దశమం సావిత్రం, ఏకాదశం త్వాష్ట్రం, ద్వాదశం పౌష్ణం, త్రయోదశమైంద్రాగ్న్యం, పంచదశం వామదేవ్యం, షోడశం మైత్రావరుణం, సప్తదశం బాభ్రవ్యం, అష్టాదశం వైశ్వదేవ్యం, ఏకోన వింశతికం వైష్ణవ్యం, వింశతికం వాసవం, ఏకవింశతికం తౌషితం, ద్వావింశతికం కౌబేరం, త్రయోవింశతికం ఆశ్వినం, చతుర్వింశతికం బ్రహ్మ ఇత్యక్షర దేవతాని భవంతి.19

గాయత్రి యందలి 24 అక్షరములకు దేవతలెవరు? దీనికి జవాబిస్తూ "తత్" కు దేవత అగ్ని యని "స" కు ప్రజాపతియని "వి" కి సోముడని, "తుః" కుఈశానుడని, "వ" కుఆదిత్యుడని, "రే" కి బృహస్పతియని, "ణి" కి భర్గుడని, "యం" కు పితరులని, "భ" కు అర్యముడని, "గో" కు సవితయని , "దే" కి త్వష్ట్రయని, "వ" కు పూషయని, "స్య" కు ఇంద్రుడు-అగ్నియని, "ధీ" కి వాయువని, "మ" కు వామదేవుడని, "హి" కి మిత్ర-వరుణులని, "ధి" కి వభృవని, "యో" కు విశ్వేదేవతయని, "యో" కు విష్ణువని, "నః" కు వసువులని, "ప్ర" కు తుషితుడి, "చో" కు కుబేరుడని, "ద" కు అశ్వినీ కుమారులని , "యాత్" కు బ్రహ్మయని చెప్పబడినది.

ఈ దేవతలు ప్రతి ఒక్క అక్షరమునకు శక్తులు. ఈ శక్తులకు గాయత్రియందలి అక్షరములు ప్రాతినిధ్యం వహిస్తున్నాయి. ఈ మహామంత్రంతో పాటు శక్తులు సాధనయందు అవిర్భవిస్తాయి.

—ద్యౌ మూర్ధాగ్ని రంగలోష్టే, అలాటే రుద్రాఃభ్రువౌ
మఘః, చక్షుషో శ్చంద్రాదిత్యౌ, కర్ణయోః శుక్ర
బృహస్పతీ. నాసికే వాసుదైవత్యే, దంతౌష్ఠావుభయ
సంధ్యే, ముఖమగ్నిం, జిహ్వే సరస్వతీ గ్రీవా సాధ్యాను
గృహీతాః స్తనయోర్వ సవః భాహ్వోర్మరుతః, హృదయం
పర్జన్యాకాశ సుందరం, నాభి రంతరిక్షం, కటి రింద్రాగ్నీ,
జఘనం ప్రాజాపత్యం, కైలాస మలయావూరూ, విశ్వదేవా
జానునీ, జహ్నుకుశికౌ జంఘాద్వయం,

**ఖురా : పితరాః, పాదౌవవన్పతయః అంగుళయో**
**రోమాణి, నఖాశ్చ ముహూర్తాస్తేఽ స్థి గ్రహో కేతుర్మాసా**
**ఋతవః సంధ్యాకాలం స్తథా చ్ఛాదన సంవత్సరో వినిష**
**మహోరాత్రి ఆదిత్యశ్చంద్రమా. 20**

గాయత్రిని ఒక మనుష్యాకృతిగల దేవిగా భావస్తే, ఆమె అంగ, ప్రత్యంగముల యందు వివిధ దేవీశక్తులు స్థాపింపబడి ఉన్నాయని తెలుసుకోవాలి. గాయత్రిని మనుష్యాకృతిలో ధ్యానించినప్పుడు అమెను దివ్యరూపమున ధారణ చేయాలి. గాయత్రియొక్క అంగ. ప్రత్యంగములయందు ఏశక్తులు నివసిస్తున్నవో వానిని గూడా సాధకుడు ధ్యానించాలి. సాధకుడు తనకుతాను గాయత్రీ శక్తితో ఓత్రప్రోతముగా కలసి పోయినట్లు అనుభవం పొందాలి. అప్పుడు మాత్రమే తాను వాస్తవంగా ఆశక్తులతో ఓతప్రోతం కాగలడు. ఏ దేవీశక్తులు గాయత్రీ అంగ ప్రత్యంగముల యందు నివశిస్తున్నవో అవియే నా అంగ ప్రత్యంగముయందు నివసిస్తున్నాయనే భావన కారణంగా సాధకుడు తన ఉపాస్యదేవతకు చెందిన జాతిలో చేరిపోతాడు. దేవతకై దేవతల ఉపాసన చేయాలని చెప్పబడింది. దైవీశక్తులు నా అంగ ప్రత్యంగముల యందు ప్రకాశిస్తున్నవన్న భావన ఆత్మ శ్రేష్ఠత యొక్క సంచారమును కలుగజేస్తుంది ఆత్మస్థితిని దేవీ ఉపాసనకు యోగ్యంగా చేస్తుంది. ఇప్పుడు గాయత్రి యొక్క అంగ ప్రత్యంగములయందున్న దైవీశక్తులను చూద్దాం.

గాయత్రి మస్తకంలో స్వర్గం, లలాటంలో రుద్రుడు, కనుబొమ్మలందు మేఘములు, రెండు కళ్ళలో సూర్యచంద్రులు. రెండు చెవులలో శుక్ర-బృహస్పతులు, రెండు నాశికారంధ్రములలో వాయువు. దంతోష్ఠము అందు ఉభయ సంధ్యలు, ముఖమందు అగ్ని, జిహ్వయందు సరస్వతి, కంఠమందు సాధ్యగణములు, రెండు భుజములయందును మరుద్గణము,స్తనములందు వసుగణములు, హృదయమందు పర్జన్యుడు. ఉదర మందు ఆకాశము, కటియందు ఇంద్రాగ్ని, జఘనమందు ప్రజాపతి, ఊరువునందు కైలాస-మలయ పర్వతములు, జంఘలయందు జహ్ను కుశికలు, అరికాళ్ళలో పితృగణములు, చరణములయందు వనస్పతిగణములు, అంగుళులయందు రోమములయందును. నఖముల యందును ముహూర్త గ్రహ, ధూమకేతు, మాస, ఋతు, సంధ్యలు; అచ్ఛాదన, సంవత్సర, వర్ష, దిన, రాత్రి, సూర్యచంద్రులు గాయత్రి యొక్క రెప్పపాట్లు.

**సహస్ర పరమాంధేవీం శతమధ్యాం దశావరాం**
**సహస్ర నేత్రాం గాయత్రీం శరణమహంప్ర ప్రద్యే.**
**ఓం తత్స వితుర్వ రేణ్యాయ నమః. ఓం తత్పూర్వ**
**జపాయనమః. ఓంతత్ ప్రాతరాదిత్య ప్రతిష్ఠాయనమః**

సాయమధీయానో దివసకృతం పాపం నాశయతి ప్రాత
రధీయానో రాత్రికృతం పాపం నాశయతి తత్సాయం
ప్రాతరధీయానో పాపోఽపాపో భవతి. 23
యఇదం గాయత్రీ హృదయం బ్రాహ్మణః పఠేత్
అపేయపానాత్ పూతో భవతి, అభక్ష్య భక్షాత్
పూతో భవతి. గురుతల్ప గమనాత్ పూతో భవతి
అపంక్తి పావనాత్ పూతో భవతి. బ్రహ్మ హత్యాయః
పూతోభవతి, బ్రహ్మచారీ సబ్రహ్మచారీ భవతి, ఇత్యనేన
హృదయే నాధీతేనక్రతుః, సమ్యగిష్టో భవతి, షష్టి
గాయత్ర్యా, శత సహస్రాణి జప్తాని భవతి అష్టౌ
బ్రాహ్మణాన్ సమ్యగ్ గ్రాహ్యేత్ అథసిద్ధిర్భవతి. 24
ఇదం బ్రాహ్మణో నిత్య మధీయతే సర్వైః పాపైః ప్రముచ్యతే
ఇతి బ్రహ్మలో కే మహీయతే ఇత్యా హ భగవాన్
యాజ్ఞవల్క్యః. 25
"ఇతి గాయత్రీ హృదయం సంపూర్ణం"

ప్రతిదినం సహస్ర గాయత్రీ జపం చేయటం మంచిది . అంత చెయ్యలేకపోతే శత గాయత్రీ అయినా చేయాలి. అంతమాత్రం గూడా చేయలేకపోతే కనీసం పదిసార్లయినా చేయాలి. గాయత్రి సహస్ర నేత్రములు కల్గినది. వేలాది నేత్రములున్నవి. ఆమె అంతటా పరికించి చూడగలదు. ఆమె దృష్టినుండి దాచగల్గిందేమీ లేదు. సర్వత్ర దర్శియైన ఈశ్వరీయశక్తిని సర్వ వ్యాపకంగా గ్రహించి తన ఆలోచనలను ఆచరణను దివ్యంగా మాత దృష్టిలో ఉచితంగా ఉత్తమంగా, ధర్మమయంగా ఉండేటట్లు చూచుకోవాలి. తన ఆచరణను , వ్యవహారమును శ్రేష్ఠంగా ఉంచుకోవటమే గాయత్రి యొక్క శక్తి భక్తిపూర్వకంగా దేవమాత శరణజొచ్చినవాడే నిజమైన సాధకుడు.

"ఓం తత్స వితుర్వరేణ్యం" ఇత్యాది పదములు గల్గిన మంత్రములకు నమస్కారము, వానిద్వారా మాత సాక్షాత్కరిస్తుంది. "ఓం తతః" మొదలైన శబ్దములతో పాటుచేయబడే పూర్వ జపమునకునమస్కారము. ఎందుకంటే ఆ జపమువలన ఆత్మ-బ్రహ్మ ప్రాప్తి కలుగుతుంది. ఓం తత్సహిత ఆదిత్య భగవానునకు నమస్కారము. ఎందు కంటే ఆయన ప్రకాశముతో, ప్రేరణతో మార్గమందు ప్రగతి కలుగుతుంది.

సాయంకాలం గాయత్రిని పఠించడంవల్ల పగలు చేసిన పాపాలు నశిస్తాయి. ఉదయం గాయత్రీ పఠనంవల్ల రాత్రి చేసిన పాపాలు నశిస్తాయి. ఉదయం-సాయంత్రం

పఠిస్తున్న పాపికూడా నిష్పాపి కాగలడు. మద్యపానము, తినగూడని పదార్థములను తినటం, అజ్ఞానంలో మునిగి ఉండటం, దొంగతనం చేయటం, వ్యభిచారము, బ్రహ్మహత్య, దురాచారము మొదలైన పాపములనుండి నివృత్తి కలుగుతుంది. అని భగవాన్ యాజ్ఞవల్క్యులు చెప్పారు.

పఠనముతో నిష్పాపి కావటంలో రహస్యం శ్రద్ధా విశ్వాసములతో ఈ మహాబ్రహ్మ విద్య యొక్క వివేచన, చింతన మననము చేయడం వల్ల వివేకం జాగృతమవుతుంది. మనుష్యునకు పాపముయొక్క నిరర్థకత. పుణ్యముయొక్క సార్థకత తెలిసి వస్తాయి. ఫలస్వరూపంగా అతడు మార్గమునుండి విరక్తుడై సన్మార్గంలో నడవడం తన నీతిగా మార్చుకుంటాడు. అంతఃకరణయందు నిండియున్న అజ్ఞానాంధకారమును బహిష్కృత మొనరించు జ్ఞాన ప్రకాశమును ధరిస్తాడు. పూర్వం చేసిన పాపములకు ప్రాయశ్చిత్తం జరుగుతుంది. భవిష్యత్తులో పాపాలు చేయనని ప్రతిజ్ఞ చేస్తాడు. అట్టిస్థితి కలిగిన అటి స్థి కలిగినతరువాత కొత్తగాపాపాలు చేయటం మానివేస్తాడు ప్రారబ్ధవశమైన పాపం నిదానంగా నశిస్తుంది. ఈవిధంగా కొద్దికాలంలోనే పాపరహితుడు కాగలడు. చెడు బుద్ధిని పరిత్యజించటం పాపనాశము యొక్క వాస్తవిక కారణము. ఈ బ్రహ్మజ్ఞానముయొక్క పాఠము. చింతన, మననము వలన కలిగిన శ్రేయస్సు ఈ పాఠముయొక్క మననము వలనగూడా చెప్పబడింది. ఈ విధంగా పఠనము వలన పాపనివృత్తి వర్ణింపబడింది.

"గాయత్రీ హృదయము" నందు విస్తృత తత్వజ్ఞానము నిండి ఉన్నది. దాన్ని చక్కగా హృదయగమం చేసుకోవటం వల్ల ఆత్మ యందు గొప్ప ప్రకాశం నింపబడుతుంది. అందువల్ల అరువది లక్షల గాయత్రీమంత్ర జపం చేసినంత హృదయశుద్ధి కలుగుతుంది. ఈ "గాయత్రీ హృదయ" మందు వర్ణింపబడిన తత్వ జ్ఞానమును హృదయగమం చేసుకోవటంవల్ల వచ్చిన పుణ్యఫలంతో తులతూగేది ప్రపంచములో మరేది లేదు.

# గాయత్రీ పంజరము

ఏదైనా ఒకవస్తువును గూర్చి ఆలోచించుటకు దాని ఆకారము మన మనః క్షేత్రమున ఉండవలెను. ఏ ఆకారము లేకుండగ ఏదైన ఒక విషయమును గూర్చి ఆలోచించుట మనస్సుకు అసంభవము. మనస్సు మొదట ఒకానొక వస్తువు యొక్క ఆకారమును నిర్ణయించుకొనును. ఇది దాని ప్రక్రియ. తరువాత దానిని గూర్చి కల్పనా శక్తి పని చేయును. సముద్రమును ఎవ్వడు చూచియుండక పోవచ్చు. కాని సముద్రమును గూర్చి ఆలోచింపసాగినచో ఒక పెద్ద జలాశయము యొక్క ప్రతిమూర్తి మనఃక్షేత్రమున తప్పక ఉండును. భాషా శాస్త్రమునకు ఆధారము ఇదియే. ప్రతి శబ్దమునకు వెనుక ఒక ఆకారము ఉండును. 'కుక్క' అను శబ్దమును ఉచ్చరించినంతనే ఒక ప్రాణి విశేషము యొక్క ఆకారము ఎదుటికివచ్చును. అప్పుడు 'కుక్క' శబ్దమును తెలిసికొనుట సార్థకమగును. తెలియని విదేశీ భాషను ఎవడైన మన ఎదుట పలికినచో దాని శబ్దములు మన చెవిలో పడును. కాని పక్షుల కోలాహలమువలె ఆ శబ్దములు నిరర్థకము లగును. ఏభావము మనస్సున ఉదయించదు. కారణమేమనగా ఆ శబ్దమునకు వెనుక ఉండు ఆకారము మనకు తెలియదు. ఆకారము ఎదుటికి రానంత వరకు దానిని గూర్చి ఆలోచించుట మనస్సునకు అసంభవమగును.

ఈశ్వరుని గూర్చిగాని ఈశ్వరీయ శక్తులను గూర్చిగాని తెలిసికొనవలెనన్న ఇదియే పద్ధతి. వానిని సూక్ష్మమనిగాని లేదా స్థూలమనిగాని భావింపవచ్చును. నిరాకారమనిగాని లేదా సాకారమనిగాని తలంపవచ్చు. ఈవిధములగు దార్శనికములైన మరియు శాస్త్రీయములైన చిక్కులలో పడుటవలన మనస్సుకు ప్రయోజనము ఉండదు. దానివలన ఈ దిశగా ఏమాత్రమైన ఆలోచింప దలచినచో ఏదైన ఒక ఆకారమును నిర్మించి వాని యెదుట నిలబెట్ట వలసి వచ్చును. లేనిచో అతడు ఈశ్వరుని గురించిగాని లేదా ఆయన శక్తిని గురించిగాని ఏమాత్రము ఆలోచింపలేడు. ఈశ్వరుని నిరాకారుడుని తలంచువారు గూడ నిరాకారమునకు సంబంధించిన ఒకానొక ఆకారమును ఏర్పాటు చేసి కొందురు. అవి ఆకాశము వంటి నిరాకారము, ప్రకాశమువంటి తేజోమయము, అగ్నివంటి వ్యాపకము, పరమాణువుల వంటి అదృశ్యములు కావచ్చు. చివరకు ఏదో ఒక

ఆధారమును ఆ నిరాకారమునకు సంబంధించిన - దానిని స్థాపించు కొనవలెను. ఆకారమును ఏర్పాటు చేసికొనవంతవరకు మనో బుద్ధి చిత్తములతో దానికి ఏమాత్రము సంబంధము ఏర్పడదు.

ఈ గొప్ప సత్యమును మనస్సులో ఉంచుకొని నిరాకారుడు, అచింత్య బుద్ధికి అగమ్యమగు వాక్కుకు అతీతుడునగు పరమాత్మ యొక్క సంబంధమును మనస్సుతో పెట్టుకొనుటకు భారతీయులైన ఆచార్యులు ఈశ్వరుని ఆకారములను నెలకొల్పిరి. ధ్యానమునకై సుందరములు దివ్యములు నగు ఇష్టదేవతా ప్రతిమలను నిర్మించెరి. వానితో పాటు దివ్యములైన ఆయుధములను, దివ్యములైన వాహనములను, దివ్యములైన గుణములను, దివ్యములైన స్వభావములను మరియు శక్తులను కల్పించిరి. ఇట్టి ఆకారములను భక్తితో ధ్యానించుటవలన సాధకుడు వానితో ఐక్యము చెందును. పాలు నీరువలె సాధ్యసాధకులు కలియుదురు. భ్రమరము ఒకకీటకమును తీసికొనివచ్చును. దానిచుట్టు ధ్వని చేయుచు తిరుగును. కీటకము దాని ధ్వనిని వినుచు తన్మయత్వము చెందును. చివరకు దాని ఆకారము గూడ మారిపోవును. ఆ కీటకము భ్రమరమగును. దివ్యకర్మ స్వభావము కలిగిన దేవతాకారమును ధ్యానించు మన్నచో సాధకుని యందును ఆ దివ్య శక్తులు ఆవిర్భవించును. రేడియో యంత్రమును కేంద్రముగా చేసికొని సూక్ష్మాకాశమునందు ఎగురుచు తిరుగు వివిధములగుధ్వనులను వినగలుగునట్లు ధ్యానములో దేవతామూర్తిని కల్పించుట ఒక ఆధ్యాత్మికమగు రేడియోను నెలకొల్పుటయే యగును. దాని కేంద్రము ద్వారా సూక్ష్మజగత్తులో సంచరించు వివిధములైన ఈశ్వరశక్తులను సాధకుడు పట్టుకొనగలుగును. ఈ సిద్ధాంతమునననుసరించి అనేకులగు ఇష్టదేవతల ఆకారములను పెక్కింటిని సాధకుల ధ్యానము కొరకు నిర్మించిరి. ఈ దేవతల ఆకారములకు స్వతంత్ర విజ్ఞానమున్నది. ఫలానాదేవతలకు ఫలానా ఆకారము ఎందుకు ఏర్పాటు చేయబడినది? దీనికొక క్రమబద్ధమైన రహస్య మున్నది. ఈ విషయమును మరియొక పుస్తకములో చర్చింపగలము. ఇక్కడ ఈ మాత్రము తెలిసికొన్న చాలును. ఫలానా ప్రయోజనమునకై ఫలానా ఈశ్వర శక్తులను తమవైపు ఆకర్షించుకొనుటకు ఏ ఆకారమును యోగులు ఏర్పాటు చేసిరో ఆ ఆకారము ఆదేవతకు సంబంధించినదియని ప్రకటింపబడినది.

ఇతర ప్రయోజనములకై ఇతర దేవతా మూర్తులున్నచోట ఈ విశ్వ బ్రహ్మాండమును ఈశ్వరమయముగా చూచుటకు విరాట్ రూప పరమేశ్వరుని మూర్తి నిర్మితమైనది. మానవుని ఆత్మోన్నతి సుఖశాంతులు ఈ విషయముపై ఆధారపడియున్నవి. వాని ఆంతరికజీవనము బాహ్యజీవనము పవిత్రము పాపరహితము అగుగాక! అన్నివిధములగు క్లేశములవలన దుఃఖములవలన, అభావములవలన, వ్యాకులతవలన మానవునకు శారీరిక

మానసిక పాపములున్నవి. అతడీపాపముల నుండి బయటపడుచున్నచో వానికి ఈశ్వరుడొసంగిన అనంతములగు సుఖశాంతులలో విఘ్నము కలుగజేయుటకుగల కారణ మేదియులేదు. పాపములనుండి బయటపడుటకు ఈశ్వరీయ భయము అవసరము. ఈశ్వరుడు సర్వవ్యాపకుడు. ఈవిషయము అందరికి తెలియును. కాని అనుభవము చాలతక్కువమందికి కలుగును. ఈశ్వరుడు నాకు నలువైపుల ఉన్నాడు, అతడు పాపమునకు తగిన శిక్షను తప్పక విధించును- అను అనుభవము ఎవనికి కలుగునో వాడు పాపము చేయజాలడు. దొంగకు చుట్టుప్రక్కల తుపాకులను పట్టుకొని పోలీసులు కాపలకాయు చుండగా, అన్నివైపుల నుండి వారు వానిపై దృష్టిపెట్టి యుండగా వాడు దొంగతనము చేయుటకెట్లు సాహసించును ?

పరమాత్మ యొక్క ఆకారమును చరాచర బ్రహ్మాండమునందుచూచుట ఒక సాధన. దానిద్వారా పరమాత్మానుభవమును పొందు హెచ్చరిక జాగృతమగును. ఇదియే విశ్వమానవపూజ. దీనినే విరాట్ దర్శన మందురు. రామాయణములో రాముడు తన జననసమయమున కౌసల్యకు విరాడ్రూపమును చూపెను. ఒక మారు భోజనముచేయుచున్నపుడు గూడ రాముడు తల్లికి విరాడ్రూపమును చూపెను. ఉత్తర కాండలో కాకభుశుండిని గూర్చి ఒక వర్ణన యున్నది. ఆయన భగవానునితో లోనికి వెడలి అక్కడ బ్రహ్మాండమునంతటిని చూచెను. శ్రీకృష్ణ భగవానుడు గూడ ఇట్లే ఎన్నోమారులు తన విరాడ్రూపమును చూపెను. మట్టితినినప్పుడు నోటిని తెరిపింపగా యశోదకు విరాడ్రూపమును చూపెను. మహాభారతములోని ఉద్యోగపర్వమునందు దుర్యోధనునకుగూడా ఇట్టి రూపమునే చూపెను. అర్జునునకు భగవానుడు యుద్ధమున విరాడ్రూపమును చూపెను. ఇది గీత 11వ అధ్యాయములో విస్తారముగ వర్ణింపబడినది.

ఈ విరాడ్రూపమును ఎవ్వడైన చూడవచ్చును. బ్రహ్మాండము నంతటిని పరమాత్మ యొక్క విశాలకాయమూర్తిగాచూచుట, దానిలో దాని అంగోపాంగముల రూపమున సర్వ పదార్థములను చూచుట, ప్రతిప్రదేశమును ఈశ్వరునితో ఓతప్రోతమై యున్నట్లు చూచుట, ఇట్లు భావన చేసిన భగవద్బుద్ధి జాగృత మగును. అంతట ప్రభువు యొక్క సత్తా వ్యాపించియున్నదను దృఢవిశ్వాసము కలుగటవలన మనుష్యుడు పాపమునుండి విముక్తుడగును. ఇకవాడు పాపకార్యము చేయడు. పాప రహితుడగుట ఎంతయో లాభము. దానివలన సర్వవిధదుఃఖముల నుండి విముక్తుడగును, అంధకారమునకు బదులుప్రకాశము, దుఃఖమునకు బదులు ఆనందము కలుగును. విరాడ్రూపమును దర్శించుటవలన పాపరహితుడగు వ్యక్తి ఎల్లప్పుడు అక్షయమగు ఆనందమును పొందును.

గాయత్రి పరమాత్మ శక్తి. పరమాత్మ శక్తి అంతట అణువణులోను, బ్రహ్మాండ మంతటిలోను వ్యాప్తమై యున్నది. ఉన్నదంతయు గాయత్రీమయమే. గాయత్రి శరీరమునందే ఈ జగత్తు అంతయు ఉన్నది. ఈ భావన గాయత్రి యొక్క విరాడ్రూప దర్శన మగును. క్రింద ఈయబోవు "గాయత్రీ పంజర స్తోత్రము" నందు ఈ విరాట్ దర్శనమే యున్నది. పంజరమనగా చట్రము. గాయత్రి యొక్క చట్రము-గాయత్రీ యొక్క పంజరము ప్రపంచమంతటిలో ఉన్నది. ఇది ఈ స్తోత్రము నందు చెప్పబడినది. ఈ స్తోత్రము భావనా సహితముగ ధ్యానించినచో అంతర్లోకములోను, బాహ్యజగత్తులోను విరాట్‌గాయత్రీ దర్శనమగును. ఆ దర్శనమువలన పోలీసులచే చుట్టుముట్టబడి ఉన్నవ్యక్తి దొంగతనము చేయుటకు ప్రయత్నించనట్లు పాపముచేయుటకు ఎవ్వడును సాహసింపడు.

## అథ గాయత్రీ పంజరమ్

**భూర్భువః సువరిత్యేతైర్నిగమత్వ ప్రకాశికామ్ ।**
**మహర్జన స్తపః సత్యలోకోపరి సుసంస్థితామ్ ।**

గాయత్రి భూః భువః స్వః - వీనిద్వారా నిగమత్వమును వెల్లడించును. మహః, జనః, తపః, సత్యః - ఈలోకములకంటె పైన ఉన్నది.

**గానాదినా వినోదాది కథాలాపేషు తత్పరామ్ ।**
**తదిత్యవాఙ్మనోగమ్య తేజో రూపధరాం పరామ్ ।**

గానము మున్నగు వినోదములయందు, కథాదులయందు తత్పరమగు ఈమె వాక్కు కంటె మనస్సు కంటె అగమ్యమైనప్పటికి, గొప్ప తేజస్సును ధరించి యున్నది.

**జగతః ప్రసవిత్రీం తాం సవితుః సృష్టి కారిణీమ్ ।**
**వరేణ్య మిత్యన్నమయీం పురుషార్థ ఫలప్రదామ్।**

జగత్తును సృష్టించునట్టి ఆమెను సవితను సృష్టించునదియనిచెప్పిరి. వరేణ్యమనగా అన్నమయి. ఆమె పురుషార్థమును ఇచ్చునట్టిది.

**అవిద్యా వర్ణ వర్జ్యాం చ తేజోవద్గర్భ సంజ్ఞికామ్ ।**
**దేవస్య సచ్చిదానంద పరబ్రహ్మ రసాత్మికామ్ ।**

ఆమె అవిద్య, వర్ణము సవిత, తేజస్సుతో గూడినది, గర్భ సంజ్ఞకమైనది. సచ్చిదానంద పరబ్రహ్మ రసమయియైనది.

**యద్వయం ధీమహి సావై బ్రహ్మాద్వైత స్వరూపిణీమ్ ।**
**ధియో యోనస్తు సవితా ప్రచోదయా దుపాసితామ్ ।**

అద్వైతస్వరూపిణియు,సవితృ స్వరూపమగు మాబుద్ధిని ఉపాసనకై ప్రేరేపించునట్టి ఆమెను మేము ధ్యానించు చున్నాము.

**తాదృగస్యా విరాడ్రూపం కిరీటవర రాజితామ్ ।**
**వ్యోమ కేశాలకాకాశం రహస్యం ప్రవదామ్యహమ్ ।**

ఇట్లు ఆమె విరాట్‌రూపము కలది. సుందర కిరీటమును ధరించినట్టిది. వ్యోమము కేశములుగా గలది. ఆకాశము అలకలు ( ముంగురులు), ఇట్లు ఈమెరహస్యము చెప్పబడినది.

**మేఘభ్రుకుటికా క్రాన్తాం విధి విష్ణు శివార్చితామ్**
**గురు భార్గవ కర్ణాంతాం సోమసూర్యాగ్ని లోచనామ్ ।**

ఆమె కనుబొమలచే ఆక్రాంతములైన మేఘములు గలది, బ్రహ్మ విష్ణు మహేశ్వరులచే అర్చింపబడునది. గురు శుక్రులుచెవులుగా గలది, సోముడు (చంద్రుడు) సూర్యుడు అగ్ని నేత్రములుగా గలది.

**పింగలేడా ద్వయం నూనం వాయునాసా పుటాన్వితామ్**
**సంధ్యోభయోష్ఠ పుటితాం లసద్వాగుపజిహ్వకామ్ ।**

ఆమెరెండు ముక్కు పుటములు ఇడా పింగళులు, రెండు సంధ్యలు రెండు ఓష్ఠములు, ఉపజిహ్వయే వాక్కు.

**సంధ్యాద్యుమణికంఠాంచ లసద్బాహు సమన్వితామ్ ।**
**పర్జన్య హృదయాసక్తాం వసు సుస్తన మండలామ్ ।**

సంధ్యారూపమగు ద్యుమణిచే కంఠము ప్రకాశించుచున్నది. బాహువులు శోభిల్లు చున్నవి. పర్జన్యము(మేఘము) హృదయము. స్తన మండలము వసువు

**వితతాకాశముదరాం సునాభ్యంతర దేశకామ్ ।**
**ప్రాజాపత్యాఖ్యజఘనాం కటీంద్రాణీతి సంజ్ఞికామ్ ।**

ఆకాశము ఉదరము, అంతరదేశము నాభి, జఘనము ప్రజాపతి, కటి (నడుము) ఇంద్రాణి.

**ఊరూ మలయ మేరుభ్యాం సన్తి యత్రా సురద్విషః**
**జానునీ జహ్ను కుశికా వైశ్వదేవ సదా భుజామ్ ।**

రెండు ఊరువులు( తొడలు) మలయమేరుపర్వతములు. అక్కడ అసురద్వేషులు (దేవతలు)నివసించుచుందురు. జానువుల (మోకాళ్ళ) యందు జహ్నువు కుశికుడు ఉన్నారు, భుజములు విశ్వేదేవులు.

**అయన ద్వయ జంఘాద్య సురాది పితృ సంజ్ఞకామ్ ।**
**పదాంఘ్రి నఖరోమాది భూతలద్రుమ లాంఛితామ్ ।**

రెండు జంఘలు(పిక్కలు)రెండు అయనములు, సురాది పితృ సంజ్ఞకమైనది. పాదములు, అంఘ్రులు (కాళ్లు), గోళ్ళు, రోమములు మొదలైనవి భూమి యందలి చెట్లు మొదలైనవిగా చెప్పబడినవి.

**గ్రహరాశి దేవర్షయో మూర్తించ పరసంజ్ఞికామ్ ।**
**తిథి మాసస్తు వర్షాఖ్య సుకేతునిమిషాత్మికామ్ ।**
**మాయా కల్పిత వైచిత్ర్యా సంధ్యా చ్ఛాదన సంవృతామ్ ।**

గ్రహములురాసులు,దేవతలు ఋషులు,పరసంజ్ఞక మగు శశియొక్క మూర్తులు. తిథులు, మాసములు, ఋతువులు సంవత్సరములు, సుకేతవు మున్నగునవి నిమేషములు, మాయారచితమగు వైచిత్ర్యముతోగూడినది, సంధ్యతోఆవరింప బడియున్నది.

**జ్వలత్కాలానల ప్రభాం తడిత్కోటి సమప్రభామ్ ।**
**కోటి సూర్యప్రతీకాశాం చంద్రకోటి సుశీతలామ్ ।**

కాలాగ్నివలె జ్వలించునట్టిది. కోట్ల కొలది మెరుపులవలె ప్రకాశించునట్టిది. కోట్లకొలది చంద్రులవలె చల్లనైనది.

**సుధామండలమధ్యస్థాం సాంద్రానందా ఽ మృతాత్మికామ్ ।**
**ప్రాగతీతాం మనోరమ్యాం వరదాం వేదమాతరమ్ ।**

సుధా మండలమధ్యలోఆనందముతోను అమృతముతోను గూడినట్టిది. ప్రాగతీతయైనది. మనోహరమైనది. వరములను ఇచ్చునట్టిది.ఆమె వేదమాత

**షడంగా వర్ణితా సాచ త్రైదేవ వ్యాపకత్రయమ్ ।**
**పూర్వోక్త దేవతాం ధ్యాయేత్ సాకారగుణ సంయుతామ్ ।**

ఆరు అంగములు గలది. ముల్లోకములలోను వ్యాపించు నట్టిది. వెనుక చెప్పబడిన ఈగుణములతో గూడిన దేవతను ధ్యానించవలెను.

**పంచవక్త్రాం దశభుజాం త్రిపంచనయనైర్యుతామ్ ।**
**ముక్తావిద్రుమ సౌవర్ణాం స్వచ్ఛ శుభ్ర సమాననామ్ ।**

ఐదు ముఖములు, పదిభుజములు, పదునైదునేత్రములు గలది. ముత్యముతో పగడముతో సమానమగు సువర్ణము శ్వేతము (తెలుపు) శుభ్రమునగు ముఖముగలది.

**ఆదిత్య మార్గ గమనాం స్మరేద్బ్రహ్మ స్వరూపిణీమ్ ।**
**విచిత్ర మంత్ర జననీం స్మరేద్విద్యా సరస్వతీమ్ ।**

ఆమె సూర్యమార్గము ద్వారా పోవునట్టిది. బ్రహ్మ స్వరూపిణియగు ఆమెను స్మరించ వలెను. విచిత్ర మంత్రములకు జననియగు విద్యాసరస్వతిని స్మరించవలెను.

## ఇతి గాయత్రీ పంజరమ్

ఇతర స్థలములందును ఈ విధములగు ప్రమాణములే లభించు చున్నవి. వానిలో పిండము నందే బ్రహ్మాండము ఉన్నదనుటకు ప్రమాణము చూపబడినది.

దేహ ఽ స్మిన్ వర్తతే మేరుః సప్తద్వీప సమన్వితః ।
సరితః సాగరాః శైలాః క్షేత్రాణి క్షేత్రపాలికాః

ఋషయో మునయస్సర్వే నక్షత్రాణి తథా గ్రహాః ।
పుణ్య తీర్థాని పీఠాని వర్తన్తే పీఠ దేవతాః ।

సృష్టిసంహార కర్తారౌ భ్రమంతౌ శశిభాస్కరౌ ।
నభో వాయుశ్చ వహ్నిశ్చ జలం పృథ్వీ తథైవచ ।

త్రైలోక్యే యాని భూతాని తాని సర్వాణి దేహతః ।
మేరుం సంవేష్ట్య సర్వత్ర వ్యవహారః ప్రవర్తతే ।

జానాతి యః సర్వమిదం స యోగీ నాత్ర సంశయః ।
బ్రహ్మాండ సంజ్ఞకే దేహే యథాదేశః వ్యవస్థితః । — శివసంహిత

మానవ శరీరము ఈ విశాల బ్రహ్మాండమునకు ప్రతిమూర్తి. ఏ శక్తులు ఈ విశ్వమును నడుపు చున్నవో అవియన్నియు ఈ మానవ దేహము నందు ఉన్నవి.

ఈ శరీరము నందు సప్త ద్వీపసహితముగ మేరువు ఉన్నది. నదులు, సాగరములు, పర్వతములు,క్షేత్రములు( పొలములు) రైతులు, ఋషులు, మునులు, నక్షత్రములు, గ్రహములు, పుణ్యతీర్థములు,పీఠములు, పీఠదేవతలు ఉన్నారు. సృష్టి సంహారములను చేయు చంద్ర సూర్యులు తిరుగు చున్నారు. ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి మరియు ముల్లోకములలో ఉన్న భూతలములు అన్నియు శరీరమునందున్నవి. మేరువును చుట్టుముట్టి అంతట వ్యవహారము జరుగుచుండును. ఈ విషయము నంతటిని తెలిసికొనినవాడు యోగియగును. ఇవిఅన్నియు బ్రహ్మాండమను దేహమునందు ఉండవలసిన చోట్ల ఉన్నవి.

సవీవ పురుషస్తస్మా దండం నిర్భేద్య నిర్గతః ।
సహస్రోర్వంఘ్రి బాహ్వక్షః సహస్రానన శీర్షవాన్ ।
యస్యే హావయవైర్లోకాన్ కల్పయన్తి మనీషిణః ।

కట్యాదిభిరధః సప్త సప్తోర్ధ్వం జఘనాదిభిః ।
భూర్లోకః కల్పితః పద్భ్యాం భువర్లోకస్య నాభితః ।
హృదా స్వర్లోక ఉరసా మహర్లోకో మహాత్మనః ।
గ్రీవయాం జనలోకస్య తపోలోకః స్తనద్వయాత్
మూర్ధాభిః సత్యలోకశ్చ బ్రహ్మలోకః సనాతనః ।
తత్కట్యాం చాతలం క్లుప్త మూరుభ్యాం వితలం విభోః ।
జానుభ్యాం సుతలం శుద్ధే జంఘాభ్యాం చ తలాతలమ్ ।
మహాతలం తు గుల్ఫాభ్యాం ప్రపదాభ్యాం రసాతలమ్ ।
పాతాలంపాదతలజ మితి లోకమయః పుమాన్ ।

అందువలన ఈ పురుషుడు అండమును భేదించు కొని బయటకు వచ్చెను. ఆయనకు లెక్కలేనన్ని ఊరువులు, వ్రేళ్ళు,బాహువులు, నేత్రములు, ముఖములు, శిరస్సులు ఉండెను. ఈ ప్రపంచమున విద్వాంసులు ఆయన అవయవముల ద్వారా లోకములను కల్పించు చున్నారు. నడుమునుండి క్రింద ఏడు లోకములు, నితంబమునకు పైన ఏడు లోకములు ఉన్నవి. పాదములలో భూలోకమును, నాభి నుండి భువర్లోకమును, హృదయమునందు స్వర్లోకమును, వక్షః స్థలమునుండి మహర్లోకమును మెడ నుండి జనలోకమును, రెండు స్తనములయందు తపోలోకమును, శిరస్సునందు సత్యలోకమును కల్పించిరి. ఆ బ్రహ్మలోకముసనాతనమై నది. నడుము నందు అతలము కల్పితమై నది. ఊరువుల యందు వితలము, మోకాళ్ళయందు సుతలము, పిక్కలయందు తలాతలము, చీలమండలముల యందు మహాతలము, మీగాళ్ళయందు రసాతలము, అరికాళ్ళ యందు పాతాళము ఉన్నవి. ఇక్కడ లోకమయపురుషుడు ఉన్నాడు.

ఈ శ్లోకములను చదివినచాలదు. దీనిని బాగుగ ఆలోచించి, భక్తితో చిత్తమును ఏకాగ్రపరచవలెను. విరాట్ విశ్వమునందు తన ఇష్టదేవతను సర్వత్ర చూచునట్టి అను భూతి ఎప్పుడు కలుగునో అప్పుడుప్రతిక్షణము ఈశ్వరుని దర్శించువారు స్వర్గమును ఈ జీవితములోనే సాక్షాత్కరింపజేసి కొందురు.

★ ★ ★

# గాయత్రీ సంహిత

1. ఆది శక్తిరితి విష్ణోస్తామహం ప్రణమామి
హి సర్గః స్థితి వినాశశ్చ జాయంతే జగతోఽనయా

గాయత్రి పరమాత్మ యొక్క ఆదిశక్తి, ఆమెకు నమస్కరించుచున్నాను. ఈ శక్తి చేతనే విశ్వము యొక్క నిర్మాణము, పాలనము, వినాశము గూడ జరుగుచున్నది.

2. నాభి పద్మభువా విష్ణోర్బ్రహ్మణా నిర్మితం జగత్
స్థావరం జంగమం శక్త్యా గాయత్ర్యా ఏతత్ వైధ్రువమ్

విష్ణువు యొక్క నాభికమలమందు పుట్టిన బ్రహ్మ గాయత్రి శక్తి చేత జడచేతన రూపమైన విశ్వమును సృజించెను.

3. చంద్రశేఖర కేశేభ్యో నిర్గతాహి సురాపగా
భగీరథం తతారైవ పరివార సమం యథా

4. జగద్ధాత్రీ సముద్భూత్య యా హృన్మానసరోవరే
గాయత్రీ సకులంపారం తథా సయతి సాధకమ్

5. సాస్తి గంగైవ జ్ఞానాఖ్య సునీరేణ సమాకులా
జ్ఞాన గంగా తు తాం భక్త్యా వారం వారం నమామ్యహమ్

శివ కేశములనుండి వెలువడిన గంగకుటుంబ సహితముగ భగీరథుని తరింపజేసినట్లు ప్రపంచమును పాలనచేయు గాయత్రి హృదయ ప్రకటమై నేడు మానస సరోవరమున సపరివారముగా గాయత్రీ సాధకుని భవసాగరము నుండి తరింపజేయును. ఆ గాయత్రియే జ్ఞానమను జలముచే పరిపూర్ణమైన గంగ. ఆ గంగకు భక్తితో పదేపదే నమస్కరించుచున్నాను.

6. ఋషయో వేదశాస్త్రాణి సర్వేచైవ మహర్షయః
శ్రద్ధయా హృది గాయత్రీం ధారయంతి స్తువంతిచ

ఋషులు, వేదములు, శాస్త్రములు, సమస్త మహర్షులు గాయత్రిని శ్రద్ధతో హృదయమున ధరించి ఆమెను స్తుతించు చున్నారు.

7. హ్రీం శ్రీం క్లీంచేతిరూపేభ్య స్త్రిభ్యోహి లోకపాలినీ
భాసతే సతతంలోకే గాయత్రీ త్రిగుణాత్మికా

హ్రీం శ్రీం క్లీం అను మూడు రూపములతో విశ్వమును పాలించు త్రిగుణాత్మికయగు గాయత్రి విశ్వమందు నిరంతరము ప్రకాశించుచున్నది.

8. **గాయత్ర్యేవమతా మాతా వేదానాం శాస్త్ర సంపదామ్**
**చత్వారోపి సముత్పన్నా వేదాస్తస్యా అసంశయం**

శాస్త్రముల యొక్క సంపత్తి రూపమైన వేదములకు గాయత్రి మాతగా తెలియబడుచున్నది. నిశ్చయముగ నాల్గు వేదములు గాయత్రినుండి ఉత్పన్నమైనవే.

9. **పరమాత్మనస్తుయాలోకే బ్రహ్మ శక్తిర్విరాజతే**
**సూక్ష్మాచ సాత్వికీ చైవ గాయత్రీత్యభిధీయతే**

విశ్వమందు పరమాత్మయొక్క సూక్ష్మ, సాత్వికబ్రహ్మ శక్తిగా ప్రకటితమగుచున్న దంతయు గాయత్రిగా చెప్పబడుచున్నది.

10. **ప్రభావాదేవ గాయత్ర్యా భూతానామభిజాయతే**
**అంతఃకరణేషు దైవానాం తత్త్వానాం, హి సముద్భవ :**

ప్రాణుల అంతఃకరణముల యందలి దైవీ తత్త్వములయొక్క ప్రాదుర్భావము గాయత్రి యొక్క ప్రభావమున కలుగుచున్నది.

11. **గాయత్ర్యుపాసనకరణా దాత్మశక్తి ర్వివర్ధతే**
**ప్రాయతే క్రమశోఽజన్య సామీప్యం పరమాత్మన :**

గాయత్రిని ఉపాసించుట వలన ఆత్మబలము వృద్ధియగును. మెల్ల మెల్లగా జన్మబంధములు సడలి పరమాత్మ యొక్క సామీప్యము కలుగును.

12. **శౌచం శాంతిర్వివేకశ్చైతల్లాభ త్రయమాత్మకమ్**
**పశ్చాద వాప్యతే నూనం సుస్థిరం తదు పాసకమ్ ।**

మనసును వశమొనర్చుకొని గాయత్రిని ఉపాసించువానికి తరువాత పవిత్రత, శాంతి, వివేకము ఈ మూడు ఆత్మిక లాభములు నిశ్చయముగా కలుగును.

13. **కార్యేషు సాహస : స్థైర్యం కర్మ నిష్ఠాతథైవచ**
**ఏతే లాభశ్చవైతస్మాజ్జాయంతే మానసాస్త్రయ :**

కార్యములందు సాహసము, స్థిరత, కర్తవ్యనిష్ఠ ఈ మూడు మానసిక లాభములు వానికి కలుగును.

14. **పుష్కలాధన సంసిద్ధి : సహయోగశ్చసర్వత :**
**స్వాస్థ్యం వాత్రత ఏతేస్యుస్తస్మాల్లాభశ్చ లౌకిక :**

సంతోషమును కలిగించు ధన వృద్ధి, అన్నివైపులనుండి సహకారము, స్వస్థత అను ఈ మూడు ప్రాపంచిక లాభములు కలుగును.

15. కాఠిన్యాం వివిధంఘోరం హ్యాపదాం సంహతిస్తథా
శీఘ్రం వినాశతాం యాంతి వివిధా విఘ్న రాశయ :

నానావిధములైన ఘోర కష్టములు, విపత్తుల సమూహము, నానావిధములైన విఘ్నముల సమూహము ఇందువలన శీఘ్రముగ నశించును.

16. వినాశాదుక్త శత్రూణామన్త శక్త్యైరివర్ధతే
సంకటానామ నాయాసం పారం యాతి తథా నరః

ఉపర్యుక్త (పైన చెప్పబడిన) శత్రువుల యొక్క వినాశము చేత లోపలిశక్తి పెంపొందును. ఆంతరిక శాంతివలన మనుష్యుడు సహజముగానే సంకటములనుండి తరింపబడును.

17. గాయత్ర్యుపాసక స్యాంతే సత్కామా ఉద్భవంతి హి
తత్పూర్తయేఽ భిజాయంతే సహజం సాధనాన్యపి

నిశ్చయముగ గాయత్రిని ఉపాసించువాని హృదయమందు మంచి కోరికలు కలుగును. వానిని పొందుటలో సహజముగ సాధనలు జోడింప బడి యుండును.

18. త్రుటయః సర్వథాదోషావిఘ్నాయాంతి యదాంతతామ్
మానవో నిర్భయం యాతి పూర్ణోన్నతి పథంతథా

సర్వవిధములైన, పొరపాట్లు, విఘ్నములు నశించినపుడు మనుష్యుడు నిర్భయుడై సంపూర్ణమైన ఉన్నతి మార్గమందు చరించును.

19. బాహ్యంచాభ్యంతరం త్వస్య నిత్యం సన్మార్గ గామిన :
ఉన్నతేరుభయం ద్వారం యాత్యున్ముక్త కపాటతామ్

సర్వదా సన్మార్గమున చరించు ఈ వ్యక్తి యొక్క బాహ్య అభ్యంతరములను రెండును ఉన్నతి ద్వారములు వికసించును.

20. అతఃస్వస్థేన చిత్తేన శ్రద్ధయా నిష్ఠయాతథా
కర్తవ్యానిరతం కాలే గాయత్ర్యాః సముపాసనా

ఈ విధముగా శ్రద్ధతో నిష్ఠతో అటుల స్వస్థమైన చిత్తముతో ప్రతిదినము, నిరంతరము ఎక్కువకాలము గాయత్రీ ఉపాసన చేయవలెను.

21. దయాలుః శక్తి సంపన్నా మాతాబుద్ధిమతీ యథా
కల్యాణం కురుతేహ్యేవ ప్రేమ్ణాబాలస్యచాత్మన :

22. తథైవ మాతాలోకానాం గాయత్రీ భక్తవత్సలా
విధధాతి హితం నిత్యం భక్తానాం ధ్రువమాత్మన :

అట్టి దయాళువు, శక్తి శాలిని, బుద్ధియుక్తయైన మాత ప్రేమ చేత తన బాలకునకు కల్యాణమునే చేయును. ఆ విధముగా భక్తులపై ప్రేమ కురిపించు గాయత్రి విశ్వమునకు మాత ఆమె తన భక్తులకు సదా కల్యాణమునే చేయును.

**23. కుర్వన్నాతి త్రుటీర్లోకే బాలకోమాతరం ప్రతి**
**యథాభవతి కశ్చిన్నతస్యా అప్రీతి భాజన :**

**24. కుర్వన్నపి త్రుటిర్వక్త : క్వచిత్ గాయత్ర్యుపాసనే**
**నతథాఫల మాప్నోతి విపరీతం కదాచన**

విశ్వమున మాత పట్ల అపరాధములు చేసినను బాలకులెవ్వరును శత్రువులు కాజాలరు. అటులనే గాయత్రీ ఉపాసనలో తప్పులు జరిగినను భక్తులెవ్వరు ఎట్టి విపరీత ఫలములను పొందరు.

**25. అక్షరాణాంతు గాయత్ర్యా గుంఫనం హ్యస్తి తద్విధమ్**
**భవంతి జాగ్రతాయేన సర్వాగుహ్యాస్తు గ్రంథయ :**

గాయత్రియొక్క అక్షరముల కూర్పు సమస్త రహస్య గ్రంథులను జాగృత మొనర్పశక్తి గలది.

**26. జాగృతాగ్రంథయస్త్వేతా : సూక్ష్మాసాధక మానసే**
**దివ్యశక్తి సముద్భూతిం క్షిప్రం కుర్వంత్య సంశయమ్**

జాగృతమైన ఈ సూక్ష్మ యౌగిక గ్రంథులు సాధకుని మనమున నిస్సందేహముగ త్వరలో దివ్య శక్తుల ప్రకటిత మొనర్చును

**27. జనయంతి కృతేపుంసామేతావై దివ్యశక్తయ :**
**వివిధాన్ వైపరిణామాన్ భవ్యాన్ మంగళపూరితాన్**

ఈ దివ్యశక్తులు మనుష్యులకొరకు నానా విధములైన మంగళమయ సుందర పరిణామముల నుత్పత్తి చేయగలవు.

**28. మంత్రస్యోచ్చారణం కార్యంశుద్ధమేవాప్రమాదతః**
**తదశక్తో జపేన్నిత్యం సప్రణవాన్సువ్యాహృతీ :**

ఆలస్యరహితులై గాయత్రీ మంత్రమును శ్రద్ధతో శుద్ధముగా ఉచ్చారణ చేయవలెను. అటుల పలుకలేని అశక్తులు ప్రణవ సహితముగ వ్యాహృతులు మాత్రము జపింపుడు (ఓం భూర్భువః స్వః)

**29. ఓమితి ప్రణవః పూర్వం భూర్భువః స్వస్తదుత్తరం**
**ఏషోక్తా లఘుగాయత్రీ విద్వద్భిర్వేద పండితై :**

తొలుత ప్రణవము నుచ్చరించి తదుపరి "భూర్భువః స్వః" యను పంచాక్షరి మంత్రము నుచ్చరించుటను విద్వాంసులు లఘు గాయత్రి యందురు.

30. శుద్ధ పరిధాన మాధాయ శుద్ధే వై వాయుమండలే
శుద్ధదేహమనోభ్యాం వై కార్యా గాయత్ర్యుపాసనా

శుద్ధ వస్త్రములను ధరించి శుద్ధ వాయు మండలమున దేహమును, మనస్సును శుద్ధ మొనరించి గాయత్రీ ఉపాసన చేయవలె.

31. దీక్షామాదాయ గాయత్ర్యా బ్రహ్మనిష్ఠాగ్ర జన్మనః
ఆరభ్యతాం తతః సమ్యగ్విధినోపాసనా సతా

బ్రహ్మనిష్ఠులైన బ్రాహ్మణులవద్ద గాయత్రీ దీక్షను పొంది అప్పుడు విధిపూర్వకముగా ఉపాసనను ఆరంభింపవలెను.

32. గాయత్ర్యుపాసనా ముక్త్వా నిత్యావశ్యక కర్మను
ఉక్తస్త్రత ద్విజాతీనాం నానాధ్యాయో విచక్షణై :

గాయత్రీ ఉపాసనను ద్విజులకు అనివార్యమనియు వదలక ప్రతిదినము చేయవలసిన నిత్యకర్మమనియు విద్వాంసులు చెప్పి యున్నారు.

33. ఆరాధయంతి గాయత్రీం న నిత్యం యేద్విజన్మన :
జాయతేహి సర్వకర్మభ్యస్తేచ్యుతానాత్ర సంశయః

ద్విజు లెవరైనను నిత్యమును గాయత్రి నుపాసింపనిచో వారు వారి కర్తవ్యమునుండి చ్యుతులగుటలో సంశయము లేదు.

34. శూద్రాస్తుజన్మనా సర్వే పశ్చాద్యాంతి ద్విజన్మతాం
గాయత్ర్యైవ జనాస్సర్వేహ్యుపవీతస్య ధారణాత్

జన్మచేత ప్రతివారును శూద్రులే. తరువాత మనుజులు గాయత్రీ సహితముగ యజ్ఞోపవీతధారణ చేసి ద్విజత్వమును పొందుదురు.

35. ఉచ్ఛ్రతా పతితానాంచ పాపినాం పాపనాశనమ్
జాయతే కృపయైవాస్యాః వేదమాతురనంతయా

పతితులకు ఉన్నతి, పాపులకు పాపవినాశము ఈ రెండు పనులు వేదమాతయగు గాయత్రి యొక్క అనంతకృపవలననే కలుగును.

36. గాయత్ర్యా యా యుతా సంధ్యా బ్రహ్మసంధ్యాతు సా మతా
కీర్తితం సర్వతః శ్రేష్ఠం తస్యానుష్ఠాన మాగమైః

గాయత్రీ మంత్రముతో కూడిన సంధ్య బ్రహ్మ సంధ్య, అది అన్నిట శ్రేష్ఠము.

37. ఆచమనం శిఖాబంధం ప్రాణాయా మోఽఘ మర్షణమ్
న్యాసచ్చో పాసనాయాంతు పంచకోషామతాబుధై:

ఆచమనము, శిఖాబంధనము, ప్రాణాయామము, అఘమర్షణ, న్యాసము అను ఈ పంచకోషములు సంధ్యా ఉపాసనయందు విద్వాంసుల స్వీకారమును పొందినట్టివి.

38. ధ్యానతస్తు తత: పశ్చాత్ సావధానేన చేతసా
జప్యానతతం తులసీమాలయా చ ముహుర్మహు:

సావధాన చిత్తముతో ధ్యానపూర్వకముగ గాయత్రీ మంత్రము యొక్క సాత్విక ప్రయోజనము నిమిత్తము తులసిమాలతో జపము చేయవలె.

39. ఏకవారం ప్రతిదినం న్యూనతో న్యూనసంఖ్యకం
ధీమన్మంత్ర శతం నూనం నిత్యమష్టోత్తరం జపేత్

ప్రతిదినము కనీసము 108మార్లు గాయత్రీ మంత్ర జపము తప్పక చేయవలెను.

40. బ్రాహ్మెముహూర్తే ప్రాఙ్మఖం మేరుదండం ప్రయమ్యహి
పద్మాస సమాసీన: సంధ్యావందన మాచరేత్

బ్రాహ్మమూహూర్తమున తూర్పువైపుతిరిగి కూర్చుండి వెన్నెముకను నిటారుగా నుంచి పద్మాసనము వేసికొని సంధ్యావందన మాచరించవలెను.

41. దైన్యరుక్ శోక చింతానాం విరోధాక్రమణాపదామ్
కార్యగాయత్ర్యనుష్ఠానం భయానాం వరణాయచ

దైన్యము, రోగము, శోకము, ఆక్రమణము, ఆపద భయము వీనినివారణ కొరకు గాయత్రీ అనుష్ఠానము చేయవలె.

42. జాయతేన స్థితి రస్మాన్మనో ఽభిలాష యాన్వితా:
యత: సర్వేఽభిజాయంతే యథాకాలంహి పూర్ణతామ్

ఈ అనుష్ఠానము వలన సమస్త మనో వాంఛితములు, అభిలాషలు, సమయపూర్ణత లభించును.

43. అనుష్ఠానాత్తు వైతస్మాత్ గుప్తాధ్యాత్మిక శక్తయ:
చమత్కార మయాలోకే ప్రాప్యంతేఽనేకథాబుధై:

ఈ అనుష్ఠానమువలన సాధకునకు లోకమున చమత్కార పూర్ణమైన అనేక ప్రకారములైన ఆధ్యాత్మిక శక్తులు ప్రాప్తించును.

44. సపాదలక్షమంత్రాణాం గాయత్ర్యా జపనం తు వై
ధ్యానేన విధినా చైవహ్యనుష్ఠానం ప్రచక్షతే

విధి పూర్వకముగ ధ్యాన పూర్వకముగా సవాలక్ష(1,25,000) గాయత్రీ మంత్ర జప మొనరించుట అనుష్ఠాన మనబడును.

45. పంచమ్యాం పూర్ణిమాయాం వా చైకాదశ్యాం తథైవహి
అనుష్ఠానస్య కర్తవ్యం ఆరంభః ఫలప్రాప్తయే

పంచమి, పూర్ణిమ, ఏకాదశి దినములందు అనుష్ఠానము నారంభించుట శుభము.

46. మాసద్వయే ఒ విరామం తు చత్వారి శద్దినేషువా
పూరయే త్తదనుష్ఠానం త్తుల్య సంఖ్యాన్తువై జపన్

రెండు మాసములందు అథవా 40 దినములలో నాగా లేకుండగా నిత్యము సమానసంఖ్యలో (నియమిత సంఖ్యలో) అనుష్ఠానమును పూర్తిచేయవలెను.

47. తస్యాప్రతిమాం ను సంస్థాప్య ప్రేమ్ణా శోభన ఆసనే
గాయత్ర్యాస్తత్ర కర్తవ్యా సత్ప్రతిష్ఠా విధానతః

ప్రేమతో సుందరమైన, ఉన్నతమైన ఆసనముపై గాయత్రీ ప్రతిమను స్థాపించి తగు విధముగా ప్రతిష్ఠ చేయవలెను.

48. తద్విధాయ తతో దీప ధూప నైవేద్య చందనైః
నమస్కృత్యాక్షతై నాపి తస్యాః పూజనమాచరేత్

ఈ విధముగా గాయత్రిని స్థాపనము చేసి తదనంతరము నమస్కరించి దీప, ధూప, నైవేద్య, అక్షతలతో పూజింపవలెను.

49. పూజనానంతరం విజ్ఞః భక్త్యా తజ్జపమారభేత్
జపకాలేతు మనఃకార్యం శ్రద్ధాన్విత మచంచలమ్

బుద్ధిమంతులు పూజానంతరము భక్తితో గాయత్రీ జపము ప్రారంభింపవలెనని జప సమయమున మనస్సు శ్రద్ధతో నిండి స్థిరముగా నుండవలెను.

50. కార్యతో యది చోత్తిష్ఠే న్మధ్యఏవ తతః పునః
కరప్రక్షాళనం కృత్వా శుద్ధై రంగైరుపావిశేత్

సాధనా సమయమున పని తగిలి లేచినపుడు చేతులు, నోరు శుభ్రము చేసికొని తిరిగి కూర్చుండవలెను.

51. ఆద్య శక్తి ర్వేదమాతా గయత్రీ తు మదంతరే
శక్తి కల్లోల సందోహాన్ జ్ఞానజ్యోతిశ్చ సంతతమ్

52. **ఉత్తరోత్తర మాశీర్య ప్రేరయంతీ విరాజతే**
**ఇత్యేవా విరతం ధ్యాయన్ ధ్యానమగ్నస్తు తాం జపేత్**

ఆద్యశక్తి, వేదమాతయగు గాయత్రి నాఅంతరంగమున నిరంతరము శక్తి యొక్క ప్రవాహమును, జ్ఞానమును ప్రకాశమును అంతట వ్యాపింపజేయుచున్నది. ఇట్లు నిరంతరము ధ్యానించుచు నిమగ్నుడై దానిని జపింపవలె.

53. **చతుర్వింశతి లక్షాణాం సతతం తదుపాసకః**
**గాయత్రీ నామనుష్ఠానాత్ గాయత్ర్యాః సిద్ధిమాప్నుతే.**

గాయత్రీ ఉపాసకుడు నిరంతరము 24 లక్షల గాయత్రీ మంత్రమును జపించిన గాయత్రీ సిద్ధిని తప్పక పొందును.

54. **సాధనాయైతు గాయత్ర్యా విశ్చలేన హి చేతసా**
**వరణీయః సదాచార్యః సాధకేన సుభాజనః**

గాయత్రీ సాధన నిమిత్తము సాధకుడు శ్రద్ధా భక్తులతో శ్రేష్ఠుడైన ఆచార్యునికడ దీక్షగొని సాధన నారంభింపవలె.

55. **లఘ్వ్యానుష్ఠానతో వాపి మహానుష్ఠానతోऽథవా**
**సిద్ధిం విందతి వై నూనంసాధకః సానుపాతకామ్**

లఘు అనుష్ఠానము చేతగాని, మహానుష్ఠానము చేతగాని శ్రమనిష్పత్తిననుసరించి సిద్ధిని పొందును.

56. **ఏకవీవతు సంసిద్ధిః గాయత్రీమంత్రః ఆదిశల్**
**సమస్తలోక మంత్రాణాం కార్యసిద్ధేస్తు పూరకః**

గాయత్రీ మంత్ర సిద్ధి మాత్రమే ఇతరములైన అన్ని మంత్రములద్వారా కాదగిన కార్యములను సిద్ధింప జేయునదియగును.

57. **అనుష్ఠానావసానేతు అగ్నిహోత్రో విధీయతామ్**
**యథాశక్తి తతోదానం బ్రహ్మభోజనస్తతఃఖలు**

అనుష్ఠానానంతరము హవనము చేయవలెను. ఆ తరువాత శక్తికొలది దానము బ్రాహ్మణ భోజనము జరుపవలెను.

58. **మహామంత్రస్య చాప్యస్యస్థానేస్థానే పదేపదే**
**గూఢానంతోపదేశానాం రహస్యం తత్ర వర్తతే**

ఈ మంత్రము యొక్క ప్రతి అక్షరమున ప్రతిపదమున రహస్యము నిం యున్నది. అనంత ఉపదేశముల యొక్క సమూహము ఈ మంత్రమున దాగియున్నది

59. యో దధాతి సర్వశ్చైతానుపదేశాంస్తు మానసే
జాయతే హ్యభయం తస్య లోకమానందసంకులమ్

ఈ ఉపదేశములను మనమున ధారణ చేసిన వానికి రెండు లోకములును ఆనందమయమై తోచును.

60. సమగ్రామపి సామగ్రీమనుష్ఠానస్య పూజితామ్
స్థానే పవిత్ర ఏవైతాం కుత్రచిద్ధి విసర్జయేత్

అనుష్ఠాన సమయమున పూజచేసిన సామాగ్రిని పవిత్ర స్థానమునందు మాత్రమే విసర్జింపవలెను.

61. సత్పాత్రో యది వా చార్యో నచేత్సం ప్రాప్యతే తదా
నారికేళం తు సంవృత్యాచార్యభావేన చాసనే

శ్రేష్ఠుడైన ఆచార్యుడు లభ్యముగానిచో పవిత్ర నారికేళమును ఆచార్యభావముతో స్వీకరించి ఆసనముపై స్థాపన చేయవలె.

62. ప్రాయశ్చిత్తం మతం శ్రేష్ఠం త్రుటీనాం పాపకర్మణాం
తపశ్చర్యైవ గాయత్ర్యా : నాతోఽన్యద్ దృశ్యతే క్వచిత్.

ఎన్నోవిధములైన పొరపాట్లకు, పాపకర్మములకు ప్రాయశ్చిత్తము గాయత్రీ తపశ్చర్య. శ్రేష్ఠముగా గణింపబడుచున్నది.

63. సేవ్యాః స్వాత్మ సముద్ధ్యర్థం పదార్థాః సాత్త్వికాః సదా
రాజసాశ్చప్రయోక్తవ్యాః మనోవాంఛిత పూర్తయే

ఆత్మోన్నతికొరకు సత్త్వగుణము కలిగినపదార్థముల నుపయోగించవలెను. కోరికలు నెరవేర్చుటకై రజోగుణ ప్రధానములైన పదార్థముల నుపయోగింపవలెను.

64. ప్రాదుర్భావస్తు భావానాం తామసానాం విజాయతే
తమోగుణానామర్థానాం సేవనాదితి నిశ్చయః

తమోగుణ ప్రధానమైన పదార్థముల నుపయోగించుట వలన నిశ్చయముగ తమోగుణ భావములు వృద్ధి చెందును

65. మాలాసన సమిధ్యజ్ఞ సామగ్ర్యర్చన సంగ్రహాః
గుణత్రయానుసారంహి సర్వే వైప్రదత్తేఫలం

మాల, ఆసనము, హవనము, సామాగ్రి, పూజా పదార్థములను ఏతత్త్వము ప్రధానముగా కలవారు స్వీకరింతురో అవి అట్లే తమగుణములననుసరించి ఫలితమును

ఇచ్చును.

66. ప్రాదుర్భవంతి వైసూక్ష్మాశ్చతుర్వింశతి శక్తయః
అక్షరేభ్యస్తు గాయత్ర్యా మానవానాంహి మానసే

మనుష్యుని యంతఃకరణమునందు గాయత్రి యందలి 24 అక్షరముల నుండి 24 సూక్ష్మ శక్తులు ప్రకటితమగును.

67. ముహూర్తాయోగ దోషా వా యోఽప్య మంగళకారిణః
భస్మతాం యాంతి తే సర్వే గాయత్ర్యాస్తీవ్రతేజసా

అమంగళ కరములైన ముహూర్త యోగదోషములు సర్వము గాయత్రీ ప్రచండ తేజమున భస్మీ పటలమగును.

68. ఏతస్మాత్ జపాన్నూనం ధ్యాన మగ్నస్య చేతసా
జాయతే క్రమ శశ్చై షట్ చక్రాణాం తు జాగృతిః

నిశ్చయముగ ధ్యానరతమగు చిత్తముతో ఈ జపము చేసిన వాని షట్ చక్రములు మెల్ల మెల్లగా జాగృతమగుచుండును.

69. షట్ చక్రాణి యదైతాని జాగృతాని భవంతి హి
షట్ సిద్ధయోఽభిజాయంతే చక్రైరేతైర్నరస్యవై

షట్ చక్రములు జాగృతములైనవానికి ఈ ఆరు చక్రముల ద్వారా ఆరు సిద్ధులు లభించును.

70. అగ్నిహోత్రంతు గాయత్రీమంత్రేణ విధివత్కృతమ్
సర్వేష్వవసరేష్వేవ శుభమేవ మతం బుధైః

గాయత్రీ మంత్రముతో విధి పూర్వకముగా హవనము చేసిన సర్వ శుభములు చేకూరునని విద్వాంసుల మతము.

71. యథావస్థాసు స్యాల్లోకే విపన్నాసు తదాతునః
మౌనం మానసికం చైవ గాయత్రీజపమాచరేత్

(సూతక, రోగ, అశౌచాది )విపత్తులయందు మనుష్యులు మౌనముగ మానసిక గాయత్రీ జపము చేయవలెను

72. తదనుష్ఠాన కాలేతు స్వశక్తిం వియమేజ్జన ః
నిమ్న కర్మసు తాః ధీమాన్ న వ్యయేద్ధి కదాచన

గాయత్రీ సాధనమున లభించిన శక్తిని సాధకుడు దాచుకొనవలెను . విద్వాంసుడు ఈ శక్తిని చిన్న పనులకు ఉపయోగింపరాదు.

73. నైవానావశ్యకం కార్యమాత్మో ద్ధారస్థితేనచ
అల్పశ క్తేస్తు ప్రాప్తయా: యత్రతత్ర ప్రదర్శనమ్.

ఆత్మోద్ధరణాభిలాషగల మనుష్యుడు లభించిన శక్తుల నెచ్చటను ప్రదర్శింపరాదు..

74. ఆహారే వ్యవహారేచ మస్తిష్కేఽపి త థైవహి
సాత్వికేన సదా భావ్యం సాధకేన మనీషిణా

ఆహార వ్యవహారముల యందును, ఆలోచనల యందును విద్వాంసుడైన సాధకుడు సాత్త్విక భావము కలిగియుండవలెను.

75. కర్తవ్య ధర్మతః కర్మ విపరీతంతు యద్భవేత్
తత్సాధకస్తు మతిమా నాచరేన్న కదాచన

కర్తవ్యముగాని విపరీత కర్మను విద్వాంసుడైన సాధకుడెన్నడును చేయరాదు

76. వృత్తతోఽస్యాసాధనాయా రాజతేఽతితరాం సదా
మనస్వి సాధకానాంహి బహూనాం సాధనాబలమ్

ఈ సాధనవెనుక ఆదికాలమునుండి తరతరాలుగా అసంఖ్యాకమైన సాధకుల సాధనా బలం విలసిల్లుతున్నది

77. అల్పీయస్యా జగత్యేవ సాధనయాతు సాధక:
భగవత్యాశ్చ గాయత్ర్యాః కృపాం ప్రాప్నోత్య సంశయమ్

ఏకొద్ది శ్రమతో సాధన చేసిన సాధకునికైన భగవతి గాయత్రీమాత కృప లభిస్తుంది.

78. ప్రాణాయామే జపన్ లోక: గాయత్రీ ధ్రువమాప్నుతే
నిగ్రహం మనసశ్చైవ చేంద్రియాణాంహి సంపదామ్

మనుష్యుడు నిశ్చయముగా ప్రాణాయామమందు గాయత్రిని జపించుటవలన మనోనిగ్రహమును, ఇంద్రియసంపత్తిని పొందగలడు.

79. మంత్రం విభజ్యభాగేషు చతుర్షు సుబుధస్సదా
రేచకం కుంభకం బాహ్యం పూరకం కుంభకం చరేత్

విద్వాంసుడు మంత్రమును నాల్గుగా విభజించి రేచక, కుంభక, పూరక, బాహ్యకుంభకములు చేయును.

80. యథాపూర్వ స్థితిశ్చైవ న ద్రవ్యం కార్యసాధకమ్
మహాసాధనతోఽప్యస్మారాజ్ఞో లాభం తథాప్నుతే

ధనమును దాచిన వారెవ్వరు కార్యసిద్ధిని పొందలేరు. మూర్ఖులు మహా సాధనవలన కూడా లాభము పొందజాలరు.

81. సాధకః కురుతేయస్తు మంత్రశక్తే రపవ్యయః
తం వినాశయతి సైవ సమూలం నాత్రసంశయః
మంత్రశక్తిని దుర్వినియోగ మొనర్చిన సాధకులు ఆశక్తిని సమూలముగ కోల్పోదురు.

82. సతతం సాధనాభిర్యో యాతి సాధకతాం నరః
స్వప్నావస్థా సుజాయంతే తస్యదివ్యానుభూతయః
నిరంతరము సాధన చేసెడు సాధకునికి స్వప్నావస్థ యందు దివ్యానుభూతులు కలుగుచుండును.

83. సఫలః సాధకోలోకే ప్రాప్నుతేఽనుభవాన్ నవాన్
విచిత్రాన్ వివిధాంశ్చైవ సాధనా సిద్ధ్యనంతరమ్
సాధనచే సిద్ధిని పొందినవానికి వినూత్నమైన విచిత్రమైన రీతులలో అనుభవములు కలుగుచుండును.

84. భిన్నాభిర్విధి భిర్బుద్ధ్యా భిన్నాసు కార్యపంక్తిషు
గాయత్ర్యాః సిద్ధిమంత్రస్య ప్రయోగః క్రియతేబుధై :
విద్వాంసులు వివిధ కార్యములందు సిద్ధిపొందిన గాయత్రీ మంత్ర ప్రయోగమును భిన్న భిన్న విధులతో వివేకముతోనుపయోగింతురు.

85. చతుర్వింశతి వర్ణైర్యా గాయత్రీ గుంఫితా శ్రుతౌ
రహస్యముక్తం తత్రాపి దివ్యై రహస్యవాదిభి :
వేదములందు గాయత్రి ఎట్లు 24 అక్షరములతో మాల గుచ్చబడి యున్నదో అట్లే ఈ 24 అక్షరములలో గొప్ప రహస్యములు ఇమిడి యున్నవని విద్వాంసులు చెప్పుదురు.

86. రహస్య ముపవీతస్య గుహ్యాత్ గుహ్యతరం హి యత్
అంతర్హితం తు తత్సర్వం గాయత్ర్యాం విశ్వమాతరి
యజ్ఞోపవీతమందు ఎన్ని రహస్యములున్నవో అవి యన్నియు విశ్వమాత గాయత్రి యందు దాగియున్నవి.

87. అయమేవ గురోర్మంత్రః యః సర్వోపరిరాజతే
బిందౌ సింధురివాస్మిన్తు జ్ఞానవిజ్ఞాన మాశ్రితమ్
ఈ గాయత్రియే గురుమంత్రము. ఇది అన్నిటికన్న విశిష్టమైనది. ఒక బిందువునందు సాగరమువలె ఇందు సమస్త జ్ఞానవిజ్ఞానములు ఇమిడియున్నవి.

88. అభ్యంతరే తు గాయత్ర్యా అనేకే యోగ సంచయాః
అంతర్హితా విరాజంతే కశ్చిదత్ర న సంశయః

గాయత్రియందు అంతర్గతమై అనేక యోగసమూహములు ఇమిడియున్నవి. ఇందులకు సందియము లేదు.

89. ధారయన్ హృది గాయత్రీం సాధకో ధౌతకిల్బిషః
శక్తీరనుభవత్యుగ్రాః స్వస్మిన్నేవాత్య లౌకికాః

పాపరహితుడైన సాధకుడు గాయత్రిని హృదయమున ధారణ చేసి తనఆత్మయందు అలౌకికమగు తీవ్రశక్తుల అనుభవమును పొందును.

90. ఏతాదృశ్యస్తస్య వార్తా భాసంతేఽల్ప ప్రయాసతః
యాస్తు సాధారణో లోకో జ్ఞాతు మర్హతి నైవహి

కొద్ది ప్రయాసముననే గొప్ప విషయము అవగతమగును. ఈ విషయములను సామాన్య మానవులర్థము చేసికొనజాలరు.

91. ఏ తాదృశ్యస్తు జాయంతే తాంమనస్యనుభూతయః
యాదృశ్యో నహి దృశ్యంతే మానవేషు కదాచన

ఆతని మనమందు ఇట్టి అనుభవములు కలుగుట యనునది ఇతరులకు ఊహింప శక్యము కానిది.

92. ప్రసాదం బ్రహ్మజ్ఞానస్య యేఽన్యేభ్యో వితరంత్యపి
ఆసాదయంతి తే నూనం మానవాః పుణ్యమక్షయమ్

బ్రహ్మజ్ఞానముయొక్క ప్రసాదము నతడు ఇతరులకు గూడ పంచగలడు. అతనికి అక్షయమగు పుణ్యము లభించుట నిశ్చయము.

93. గాయత్రీ సంహితా హ్యేషా పరమానందదాయినీ
సర్వేషామేవ కష్టానాం వారణాన్నాలం భువి

ఈ గాయత్రీ సంహిత పరమానందదాయిని. సమస్త కష్టములను నివారించునది జగమున సాటిలేనిది.

94. శ్రద్ధయా యే పఠంత్యేనాం చింతయంతిచ చేతసా
ఆచరంత్యానుకూల్యేన భవబాధాం తరంతి తే

ఎవరు ఈ గాయత్రీ సంహితను శ్రద్ధతో పఠింతురో ధ్యాన పూర్వకముగ మననము చేయుదురో ఎవరు ఈ సూ నల ననుసరించి జీవన సరళిని సరిదిద్దుకుందురో వారు భవబాధలనుండి విముక్తులగుట తథ్యము.

# గాయత్రీ తంత్రము

## రహస్య గాయత్రీవామమార్గము

**నదేయం పర శిష్యేభ్యో హ్యభక్తేభ్యో విశేషత :**
**శిష్యేభ్యో భక్తి యుక్తేభ్యో హ్యన్యథా మృత్యుమాప్నుయాత్ ।**

ఇతర శిష్యులకు ముఖ్యముగా భక్తిలేని శిష్యులకు ఈ మంత్రమును ఎప్పుడును ఉపదేశించరాదు. భక్తి గల శిష్యులకే దీనిని బోధింపవలెను. లేనిచో మృత్యువును పొందును.

పైప్రమాణముచే తంత్రమొక గుప్తవిజ్ఞానమని చెప్పబడినది. దానివిషయములు అందరి యెదుట వెల్లడించుటకు యోగ్యములుకావు. దానికి కారణము తాంత్రిక సాధనలు చాలక్లిష్టములగుటయే. సముద్రము అడుగునకు పోయి ముత్యములను వెతికి దీయునంతటి కష్టము. మునిగి ప్రాణమునొడ్డి నీటిలో చాలలోతుకు పోవుదురు. అప్పుడు అధికప్రయత్నము చేయగా వారికికొన్ని ముత్యములు చేతికి దొరకును. కాని ఆపనిలో వారు పెక్కుమారులు జలజంతువులను ఎదుర్కొనవలసివచ్చును. నటుడు తన కళను చూపి జనులను మోహపరచును, ప్రశంసను గూడ పొందును. కాని ఒక్కమారు పొరపాటు జరిగిన మంచి ఉండదు.

తంత్ర-ప్రకృతితో పోరాడి దాని శక్తులపై విజయమును పొందవలెను. దానికై అసాధారణ ప్రయత్నము చేయవలసివచ్చును. దానికి అసాధారణ ప్రతీకారము ఉండును. నీటిలో రాతిముక్కను విసరినచో అక్కడినీరు వేగముగ పైకి లేచును. ఒక చిన్న బాంబు పేలినట్టి స్థితి కనబడును. తాంత్రిక సాధకుడు గూడా ఒక రహస్యమయమగు సాధనద్వారా ప్రకృతిలోపల దాగియున్న శక్తులను పొందుటకు తన సాధనతో ఎదుర్కొనును. దానికి ఒక ప్రతీకారము జరుగును. ఆ ప్రతీకారమువలన ఒక్కొక్కప్పుడు సాధకునకు కూడ దెబ్బ తగులునను భయముండును.

తుపాకి పేల్చినప్పుడు గొట్టమునుండి గుండు బయటకు పోవునప్పుడు అది వెనుకవైపు ఒక కుదుపు ఇచ్చును. భయంకర శబ్దము చేయును. తుపాకిని పేల్చినవాడు బలహీనమైన స్వభావము గలవాడైనచో ఆ కుదుపు వలన వెనుకకు పడిపోవును.

ఆ ప్రేలుడు ధ్వనివలన వాడు భయపడును లేదా తత్తర పాటు చెందును. మంచి గంధపు చెట్ల దగ్గర పాములుండును. గులాబీపూలకు ముండ్లు ఉండును. తేనెను పొందవలె నన్న తేనెటీగలను ఎదుర్కొనవలసివచ్చును. సర్పములపైనున్న మణిని పొందుటకు భయంకరమగు సర్పముతోను, ఏనుగు తలలోని ముత్యములను పొందుటకు మదపుటేనుగు తోను పోరాడవలసి వచ్చును. తాంత్రికసాధనలు ఇట్టి వికట పురుషార్థములె. వాని వెనుక ప్రమాదములు అంటిపెట్టుకొని యుండును. ఆవిధముగ లేనిచో ఆ లాభములను ప్రతివాడు తేలికగ పొందగలుగును.

ఖడ్గధారపై (కత్తిపదునుపై) నడచుట వంటిది తంత్ర విద్యాసాధనలు. వానికై సాధకునిలో పురుషార్థము, సాహసము, దృఢత, నిర్భయత్వము, ధైర్యము పుష్కలముగా ఉండవలెను. ఇట్టి వ్యక్తి యోగ్యుడు అనుభవజ్ఞుడునగు గురువు యొక్క అధ్యక్షమున (పర్యవేక్షణమున) స్థిర చిత్తముతో శ్రద్ధగ సాధనచేసినచో సాధనలో అభీష్టసిద్ధిని పొందగలుగును. కాని నిర్బలమైన మానసిక ప్రవృత్తి గలిగిన పిరికివాడు, సందేహయుక్తమగు స్వభావముగలవాడు, శ్రద్ధలేనివాడు, స్థిరమైన మతిలేనివాడు నగుమానవుడు ఏ సాధనను ప్రారంభించినను ఏకొంచెము ఇబ్బందియైన కలిగినచో దానిని వదలి పారిపోవును. ఎవడైన సింహమునుగాని సర్పమునుగాని మొదట రెచ్చగొట్టి, అది కోపముతో తనపైదూకినచో చేతిలోని కఱ్ఱ అదిపారవేసి వెనుకముందు ఆలోచించకుండా పరుగిడును. ఇట్లు పారిపోవు మానవుని వెనుక ఆసింహము లేదా సర్పము మిగుల కోపముతో సాహసముతో పరుగిడి వానిని క్రిందపడవేయును. మనుష్యుడు ఏదైనా ఒక భూతమునుగాని పిశాచమునుగాని వశము చేసి కొనుటకు తాంత్రిక సాధన చేయుచుండుట మనము చూచుచుందుము. వాని సాధనముందుకు పోవుచున్నచో ఎన్నియో అపాయములు ఎదురగును. వానికి భయపడి ఆమనుష్యుడు తనసాధనను వదలిపారిపోవును. ఆ సాధకునిలో సాహసము లేనిచో, ఒకానొక భయంకర దృశ్యమును చూచి భయబడినచో భయపెట్టునట్టి శక్తులు వానిపై దాడిచేయును. తత్ఫలితముగు అతడు భయంకరమగు నష్టమును ఎదుర్కొనవలసి వచ్చును. కొందరు పిచ్చివారగుదురు, కొందరు చివరకు ప్రాణములనుగూడ పోగొట్టుకొందురు.

తంత్రము ఉత్తేజమును కలిగించు ఒక ఉగ్ర ప్రణాళిక. ఈ ప్రక్రియననుసరించి చేయబడుసాధన వలన ప్రకృతిలోపల ప్రబల ప్రకంపనలు బయలుదేరును. వానివలన తాపము వ్యాకులత పెరుగును. గ్రీష్మ కాలములో సూర్యుని తీక్ష్ణకిరణములవలన వాతావరణములో ఉష్ణోగ్రత పెరుగును. గాలి వేడిగా వీచుచుండును. వడగాల్పులు, తుఫానులు వచ్చును. ఆ ఉగ్రమైన ప్రేరణలో ప్రమాదములు పెరుగును. కొంతమందికి వడదెబ్బ తగులును, కొందరికి కన్నులలో దుమ్ముపడును, కొందరికి శరీరములమీద

వడగడ్డలు లేచును. తుఫానువలన ఇండ్లకప్పులు లేచిపోవును. చెట్లు పెల్లగిలిపోవును. చాలమారులు సుడిగాలులు బయలు దేరును. ఒక చిన్న వలయములో చాలవేగముగ నృత్యము చేయుచు భీతిగొల్పు ఆకారములు కనబడును. తంత్ర సాధనలవలన గ్రీష్మకాలమువంటి ఉత్పాతములు పుట్టును. మానవుని లోపల బయట వాతావరణములో ఒక విధమగు సూక్ష్మమైన వడగాలి, తుఫాను లేచును. ప్రచండములగు కుదిలింపులు దానికి ఉండును. ఈ కుదిలింపులు మెదడులోని కల్పనా తంతువులతో పోటిపడినప్పుడు అనేక విధములగు భయంకరములైన ఆకారములు కనబడసాగును. ఇట్టి సమయములో భీతిగొల్పు భూత-ప్రేత-పిశాచముల వంటి, దేవ-దానవులవంటి ఆకారములు కనబడును. దృష్టి దోషము కలిగినప్పుడు ఒకటి మరొకటిగా కనబడును. అనేక విధములగు శబ్ద-రూప-రస-గంధ-స్పర్శలు అనుభూతములగును. సాధకుడు నిర్భయముగ సహజములగు ఈ ప్రతీకారములను చూచి నవ్వకుండా ఉన్నచో వాని సాహసము నశించును. ఆ భయంకరమైన వానికి లొంగినచో అవి వానిని కష్టములపాలుజేయును.

ఈ విధములగు కాఠిన్యములను ప్రతి ఒక్కడు ఎదుర్కొనలేడు. దీనికై విశేషమగు ఒక విధమైన సాహసముతో నిండిన మనోభూమి ఉండవలెను. మానవుడు ఇతరుల విషయమున పరిశీలన బుద్ధి కలిగి యుండును. కాని తమ స్థితిని సరిగ పరిశీలించు వారు విరళముగ ఉందురు. "నేను తంత్ర సాధనలను చేయగలనా లేదా" అను నిర్ణయమును తనంతటనే తానుగా ఏమనుష్యుడు చేయలేడు. దీనికై అనుభవము గలిగిన మరియొక వ్యక్తియొక్క సాహాయ్యమును తీసికొనవలెను. రోగి తన చికిత్సను తాను చేసికొన లేనట్లు, విద్యార్థి తనంతట తాను విద్యను పొందలేనట్లు తాంత్రికసాధనలు గూడ తమంతటతాము చేయబడ జాలవు. దీనికై మరియొక విజ్ఞుడైన పురుషుని గురువుగా నియమించుకొనవలెను. ఆగురువు మొట్టమొదట తన శిష్యుని మనోభూమిని పరిశీలింపవలెను. అప్పుడు ఆ పరీక్షను ఆధారముగా జేసికొని- " ఈ వ్యక్తికి ఏసాధన ఉపయోగముగా ఉండును? ఆవిధిలో ఇతరులకంటె వీనికొరకు ఏమైనమార్పులను చేయవలయునా" అని నిశ్చయించును. సాధనా కాలములో కలుగువిక్షేపములకు తాత్కాలికములైన ఉపచారములను చేయుట, భవిష్యత్తుకై రక్షణ వ్యవస్థను కల్పించుట గురువు ద్వారానే సంభవమగును. అందువలన తంత్ర సాధనలు గురుపరంపరద్వారానే జరుగును. అసాధారణ శక్తిని పొందవలెననెడి ఆశతో అధికారములేని సాధకుడు స్వయముగ అసంబద్ధమైన రీతితో చేయకుండగనుండుగాక! అందులకై వానిని గుప్తముగా ఉంచిరి. రోగి దగ్గర మిఠాయిలను ఉంచరాదు, ఎందుకనగా జీర్ణశక్తిలేక పోయినప్పటికి ఆశకొలది వాడువానిని తినినచో చివరకు వానికి కీడు కలుగును.

తంత్ర సాధనలను సాధించుకొనినపిమ్మట ఏశక్తి కలుగునో దానిని దురుపయోగము చేసినచో వానికి సంసారములో గొప్ప అవ్యవస్థ వాటిల్లును, ఇతరులకు కీడుకలుగును.

అనధికారులకు అనావశ్య కముగురీతితో లాభము లేదా నష్టమును కలిగించుట వలన వారికి అనిష్టమేకలుగును. పరిశ్రమ లేకుండగ కలుగు ప్రయోజనము అనేకవిధముల దుర్గుణములను పుట్టించును. జూదము ఆడి పదివేల రూపాయలను సంపాదించినవాడు ఆ రూపాయలను సద్వినియోగముచేయలేడు. వానివలన వాస్తవమగు సుఖమును పొందలేడు. ఇట్లే ఈశ్వరీయ విధివలన లేదా రాజకీయ విధివలన లభించు సహజమగు శిక్షనుండి తప్పించుకొని ఎవనికైన మంత్రబలముతో హానిని కలిగించినచో అది గర్భపాతమువలె అహితకరమే యగును. తంత్రములో సఫలుడగు వ్యక్తి ఇట్టి గందర గోళమును సృష్టించగలడు. అందువలన ప్రతివానికి దానిని సాధన చేయు అధికారము ఈయబడలేదు. అది ఒక విశేషమగు మనోభూమిగల వ్యక్తులకే పరిమితమగు ప్రదేశమున ఉపయోగములోనికి వచ్చు వస్తువు. అందువలన అందరికి సంబంధించినదిగ దానిని వ్యక్తము చేయలేదు. మన గృహములు అధికార పూర్వకముగ నివసించువ్యక్తుల ఉపయోగముకొరకే ఉండును. స్వగృహములు ధర్మసత్రములవలె ఉండవు. ప్రతివాడు మరియొకని యింటిలో ప్రవేశించుటకు వీలులేదు. తంత్రముగూడ అధికార సంపన్నమైన మనోభూమిగల గల విశేషవ్యక్తుల గృహము. దానిలోనికి ప్రతివానికి ప్రవేశము లేదు. అందువలన దానిని పరిమితమైన హద్దులో ఉంచుటకే గుప్తముగా చేసిరి.

తంత్రగ్రంథములలో వ్రాయబడిన సాధనావిధులు అసంపూర్ణములని మనకు తెలియను. వానిలో రెండు విషయములే లభించును-ఒకటి సాధనా ఫలము, రెండవది సాధనా విధికి సంబంధించిన ఒక చిన్న భాగము. "జమ్మి కట్టెను హోమము చేసినచో పుత్రుడు పుట్టును" అని ఒకచోట ఉన్నది. ఈ మాత్రపు ఉదాహరణను ఆధారముగా జేసికొని ఎవడైన జమ్మికట్టెల మోపును పొయ్యిలో పడవేసిన వాని మనోవాంఛితము నెరవేరునా? ఈ సాధనావిధి తప్పు అని మూర్ఖులు భావింతురు. కాని ఈ శైలితోవర్ణించుటలో తంత్రకారుల ఉద్దేశ్యమేమనగా - ఈ సాధనావిధిసంకేతము స్థిరముగ ఉండుగాక! దీనివలన ఈ విద్యకు లోపము కలుగుకుండుగాక! అది విస్మృతము కాకుండుగాక! ఇదిసూత్ర ప్రణాళిక. వ్యాకరణాది సూత్రములు చాలా చిన్నవిగా ఉండును. వానిలో అక్షరములు పది లేదా అయిదు చొప్పున ఉండును. అర్థము ఎక్కువగా ఉండును. అవి లఘుసంకేత మాత్రములుగ నుండును. వానితో పని చేయవలసివచ్చినచో ఆసమయమునకు విషయమంతము గుర్తుకువచ్చును. రహస్య కార్యములను చేయు దొంగలు, కుట్రలు పన్నువారు, లేదా గూఢచారులగు పోలీసులు మున్నగువారు ఇట్టి సంకేతములను కొన్నింటిని సిద్ధము చేసికొందురు. వానిద్వారా రెండు మూడు మాటలను చెప్పుట వలననే ఒక అర్థము తెలియబడును.

ఈ సంకేతసూత్రములో ఒక గొప్పవిధానము దాగియున్నది. ఏ మనోభూమి గల మనుష్యుడు, ఏసమయమున,

ఏనియమములతో, ఏయుపకరణములతో, ఏమంత్రములతో ఎంతహోమము చేయ వలెను? అప్పుడు పుత్రప్రాప్తి యగును. ఈ విధానమంతయు ఆసూత్రమున దాచిపెట్టబడియున్నది. దాచిపెట్టుటలో గల ఉద్దేశ్యము - అధికారములేనివారు దానిని ప్రయోగింపకుండుటయే. సంకేతరూపమున చెప్పుట - కాలాంతరమున ఈ సత్యమును మరువకుండగనుండుటకే. ఆధారముండుట వలన ముందు విషయము జ్ఞప్తికి వచ్చుట సుగమమగును. ఈతంత్రగ్రంథములలో సాధనా విధులను గుప్తముగ నుంచవలసినదిగ పలువిధముల చెప్పుట జరిగినది. దానితో పాటు అక్కడక్కడ ఎన్నోవిధులు చెప్పబడినవి. చూచుట కవి చాల సుగమముగ ఉండును. కాని వాని ఫలము చాల అధికమని చెప్పబడినది. ఈ దశలో తెలియని వారికి ఇది చాల చిక్కు సమస్యగా ఉండును. వారు ఒకప్పుడు దానిని చాలా తేలికయని భావింతురు. ఒకప్పుడు దానిని అసత్యమని తలంతురు. కాని వాస్తవస్థితి వేరుగా ఉన్నది. సంకేత సూత్రవిధితో ఆసాధనలను వర్ణించి తంత్రకారులు తమ రహస్య వాదమనః ప్రవృత్తిని పరిచయము చేసిరి.

గాయత్రికి రెండు ప్రయోగములున్నవి. ఒకటి దక్షిణమార్గము, రెండు వామ మార్గము. అవి యోగములు మరియు తంత్రములును. దానివలన ఆత్మ దర్శనము బ్రహ్మప్రాప్తి కలుగును. అట్లే సాంసారికమైన ఉపార్జన(సంపాదన) మరియు సంహారము గూడకలుగును. గాయత్రీ యోగము దక్షిణ మార్గము. ఆమార్గము ద్వారా ఆత్మ సుఖమును పొందవలెననెడు మన ఉద్దేశ్యము నెరవేరును. గాయత్రీ తంత్రము వామమార్గము. దానివలన సాంసారిక వస్తువులు లభించును. ఎవనినైన నాశము గూడ చేయ వచ్చును. తంత్రవిషయము రహస్యమైనది. అందువలన గాయత్రీతంత్ర గ్రంథములవలన ఇట్టి సాధనలు అనేకములు లభించును. వానియందు ధనము, సంతానము, స్త్రీ, ఆరోగ్యము, పదప్రాప్తి, రోగ నివారణము, శత్రునాశనము పాపనాశము, వశీకరణము మున్నగు లాభములు వర్ణింపబడినవి. సంకేతముగ ఆసాధనలలోని ఒక అంశము చెప్పబడినది. ఈ సంక్షిప్త సంకేతముల వెనుక ఒక పెద్ద కర్మాకాండ, విధి విధానము దాగియున్నదని తెలిసికొనవలెను. అది పుస్తములలో లేదు, అనుభవజ్ఞులు సాధనాసంపన్నులునగు వ్యక్తుల వలన లభించును.

తంత్రగ్రంథములనుండి సంగ్రహించినకొన్ని సంకేతములు తరువాత పుటలలో ఈయబడుచున్నవి. దానివలన పాఠకులకు గాయత్రి ద్వారా లభించు గొప్పలాభములను గూర్చిన పరిచయము కొద్దిగా లభించును.

# అథ గాయత్రీ తంత్రమ్

నారద ఉవాచ :-

నారాయణ మహాభాగ గాయత్ర్యా తు సమన్వితః।
శాన్త్యాదికాన్ ప్రయోగాన్ త్వం వదస్వ కరుణానిధే। 1

నారదుడు అడిగెను :- నారాయణా ! గాయత్రికి సంబంధించిన శాంతిమున్నగు ప్రయోగములను చెప్పుము.

నారాయణ ఉవాచ :-

అతిగుహ్యమిదం పృష్టం త్వయా బ్రహ్మతనూభవ।
వక్తవ్యం న కస్మైచిద్ దుష్టాయ పిశునాయచ। 2

నారాయణుడు పలికెను :- నారదా! నీవు చాల రహస్యమైన విషయమును అడిగితివి. కాని దానిని దుష్టునకుగాని లోభికిగాని చెప్పవద్దు.

అథ శాన్త్యర్థముక్తాభిః సమిద్భిర్జుహుయాద్ద్విజః।
సర్వే సమిద్భిః శామ్యన్తి భూత రోగ గ్రహాదయః। 3

ద్విజులు శాంతిని పొందుటకు హోమము చేయవలెను. జమ్మి సమిధలతో హోమము చేసిన భూతరోగములు, గ్రహాదులు శాంతించును.

ఆర్ద్రాభిః క్షీర వృక్షస్య సమిద్భిః జుహుయాద్ద్విజః।
జుహుయాచ్ఛకలైర్వాపి భూతరోగాది శాన్తయే। 4

పాలుగలిగిన చెట్టుయొక్క పచ్చి సమిధలతో హోమము చేసిన గ్రహాదులకు శాంతి కలుగును. అందువలన రోగాదులు శాంతించుటకు సర్వవిధ సమిధలతో హోమము చేయవలెను.

జలేన తర్పయేత్సూర్యం పాణిభ్యాం శాన్తిమాప్నుయాత్।
జానుదఘ్నే జలే జప్త్వా సర్వాః దోషశమో భవేత్। 5

సూర్యునకు చేతులతో జలమును తర్పణము చేసిన శాంతి కలుగును. మోకాళ్ళవరకు నీటిలో నిలబడి జపించినచో సర్వదోషములు శాంతించును.

కంఠదఘ్నే జలే జప్త్వా ముచ్యేత్ ప్రాణాన్తకా ద్భయాత్।
సర్వేభ్యః శాంతి కర్మేభ్యో నిమజ్యాప్సు జపః స్మృతః। 6

కంఠమువరకు జలములో నిలబడి జపము చేసినచో ప్రాణములు పోవునను భయముండదు. అందువలన సర్వ విధశాంతిని పొందుటకు జలములో ప్రవేశించి జపము చేయుట ఉత్తమము.

**సౌవర్ణే రజతే వాపి పాత్రే తామ్రమయే ఒ పివా ।**
**క్షీరవృక్షమయే వాపి నిశ్ఛిద్రే మృణ్మయేఽపి వా ।** 7
**సహస్రం పంచగవ్యేన హుత్వా సుజ్వలితే ఒనలే ।**
**క్షీరవృక్షమయైః కాష్ఠైః శేషం సంపాదయేచ్ఛ్రనైః ।** 8

బంగారము-వెండి-రాగి పాత్రలయందుగాని, పాలు గలిగిన చెట్టు కట్టెతో చేయబడిన పాత్రయందుగాని, రంధ్రములు లేని మట్టిపాత్రయందుగాని పంచగవ్యమునుంచి పాలుగలిగిన చెట్టు కట్టెలతో ప్రజ్వలితమగు అగ్నిలో హోమము చేయవలెను.

**ప్రత్యాహుతిం స్పృశన్ జప్త్వా తద్గవ్యం పాత్రసంస్థితమ్ ।**
**తేనైవ ప్రోక్షయేద్దేశం కుశైర్మంత్రమను స్మరన్ ।** 9

ప్రతి ఆహుతియందు పంచగవ్యమును స్పృశించవలెను. మంత్రమునుచ్చరించుచు కుశలద్వారా పంచగవ్యముతోనే ప్రదేశమునంతటిని మార్జనము చేయవలెను.

**బలింప్రదాయ ప్రయతో ధ్యాయేత పరదేవతామ్ ।**
**అభిచారసముత్పన్నా కృత్యా పాపంచ నశ్యతి ।** 10

తరువాత బలినొసంగి దేవతలను ధ్యానించవలెను. ఇట్లు ధ్యానించుటవలన అభిచారమునుండి పుట్టిన కృత్య, పాపము శాంతించును.

**దేవభూత పిశాచాదీన్ యద్యేవం కురుతే వశే ।**
**గృహం గ్రామం పురం రాష్ట్రం సర్వం తేభ్యో విముచ్యతే ।** 11

దేవతలు, భూతములు, పిశాచములు మున్నగు వానిని వశపరచుకొనుటకుగూడ పైన చెప్పబడిన విధిని ఆచరింపవలెను. ఈ విధమగు కర్మవలన దేవతలు, భూతములు, పిశాచములు సమస్తము తమతమ గృహములను, గ్రామములను, నగరములను, రాజ్యములను వదలిపోవును.

**చతుష్కోణే హి గంధేన మధ్యతో రచితేన చ ।**
**మండలే శూల మాలిఖ్య పూర్వోక్తే చ క్రమేణ వా ।**
**అభిమంత్ర్య సహస్రం తన్నిఖనేత్సర్వ సిద్ధయే ।** 12

చతుష్కోణ మండలము నందు గంధముతో శూలమును చిత్రించి పూర్వోక్తవిధితో సహస్రగాయత్రిని జపించి పాతిపెట్టినచో సర్వవిధములగు సిద్ధులు లభించును.

**సౌవర్ణం రాజతం వాపి కుంభం తామ్రమయం చ వా ।**
**మృణ్మయం వా నవం దివ్యం సు త్రవేష్టిత మవ్రణమ్ ।** 13

మండలే సైకతే స్థాప్యం పూరయేన్మంత్రి తైర్జలైః ।
దిగ్భ్య ఆహృత్య తీర్థాని చతస్సృభ్యో ద్విజోత్తమైః । 14

బంగారము, వెండి, రాగి, మట్టి మున్నగువానిలో నుండి రంధ్రములు లేని ఏదో ఒక కుండను తీసికొని సూత్రముతో చుట్టి ఇసుక గలిగిన ప్రదేశమున నిలిపి బ్రాహ్మణోత్తములు నలుదిక్కులనుండి తెచ్చిన జలములతో దానిని నింపవలెను.

ఏలా-చందన-కర్పూర-జాతీ-పాటల-మల్లికాః । 15
బిల్వపత్రం తథా క్రాన్తాం దేవీం వ్రీహి యవాంస్తిలాన్ ।
సర్షపాన్ క్షీరవృక్షాణాం ప్రవాలాని చ నిక్షిపేత్ । 16

ఏలకి, మంచిగంధము, కర్పూరము, జాజికాయ, కలిగొట్టు, మల్లె మారేడు, విష్ణుక్రాంతము, దేవి, యవలు, నువ్వు, ఆవ, క్షీరములను స్రవించు వృక్షములు - వీని ఆకులను దానిలో విడువలెను

సర్వమేవ వినిక్షిప్య, కుశకూర్చ సమన్వితమ్ ।
స్నాతః సమాహితో విప్రః సహస్రం మంత్రయేద్బుధః । 17

ఇట్లు అన్నింటిని దానిలో వదలి, దర్భలతో కూర్చను చేసి, దానిని గూడ కడవలో ఉంచి, స్నానము చేసి ఒక్కవెయ్యిమారులు మంత్రమును జపింపవలెను.

దిక్షు సారానధి మీరన్ మంత్రాన్ విప్రాస్త్రయీవిధః ।
ప్రోక్షయే త్పాయయేదేనం నీరం తేనాభిషించయేత్ । 18

వేదవేత్తలగు బ్రాహ్మణులు మంత్రములతో పవిత్రము చేసిన జలమును భూతాదులచే పీడితుడగు పురుషునిపై చల్లి, వానిచే ఆనీరు త్రాగించవలెను. గాయత్రీ మంత్రముతో పాటు ఆజలముతో వానిని అబిషేకించవలెను.

భూత రోగాభిచారేభ్యః స నిర్ముక్తః సుఖీ భవేత్ ।
అభిషేకేన ముచ్యేత మృత్యోరాస్యగతో నరః । 19

ఇట్లు స్నానము చేయించగా మరణాసన్నుడగు మనుష్యుడుగూడ భూత వ్యాధినుండి ముక్తుడై సుఖియగును.

అవశ్యం కారయే ద్విద్వాన్ రాజా దీర్ఘం జిజీవిషుః ।
గావో దేయాశ్చ ఋత్విగ్భ్యో హ్యభిషేకే శతం మునే । 20
తేభ్యో దేయా దక్షిణా చ యత్కించి చ్ఛక్తిపూర్వకమ్ ।
జపేదశ్వత్థ మాలంబ్య మందవారే శతం ద్విజః । 21
భూతరోగాభిచారేభ్యో ముచ్యతే మహతో భయాత్,

ఓమునీ! చాలాకాలము జీవింపదలచిన విద్వాంసుడుగురాజా ఈ కార్యమును తప్పక చేయంపవలెను. ఈ అభిషేక సమయమున ఋత్విక్కులకు నూరుగోవులను దక్షిణగానీయవలెను, లేదా బ్రాహ్మణులను సంతోష పెట్టి మరోకదక్షిణ నీయవలెను, లేదా తనశక్తికొలది దానమునీయవలెను. శనివారమునాడు రావిచెట్టుక్రింద కూర్చుండి నూరుమారులు జపము చేయు బ్రాహ్మణుడు నిస్పందేహముగ భూత బాధాదులనుండి విముక్తుడగును.

గుడూచ్యాః పర్వ విచ్ఛిన్నైర్హుహూయాద్దుగ్ధే సిక్తకైః । 22

తిప్పతీగె సమిధలను నేతిలో ముంచి హోమముచేసిన ద్విజుడు సర్వవ్యాధుల నుండి విముక్తుడగును.

**ద్విజో మృత్యుంజయో హోమః సర్వవ్యాధి వినాశనః ।**
**ఆమ్రస్య జుహుయాత్పత్రైః పయసా జ్వరశాన్తయే ।** 23

జ్వరము తగ్గుటకు నేతిలో తడిపిన మామిడి ఆకులతో ద్విజుడు హోమము చేయవలెను. అది మృత్యువును జయించు హోమము.

**బచాభిః పయః సిక్తాభిః క్షయం హుత్వా వినాశయేత్ ।**
**మధుత్రితయ హోమేన రాజయక్ష్మా వినశ్యతి ।** 24

పాలలో వసను అభిషిక్తము చేసి హోమము చేసినచో క్షయరోగము నశించును. పాలు, పెరుగు, నెయ్యి ఈ మూడింటిని అగ్నిలో హోమముచేసినచో రాజయక్ష్మ (క్షయరోగము) నశించును.

**నివేద్య భాస్కరాయాన్నపాయసం హోమపూర్వకమ్ ।**
**రాజయక్ష్మాభిభూతం చ పాయయే ఛ్ఛాన్తి మాప్నుయాత్ ।** 25

పాయసాన్నమును సూర్యునకు నివేదించవలెను. హోమము చేయగా మిగిలిన పాయసమును క్షయ రోగిచే తినిపించినచో వానిరోగము శాంతించును

**లతాః పర్వసు విచ్ఛిద్య సోమస్య జుహుయాద్ద్విజః ।**
**సోమే సూర్యేణ సంయుక్తే ప్రయుక్తా క్షయ శాన్తయే ।** 26

అమావాస్యనాడు సోమలత యొక్క కొమ్మను నరికి హోమము చేసినచో క్షయరోగము నివారించును.

కుసుమైః శంఖవృక్షస్య హుత్వా కుష్ఠం వినాశయేత్ ।
అపస్మార వినాశః స్యాదపామార్గస్య తండులైః ।

శంఖవృక్షము యొక్క పుష్పములతో హోమము చేసినచో కుష్ఠరోగము నశించును. ఉత్తరేణు గింజలతో హోమము చేసినచో అపస్మారరోగము నశించును.

**క్షీరవృక్ష సమిద్ధోమా దున్మాదోఽపి వినశ్యతి ।**
**ఔదుంబర సమిద్ధోమా దతిమేహః క్షయం వ్రజేత్ ॥ 28**

పాలుస్రవించు చెట్టుయొక్క సమిధలతో హోమము చేసిన ఉన్మాదరోగము ఉండదు. మేడి చెట్టు సమిధలతో హోమము చేసిన అతిమూత్రవ్యాధి నశించును

**ప్రమేహం శమయేద్ధుత్వా మధునే క్షురసేన వా ।**
**మధుత్రితయహోమేన నయేచ్ఛాన్తిం మసూరికామ్ ॥ 29**

అతిమూత్రవ్యాధి నివారణకై తేనెతో లేదా చెరకు రసముతో హోమము చేయవలెను. మశూచి కారోగము శాంతించుటకు మధుత్రయము (పాలు, నెయ్యి, పెరుగు) తో హోమము చేయవలెను.

**కపిలా సర్పిషాహుత్వా నయే చ్ఛాన్తిం మసూరికామ్ ।**
**ఉదుంబర వటా ఽ శ్వత్థై ర్గోగజా శ్వామయం హరేత్ ॥ 30**

కపిలగోవు నేతితో హోమము చేసినచో మశూచికారోగము తొలగును. ఆవుకు వచ్చురోగముల నివారణకు మేడి సమిధలతోను, ఏనుగుకు వచ్చురోగముల నివారణకు మఱ్ఱి సమిధలలోను, గుఱ్ఱమునకు వచ్చు వ్యాధులు పోవుటకు రావి సమిధలతోను హోమము చేయవలెను.

**పిపీలి మధువల్మీకే గృహే జాతే శతం శతమ్ ।**
**శమీ సమిద్భిరన్నేన సర్పిషా జుహుయాద్ద్విజః ॥ 31**

ఇంటిలో చీమలు పుట్టలు పెట్టిన, అట్లే తేనెటీగలు తెట్టెలు పెట్టిన జమ్మి సమిధలతో హోమము చేయవలెను. దానితో పాటు అన్నము, నెయ్యి కూడ ఉండవలెను.

**అభ్రస్తనిత భూకంపే సమిద్భిర్వనవేతసః ।**
**తదుత్థం శాన్తిమాయాతి జుహుయాత్తత్ర బలిం హరేత్ ॥ 32**

ఉరుములు మెరుపులతో భూకంపము కలిగినచో అడవిప్రబ్బలిచెట్టు కట్టెలతో హోమము చేయవలెను. ఆభూకంపము వలన కలుగు భయము శాంతించును.

**సప్తాహం జుహుయాదేవ రాష్ట్రే రాజ్యే సుఖం భవేత్ ।**
**యాం దిశం శతజప్తేన లోష్టేనాభిప్రతిడయేత్ ॥ 33**

**తతోఽగ్ని మారు తారిభ్యో భయం తస్య వినశ్యతి ।**
**మనస్యైవ జపేదేనాం బద్ధో ముచ్యేత బంధనాత్ ।** 34

ఏవైపునైన దిక్కు తగులబడుచున్నచో ఏడుదినములవరకు మంత్రమును జపించి ఆదిక్కున తగుల బడుచున్న వైపు మట్టిపెడ్డను విసరవలెను. ఇట్లు చేసిన శాంతికలుగును. ఒక సప్తాహము వరకు ఈ క్రియను చేయుచుండుట వలన రాజ్యములోను, రాష్ట్రములోను సుఖముకలుగును.

బంధనమున చిక్కుకొనిన మానవుడు గాయత్రీ మంత్రమును మనుస్సులో జపించినచో బంధనమునుండి ముక్తుడుగును.

**భూతరోగ విషాదిభ్యః వ్యథితం జప్త్వా విమోచయేత్ ।**
**భూతాదిభ్యో విముచ్యేత జలం పీత్వాభిమంత్రితమ్ ।** 35

భూతరోగము, విషము మున్నగువాని వలన పీడితుడగు పురుషుడు గాయత్రీ మంత్రమును జపించవలెను. (దర్భలతో జలమును స్పృశించుచు గాయత్రీ మంత్రమును జపించవలెను. తరువాత ఆజలమును భూత-ప్రేత-పిశాచాదులచే పీడింపబడు మానవునిచే త్రాగింపవలెను. అట్లు చేసినచో అతడు రోగముక్తుడగును.)

**అభిమంత్ర్య శతం భస్మ న్య సద్భూతాని శాన్తయే ।**
**శిరసా ధారయేద్ భస్మ మంత్రయిత్వా తదిత్యృచా ।** 36

గాయత్రీ మంత్రముతో అభిమంత్రించిన భస్మమును పూసికొనుటవలన భూతప్రేతములకు శాంతి కలుగును. మంత్రమును ఉచ్చరించుచు మంత్రింపబడిన భస్మమును పీడితుడగు వ్యక్తి శిరస్సుపై పూయవలెను

**అథ పుష్టిం శ్రియం లక్ష్మీం పుష్పైర్హుత్వాప్ను యాద్ద్విజః ।**
**శ్రీకామో జుహుయాత్పద్మైః రక్తైః శ్రియమవాప్నుయాత్ ।** 37

శ్రీని, సౌందర్యమును కోరు పురుషుడు ఎఱ్ఱని తామరపూలతో హోమము చేసినచో శ్రీ లభించును (లక్ష్మిని గోరుపురుషులు గాయత్రీ మంత్రమును ఉచ్చరించుచు పుష్పములతో హోమము చేయవలెను.)

**హుత్వా శ్రియమవాప్నోతి జాతీపుష్పైర్నవైః శుభైః ।**
**శాలి తండుల హోమేన శ్రియమాప్నోతి పుష్కలామ్ ।** 38

జాతీపుష్పములతో (జాజికాయ) హోమము చేసినచో లక్ష్మి లభించును. అందువలన లక్ష్మిని (సంపదను) గోరువాడు నవీన జాతి పుష్పములతో హోమము చేయవలెను. శాలిబియ్యముతో హోమము చేయగా లక్ష్మి (సంపద) లభించును.

శ్రియమాప్నోతి పరమాం మూలస్య శకలైరపి ।
సమిద్భిర్బిల్వ వృక్షస్య పాయసేన చ సర్పిషా । 39

మారేడు చెట్టు వ్రేళ్ళుతో, పాయసముతో, నెయ్యితో హోమము చేసినచో లక్ష్మి కలుగును. లేదా వ్రేళ్ళకు బదులు మారేడు కఱ్ఱలను, ఆకులను, పూలను,పండ్లను ఎండబెట్టి, దంచి పొడిచేసి దానితో నెయ్యిని పాయసమును కలిపి హోమము చేయవలెను.

శతం శతం చ సప్తాహం హుత్వా శ్రియమవాప్నుయాత్ ।
లాజైస్తు మధురోపేతైర్హోమే కన్యామవాప్నుయాత్ । 40

మధుత్రయమును( పాలు, పెరుగు, నెయ్యి) కలిపి పేలాలతో ఏడుదినములవరకు నూరు నూరు ఆహుతుల నిచ్చుచు హెూమము చేసినచో సుందరియైన కన్య లభించును.

అనేన విధినా కన్యా వరమాప్నోతి వాంఛితమ్ ।
హుత్వా రక్తోత్పలైః హేమం సప్తాహం ప్రాప్నుయాత్ఖలు । 41

ఈ విధిలో హోమము చేయగా కన్య సుందరుడైన కోరిన వరుని పొందును. ఏడు దినముల వరకు ఎఱ్ఱని తామరపూలతో హోమము చేసిన బంగారము లభించును

సూర్యబింబే జలం హుత్వా జలస్థం హేమమాప్నుయాత్ ।
అన్నం హుత్వాప్నుయాదన్నం వ్రీహీన్ వ్రీహిపతిర్భవేత్ । 42

సూర్య బింబమునందు జలమును వదలినచో జలములో ఉన్న బంగారము లభించును. అన్నమును హోమము చేసిన అన్నము లభించును. వ్రీహి (వడ్లు)తో హోమము చేసిన వ్రీహిపతి యగును. (అనగా ధాన్యము ఎక్కువగా లభించును)

కరీషచూర్ణైర్వ త్సస్య హుత్వా పశుమవాప్నుయాత్ ।
ప్రియంగు పాయసాజ్యైశ్చ భవేద్ధో మాదిష్ట సన్తతిః । 43

ఆవుదూడ పేడతో హోమము చేసిన పశువులు లభించును. కొఱ్ఱల పాయసముతోను, నెయ్యితోను హోమము చేసిన అభీష్టమైన సంతానమును పొందును.

నివేద్య భాస్కరాయాన్నం పాయసం హోమపూర్వకమ్ ।
భోజయేత్తదృతుస్నాతాం పుత్రరత్నమవాప్నుయాత్ । 44

హోమము చేసి సూర్యునకు పాయసాన్నమును నివేదించి ఋతుస్నానముచేసిన స్త్రీకి భోజనము పెట్టినచో పుత్రుడు కలుగును.

సప్రరోహాభిరార్ద్రా భిర్హుత్వా ఆయుష్యమాప్నుయాత్ ।
సమిద్భిః క్షీరవృక్షస్య హుత్వా ఒఒ యుష్యమవాప్నుయాత్ । 45

మోదుగు సమిధలతో హోమము చేసిన ఆయుర్దాయము పెరుగును. పాలుగారు చెట్ల పుల్లలతో హోమము చేసినను ఆయుర్దాయము వృద్ధి చెందును.

**సంప్రరోహిభి రార్ద్రాభిః యుక్తా భిర్మధురత్రయైః ।**
**వ్రీహీణాం చ శతం హుత్వా హేమం చాయురవాప్నుయాత్ । 46**

మోదుగ సమిధలతో హోమము చేసిన మరియు యవలతో హోమము చేసిన, మధురత్రయములోను వ్రీహిధాన్యములోను నూరు ఆహుతులనిచ్చిన సువర్ణమును ఆయుర్దాయమును పొందును.

**సువర్ణ కమలం హుత్వా శతమాయు రవాప్ను యాత్ ।**
**దూర్వాభిః పయసా వాపి మధునా సర్పిషాపి వా । 47**

**శతం శతం చ సప్తాహ మపమృత్యుం వ్యపోహతి ।**
**శమీసమిద్భి రన్నేన పయసా వాచ సర్పిషా ! 48**

బంగారు తామరపూలతో హోమము చేసినచో మానవుడు నూరు సంవత్సరములు జీవించును. గరికతోను, పాలతోను, తేనెతోను, నెయ్యితోను, నూరు నూరు ఆహుతుల నిచ్చినచో అకాల మృత్యుభయముండదు. జమ్మిపుల్లలతో,పాలతో, నేతితో హోమము చేసినను అపమృత్యువు కలుగునను భయముండుదు.

**శతం శతం చ సప్తాహమమృత్యుం వ్యపోమతి ।**
**న్యగ్రోధ సమిధో హుత్వా పాయసం హోమయేత్తతః । 49**

మర్రి చెట్టు సమిధలతో నూరు నూరు చొప్పున ఆహుతులనిచ్చినను అపమృత్యు భయముండదు.

**శతం శతం చ సప్తాహ మపమృత్యు వ్యపోహతి ।**
**క్షీరాహారో జపేన్మృత్యోః సప్తా హాద్విజయీ భవేత్ । 50**

ఒక్క సప్తాహము వరకు పాలను ఆహారముగా తీసికొనుచు నూరునూరు చొప్పున ఆహుతులను ఇచ్చినచో మానవుడు మృత్యువును జయించును.

**అనశ్నన్ వాగ్యతో జప్త్వా త్రిరాత్రం ముచ్యతే యమాత్ ।**
**విమజ్జ్యాప్సు జపేదేవ సద్యో మృత్యోర్విముచ్యతే । 51**

మూడు రాత్రులు ఏమియు తినకుండగ మంత్రమును జపించినచో మృత్యు భయమునుండి ముక్తుడగును. నీటిలో మునిగి గాయత్రిని జపించినచో వేంటనే మృత్యువునుండి విముక్తుడగును.

**జపేద్ బిల్వ సమాశ్రిత్య మాసం రాజ్య మవాప్నుయాత్ ।**
**బిల్వం హుత్వాప్నుయాద్ ద్రవ్యం సమూలం ఫల పల్లవమ్ ।** 52

ఒక మాసము వరకు మారేడు చెట్టు క్రింద కూర్చుండి జపము చేసిన రాజ్యము లభించును. మారేడు చెట్టువ్రేళ్ళతో, పండ్లతో, పూలతో, ఆకులతో హోమము చేసినను రాజ్యము లభించును.

**హుత్వా పద్మశతం మాసం రాజ్యమాప్నోత్య కంటకమ్ ।**
**యవాగుం గ్రామమాప్నోతి హుత్వా శాలిసమన్వితమ్ ।** 53

ఒక్క నెలవరకు మారు పద్మములతో హోమము చేసిన రాజ్యము లభించును. బియ్యపు జావతో హోమము చేసిన గ్రామము లభించును.

**అశ్వత్థసమిధో హుత్వా యుద్ధాదౌ జయమాప్నుయాత్ ।**
**అర్కస్య సమిధో హుత్వా సర్వత్ర విజయీ భవేత్ ।** 54

రావి సమిధలతో హోమము చేసిన యుద్ధమున విజయము లభించును. జిల్లేడు సమిధలతో హోమము చేసిన అంతట విజయము కలుగును.

**సంయుక్తైః పయసా పత్రైః పుష్పైర్వా వేతసస్య చ ।**
**పాయసేన శతం హుత్వా సప్తాహం వృష్టిమాప్నుయాత్ ।** 55

పాలతోగూడిన ప్రబ్బలి చెట్టు పూలతో లేదా ఆకులతో పాయసముతో హోమము చేసిన వర్షము పడును.

**నాభిదఘ్నే జలే జప్త్వా సప్తాహం వృష్టిమాప్నుయాత్ ।**
**జలే భస్మ శతం హుత్వా మహావృష్టిం నివారయేత్ ।** 56

నాభి వరకు నీటిలో నిలబడి ఒక్క సప్తాహము వరకు గాయత్రిని జపించినచో వర్షముపడును. నీటిలో నూరుమారులు హోమము చేసిన అతివృష్టి నివారింపవచ్చును.

**పాలాశైః సమవాప్నోతి సమిద్భిర్బ్రహ్మవర్చసమ్ ।**
**పలాశ కుసుమైర్హుత్వా సర్వమిష్ట మవాప్నుయాత్ ।**

మోదుగసమిధలతో హోమము చేసిన బ్రహ్మతేజస్సు వృద్ధిపొందును. మోదుగపూలతో హోమము చేసిన సర్వాభీష్టములు తీరును.

**పయో హుత్వాప్ను యాన్మేధామాజ్యం బుద్ధిమ వాప్నుయాత్ ।**
**పీత్వాభిమంత్ర్య సురసం బ్రాహ్మ్యా మేధామవాప్నుయాత్ ।** 58

పాలతో హోమము చేసిన, ఘృతాహుతులను ఇచ్చిన బుద్ధి పెరుగును. మంత్రమును ఉచ్చరించుచు బ్రాహ్మీరసమును (పొన్న గంటి ఆకు రసమును) త్రాగినచో సూక్ష్మగ్రాహకమగు బుద్ధిని పొందును.

పుష్ప హోమే భవేద్వాస స్త్రరుభిన్న ద్విధం పటమ్ ।
లవణం మధునాయక్తం హుత్వేష్టం వశమానయేత్ ॥ 59

పుష్పములను హోమము చేసిన వస్త్రము, పిండెలను హోమము చేసినను అదే విధముగు వస్త్రము లభించును. ఉప్పు కలిపిన తేనెతో హోమము చేసిన ఇష్టమైనది వశమగును.

నయేదిష్టం వశం హుత్వా లక్ష్మీవు ష్పైర్మధుప్లుతైః ।
నిత్యమంజలి నాత్మాన మభిషించన్ జలే స్థితః ॥ 60

లక్ష్మీ పుష్పములతో కలిపిన తేనెను హోమము చేసిన ఇష్టమైనది వశమగును. నీటిలో స్థిరముగా ఉండి దోసిలితో తన్ను అభిషేకించు కొనినను (దోసిలిలోనికి నీటిని తీసికొని తనపైచల్లు కొనినను) పైఉద్దేశ్యము పూర్తియగును.

మతిమారోగ్య మాయుష్యన్నిత్యం స్వాస్థ్య మవాప్నుయాత్ ।
కుర్యాద్విప్రోఽన్యముద్దిశ్య సోఽపి పుష్టిమవాప్నుయాత్ ॥ 61

నియమితముగ హోమము చేసినచో మతి, ఆరోగ్యము, చిరాయవు, స్వాస్థ్యము, లభించును. బ్రాహ్మణుడు మరియొక పురుషుని కొరకు చేసినచో అతడు పుష్టిని పొందును.

మచారు విధినా మాసం సహస్రం ప్రత్యహం జపేత్ ।
ఆయుష్కామః శుచౌ దేశే ప్రాప్నుయాదాయురుత్తమమ్ ॥ 62

తగిన రీతిలో ప్రతిదినము ఒక సహస్రజపమును ఒక మాసపర్యంతము చేసినచో ఆయుర్దాయము పెరుగును. ఈ దీర్ఘాయువు, బలము ఉత్తమదేశమున లభించును.

ఆయురారోగ్య కామస్తు జపేన్మాసద్వయం ద్విజః ।
భవేదాయుష్య మారోగ్యం శ్రియం మాసత్రయం జపేత్ ॥ 63

ఆయుష్యమును, ఆరోగ్యమును కోరు ద్విజుడు రెండుమాసములవరకు జపము చేయవలెను. రెండుమాసములవరకు చేసిన ఆయుస్సు, ఆరోగ్యము రెండు లభించును. లక్ష్మిని గోరువాడు మూడుమాసముల పర్యంతము జపము చేయవలెను.

ఆయుః శ్రీ పుత్ర దారాద్యైశ్చతుర్భిః మయశో జపాత్ ।
పుత్రదారాయురారోగ్య శ్రియం విద్యాం చ పంచభిః ॥ 64

నాలుగుమాసముల పర్యంతము జపము చేసిన దీర్ఘాయువు, శ్రీ (లక్ష్మి), స్త్రీ, యశస్సు లభించును. పుత్రుడు, కళత్రము, ఆయుస్సు, ఆరోగ్యము, లక్ష్మి, విద్య లభించుటకు అయిదుమాసముల వరకు జపము చేయవలెను.

ఏవమేవోక్త కామార్థం జపేన్మాసైః మవిశ్చితైః ।
ఏకపాదో జపేదూర్ధ్వ బాహుః స్థిత్వా విరాశ్రయః । 65

ఇట్లు పైన చెప్పబడిన వానిని పొందుటకు నిర్దిష్టములైన మాసములవరకు జపము చేయవలెను. ఒంటికాలిపై ఏఆధారము లేకుండగ నిలబడి, పైకి చేతులను ఎత్తి జపము చేయవలెను.

మాసం శతత్రయం విప్రః సర్వాన్ కామానవాప్నుయాత్ ।
ఏవం శతోత్తరం జప్త్వా సహస్రం సర్వమాప్నుయాత్ । 66

ఇట్లు ఒక్క మాసపర్యంతము 300 మారులు మంత్రమును ప్రతిదినము జపించినచో సర్వకార్యములు సిద్ధించును. ఇట్లు పదునొకండు వందలు నిత్యము జపము చేసిన సర్వ కార్యములు సంపన్నములగును.

రుద్ధ్వా ప్రాణమపానం చ జపేన్మాసం శతత్రయమ్ ।
యదిచ్ఛేత్త దవాప్నోతి సర్వం స్వాభీష్టమాప్నుయాత్ । 67

ప్రాణ-అపానవాయువులను నిరోధించి ఒక్క మాసమువరకు ప్రతిదినము మూడువందలు జపము చేసిన అభీష్టవస్తువు లభించును.

ఏకపాదో జపేదూర్ధ్వం బాహూ రుద్ధ్వానిలం వశీ ।
మాసం శతమవాప్నోతి యదిచ్ఛేదితి కౌశికః । 68

పైకి చేతులెత్తి ఒంటి కాలిపై నిలుచుండి శ్వాసను యథాశక్తిగ నిలిపి ఒక్కమాసము వరకు ప్రతిదినము 100 మారులు జపము చేసిన అభీష్ట వస్తువులను పొందును. ఇది కౌశికుని మతము.

ఏవం శతత్రయం జప్త్వా సహస్రం సర్వమాప్నుయాత్ ।
నిమజ్యాప్సు జపేన్మాసం శత మిష్ట మవాప్నుయాత్ । 69

నీటిలో మునిగి ఒక్కమాసమువరకు ప్రతిదినము మూడువందలు జపించినచో అభీష్టములైన వస్తువులన్ని లభించును.

ఏకం శతత్రయసహస్రం వై జప్త్వైవం సర్వమాప్నుయాత్ ।
ఏకపాదో జపేదూర్ధ్వం బాహూరుద్ధ్వా నిరాశ్రయః । 70

ఇట్లు 1,300 మారులు మంత్రమును ప్రతిదినము జపించినచో సర్వవస్తువులు లభించును. జపించునప్పుడు ఒంటి కాలిపై నిలుచుండి, పైకి చేతులనెత్తి, ఎట్టి ఆధారము లెకుండగ నిలబడవలెను.

నక్తమశ్నన్ హవి ష్యాన్నం వత్సరా దృషితా మియాత్ ।
గిరమోఘా భవేదేవం జప్త్వా సంవత్సరద్వయమ్ । 71

ఇట్లు ఒంటి కాలిపై నిలుచుండి రాత్రియందు హవిష్యాన్నమును తినుచు ఒక్క సప్తాహము వరకు జపము చేసినచో మానవుడు ఋషియగును. ఇట్లే రెండు సంవత్సరములవరకు జపము చేసినచో వాక్కు అమోఘమగును.

త్రివత్సరం జపేదేవం భవేత్ త్రికాల దర్శనమ్ ।
ఆయాతి భగవాన్ దేవశ్చతుః సంవత్సరే జపేత్ । 72

మూడు సంవత్సరములవరకు, ఈ విధిననుసరించి జపించినచో మానవుడు త్రికాలదర్శియగును. నాలుగు సంవత్సరముల వరకు జపించినచో భగవంతుడే దగ్గరకు వచ్చును.

పంచభిర్వత్సరై రేవ మణిమాదియుతో భవేత్ ।
ఏవం షడ్వత్సరం జప్త్వా కామరూపిత్వ మాప్నుయాత్ । 73

ఐదు సంవత్సరముల పర్యంతము జపము చేయుచున్నచో అణిమాది అష్టసిద్ధులు లభించును. ఆరు సంవత్సరముల వరకు ఒంటికాలిపై నిలుచుండి పైకి చేతులనెత్తి జపముచేసిన ఇష్టమువచ్చిన రూపమును ధరింపవచ్చును.

సప్తభిర్వత్సరైరేవ మమరత్వమవాప్నుయాత్ ।
మనుత్వాసిద్ధ ర్నవభిరింద్రత్వం దశభిర్భవేత్ । 74

ఏడు సంవత్సరములవరకు జపముచేసిన అమరత్వము లభించును. అనగా దేవయోని లభించును. తొమ్మిది సంవత్సరములు జపము చేసిన మనువుపదవి లభించును. పది సంవత్సరములలో ఇంద్రాసనమే లభించును.

ఏకాదశభి రాప్నోతి ప్రాజాపత్యం తు వత్సరైః ।
బ్రహ్మత్వం ప్రాప్నుయాదేవం జప్త్వా ద్వాదశ వత్సరాన్ । 75

ఇట్లు ఒక్క ఆసనమున ఉండి పదునొకండు సంవత్సరముల వరకు జపము చేసిన మానవుడు ప్రజాపతిత్వమును పొందును. పండ్రెండు సంవత్సరముల తరువాత బ్రహ్మత్వమును పొందును.

ఏతేనైవ జితాలోకాస్తపసా నారదాదిభిః ।
శాకమన్యేఽపరే మూలం ఫలమన్యే పయోఽపరే । 76

ఈ తపస్సులోనే నారదాదిఋషులు సర్వలోకములను జయించిరి. వారిలో కొందరు శాకాహారులు, కొందరు దుంపలను భుజించినవారు, కొందరు ఫలములను తినినవారు, కొందరు పాలపై ఆధారపడిన వారు.

**ఘృత మన్యేఽపరే సోమమపరే చారువృత్తయః ।**

**ఋషయః భైక్ష్యమశ్నన్తి కేచిద్ భైక్ష్యాశినోఽపరి ।** 77

కొందరు నెయ్యిని ఆహారముగా తీసికొనినవారు, కొందరు సోమపానము చేసినవారు, కొందరు భిక్షాన్నమును ఆహారముగా స్వీకరించినవారు

**హవిష్యమపరేఽశ్నన్తః కుర్వంత్యేవ పరంతపః ।**

**అథ శుద్ధ్యం రహస్యానాం త్రిసహస్రం జపేద్ద్విజః ।** 78

కొందరు హవిష్యమును భుజించుచు గొప్పతపస్సును చేసిరి, ద్విజులు పాపనివారణార్థమై మూడువేలు జపము చేయవలెను.

**మాసం శుద్ధో భవేత్ స్తేయాత్సువర్ణస్య ద్విజోత్తమః ।**

**జపేన్మాసం త్రిసహస్రం సురాపః శుద్ధిమాప్నుయాత్ ।** 79

ఏ ద్విజుడైన సువర్ణమును అపహరించినచో ఆపాపమునుండి ముక్తుడగుటకు ఒక్కమాసమువరకు అతడు జపము చేయవలెను. మదిరను త్రాగిన ద్విజుడు ఒకనెల వరకు మూడువేలు మంత్రమును ప్రతిదినము జపింపవలెను.

**మాసం జపేత్ త్రిసహస్రం శుచిః స్యాద్గురుతల్పగః ।**

**త్రిసహస్రం జపేన్మాసం కుటీం కృత్వా వనే వసన్ ।** 80

**బ్రహ్మహత్యాద్భవాత్పాపాత్ ముక్తిః కౌశికభూషితమ్ ।**

**ద్వాదశాహం నిమజ్యాప్సు సహస్రం ప్రత్యహం జపేత్ ।** 81

గురుశయ్యను పొందువాడు శుద్ధుడగుటకు ఒకనెలవరకు మూడువేలు మంత్రమును జపించవలెను. అరణ్యములో కుటీరమును నిర్మించుకొని మూడువేలు ప్రతిదినము మంత్రమును జపింపవలెను. అట్లు చేసిన బ్రహ్మహత్య చేసినవాడు ఆపాతకమునుండి ముక్తుడగును. ఇట్లు విశ్వామిత్రుడు చెప్పినాడు. పండ్రెండు (12) దినముల వరకు జలములో మునిగి వెయ్యిమారులు గాయత్రీ జపముచేయవలెను. (80 ,81)

**ముక్తాః స్యురఘువ్యాపాచ్చ మహాపాతకినో ద్విజాః ।**

**త్రిసహస్రం జపేన్మాసం ప్రాణానాయమ్య వాగ్యతః ।** 82

ఒక్కనెలవరకు ప్రాణాయామము చేసి మౌనముగ మూడువేలమారులు మంత్రమును జపించినచో మహాపాతకులగు ద్విజులు మహాపాపములనుండి ముక్తులగుదురు.

**మహాపాతకయుక్తోఽపి ముచ్యతే మహతో భయాత్ ।**

**ప్రాణాయామ సహస్రేణ బ్రహ్మహత్యాపి శుధ్యతి ।** 83

మహాపాతకియైనను అతడు మహాభయము నుండి ముక్తుడగును. ఒక్క వెయ్యిమారులు ప్రాణా యామము చేయుటవలన బ్రహ్మహత్య చేసినవాడు గూడ విశుద్ధుడగును.

షట్కృత్వా హ్యభ్యసే దూర్ధ్వం ప్రాణాపానౌ సమాహితః।
ప్రాణాయామో భవేదేష సర్వపాపప్రణాశనః॥ 84

ఆరు మారులు ప్రాణాపానములను పైకిచేసి ప్రాణాయామమును చేసినవాని సర్వపాపములు నశించును.

సహస్రమభ్యసేన్మాసం క్షితిపః శుచితామియాత్।
ద్వాద శాహం త్రిసహస్రం జపేద్ధి గోవధే ద్విజః॥ 85

రాజు ఒక్క మాసపర్యంతము జపించుచున్నచో పవిత్రుడగును. గోహత్యయందు ద్విజుడు పండ్రెండుదినములవరకు ప్రతిదినము మూడువేల మారులు జపించవలెను.

అగమ్యాగమనే స్తేయే హననేఽ భక్ష్య భక్షణే।
దశసహస్ర మభ్యస్తా గాయత్రీ శోధయే ద్విజమ్॥ 86

వెళ్ళకూడని చోటికి వెళ్ళుట, దొంగతనము చేయుట, చంపుట, తినగూడని వస్తువులను తినుట-అనుదోషములను పోగొట్టుకొనుటకు పదివేలు గాయత్రీ జపము చేయవలెను. అట్లు చేసిన ద్విజుడు శుద్ధుడగును.

ప్రాణాయామశతం కృత్వా ముచ్యతే సర్వకిల్బిషాత్।
సర్వేషామేవ పాపానాం సంకరే సతి శుద్ధయే॥ 87

సర్వపాపములు ఒక్కమారే ఏమానవుని నైన దోషయుక్తునిగా చేసినచో అతడు నూరుప్రాణాయామములనుచేసి ఆపాపములనుండి ముక్తి పొందవలెను.

సహస్రమభ్యసేన్మాసం నిత్యం జాపీ వనే వసన్।
ఉపవాససమో జాపస్త్రిసహస్రం తదిత్యృచః॥ 88

వనములో వెయ్యిమారులు జపించుచు ఒక్క మాసమువరకు నివసింపవలెను. దానివలన సర్వదోషములు తొలగును. మూడువేలు జపము చేసినచో ఒక ఉపవాసముతో సమానముగ పుణ్యము లభించును.

చతుర్వింశతి సాహస్రమభ్యస్తా కృచ్ఛ్రసంజ్ఞితా।
చతుష్షష్టిః సహస్రాణి చాంద్రాయణ సమాచి తు॥ 89

ఇరువది నాల్గువేలు జపము చేసినచో ఒక కృచ్ఛ్ర వ్రతముతో సమానమగును, అరువదినాలుగు వేలు జపము చేసిన ఫలము ఒకచాంద్రాయణ వ్రతముతో సమానమగును.

శతకృత్వోఽభ్యసేన్నిత్యం ప్రాణాయమ్య సంధ్యయోః ।
తదిత్యృచమవాప్నోతి సర్వపాపక్షయం పరమ్ । 90

ప్రాతః కాల సయంకాల సంధ్యలలో నూఱు నూఱు చొప్పున జపముచేసిన సర్వపాపములు నశించును.

నిమజ్యాప్సు జపేన్నిత్యం శతకృత్వస్తదిత్యృచమ్ ।
ధ్యాయేద్దేవీం సూర్యరూపాం సర్వపాపైః ప్రముచ్యతే । 91

జలములో నిమగ్నుడై ఒక నూరు మారులు గాయత్రిని జపముచేసిన సర్వపాపములనుండి ముక్తుడగును. జపము చేయునపుడు సూర్యరూపిణియగు గాయత్రిని ధ్యానించవలెను.

ఇతి మే సమ్యగా ఖ్యాతా శాంతిశుద్ధ్యాది కల్పనా ।
రహస్యాతిరహస్యాశ్చ గోపనీయాస్త్వయా సదా । 92

నారదా! మేము నీకు శాంతి శుద్ధిమున్నగు కల్పనా రహస్యమును చెప్పితిమి. ఇది రహస్యములకు గూడ రహస్యమైనది. దీనిని నీవు ఎల్లప్పుడు గుప్తముగా నుంచవలెను.

ఇతిసంక్షేపతః ప్రోక్తః సదాచారస్య సంగ్రహః ।
విధినా చరణా దస్య మాయా దుర్గా ప్రసీదతి । 93

ఈ సదాచారమును సంగ్రహముగ నేను నీకు వినిపించితిని. విధిగా ఆచరించినచో మాయాదుర్గ ప్రసన్నయగును.

నైమిత్తికం చ నిత్యం చ కామ్యం కర్మ యథావిధి ।
ఆచరేన్మనుజః సోఽయం ముక్తి భుక్తి ఫలా ప్తిభాక్ । 94

నిత్య కర్మను, నైమిత్తిక కర్మను యథావిధిగ చేయు పురుషుడు భుక్తికి ముక్తికి రెంటికి అధికారియగును.

ఆచారః ప్రథమో ధర్మో ధర్మస్య ప్రభురీశ్వరీ
ఇత్యుక్తం సర్వశాస్త్రేషు సదాచార ఫలం మహత్ । 95

ఆచారము మొదటి ధర్మముగా చెప్పబడినది. ధర్మమునకు స్వామిని దేవి, ఈ విషయమునె సర్వశాస్త్రములు చెప్పినవి. సదాచారముతో సమానముగ ఏవస్తువు మహాఫలము నొసంగదు.

ఆచారవాన్ సదా పూతః సదైవాచారవాన్ సఖీ ।
ఆచారవాన్ సదా ధన్యః సత్యం సత్యం చ నారద । 96

సదాచారియగు పురుషుడు ఎల్లప్పుడు పవిత్రుడుగా నుండును, ఎల్లప్పుడు సుఖవంతుడగును. నారదా ! సదాచారముగలవాడు దన్యుడనుటలో అసత్యములేదు.

**దేవీప్రసాద జనకం సదాచార విధానకమ్ ।**
**శ్రావయేత్ శృణుయాన్మర్త్యో మహాసంపత్తి సౌఖ్యభాక్ ।** 97

దేవికి అనుగ్రహమును కలిగించి సదాచార విధిని వినినవాడు వినిపించినవాడు సర్వవిధముల ధనవంతుడు, సుఖియునగును.

**అవ్యం త్రివర్గ సంయుక్తం గృహస్థేన విశేషతః ।**
**మునీనాం జ్ఞానసిద్ధ్యర్థం యతీనాం మోక్షసిద్ధయే ।** 98

విశేషముగ జపముచేయు గృహస్థులకు త్రివర్గము లభించును. మునులకు జ్ఞానసిద్ధి కలుగును. యతులకు మోక్షము సిద్ధించును.

**త్రిరాత్రో పోషితః సమ్యగ్ ఘృతం హుత్వా సహస్రశః ।**
**సహస్రం లాభమాప్నోతి హుత్వాగ్నౌ ఖదిరేంధనమ్ ।** 99

మూడు రాత్రులు ఉపవసించి చక్కగ ఆజ్యాహుతులను ఒక వెయ్యింటిని చంద్రసమిధలతో అగ్నికి ఇచ్చినచో అధికధనము లభించును

**పాలాశైర్మి సమిద్భిశ్చ ఘృతాక్తైస్తు హుతాశనే ।**
**సహస్రం లాభ మాప్నోతి రాహుసూర్య సమాగమే ।** 100

నేతితో తడిపిన మోదుగ సమిధలను అగ్నియందు సూర్యగ్రహణ సమయమున హోమము చేసిన వేలకొలదిగ ధనము లభించును.

**హుత్వాతు ఖదిరం వహ్నౌ ఘృతాక్తం రక్తచందనమ్ ।**
**సహస్రం హేమమాప్నోతి రాహుచంద్రసమాగమే ।** 101

చంద్ర సమిధలను, చందన సమిధలను నేతితో తడిపి చంద్రగ్రహణ సమయమున అగ్నిలో హోమము చేసిన అధికముగ బంగారము లభించును

**రక్త చందన చూర్ణం తు సఘృతం హవ్యవాహనే ।**
**హుత్వా గోమయమాప్నోతి సహస్రం గోమయం ద్విజః ।** 102

రక్తచందన చూర్ణమును నేతితో తడిపి అగ్నిలో వెయ్యిమారులు ఆహుతుల నిచ్చినచో నెయ్యి, పాలు, గోమయము పుష్కలముగా లభించును.

**జాతీ చంపక రాజార్కకుసుమానాం సహస్రశః ।**
**హుత్వా వస్త్ర మవాప్నోతి ఘృతాక్తానాం హుతాశనే।** 103

మల్లెపూలను, సంపెంగపూలను, వెట్టి జిల్లేడు పూలను నేతిలో తడిపి అగ్నియందు హోమము చేసినచో వస్త్రములు లభించును.

**సూర్యమండల బింబేచ హుత్వా తోయం సహస్రశః ।**
**సహస్రం ప్రాప్నుయాద్దేమం రౌప్యమిందుమయే హుతే ।** 104

సూర్య మండల బింబము మాత్రము ప్రకాశించుచున్నపుడు అనగా సూర్యోదయ మగునప్పుడు వెయ్యి మారులు తర్పణము చేయుటవలన , సూర్యోదయమునకు పూర్వము చంద్రకాలమున ఒక వెయ్యి ఆహుతులనిచ్చిన బంగారము, వెండి లభించును.

**అలక్ష్మీ పాపసంయుక్తో మలవ్యాధి సమన్వితః ।**
**ముక్తః సహస్రజాప్యేన స్నాయాద్యస్తు జలేన వై ।** 105

నీటిలో స్నానము చేసి ఒక్క వెయ్యి మారులు జపము చేసినచో అలక్ష్మి, పాపము, మలము, వ్యాధి నశించును.

సగోఘృతేన సాహస్రం లోధ్రేణ జుహుయాద్యది ।
చౌరాగ్ని మారుతోత్థాని భయాని న భవన్తి వై । 106

లొద్దుగపూలను ఆవునేతితో కలిపి వెయ్యిమారులు హోమము చేసినచో చోర-అగ్ని-వాయు ఉపద్రవముల భయము నశించును.

**క్షీరాహారో జపేల్లక్ష మపమృత్యుమపోహతి ।**
**ఘృతాశీ ప్రాప్నుయా న్మేధాం బహువిజ్ఞాన సంచయామ్ ।** 107

పాలు త్రాగి ఒక్క లక్షగాయత్రీ జపము చేసిన అకాలమృత్యుభయము తొలగును, నేతిని తినువాడు మేధస్సును పొందును. దానివలన అనేక విధములగు విజ్ఞానమును పొందును.

**హుత్వా వేతసపత్రాణి ఘృతాక్తాని హుతాశనే ।**
**లక్షాధిపత్యపదవీ మాప్నోతీతి న సంశయః ।** 108

ప్రబ్బలి పత్రములను నెతిలో కలిపి అగ్నిలో హోమము చేసినచో లక్షాధిపతి పదవిని పొందును. సందేహము లేదు.

**లాక్షా భస్మ హోమం చ కృత్వా హ్యుత్తిష్ఠతే జలాత్ ।**
**ఆదిత్యాభిముఖం స్థిత్వా నాభిమాత్ర జలే శుచౌ ।** 109

**గర్భపాతాది ప్రదరా శ్చాన్యే స్త్రీణాం మహారుజః ।**
**నాశమేష్యన్తి తే సర్వే మృతవత్సాది దుఃఖదాః ।** 110

జలములో నిలబడి లక్షభస్మమును హోమము చేసినచో, అట్లే సూర్యునకు ఎదురుగ నాభిమాత్ర జలమున శుద్ధుడై నిలబడినచో గర్భపాతము, రక్తస్రావము, మృతసంతానోత్పత్తి మున్నగు స్త్రీ సంబంధములగు మహారోగములు తొలగును.

**తిలానాం లక్షహోమేన ఘృతాక్తానాం హుతాశనే ।**
**సర్వకామ సమృద్ధాత్మా పరాంసిద్ధి మవాప్నుయాత్ ।** 111

నెయ్యికలిపిన నువ్వులను అగ్నిలో ఒక్కలక్షమారులు హోమము చేసిన అన్నికోరికలు తీరును. పరమ స్థానము లభించును.

**యవానాం లక్ష హోమేన ఘృతా క్తానాం హుతాశనే ।**
**సర్వకామ సమృద్ధాత్మా పరాంసిద్ధి మహాప్నుయాత్ ।** 112

యవలను నేతిలో కలిపి ఒక్కలక్షమారులు అగ్నిలో ఆహుతుల నిచ్చినచో సర్వకార్యములు సిద్ధించును. పరాసిద్ధి లభించును.

**ఘృత స్యాఽఽ హుతిలక్షేణ సర్వాన్ కామా నవాప్నుయాత్ ।**
**పంచగవ్యాశనో లక్షం జపేచ్ఛ్రుతి స్మృతిర్భవేత్ ।** 113

ఒక్క లక్షమారులు ఆజ్యాహుతుల నిచ్చినచో సర్వకార్యములు సిద్ధించును. పంచగవ్యమును త్రాగి ఒక్కలక్షజపము చేసిన స్మృతి పెరుగును.

**అన్నాదిహవనాన్నిత్యమన్నాదిశ్చ భవేత్సదా ।**
**తదేవ హ్యనలే హుత్వా ప్రాప్నోతి బహుసాధనమ్ ।** 114

ఇట్లే అన్నాదులతో నిత్యము హోమము చేసిన అన్నాదులు లభించును. అగ్నియందు ఆహుతుల నిచ్చిన పెక్కు సాధనములు లభించును.

**లవణం మధుసంయుక్తం హుత్వా సర్వవశీభవేత్ ।**
**హుత్వాతు కరవీరాణి రక్తాని జ్వాలయే జ్జ్వరమ్ ।** 115

ఉప్పును తేనెను కలిపి హోమము చేసిన అన్నియు వశమగును. జ్వరము తగ్గిపోవుటకు ఎఱ్ఱగన్నేరు పూలతో హోమము చేయవలెను.

**హుత్వా భాల్లాతకీతైలం దేశాదేవ ప్రచాలయేత్ ।**
**హుత్వాతు నింబపత్రాణి విద్వేషం శమయేన్నృణామ్ ।** 116

జీడినూనెతో హోమము చేసిన ఉచ్చాటనమగును. అనగా పిశాచములు పారిపోవును. వేపాకులతో హోమము చేసిన విద్వేషము పోవును.

**మరక్తాన్ తండులాన్నిత్య ఘృతాక్తాన్ చ హుతాశనే ।**
**హుత్వా బలమవాప్నోతి శత్రు భిర్న స జీయతే ।** 117

ఎఱ్ఱని బియ్యమును నేతిలో కలిపి అగ్నిలో హోమము చేసిన బలముకలుగును. శత్రునాశనమగును.

ప్రత్యానయన సిద్ధ్యర్థం మధుసర్పిః సమన్వితమ్ ।
గవాం క్షీరం ప్రదీప్తేఽగ్నౌ జుహ్వతస్తత్ప్రశామ్యతి । 118

ఎవనినైన వెనుకకు పిలిపింపదలచినచో తేనెను, నేతిని కలిపి హోమము చేయవలెను. ఆవుపాలను అగ్నిలో హోమము చేసిన శాంతికలుగును.

బ్రహ్మచారీ జితాహారో యః సహస్రత్రయం జపేత్ ।
సంవత్సరేణ లభతే ధనైశ్వర్యం న సంశయః । 119

ఆహారమును జయించి బ్రహ్మచారి మూడువేలు గాయత్రిని జపించినచో సంవత్సరములో ధనము, ఐశ్వర్యము మున్నగువానిని పొందును ఇందులో సందేహములేదు.

శమీ బిల్వపలా శానా మర్కాన్య తు విశేషతః ।
పుష్పాణాం హి సమిద్భిశ్చ హుత్వా హేమమవాప్నుయాత్ । 120

జమ్మి పూలను, మారేడుపూలను, మోదుగపూలను ముఖ్యముగ జిల్లేడుపూలను సమిధలుగా జేసి హోమము చేసిన వాడు బంగారమును పొందును.

ఆబ్రహ్మత్ర్యంబ కాద్యన్తం యో హి ప్రయతమానసః
జపేల్లక్షం నిరాహారః గాయత్రీ వరదా భవేత్ । 121

" ఆబ్రహ్మ" నుండి "త్ర్యంబకం యజామహే" వరకు ఒకలక్షమార్లు నిరాహారుడై జపించుట వలన గాయత్రి వరములనిచ్చునదగును.

మహారోగా వినశ్యన్తి లక్షం జప్యాను భావతః ।
స్నాత్వా తథైవ గాయత్ర్యాః శతమన్తర్జలే జపేత్ । 122

భావనతో ఒక లక్షమార్లు గాయత్రీ జపము చేసినచో మహారోగములు నశించును. స్నానము చేసి నీటిలో నిలబడి నూరుమారులు జపము చేసిన రోగములు నశించును.

స్వర్ణహారీ తైలహారీ యస్తు విప్రః సురాం పిబేత్ ।
చందన ద్వయ సంయుక్తం కర్పూరం తండులం యవమ్ । 123

లవంగం సుఫలం చాజ్యం సితాం చామ్రస్య దారుకమ్ ।
జుహుయాద్విధిరుక్తోఽయం గాయత్ర్యాః ప్రీతి కాకకః 124

బంగారమును నూనెను దొంగిలించినవాడు సురాపానము చేసిన వాడునగు విప్రుడు ఆపాపము పోవుటకు చందనద్వయము కర్పూరము, బియ్యము, లవంగములు,

కొబ్బరి, ఆజ్యము, పంచదార,మామిడి పుల్లలు - వీనితో హోమము చేయవలెను ఈసామగ్రితో హోమము చేసిన గాయత్రికి సంతోషము కలుగును

**క్షీరోదనం తిలాన్ దూర్వా క్షీరద్రుమ సమిద్వరాన్ ।**
**పృథక్ సహస్ర త్రితయం జుహుయాన్మంత్ర సిద్ధయే ।** 125

ప్రణవయుక్తమగు 24 లక్షల గాయత్రీ జపము సిద్ధించుటకు వేరుగ పాలు, అన్నము, నువ్వులు, గరిక, మట్టి, మేడి మున్నగు పాలుగారు చెట్ల సమిధలతో మూడువేలమారులు గాయత్రీ హోమము చేయవలెను. (125)

**తత్త్వ సంఖ్యా సహస్రాణి మంత్ర విజ్జుహుయాత్తిలైః ।**
**సర్వపాపవినిర్ముక్తో దీర్ఘమాయుః స విందతి ।** 126

నువ్వులతో 24వేల ఆహుతులనిచ్చిన వాడు సర్వపాపములు తొలగి దీర్ఘాయువు అగును.

**ఆయుషే సాజ్యహవిషా కేవలేనాథ సర్పిషా ।**
**దూర్వాక్షీర తిలైర్మంత్రీ జుహుయాత్త్రి సహస్రకమ్ ।** 127

ఆయుర్దాయము కొరకు ఘృతముతోగూడిన సామగ్రితో లేదా కేవల ఘృతముతో, పాయసముతో, పాలతో, నువ్వులతో మూడువేల ఆహుతుల నీయవలెను

**అరుణా బ్జైస్త్రిమధ్వక్తై ర్జుహుయాదయుతం తతః ।**
**మహాలక్ష్మీర్భవేత్తస్య షణ్మాసాన్న సంశయః ।** 128

అటు తరువాత త్రిమధుయుక్తములగు ఎఱ్ఱదామరలతో పదివేల ఆహుతులనిచ్చిన ఆరునెలలలో గొప్పధన వంతుడగును. ఇందులో సందేహము లేదు.

**సవ్యాహృతిం సప్రణవాం గాయత్రీం శిరసాసహ ।**
**యే జపన్తి సదా తేషాం న భయం విద్యతే క్వచిత్ ।** 129

ప్రణవముతోను, వ్యాహృతితోను, శిరస్సుతోను గాయత్రీ మంత్రమును జపించిన మానవులకు ఎక్కడను భయము కలుగదు.

**శతజప్తా తు సా దేవీ దినపాపప్రణాశినీ ।**
**సహస్రం జప్తా సా దేవీ సర్వకల్మషనాశినీ ।** 130

నూరుమారులు గాయత్రిని జపించినచో పగటిపాపము నశించును. వెయ్యిమారులు జపించినచో అనేక పాతకములనుండి ముక్తుడగును.

**దశ సహస్ర జపాత్సా పాతకేభ్యః సముద్ధరేత్ ।**
**స్వర్ణస్తేయకృద్యో విప్రో బ్రాహ్మణో గురుతల్పగః ।** 131

పదివేల మారుల గాయత్రీ జపము చేసినచో బంగారమును దొంగిలించిన పాపమునుండి, గురుపత్నీగమన పాపమునుండి ముక్తుడగును.

**సురాపశ్చ విశుధ్యేత లక్షజాపాన్న సంశయః ।**
**ప్రాణాయామత్రయం కృత్వా స్నాన కాలే సమాహితః ।** 132

స్నాన కాలమున మూడు మారులు ప్రాణాయామము చేసి ఒక లక్షగాయత్రీ జపము చేసినచో మద్యపానదోషమునుండి ముక్తుడగును.

**అహోరాత్ర కృతాత్పాపాత్తత్ క్షణాదేవ ముచ్యతే ।**
**ప్రాణాయామైః షోడశభిః వ్యాహృతి ప్రణవాన్వితైః ।** 133

ప్రణవముతోను, మహావ్యాహృతితోను ప్రాణాయామమును పదునారుమారులు చేసినచో రేయింబవళ్ళు చేసిన పాపమునుండి ముక్తుడగును.

**భ్రూణహత్యాయుతం దోషం పునాతి సతతం జపాత్ ।**
హుతా దేవీ విశేషేణ సర్వకామప్రదాయినీ । 134

ఒక్కవెయ్యిమారులు నిత్యగాయత్రీ జపమును ఒక్క మాసపర్యంతము చేసినచో భ్రూణహత్యా దోషమును గూడ నాశనము చేయును. విశేషముగ గాయత్రీ మంత్రముతో హోమము చేసినచో అన్ని కోరికలు తీరును.

సర్వపాపక్షయకరీ వరదా భక్తవత్సలా ।
శాన్తికామస్తు జుహుయాత్ సావిత్రీమక్షతైః శుచిః । 135

గాయత్రి సర్వపాపములను నాశనము చేయునట్టిది. వరములనిచ్చునట్టిది, భక్తులపై కృపజూపునట్టిది. అందువలన శాంతిగోరువాడు పవిత్రుడై బియ్యముతో గాయత్రీమంత్రము ద్వారా హోమము చేయవలెను.

హన్తుకామోఽపమృత్యుం చ ఘృతేన జుహుయాత్తథా ।
శ్రీకామస్తు తథా పద్మైర్బిల్వైః కాంచనకాముకః । 136

అపమృత్యువును తప్పించుకొన గోరువాడు నేతితోను, శోభను గోరువాడు పద్మములతోను, బంగారమును గోరువాడు మారేడు దళములతోను, గాయత్రీ మంత్రమును హోమము చేయవలెను.

బ్రహ్మవర్చసకామస్తు పయసా జుహుయాత్తథా ।
ఘృతాప్లుతైస్తిలైర్వహ్నౌ జుహుయాత్సుసమాహితః । 137

బ్రహ్మతేజస్సును గోరువాడు శ్రద్ధగ నేతితో తడిపిన తిలలతోను, నేతితోను హోమము చేయవలెను.

**గాయత్ర్యయుత హోమాచ్చ సర్వపాపైః ప్రముచ్యతే ।**
**పాపాత్మా లక్షహోమేన పాతకేభ్యః ప్రముచ్యతే ।** 138

ఒక్కవెయ్యి గాయత్రీ హోమము చేసినచో పాపముక్తుడగును. ఒక్కలక్షమారులు హోమము చేసినచో పాపాత్ముడు పాతకములనుండి ముక్తుడగును.

**ఇష్టలోకమవాప్నోతి ప్రాప్నుయాత్కామమీప్సితమ్ ।**
**గాయత్రీ వేదజననీ గాయత్రీ పాపనాశినీ ।** 139

గాయత్రి వేదమాత, పాపములు నాశనము చేయనట్టిది. అందువలన గాయత్రిని ఉపాసించువాడు కోరిన లోకములను పొందును.

**ఉపాంశు స్యాచ్ఛతగుణః సాహస్రో మానసః స్మృతః ।**
**నోచ్చైర్జపమతః కుర్యాత్సావిత్ర్యాస్తు విశేషతః ।** 140

ఉపాంశు భావముతో (పెదవులు కదపకుండగ) జపముచేసినచో నూరురెట్లు ఫలము లభించును. మనస్సులో జపించినచో వెయ్యి రెట్లు ఫలములభించును. అందువలన గాయత్రీ జపమును ముఖ్యముగ బిగ్గరగ చేయరాదు.

**సావిత్రీ జాపనిరతః స్వర్గమాప్నోతి మానవః ।**
**గాయత్రీ జాపనిరతో మోక్షోపాయం చ విందతి ।** 141

గాయత్రీజపము చేయువాడు స్వర్గమును పొందును, మోక్షమును గూడ పొందును.

**తస్మాత్సర్వప్రయత్నేన స్నాతః ప్రయతమానసః ।**
**గాయత్రీం తు జపేద్భక్త్యా సర్వపాపప్రణాశినీ ।** 142

అందువలన సమస్తప్రయత్నములతో స్నానము చేసి స్థిరచిత్తుడై సర్వపాపములను నాశనము చేయునట్టి గాయత్రీ జపమును చేయవలెను.

**ఏవం యః కురుతే రాజా లక్షహోమం యతవ్రతః ।**
**న తస్య శత్రవః సంఖ్యే అగ్రే తిష్ఠన్తి కర్హిచిత్ ।** 143

రాజునియమ పూర్వకముగ ఒకలక్ష గాయత్రీహోమమును చేసినచో శత్రువులు యుద్ధభూమిలో వానియెదట ఎప్పుడును నిలబడలేరు.

**నాకాలమరణం దేశే వ్యాధిర్వా జాయతే తథా ।**
**అతివృష్టిరనావృష్టి ర్మూషకాః శలభాః శుకాః ।** 144

వాని దేశములో అకాలమరణము, వ్యాధిభయము ఎప్పుడును ఉండదు. అతివృష్టి, అనావృష్టి, ఎలుకలు, మిడతలు, చిలుకలు – వీనినుండి రక్షణ లభించును.

రాక్షసాద్యాః వినశ్యన్తి సర్వాస్తత్ర తథేతయః I 145
రసవన్తి చ తోయాని రాజ్యం చ నిరుపద్రవమ్ I
ధర్మిష్ఠా జాయతే చేష్టా భద్రం భవతి సర్వతః I 146

వానికి సర్వవిధములగు ఈతిబాధలు, రాక్షసబాధలు ఉండవు. అందరికి ధర్మనిష్ఠమగు ప్రయత్నముండును. అన్నివైపుల శుభము కలుగును.

కోటి హోమంతు యో రాజా కారయేద్విధి పూర్వకమ్ I
న తస్య మానసో దాహః ఇహలోకే పరత్ర చ I
కోటిహోమేతు వరయేత్ బ్రాహ్మణాన్ వింశతి నృపః I 147

ఒక్క కోటి సంఖ్యతో యథావిధిగ హోమము చేసిన రాజుయొక్క చిత్తము స్థిరముగ శాంతముగ నుండును. వానిని మానసిక దాహము ఈ లోకములోను పరలోకములోను ఎచ్చటను బాధించదు. ఈ కోటి హోమము నందు రోజు ఇరువది మంది బ్రాహ్మణులను వరించవలెను.

శతం వాథ సహస్రం వా య ఇచ్ఛే ద్గతి మాత్మనః I
కోటి హోమం స్వయం యస్తు కురుతే శ్రద్ధయా ద్విజః I 148

క్షత్రియో వాథ వైశ్యో వా తస్య పుణ్యఫలం మహత్ I
యద్యదిచ్ఛతి కామాన్వై ప్రత్త దాప్నోత్య సంశయమ్ I 149

ఏ బ్రాహ్మణుడు ఆత్మయొక్క సద్గతికై నూరు లేదా ఒక్కవెయ్యి లేదా ఒక్కకోటి హోమమును స్వయముగా చేయునో వానికిగొప్పపుణ్యఫలము లభించును. ఇట్లే శ్రద్ధగలవాడై క్షత్రియడు చేసినను, వైశ్యుడు చేసినను గొప్పపుణ్యఫలమును పొందును. అతడు ఏయేవస్తువులను అభిలషించునో వానికి అవి నిస్సందేహముగ లభించును.

సశరీరోఽపి చేద్గన్తుం దివమిచ్ఛేత్తదాప్నుయాత్ I
సావిత్రీ పరమా దేవీ సావిత్రీ పరమాత్పరా I 150

సావిత్రీదేవి దేవాదిదేవిరూపిణి, పరాత్పరి, ఆమెను – ఆశ్రయించినచో మానవునకు సశరీరముగ స్వర్గమునకు పోవు అభిలాష పూర్తియగును.

సర్వ కామప్రదా చైవ సావిత్రీ కథితా పునః I
అభిచారేషు తాం దేవీం విపరీతాం విచిన్తయేత్ I 151

మనోవాంఛితములను అన్నింటిని తీర్చునట్టిదిగా సావిత్రి చెప్పబడినది. అభిచారములయందు దీనిని విపరీతముగ చింతనచేయవలెను.

కార్యావ్యాహృతయశ్చాత్ర విపరీతా క్షరాస్తథా ।
విపరీతాక్షరం కార్యం శిరశ్చ ఋషిసత్తమ॥ 152

ఇచ్చట విపరీతాక్షర వ్యాహృతులను ఉచ్చరించవలెను. ఓఋషి శ్రేష్ఠా ! ఈమె శిరస్సును విపరీతాక్షరముగా భావించవలెను.

ఆదౌ శిరః ప్రయోక్తవ్యం ప్రణవోఽన్తే చ వై ఋషే।
భీతి స్థేనేవ ఫట్కారం మధ్యే నామ ప్రకీర్తితమ్ ॥ 153

ఆరంభమున శిరస్సును ప్రయోగించవలెను. ప్రణవమును అంతమున ఉచ్చరింపవలెను. ఫట్కారమును మధ్యలో ప్రయోగింపవలెను.

గాయత్రీం చిన్తయేత్తత్ర దీప్తానల సమప్రభామ్ ।
ఘాతయన్తీం త్రిశూలేన కేశేష్వాక్షిప్య వైరిణమ్ ॥ 154

ప్రజ్వలితమగు అగ్నియొక్క కాంతివంటి కాంతి గలిగిన గాయత్రిని చింతన చేయవలెను. ఆమె శత్రువుల కేశములను పట్టుకొని తనత్రిశూలముతో వారిని చంపుచున్నట్లు ధ్యానింపవలెను.

ఏవం విధా చ గాయత్రీ జప్తవ్యా రాజసత్తమః ।
హోతవ్యా చ యథా శక్త్యా సర్వకామసమృద్ధిదా ॥ 155

రాజోత్తమా! సర్వవాంఛలను తీర్చునట్టి గాయత్రిని ఇట్లుజపము చేయవలెను. శక్తిననుసరించి హోమము చేయవలెను.

నిర్దహన్తీ త్రిశూలేన భ్రుకుటీ భూషితాననామ్ ।
ఉచ్చాటనే తు తాం దేవీం వాయుభూతాం విచిన్తయేత్ ॥ 156

తన శూలములతో దహించుచు, బొమముడిచే శోభిల్లు ముఖమండలము కలిగిన ఆవాయు భూత దేవిని ఉచ్చాటన కాలమున చింతనచేయవలెను.

ధావమానం తథా సాధ్యం తస్మాద్దేశాతి దూరతః ।
అభిచారేషు హోతవ్యా రాజికా విషమిశ్రితాః ॥ 157

దాడిచేయునట్టి రోగమును ఆ దేశమునుండి దూరముగ పారద్రోలుటకు అభిచారములయందు విషమిశ్రితములైన నల్ల ఆవాలను హోమముచేయవలెను.

స్వరక్తసిక్తం హోతవ్యం కటుతైల మథాపి వా ।
తత్రాపి చ విషం దేయం హోమకాలే ప్రయత్నతః ॥ 158

తన రక్తమును కటు తైలమునందు కలిపి దానిలో విషము కలిపి ప్రయత్నముతో హోమ కాలమున ఇవ్వవలెను.

క్రోధేన మహతావిష్టః పరాన్నాభిచరే ద్వధః ।
న జుహ్యాద్యది క్రోధేన ధ్రువం నశ్యేత్ సఏవతు । 159

కాని క్రోధముతో వచ్చి శత్రువులను వధించు ఈ విధానమును ప్రయోగించరాదు. అటుకాక శత్రువుపై ప్రయోగింపబడినచో ప్రయోగించు వానిని అది తప్పక నష్టపరుచును.

అనాగసి న కర్తవ్యో హ్యభిరో మతో బుధైః ।
స్వల్పాగసి న కర్తవ్యో హ్యభిచారో మహామునే । 160

బుద్ధిమంతులు దీనిని క్రోధము లేనప్పుడు ప్రయోగింపరాదు. మునీశ్వరా ! స్వల్పాపరాధము కలిగినను దీనిని ఉపయోగించరాదు.

మహాపరాధం బలినం దేవబ్రాహ్మణకంటకమ్ ।
అభిచారేణ యో హన్యాన్న స దోషేణ లిప్యతే । 161

మహాపరాధము చేసిన బలవంతుని, దేవునకు బ్రాహ్మణునకు కష్టము కలిగించువానిని సంహరించినను వానికి దోషము కలుగదు.

ధర్మస్య దాన కాలే చ స్వల్పాగసి తథైవచ ।
అభిచారం న కుర్వీత బహుపాపం విచక్షణః । 162

ధర్మమును, దానమును చేయునపుడు, అల్పక్రోధము వచ్చినపుడు పండితుడు బహుపాపరూపమగు అభిచారమును ఎప్పుడును చేయరాదు. (అభిచారము=హింసార్థమైన హోమకర్మ)

బహూనాం కంటకాత్మానం పాపాత్మానం సుదుర్మతిమ్ ।
హన్యాత్కృతాపరాధాన్హి తస్య పుణ్యఫలం మహత్ । 163

పాపాత్ముడు, దుర్మతియు, చాలమందికి కంటకుడు, పెక్కు అపరాధములను చేసినవాడునగు వ్యక్తిని సంహరించిన వానికి గొప్పపుణ్యఫలము లభించును.

యే భక్తాః పుండరీకాక్షే వేదయజ్ఞే ద్విజే జనే ।
న తానభిచరేత్ జాతు తత్ర తద్విఫలం భవేత్ । 164

భగవానునకు, వేదములకు, యజ్ఞములకు, ద్విజులకు, భక్తులగు వారిని గూర్చి ఎప్పుడును అభిచారము చేయరాదు. ఒక వేళ అట్లు చేసినచో అభిచారము నిష్ఫలమగును.

న హి కేశవ భక్తానా మభిచారేణ కర్హిచిత్ ।
వినాశమభిపద్యేత తస్మాత్తన్న సమాచరేత్ । 165

శ్రీకృష్ణ భగవానుని భక్తులను గూర్చి ఎప్పుడును అభిచారము చేయరాదు. అట్లు చేసిన తనకే వినాశము కలుగును.

**సేయం ధాత్రీ విధాత్రీ చ సావిత్ర్యథ వినాశినీ ।**
**ప్రాణాయామేన జాప్యేన తథా చాన్తర్జలేన చ ।** 166

**సవ్యాహృతీ సప్రణవా జప్తవ్యా శిరసాసహ ।**
**ప్రణవేన తథా వ్యస్తా వాచ్యా వ్యాహృతయః పృథక్ ।** 167

పాపములను నాశనము చేయునట్టి ఆ ధాత్రీ సావిత్రిని ప్రాణాయమములో, జపములో, అంతర్జలములో, వ్యాహృతి ప్రణవములతో గూడిన శిరస్సుతో జపము చేయవలెను. ప్రణవములతో న్యాసము చేసి వ్యాహృతులను వేరువేరుగ ఉచ్చరింపవలెను.

**సదాచారేణ సిద్ధ్యేచ్చ ఐహికాముష్మికం సుఖమ్ ।**
**తదేవ తే మయా ప్రోక్తం కిమన్యచ్ఛ్రోతుమిచ్ఛసి ।** 162

సదాచారమువలన లౌకిక సుఖము, పారలౌకిక సుఖముగూడ లభించును. దీనిని నేను నీకు చెప్పితిని. ఇక ఏమి వినదలచితివో? నాతో చెప్పుము.

గాయత్రీతంత్రములోని కొన్ని ప్రయోగ సంకేతములుపైన వివరింపబడినవి. ఈ ప్రయోగములకు సంబంధించిన విస్తృతములైన విధి విధానములను, కర్మకాండను, నియమనిబంధనలను ఉదహరించుట ఇచ్చుట ఉచితము కాదు. ఎందుకనగా తంత్ర రహస్యములను సామాన్యులకు తెలియజెప్పుటవలన సార్వజనికమైన వ్యవస్థలో కష్టము కలుగునను సందేహమున్నది.

# గాయత్రీ అభిచారము

మానవుడు ఒక ఉత్తమమైన విద్యుత్ప్రవాహము. వానిలో ఎంతో ఉష్ణము, విద్యుత్ శక్తి ఉన్నది. అది అన్నివిధముల చక్కగ ఉపయోగపడినచో వేగముగ తుఫాన్ మెయిల్ పరుగిడ గలదు. నోటినుండి వెలువడు శబ్దములు తమవెంట ఒకవిద్యుత్ ప్రవాహమును తీసికొనిపోవును.తత్ఫలితముగ వానిద్వారా సూక్ష్మ జగత్తులో కంపనలు పుట్టును. ఆకంపనల ద్వారా ఇతరువస్తువులపై ప్రభావము పడును. కొందరు వక్తలు శ్రోతల హృదయములు హర్షము, విషాదము, క్రోధము, త్యాగము మున్నగు వానితో నిండిపోవునట్టి భావవిద్యుత్తును తమ వక్తృత్వముతో కలిపివేయుదురు. ఆ వక్తలు తమ శ్రోతలను వ్రేళ్ళపై ఆడింతురు. కొందరు ఉగ్రవక్తలు గుంపును ఉత్తేజపరచి దానితో భయంకరమగు పనులనుచేయింతురు. ఒక్కొక్కప్పుడు మహత్త్వముగల కొందరు వ్యక్తుల ఉపన్యాసములు ఎంతో మహత్తుగలవిగ ఉండును. అవి ప్రపంచములో గొప్పసంచలనము కలిగించును.

శాస్త్రములలో శబ్దము బాణమని చెప్పబడినది. ధనుస్సునుండి బాణము విడువబడునప్పుడు దానిలో శక్తి ఉండును. ఈ శక్తి దెబ్బగొట్టి వానిని కలత పెట్టును. శబ్దము గూడ శక్తి సంపన్న మైన సాధనమే. అది ప్రకృతి పరమాణువులయందు వివిధరీతుల కలతను కలిగించును. ప్రకృతిలో శాస్త్రీయ పరిశోధనల సాహాయ్యముతో అల్లకల్లోలము సృష్టింపబడునట్లు మానవశరీరములో ఉండు విద్యుత్ ప్రవాహమును ఆధారము చేసికొని సృష్టికి సంబంధించిన పరమాణువులలో చలనము సృష్టింపబడును. శాస్త్రవేత్తలు మంత్రములను ఆధారము చేసికొని పరిణామములను వెల్లడించునట్లు కొన్ని మార్పులు వెలువరింప బడును.

ఆకాశములో ఎత్తుకు పోయి మంచుపొడిని విమానముల నుండి వెదజల్లి శాస్త్రవేత్తలు వెంటనే వర్షమును కురింపించు విధానమును కనిపెట్టిరి. ఈ కార్యము ప్రాచీనకాలములో శబ్దవిజ్ఞానముద్వారా, మంత్రబలముతో చేయబడుచుండెడిది. ఆకాలమునందును ఉన్నత శ్రేణికి చెందిన శాస్త్రవేత్తలు ఉండిరి, కాని వారికిగల ఆధారము నేటి ఆధారమునకంటె వేరుగా ఉండెను. దీనికై వారికి యంత్రముల అవసరము లేకుండెడిది. ఇంతటి దుబారాఖర్చు లేకుండగనే వానిపని జరుగుచుండెడిది. నేడు స్థూలముతో సూక్ష్మమును ప్రభావితము చేయుటకు శక్తి ఉత్పత్తి చేయబడుచున్నది. దానివలన పరిశోధనలు ప్రకటింపబడుచున్నవి. నేడు బొగ్గునుండి, నూనెనుండి, నీటినుండి శక్తి ఉత్పత్తి చేయబడుచున్నది. పరమాణువును విస్ఫోటనము చేసి శక్తిని పుట్టించు నూతనప్రయోగము ఇప్పుడు ఫలించినది. అమెరికాసైన్స్ అకాడమీకి

ప్రధానుడైన డాక్టర్ ఎవిడ్ చెప్పిన దేమనగా - రాబోవు మూడువందల సంవత్సరముల లోపల సైన్స్ ఎంతో అభివృద్ధి చెందగలదు, దానివలన బయటి వస్తువు సహాయమేది లేకుండగనే మానవశరీరములోపల ఉండు తత్త్వములను ఆధారముచేసి కొని సూక్ష్మజగత్తులో గందరగోళమును సృష్టింపవచ్చు. ఏ ఫలితములు నేడు యంత్రముల ద్వారా లభించుచున్నవో అవి శబ్దాదుల ప్రయోగము ద్వారానే పొందబడును.

డా. ఎవిడ్ భవిష్యతులో ఏ శాస్త్రీయమగు ఉన్నతిని ఆశించుచున్నాడో దానిలో భారతీయ శాస్త్రవేత్తలు ఎప్పుడో ఆరితేరిరి. శాపమిచ్చుట, వరమునొసంగుట ఈ శబ్దవిజ్ఞానమునకు సంబంధించిన అంతిమ ఉన్నతియే. శబ్దాఘాతము చేసి ప్రకృతిలో నిండియున్న పరమాణువులు ఆకర్షణ వికర్షణ చేయబడుచుండెను. నేడు విశేషములైన ప్రక్రియల ద్వారా, యంత్ర చాలనము ద్వారా విశేషములగు కార్యములు సిద్ధింపజేయుచున్నట్లు మానవుని యెదుట మంచి చెడు - రెండు విధములగు మార్పులు ఉపస్థితములగుచున్నవి. ప్రాచీనకాలమున మానవుడు తనను తాను మహాశక్తివంతమగు ఒక యంత్రముగా భావించుకొని దానిద్వారా ఒక శక్తిని ఉత్పత్తి చేయుచుండెను. దాని ద్వారా అభీష్టఫలములను ఆశ్చర్యమగు రీతిలో పొందుచుండిరి. ఈ ప్రణాళిక సాధన, యోగాభ్యాసము, తపస్సు, తంత్రము మున్నగు పేర్లతో పిలువబడుచున్నది. ఈ ప్రణాళికలకు ఉపాయములు జపము, హోమము, పురశ్చరణము, అనుష్ఠానము, తపస్సు, వ్రతము, యజ్ఞము, పూజ మున్నగునవి. వివిధప్రయోజనములకు వివిధములగు కర్మకాండలున్నవి. హోమములో ఉపయోగించు సామగ్రులు, మంత్రధ్వని, ధ్యానాకర్షణము, స్తోత్రములు, ప్రార్థనలద్వారా కోరికలు పెరుగుట, విశేషములగు ఆహార విహారములద్వారా మనః శక్తులను విశేషవిధముగ నిర్మించుట, తపస్సుద్వారా శరీరములో విశేషమగు ఉన్నతను ఉత్పత్తి చేయుట, దేవపూజద్వారా ప్రకృతిలోని సూక్ష్మ శక్తులను ఆకర్షించి తనలో నిలుపుకొనుట మున్నగు అనేకవిధులతో సాధకుడు తన్నుతాను ఒక విద్యుత్పుంజముగా చేసికొనుచుండును. దాని శ్రమ ఏదిశగా పోవునో ఆదిశయందలి ప్రకృతి పరమాణువులపై దాని ఆధిపత్యము ఉండును. ఆప్రక్రియద్వారా కావలసిన మార్పులు లభించును.

భారతీయవిజ్ఞానము ఇట్టిదే. దానిలో యంత్రముల అవసరము ఉండదు. పైగా తన్నుతాను ఒక మహాయంత్రముగా భావించుకొని దానిని అప్పుడప్పుడు యోగ్యముగా చేయుచుండును. దానితో ప్రపంచములోని అన్నియంత్రముల పనిజరుగుచుండెడిది. అప్పుడు రేడియోధ్వని విస్తారక యంత్రము లేదా ధ్వనిగ్రాహక యంత్రము అవసరము లేకుండెడిది. అప్పుడు విచార సంచాలన విద్యాసాధనను తెలిసినవారు చాలసులభముగ ఈ లాభమును పొందుచుండెడి వారు. అస్త్ర శస్త్రముల విషయము గూడ ఇంతే. నేడు తుపాకిని నిలువుగా పేల్చువిషయము అందరికి తెలియును. కాని ఒకానొకప్పుడు

తుపాకిగుండును లేదా బాణమును వంచి చక్రాకారముగ ప్రయోగించు విజ్ఞానము తెలియును. శ్రీరాముడు చక్రాకారమున నిలబడి ఏడుతాటిచెట్లను ఒక్కబాణముతో పడగొట్టెను. ఏకలవ్యుడు కుక్క పెదవులను బాణములతో కుట్టివేసెను. కాని కుక్క దవడ మీద ఏమాత్రముగాయము కలుగలేదు. శబ్దవేధ బాణమును ప్రయోగించు విద్య పృథ్వీరాజు చౌహాన్‌కు కూడ తెలియును. నేడు ఆవిజ్ఞానము దాదాపుగ లోపించినట్లే.

యంత్రములు లేకుండగ పోవు అద్భుత దివ్యశస్త్రములు భారతీయ ఇతిహాసములో వర్ణింపబడినవి. వానిలో ఆగ్నేయాస్త్రము గూడ ఒకటి. ఇది దగ్ధము చేయును. దీనిచే మంటలు, తుఫానులు, సృష్టింపబడెడివి. వ్యక్తిగతములగు ప్రయాసలతో (ప్రయత్నములతో) దీనిని ఒకవ్యక్తిపై ప్రయోగించి వాని ప్రాణముతీయుట జరుగుచుండెడిది. అగ్నికాండము జరుగుచుండెడిది. ఇది తాంత్రికకాలమున 'అగియాబైతాలము' అనిచెప్పబడుచుండెడిది. గాయత్రీమంత్రముద్వారా గూడ దీనిని ప్రయోగించుచుండిరి. దీని సంకేతములు కొన్ని క్రింది ప్రమాణములలో చెప్పబడినవి. విపరీత క్రమగాయత్రిని ' అనులోమ జపమందురు. ఇదియే ఆగ్నేయ స్త్రము ---

"త్ యా ద చో ప్ర నః యో యో ధి. హి మ
ధీ స్య వ దే ర్గో భ ణ్యం రే ర్వ తు వి త్స త
స్వః వః ర్భు భూః ఓం."

ఈ మంత్రము ఆగ్నేయాస్త్రము. ఈ విద్య కొద్దిగా క్రింద పరిచయము చేయబడుచున్నది.

ఆగ్నేయాస్త్రస్య జానాతి విసర్గాదాన పద్ధతిమ్ ।
యః పుమాన్ గురుణా శిష్టస్తస్యాధీనం జగత్ర యమ్ । 1

ఏ పురుషుడు ఈ ఆగ్నేయాస్త్రమును విడచుట, ఆకర్షించుట ఎరుగునో, ఎవడు గురువు ద్వారా శిక్షితు డగునోవాని యధికారమున ముల్లోకములు ఉండును.

ఆగ్నేయాస్త్రాధికారీ స్యాత్ప్రవిధాన ముదీర్యతే ।
ఆగ్నేయాస్త్రమితి ప్రోక్తం విలోమ పఠితో మనుః । 2

మరియు అతడు ఆగ్నేయాస్త్రమున కు అధికారియగును. ఇప్పుడు ఆగ్నేయాస్త్ర యోగ విధి చెప్పబడుచున్నది. ఆగ్నేయాస్త్రము విలోమము అనులోమము అనిరెండు విధముల చెప్పబడినది.

క్షీరద్రుమేంధనాజ్యేన హవిష్యాన్నైర్ఘృతాప్లు తైః ।
చతుశ్చత్వారింశాదాధ్య చతుశ్శత సమన్వితమ్ । 3

చతుస్సహస్ర జుహుయాదర్చితే హవ్యవాహనే ।
మండలే సర్వతో భద్రేమష్టకోణాంకిత కర్ణికే । 4

పాలుగారు చెట్ల సమిధలతో, ఘృతయుక్తమగు యవలతో ఆహుతులను ప్రజ్వలించు అగ్నిలో ఉంచవలెను. సర్వతోభద్రయంత్రమును నిర్మించి దానిలో ఆరుకోణములు గల యంత్రమును వేయవలెను.

**పూర్వోక్తా ఏవ సంపాత్యా మంత్రాశ్చ పరికీర్తితాః ।**
**ప్రతిలోమం కుర్యాదన్య షడంగాని ప్రకల్పయేత్ ।** 5

విలోమ కర్మయందు వెనుక చెప్పబడిన ఋష్యాదులను, షడంగన్యాసాదులను విలోమముగా చేయవలెను.

**వర్ణన్యాసం పదన్యాసం విదధ్యాత్ప్రతిలోమతః ।**
**ధ్యానభేదాన్విజానీయాద్ గుర్వాదేశాన్న చాన్యథా ।** 6

వర్ణన్యాసము, పదన్యాసము మున్నగువానిని విలోమముగా చేయవలెను. ధ్యానభేదములను గురువు ఆజ్ఞననుసరించి చేయవలెను. వేరువిధముగ చేయరాదు.

**పూర్వవజ్జప క్లృప్తిః స్యాజ్జుహుయాత్పూర్వసంఖ్యయా।**
**పంచగవ్యం మపక్వేన చరుణా తస్య సిద్ధయే ।** 7

వెనుక చెప్పబడిన సంఖ్యననుసరించి జపము చేయవలెను. పంచగవ్యముతోగూడి చక్కగా పచనమైన గురువుద్వారా జపసిద్ధికై వెనుక చెప్పబడిన సంఖ్యననుసరించి ఆహుతుల నీయవలెను.

**అర్చనం పూర్వవత్కుర్యాచ్ఛక్తీనాం ప్రతిలోమతః ।**
**సర్వత్ర దైశికః కుర్యాత్ గాయత్ర్యా ద్విగుణం జపమ్ ।** 8

విలోమముగా శక్తులను వెనుకటివలె పూజింపవలెను. అంతట ఆచార్యుడు గాయత్రిని రెండింతలుగా జపము చేయవలెను.

**క్రూరకర్మాణి కుర్వీత ప్రతిలోమవిధానతః ।**
**శాంతికం పౌష్టికం కర్మ కర్తవ్యమనులోమతః ।** 9

క్రూరకర్మల సిద్ధికై విలోమవిధానముతో జపాదులను చేయవలెను. శాంతిమయము లైన, పుష్టిదాయకములైన కర్మల సిద్ధికై అనులోమవిధానముతో జపాదులను చేయవలెను.

**విలోమకాలే ప్రజపేదష్టౌ పాదాన్స్తు ప్రతిలోమతః ।**
**శోధితో జయతే పశ్చాత్ మంత్రోఽయం విధినాఽమునా ।** 10

విలోమప్రయోగ కాలమున మంత్రములోని ఎనిమిది పాదములను పఠించవలెను. ఎందుకనగా మంత్ర పఠనమువలన మనస్సులోని అస్థిరత్వము మున్నగు దోషములు నశించును.

పైన చెప్పిన విధానము ఒకసంకేతము మాత్రము. దానితో పాటు ఒకవిస్తృతమగు కర్మకాండ, గుప్తసాధనావిధానము ఉన్నవి. వాని అన్నింటి రహస్యము గుప్తముగనే ఉంచబడును. ఎందుకనగా ఆ విషయములను సార్వజనికముగ స్పష్టము చేయుట అన్నివిధముల నిషిద్ధము.

## మారణప్రయోగము

తంత్రగ్రంథములలో మారణము, మోహనము,ఉచ్చాటనము మున్నగు ప్రయోగము లేన్నియో లభించున్నవి. శత్రునాశనమునకై మారణప్రయోగములు గైకొనబడుచున్నవి. మారణము ఎన్నోవిధముల ఉన్నది. ఇందులో ఒక ప్రయోగమున్నది-దానివలన ఏ మానవునికైన వెంటనే మరణము సంభవించును. ఇట్టి ప్రయోగములలో "ఘాతము" లేదా "కృత్య" ప్రసిద్ధమైనది. అది శక్తివంతమగు తాంత్రిక అగ్నిఅస్త్రము, అది ప్రత్యక్షముగ కనబడదు. అయనను తుపాకిలోని గోలీవలె లక్ష్యమునకు చేరును, శత్రువును పడగొట్టును. రెండవ విధమగు మారణము మందమారణము అనిచెప్పబడుచున్నది. దీనిప్రయోగము వలన ఏవ్యక్తినైన రోగిగా చేయవచ్చును. జ్వరము, నీళ్ళ విరేచనములు (అతిసారము), బాధ, పక్షవాతము, ఉన్మాదము, మతిభ్రమమున్నగు రోగములు, క్రిమిబాంబులతో ప్లేగు, కలరా మున్నగు మహావ్యాధులు వ్యాపించునట్లు ఏవ్యక్తినైన ఆక్రమించును.

ఇట్టిప్రయోగములు నైతిక దృష్టితో ఉచితములా? అనుచితములా? ఇది వేరే ప్రశ్న. కాని నిశ్చయమేమనగా ఇది అసంభవము కాదు సంభవమే. విషమును త్రాగించి లేదా శస్త్రమును ప్రయోగించి ఏమనుష్యునైన చంపవచ్చు. అట్లే కొన్ని అదృశ్య ఉపకరణములు గూడ ఉన్నవి. వానిని ప్రేరేపించినచో ప్రకృతిని నాశనము చేయుపరమాణువులు ఒకచోట చేరి అభీష్టలక్ష్యమువైపు పరుగిడును, దానిపై భయంకరముగ దాడిచేసి పైకి ఎక్కి కూర్చుండి దానిని గెలిచిప్రాణసంకటమున పడవేయును. ఇట్లు ప్రకృతి గర్భమున సంచరించుచు ఒకానొక రోగమునకు సంబంధించిన కీటాణువులను ఏవ్యక్తి మీదకు నైన పంపవచ్చును.

'మృత్యుకిరణము" నేటి శాస్త్రీయపరిశోధనాసృష్టి. ఏప్రాణిపైనగాని ఈ కిరణములను ప్రయోగించినచోవాడు (అది) తప్పక మరణించును. ప్రత్యక్షముగా చూచినచో ఆ వ్యక్తియందు ఏవిధమగు గాయము ఉండదు. కాని అదృశ్యమర్గముతో వానిలోని అవయవములపై సూక్ష్మమగు ప్రభావముండును. ఆ ప్రహారముచే వాడు మరణించును. ఆదెబ్బకొంచెము తక్కువస్థాయిలో ఉన్నచో వానికి మరణము కలుగదు. కాని దానివలన మృత్యువుతో సమానమగు కష్టమును కలిగించునట్టి లేదా మెల్లమెల్లగా చంపునట్టి రోగములు పుట్టును.

శాపమును ఇచ్చునట్టి విద్య ప్రాచీనకాలమున చాలమందికి తెలియును. ఎవనికి శాపము ఇవ్వబడునో వానికి గొప్ప అనిష్టము కలుగు చుండెడిది. శాపమిచ్చువాడు తన ఆత్మిక శక్తులను కూడ తీసికొని ఒకవిశేషవిధితో ఎవనిపై వానిని ప్రయోగింతునో తాను అనుకొన్నట్లుగ వానికి ఆవిధమగు అనిష్టము కలిగెడిది. తాంత్రిక అభిచారములతో గూడ ఈవిధముగ ఇతరులకు కీడును కలుగజేయవచ్చును. కాని గుర్తుపెట్టుకొనవలసిన విషయమొకటి ఉన్నది. ఈ విధమగు ప్రయోగములలో ప్రయోగించువాని శక్తి కూడ ఎక్కువగనే పోవును. శిశువును ప్రసవించిన పిమ్మట తల్లి పూర్తిగ బలహీనురాలగును, సత్తువ ఏమియు నుండదు. ఎవనినైన కాటువేసినపిమ్మట సర్పము తేజస్సు లేనిది, వీర్యము నశించినది, శక్తి లేనిది అగును. మారణము ఉచ్చాటనము అను అభిచారము చేయువారి శక్తులు గూడ ఎక్కువగనే వ్యయమగును. ఆ నష్టమును పూడ్చుకొనుటకు వారు అసాధారణములగు ప్రయోగములను చేయవలసి ఉండును.

ఏ విధముగ మంత్రములద్వారా ఇతురులకు మారణ - మోహన - ఉచ్చాటనాది అనిష్టములు కలుగునో అదేవిధముగ నేర్పరియైన తాంత్రికుడు ఈవిధములగు అభిచారములను ఆపనుగూడ ఆపగలడు, వానిదాడులను త్రిప్పివేయగలడు. చివరకు అవి ప్రయోగించువానిపై బడి వానికి కడును కలుగజేయును. ఘాతము, కృత్య, చౌర్యము మున్నగు వానిని మరొక తాంత్రికుడు త్రిప్పిపంపినచో వానిని ప్రేరేపించి ప్రయోగించిన వానిపై ఆపద అనెడు పర్వతము విరిగిపడినట్లే అని భావించవలెను.

పైన చెప్పబడిన అనిష్టకారకములను ప్రయోగములు తరచుగ జరుగుచుండును. ఇవి తంత్రవిద్యద్వారా జరుగును. కాని నీతి, ధర్మము, మానవత్వము, ఈశ్వరీయవిధానము అనునవి సుస్థిరముగ ఉండదలచినచో ఇట్టి ప్రయోగములు పూర్తిగ అనుచితములు, అవాంఛనీయములు. ఈ విధముగ రహస్యహత్యలు సాగుచున్నచో దానివలన లోకవ్యవస్థలో గందరగోళము ఏర్పడును, పరస్పర సద్భావము, విశ్వాసము దెబ్బతినును. ప్రతివాడు మరొకనిని అనుమానముగ, సందేహముగ, అవిశ్వాసముతో చూచును. అందువలన తంత్రవిద్యావేత్తలగు భారతీయులు ఈ కర్మలను నిషేధించి, ఆ విధానములను గుప్తముగ ఉంచిరి. నేడు పరమాణు అస్త్రములను నిర్మించు రహస్యములు చాల జాగ్రత్తగ దాచి పెట్టబడు చున్నవి. అట్లుగాక వాని నిర్మాణజ్ఞానము అందరికీ అందుబాటులోనికి వచ్చినచో అది దుర్వినియోగమగును. అట్లే ఆ అభిచారములనుగూడ పూర్తిగా గోప్యములుగా ఉంచుటకు చట్టము చేయుట జరిగినది.

'శారదాతిలక' మనుతంత్రగ్రంథములోని గాయత్రీ పటలమునందు ఈవిధములగు అభిచారములు వర్ణింపబడినవి. దీనిలో సంకేతరూపమున ఆ విస్మృతక్రియల ఆభాసము కొంచెము కొంచెముగ చూపబడినది. ఆ సంకేతము పూర్తిగ అసంపూర్ణము. అసంబద్ధము అయినను ఆసూత్రమును ఆధారముగా చేసికొని పనిని పూర్తిచేయుటకు

ఏప్రణాళికను అవలంబింపవలెను ఏవస్తువల అవసరము ప్రధానముగా ఉన్నది అనువిషయమును తెలిసికొనవచ్చును. ఈ సంకేతములతో ఆ మార్గమున పయనించు వానికి ఏదోవిధముగ ఆగుప్తరహస్యముల జ్ఞానము తెలియగలదు.

క్రింద శారదా తిలకతంత్రములోని కొన్ని అభిచారసూత్రములు వ్రాయబడుచున్నవి. వాని వలన ఈ విధమగు విధులు తెలియగలవు. గాయత్రివలన సాత్త్వికలాభములు కలుగును. దానివలన తామసిక కార్యములను గూడ చేయవచ్చును. కాని ఇట్టి ప్రయోగములు చేయుట ఉచితమని చెప్పుటకువీలులేదు. అందువలన ఆ విధానములను గుప్తముగనే ఉంచుట జరుగుచున్నది. క్రింద కొన్ని అభిచార సంకేతములు గల శ్లోకములు వ్రాయబడుచున్నవి.

ధత్తూర విషవృక్షార్క భూరుహోత్థాన్ సమిద్వరాన్ ।
రాజీతైలేన సంలిప్తాన్ పృథక్సప్త సహస్రకమ్ ।
జుహుయాత్ సంయతో మంత్రీ రిపుర్యమపురం వ్రజేత్ । 1

ఉమ్మెత్తను, విషవృక్షము యొక్క సమిధలను నల్ల ఆవాలనూనెతో కలిపి వేరుగ ఏడువేల ఆహుతులను ఇంద్రియనిగ్రహముగలవాడై ఇచ్చినచో శత్రువు యమపురమునకు పోవును.

సప్తరాత్రం ప్రజుహుయాత్ సర్షపస్నేహమిశ్రితైః ।
ఆర్ద్రవస్త్రో వృష్టికాలే మరిచైర్మనునామమునా । 2

ఏడురాత్రులవరకు ఆవాల నూనెతో కలిపి మిరపకాయలతో హోమము చేయవలెను. తడిబట్టలను కట్టుకొని వర్షాకాలమున ఈ ప్రయోగము చేయవలెను.

విగృహ్యతే జ్వరేణారిః ప్రలయాగ్నిసమేన సః ।
తాలపత్రే సమాలిఖ్య శత్రునామ యథావిధ । 3

ఆగ్నేయాస్త్రేణ సంవేష్ట్య కుండమధ్యే వికన్యతే ।
జుహుయాన్మరిచైః క్రుద్ధో జ్వరాక్రాన్తః స జాయతే । 4

ఇట్లు చేసినచో శత్రువు ప్రళయాగ్నితో సమానమగు జ్వరమునకు గురియగును. తాటియాకుపై శత్రునామమును పైన చెప్పిన విధిగ వ్రాసి ఆగ్నేయాస్త్రముతో అభిమంత్రించి కుండమునందు పాతిపెట్టినచో, మరియు క్రోధితుడై మిరపతో హోమము చేసినచో శత్రువు జ్వరపీడితుడగును.

తదాదాయ క్షిపేత్తోయే శీతలే సర్వశో భవేత్ ।
పిష్ట్వాపామార్గ బీజాని మరిచం మధుసంయుతమ్ । 5

**అత్యుష్ణంవణే తోయే నిక్షిప్య క్వాథయేత్తతః ।**
**ఋక్షవృక్ష ప్రతికృతౌ హృదయే వదనే నసి ।** 6

మరల కుండమునుండి పెకలించి శీతల జలములో పడవేయవలెను. ఉత్తరేణు గింజలను నూరి, తేనెతో గూడిన మిరపకాయలను ఉప్పునీటిలో ఉంచి నిప్పుపై పెట్టి కషాయమువలె కాచవలెను. మరల ఋక్షములోను వృక్షముతోను రచితమైన ప్రతిమకు హృదయమును, ముఖమును, ముక్కును చిత్రించవలెను.

**కించిత్కించిత్క్షిపేత్తోయే దర్వ్యా సంచాలయేత్తథా ।**
**ఆగ్నేయముచ్చరన్మంత్రో సోఽచిరాజ్జ్వరితో భవేత్ ।** 7

ఇంకను దానిలో పాటు కొంచెము కొంచెముగ నీరును పోయుచు మంత్రమును ఉచ్చరించుచు దర్వితో (గరిటతో) కలియబెట్టుచున్నచో త్వరగనే శత్రువు జ్వరయుక్తుడగును.

క్వథితేఽమ్బసి తాం క్షిప్త్వాహన్యాచ్ఛత్రూన్ప్రయత్నతః ।
తీక్ష్ణస్నేహేన సంలిప్తాం శత్రోః ప్రతికృతిం నిశి ।  8

**తాపయేదేధితే వహ్నౌ ప్రతిలోమ మనుం జపన్ ।**
**జ్వరేణ బాధ్యతే సద్యో హోమాదన్య మృతిర్భవేత్ ।** 9

కషాయము సిద్ధమైన పిమ్మట దానిని నీటిలో వేసి కలుపవలెను. మరల తైలములో ఆ కలిపిన క్వాథము (కషాయము) ను రాత్రి యందు విలోమముగ మంత్రమును జపించుచు ప్రజ్వలితాగ్నిలో కాచవలెను. దీనివలన శత్రువు త్వరగనే జ్వరపీడితుడగును. హోమమువలన వాడు మరణించును.

**సాముద్రే సలిలే హింగు బీజజీరకలోలితే ।**
**క్వథితే పుత్తలిం సాధ్య నక్షత్ర తరునిర్మితామ్ ।** 10

**అధోవక్త్రాం వినిక్షిప్య యష్ట్యా విషద్రుమస్య వై ।**
**తచ్ఛిరః సోత్పీడనం కుర్వన్ జపేన్మంత్రవిలోమతః ।** 11

ఉప్పుకలిపిననీటిలో ఇంగువను, జీలకఱ్ఱను కలిపి కషాయము చేసి ఋక్ష వృక్షముతో వాని ఆకారమును నిర్మించి, దానిని అధోముఖముగ నేలపై పడవేసి విష వృక్షపు కఱ్ఱతో వాని శిరస్సును పొడుచుచు మంత్రమును జపింపవలెను.

సప్తాహాన్మరణం యాతి శత్రుర్జ్వర విమోహితః ।
ఆదిత్య రథనాగేంద్ర ప్రస్తాం ప్రత్యతిద్విషా హతమ్ । 12

ఇట్లు చేయగా శత్రువు జ్వరపీడితుడగును. వారముదినములలో వాడుమరణించును. సర్పము వాని కాలిపై కాటువేయును.

తత్తైలేన మరిప్త్వాంగం దగ్ధం రక్తమరీచిభిః ।
అధోముఖం విజరిపుం దగ్ధ్వా క్వథితవారిణా । 13
తర్పయేద్భాను మాలోక్య శత్రుర్మృత్యుముఖే భవేత్ ।

మరొకవిధి ఇట్లున్నది - ప్రతిమను తైలములో పూసి మిరపతో కాల్చి దానిని క్రింద ఎండ బెట్టి వేడి నీటితో సూర్యునకు తర్పణము చేయవలెను. శత్రువు త్వరగా మరణించును.

ప్రాంగణే స్థండిలం కృత్వా సుగంధికుసుమాదిభిః ।
దేవీ మభ్యర్చయేన్నిత్యం ప్రాగుక్తేనైవ వర్త్మనా । 14
అహోరేద్రాత్రిషు బలిం చరుణా సర్వసిద్ధిదామ్ ।
భూతరోగద్రోహ భయం ప్రభవేన్నాత్ర సంశయః । 15

ప్రాంగణమున వేదికను నిర్మించి సుగంధపుష్పాదులతో నిత్యము యథావిధిగ దేవిని అర్చించవలెను. రాత్రివేళ సర్వసిద్ధుల నొసంగు చరువుతో బలి నొసంగవలెను. ఇట్లుచేసిన మీదట రోగ - భయ - ద్రోహ - భూతాదుల భయము ఉండదు.

యథావదగ్నిమారాధ్య గంధైః పుష్పైః మనోరమైః ।
స్థిత్వా తస్యాగ్రతో మంత్రీ జపేన్మంత్రమనన్యధీః । 16

మనోహర సుగంధపుష్పములతో అగ్నిని పూజించి అగ్నియెదుట అనన్య బుద్ధితో మంత్రమును జపింపవలెను.

జపోఽన్య సర్వ సిద్ధ్యై స్యాన్నాత్ర కార్యావిచారణా ।
లవణై ర్మధురా సిక్తైర్జుహూయా త్పశ్చిమోన్ముఖః । 17

ఈ జపము సర్వసిద్ధుల నిచ్చునట్టిది. దీనిలో ఎట్టి సందేహము పనికిరాదు. పడమటివైపు ముఖముపెట్టి ఉప్పుతో గలిసిన అన్నమును, మిఠాయిలను హోమము చేయవలెను.

మంత్రార్థ సంఖ్యయా మంత్రీ రిపుమాత్మావశం నమేత్ ।
శాలీన్ ప్రక్షాల్య సంశోధ్య శుద్ధాన్ కుర్వీత తండులాన్ । 18
జపిత్వా పంచగవ్యేషు సంస్కృతే హవ్యవాహనే ।
సంపచేజ్జపన్మంత్రం వ్రీహీన్ తత్ర పునః సుధీః । 19

నలుబదినాలుగువేలు మంత్ర జపముచేసిన వాడు శత్రువును తన వశము చేసికొనును. బియ్యమును కడిగి శుభ్రముచేసి ఆ బియ్యమును పంచగవ్యమున శుద్ధిచేసి విద్వాంసుడు మరల మంత్రమును జపింపవలెను.

అర్చయిత్వా విశదధీర్దేవీమగ్నౌ యథా పురా ।
జుహుయాచ్చరుణానేన సాజ్యేనాష్టసహస్రకమ్ । 20

మరల వెనుకటివలె దేవిని పూజించి అగ్నిలో ఘృతయుక్తమగు ఈ చరువుతో ఎనిమిదివేలు ఆహుతుల నీయవలెను.

పాత్రే సంపాతనం కుర్వన్ సాధ్యం ధీతత్ భక్షయేత్సు
శేషం తం నిఖనేద్వారి సంపాతం ప్రాంగణాంతరే । 21

మరల కొంచెము పాత్రలో ఉంచి తాను తినవలెను. మిగిలిన దానిని ప్రాంగణమున పాతిపెట్టవలెను లేదా వాకిలి మీదపారవేయవలెను.

కృత్యారోగా వినశ్యన్తి సహభూత గ్రహామయైః
పరైరుత్పాదితా కృత్యా పునస్తానేవ భక్షయేత్ । 22

కృత్యవలన గలిగిన రోగములు భూత గృహములతో పాటు నశించును. ఇతరులచే పంపబడిన కృత్య వారికే కీడుకలిగించును.

# చతుర్వింశతి గాయత్రీ

గాయత్రీ మంత్రమందలి 24 అక్షరములు నిజానికి 24 శక్తిబీజాలు. పృథ్వీ జలము. వాయువు, ఆకాశము, అగ్ని అనే పంచతత్వాలు ప్రధానమైనవి. కాని తత్వములు 24 ఉన్నాయి. వీటివర్ణన సాంఖ్య దర్శనంలో యివ్వబడింది. ఈ సృష్టిలో 24 తత్వములను గుది గుచ్చిన ఒక సూక్ష్మ ఆధ్యాత్మిక శక్తి యొక్క ఆవిర్భావం జరిగింది. ఆశక్తి పుంజం పేరు గాయత్రి.

గాయత్రి యందలి 24 అక్షరాలు 24 మాతృకామహాశక్తులకు ప్రతీకలు. వాని కలయిక ఒక పద్ధతి ప్రకారం మాలగా గుది గుచ్చబడింది. అందు వలన ఈ మహామంత్రాన్ని ఉచ్చరించిన మాత్రాననే శరీరంలోని వివిధ భాగాలలో అవస్థితమై ఉన్న 24 మహాశక్తులు జాగృతం కాగలవు.

మార్కండేయ పురాణంలో శక్తి అవతారం యొక్కకథనం ప్రకారం దేవతలందరూ తమతమ తేజస్సును ఏకత్రితం చేసినంత, ఆ ఏకత్రిత తేజో కేంద్రము శరీర రూపంలో అవతరించింది. అందున్నశక్తులు స్రష్ఠ యొక్క నిర్మాణ, పోషణ, సంహారములకు మూల కారణములు. రసాయన విజ్ఞాన నియమం ప్రకారం క్రియాశీల పదార్థాల సమ్మేళనం వల్ల కొత్త పదార్థం ఉత్పన్నమవుతుంది. రజము, వీర్యము సజీవంగా కలిస్తే ఒక మూర్తి వంతమైన గర్భం ఆవిర్భవిస్తుంది. గంధకం పాదరసం కలిసి కాటుక తయారవు తుంది. పాలు, పులుపు కలిస్తే పెరుగవుతుంది. ఋణ ధన పరమాణువులు కలిస్తే విద్యుత్తు యొక్క శక్తి శాలియైన ధార ఉత్పన్న మవుతుంది. 24 సూక్ష్మతత్వముల 24 సూక్ష్మ శక్తుల సమ్మేళనం వల్ల ఎట్టి అద్భుత విద్యుద్ధార ఉత్పన్నమవుతుందంటే దాని సామర్ధ్యాన్ని వర్ణించటం కష్టం. మార్కండేయ పురాణం లోని శక్తి అవతారం ఆ అవతారము యొక్క క్రియాశీలత ఈ తథ్యముల (facts) నను సరించి వివరింప బడ్డాయి.

ఒక విశేష పర్వత ప్రదేశంలో భూమి అక్కడి వాయువు, అక్కడి వనస్పతులు రసాయనిక పదార్థాల సమ్మిశ్రణ కారణాన గంగోత్రి నుండి ఆరంభమయే జలం ఒక విశిష్టమైన అద్భుత గుణం కలిగి ఉంటుంది. అదేవిధంగా 24 అక్షరాలుఉపయోగకరమైన తత్వాలు కారణవశాన సమ్మిశ్రణం కావటం వల్ల అంతరిక్షాకాశంలో ఒక విద్యున్మయ సూక్ష్మ సరిత (ప్రవాహం) బయలు దేరుతుంది. ఈ ఆధ్యాత్మ గంగకే గాయత్రియని పేరు. ఏవిధంగా గంగా నదిలో స్నానం చేయటంవల్ల శారీరిక మానసిక స్వస్థత కలుగుతుందో అదేవిధంగా ఆ ఆకాశ వాహినియైన విద్యున్మయీ గాయత్రీశక్తి యొక్క సామీప్యంవల్ల ఆంతరిక, బాహ్యబలము, వైభవము కలుగుతాయి.

సృష్టియొక్క ఉత్పాదక తత్వము చైతన్య రహితంగా చెప్పబడింది. అట్టి అచైతన్యము ఉత్తస్థూల రూపం మాత్రమే. అచేతన వెనుక గూడా ఒక ప్రేరణ ఉంటుంది. ఎందువల్లనంటే ప్రేరణలేక ఎట్టి అచేతన వస్తువయినా పని చేయ జాలదు. రైలు, మోటారు, ఓడ, విద్యుత్తంత్రి, బాంబు, తుపాకి మందు మొదలైనవానికి స్వయంగా పనిచేసే శక్తి లేదు. ఒక చైతన్యవంతమైన ప్రాణి వాటిని ఉపయోగించాలి. అదేవిధంగా తత్వాలను క్రియాశీలంగా ఉంచటానికి వాని వెనుక చైతన్యశక్తి పనిచేస్తుంది. ఆధ్యాత్మ విద్య నెరిగిన భారతీయ వైజ్ఞానికులందరికీ ప్రతితత్వమునకూ వెనుక ఒక చైతన్య శక్తి, ప్రేరణశక్తి రూపంలో వెలుగొందుతున్నదని తెలుసును. ఆప్రేరకశక్తితో పరిచయం పొంది ఆశక్తి ఆధిపత్యంలో ఉన్నటు వంటి పదార్థాలను పొందగల్గినారు. ఈ ప్రేరక శక్తులను భారతీయ విజ్ఞాన వేత్తలు "దేవతలు" అనిపిలిచే వారు.

పృథ్వి, వాయువు, అగ్ని, జలము మొదలైన వానిని పూజించేటందుకు వేదోక్త, పురాణోక్త విధానాలున్నాయి. ఏమిటి ? లోహాలను, పుల్లలను, నీటిని, నిప్పును, గాలిని పూజచేయట మేమిటి ? ఈ నిర్జీవ పదార్థాలను పూజచేయటం వల్ల లాభం పొందటం అసంభవం అని తెలియనంతటి మూర్ఖులా ? మన ఋషులు, మునులు. ఈవిధంగా ఆలోచించి లాభంలేదు. భారతీయ వైజ్ఞానికులు గొప్ప ఉన్నతస్థాయి పరిశోధనలు చేసినవారు. నేటి భౌతిక వైజ్ఞానికుల పరిశోధన ఎక్కడితో ఆగిపోతున్నదో అక్కడ నుండి భారతీయ మహర్షులు పరిశోధనను ప్రారంభించారు. వారిని మట్టిని, రాళ్లను పూజించే మూర్ఖులనే తప్పుడు ఆలోచనలను మనం కట్టి పెట్టాలి. వస్తువుల స్థితి ఎటువంటిదంటే ఒక విధమైన గుణముశక్తి, స్వభావము, ప్రవృత్తి, స్థితి అనేవాటివల్ల పరమాణు సమూహము తత్వాలలో ఉంటుంది. తత్వం వెనుక ఒక ప్రేరకశక్తి పని చేస్తూ ఉంటుంది. దానినే ఈశ్వరీయ అనుశాసనము అని పిలుస్తారు. అదే ప్రేరకము, నియామ ఉత్పాదకము, సంచాలకము, విధ్వంసకము అయిన శక్తి, అది తన క్షేత్రమునకు అధిపతి. ఆ ఆధిపత్యం సంపూర్ణమైనది. దాని పేరే దేవత.

ఈదేవతలందరకూ తమతమ కార్యప్రణాళికలు, మర్యాదలు ఉంటాయి (నియమాలు). ఎక్కడ పదార్థాల, పరమాణువుల సంబంధమైన క్రియాకలాపాలు ఉంటాయో, అక్కడ గుణ స్వభావ సంబంధశక్తులు గూడా ఉంటూ దేవతలతో సంబంధం ఏర్పాటు చేసుకునే, ఉపాసనలో వారి గుణ స్వభావములతో గూడా సంబంధం పెట్టుకునే ఏర్పాటు కూడా ఉంటుంది. ఆవిధంగా ఉపాసకునికి తన ఉపాస్యదేవత యొక్క గుణ, స్వభావాలు అలవడతాయి. అంతే కాకుండా ఆదేవతలకు ఏవస్తువుల మీద ఆధిపత్యం ఉన్నదో ఆవస్తువులు ఉపాసకునికి కొద్దిగానో, గొప్పగానో లభించి తీరుతాయి.

ఈదేవశక్తులను సమీపించటానికి, వాటిని పట్టుకోటానికి వాటితో సంబంధాన్ని ఏర్పాటు చేసుకోవటానికి, సాధనా విజ్ఞానంలో నిష్ణాతులైన ఆచార్యులు సమాధ్యవస్థను పొంది తమ ధ్యాన చేతనను అంతరిక్షలోకాలలోనికి వదిలారు. వారి అంతః చేతన దేవశక్తులతో సంబంధం పొంది, పొందిన అనుభవాలను యోగిజనులు దేవతల రూపంలో వర్ణించారు. **మనుష్యుని మెదడు నిర్మాణరీతి, అతనికి ఏవస్తువును గురించి చెప్పినా, ఆవస్తువు యొక్క రూపం గుర్తుకు వచ్చే విధంగా ఉంటుంది. ఆవస్తువుసాకారమైనా, నిరాకారమైనా మస్తిష్కంతో ఆలోచించాలంటే రూపం ఉండక తప్పదు. రూపరహితమైన దానిని గురించి మెదడు ఆలోచించటం అసంభవం.** సాకారమైన వస్తువుల గురించి విన్నా వాటిని చూచినా ఒకానొక రూపముద్ర మెదడులో పడుతుంది. నిరాకార వస్తువుల యొక్క ఆకారం వారి కల్పనను బట్టి ఉంటుంది. కాని ఆకల్పనకు గూడా ఒకనొక ఆధారం ఉండితీరాలి. దేవతల ఆకారాన్ని యోగాచార్యులు నిర్ధారణ చేశారు. వారి మస్తిష్కము అంతరిక్ష లోకాలలో వ్యాపించియున్న దేవశక్తులతో కలిసినప్పుడు ఏరూపంలో గ్రహించారో అదే ఆదేవతల రూపంగా భావించారు.

ఈదేవతల రూపమనేది ఒక మీడియం. దాన్ని ఆధారం చేసికొని సులభంగా ఆదేవశక్తులతో సంబంధాన్ని పొందవచ్చు.. దేవశక్తులతో సంబంధం ఏర్పడినప్పుడు ఏచిత్రం మనస్సులో మెదులుతుందో ఆచిత్రాన్ని ఆరంభంలోనే మనస్సులో ధారణ చేయగలిగితే ఆశక్తితో సంబంధం ఏర్పరచుకోవటం గూడా తేలికగా జరుగుతుంది. దేవతల రూపాన్ని ధ్యానించటం ఈదిశలో ప్రధానసాధన. అందుకు ఆచార్యులు ప్రతి దేవత యొక్కరూపాన్ని అనుభవసాధన ఆధారంగా నిర్ధారణ చేసి యిచ్చారు.

ఇక్కడ మనం గుర్తుంచుకోవలసిన విషయం, దేవతలు స్వతంత్ర శక్తులుకావు. ఒకే పరమాత్మ యొక్క వివిధ శక్తుల నామములే దేవతలు. సూర్య కిరణాలను ఏవిధంగ అల్ట్రావయొలేట్, ఆల్ఫా, పారదర్శ, మృత్యు కిరణాలనే పేర్లతో పిలుస్తారో, అదేవిధంగా అనేక కార్యములు, గుణముల కారణంగా ఈశ్వరీయ శక్తులు గూడా దేవనామములతో పిలువబడతాయి. సూర్యుని ప్రాతః కాలీన మధ్యాహ్నకాలీన, సాంధ్య కాలీన కిరణముల గుణాలు భిన్నంగా ఉంటాయి. ఈవిధంగా వేసవి, వర్ష, శీతాకాలాలలో గూడా కిరణముల గుణములలో తేడా ఉంటుంది. సూర్యుడొక్కడైనప్పటికీ ప్రదేశము, ఋతువు కాలముల భేదం వల్ల గుణములు భిన్నంగా ఉంటాయి. ఈశ్వరుని శక్తులలో ఈవిధమైన విభిన్నతలు ఉండటంవల్ల పేర్లు విభిన్న ప్రకారంగా పెట్టబడ్డాయి.

గాయత్రి యందు 24 శక్తులు గుదిగుచ్చబడి ఉన్నాయి. సాధారణంగా గాయత్రీ ఉపాసన చేయడంవల్ల ఆ 24 శక్తుల యొక్కయథోచిత మాత్రలో లాభం కలుగుతుంది. పాలలో అన్నిరకకాల పోషకతత్వాలూ ఉన్నాయి. పాలు త్రాగే వారికి ఆ అన్నితత్వములు యథోచితమాత్రలో లాభం కలుగుతుంది. కాని ఎవరికైనా కొన్ని విశేష తత్వముల

ఆవశ్యకత కలిగినప్పుడు కొన్ని విశేష భాగములను విడదీసి సేవించాలి. కొందరికి పాలలో గల చమురు (మృదువు) గలభాగం కావలసి వస్తే వారు నేతిని తీసుకుంటారు. మజ్జిగ కావలసివస్తే తక్కిన వానిని వదలి మజ్జిగ మాత్రమే సేవిస్తారు. రోగులకు పాలు విరుగగొట్టి అందలి నీరు మాత్రమే యిస్తారు. ఈవిధంగానే వివిధ వ్యక్తులు వారి అవసరాలను బట్టి గాయత్రి యందలి అనేక దేవశక్తులలో ఒకదానిని మాత్రమే ఆరాధిస్తారు. తమ ముఖ్యమైన ఆవశ్యకత ననుసరించి ఆవస్తువు కొరకు ఎక్కువగా కష్టపడతారు.

ఈదృష్టితో పనిచేసేటందుకు విభిన్నసాధనలు చెప్పబడ్డాయి. ఈపద్ధతిని 24 గాయత్రుల సాధన అంటారు. గాయత్రి మంత్ర గ్రంథములయందు 24 దేవతల యొక్క 24 గాయత్రులు చెప్పబడ్డాయి. వాని సంక్షిప్త విధి గూడా చెప్పబడింది. వాటి అన్నిటియొక్క సూక్ష్మావలోకనం చేయడంవల్ల వివిధ కామనల పూర్తి కొరకు సృష్టి యొక్క 24 ప్రధానతత్వముల ప్రేరకశక్తులను ఉపయోగించుకునే విధివిధానంగా తెలుస్తుంది. భారతీయ యోగవిజ్ఞానంలోని క్రియాపద్ధతి - వారు పరమాణువుల తత్వముల వివేచన నేటి భౌతికశాస్త్రజ్ఞులు చేసిన విధంగా చేయరు. వైజ్ఞానికులు తమ అభీష్టసిద్ధి కొరకు తత్వాలను పరమాణువులను పట్టుకుంటారు. ఈ గ్రహణం కొరకు వారు ఎంతో శ్రమను ధనాన్ని వెచ్చిస్తారు. తడవ తడవకూ యంత్రాలతో పనిపడుతుంది. యోగవిజ్ఞానం యింతకన్న విశాలమైన ప్రాతిపదికను ఉపయోగిస్తుంది. యోగులు పరమాణువుల వెనుక పనిచేసే ప్రేరక, చైతన్య దేవశక్తులను పట్టుకుంటారు. వానితో తమ మనోరథాన్ని పూర్తి చేసుకుంటారు. వీటిని పట్టుకోటానికి వారికి లోహ యంత్రాలతో పనిలేదు. వారు మానవ శరీరముయొక్క, మనస్సుయొక్క అంతఃకరణ యొక్క అలౌకిక, అసాధారణ, అనంతశక్తిశాలీ యంత్రాలను ఉపయోగించుకుంటారు. ఈశ్వరుడు సర్వాంగ పూర్ణమైన మానవ శరీరమనే యంత్రాన్ని తయారు చేశాడు. అటువంటి యంత్రాన్ని యింత వరకూ ఏవైజ్ఞానికుడూ తయారు చేయలేక పోయాడు. భవిష్యత్తులో కూడా అది సంభవంకాదు. భారతీయ వైజ్ఞానికులు తడవతడవా భారీయంత్రాలను తయారు చేసుకునేటందుకు బదులు మనుష్య శరీరమనే అతి సూక్ష్మయంత్రాన్ని ఉపయోగించారు.

రేడియో స్విచ్చివేసి మీటరు త్రిప్పగానే వివిధస్థానాలలో వివిధ ధ్వనులు వినిపిస్తాయి. అవి దూరమైనాసరే, దగ్గరైనా సరే రేడియో స్విచ్చివేయగానే దానిలోపల అంతకు ముందున్న విధివిధానం మారి కొత్త విధానంలో పని చేయటం ప్రారంభిస్తుంది. ఒక స్టేషను పనిచేయటంమాని ముల్లుత్రిప్పిన ప్రకారం యింకో స్టేషను పనిచేయటం ప్రారంభిస్తుంది. మనుష్య శరీరం స్థితిని గూడా సాధనాత్మక కర్మకాండల ద్వారా మార్పుచేసి ఒక దేవశక్తికి మారుగా సాధనా కాలంలో సాధకుని రీతి - రివాజు, ఆహార-

విహారాలు, దినచర్య, ఆలోచనలు, చింతన, ధ్యానము సంయమము, కర్మకాండ, నియంత్రణ చేసుకోవాలి. అందువల్ల అతని మనోభూమి ఒక విశేష దిశలో పనిచేయడానికి యోగ్యతను పొందుతుంది. సాధనాకాలంలో నియమోపనియమాలను నియంత్రణను సాధకుడు చక్కగా పాటిస్తే అతని యంత్రం ఎంత సూక్ష్మంగా తయారవుతుందంటే తన యిష్ట దేవతతో సంబంధం ఏర్పడుతుంది. అందువలన ఆధ్యాత్మవిద్యలో గురువు తన శిష్యులకు సాధనకాలం అవసరమైన సంయమ, నియమములను పాటించడంలో శ్రద్ధ చూపుతాడు.

స్థూల శరీరంలో రెండు చేతుల సహాయంతో ఏదైనా వస్తువును పట్టుకుంటాము. సూక్ష్మశరీరంలో గూడా యిదే విధంగా రెండు చేతులున్నాయి. వానితో పరమాణు తత్త్వములుగాక వాని కన్న ఉన్నతశ్రేణికి చెందిన పరబ్రహ్మ లోకంలో సంచరించే దేవతా శక్తులను పట్టుకోవచ్చు. ఈ సూక్ష్మ హస్తములపేర్లు శ్రద్ధ విశ్వాసము. శ్రద్ధావిశ్వాసముల కారణంగా మనఅంతఃకరణలో చెల్లాచెదరుగా ఉన్నశక్తులను ఒకే స్థానంలో కేంద్రీ కరించవచ్చు. ఈ ఏకృతశక్తిని మనం ఏ దిశకు త్రిప్పితే ఆదిశలో వేగంగా పరుగులు తీస్తుంది. తుపాకి మందును గుండుగా చేసి తుపాకిలో దట్టించి ఏదిశలో ప్రేలిస్తే ఆదిశలో విపరీత వేగంతో పోతుంది. లక్ష్యాన్ని ఛేదిస్తుంది. యోగసాధనలో గూడా అదేజరుగుతుంది. **ఆహార విహారాలను, దినచర్య కట్టుదిట్టంచేయటం తుపాకి వంటిది. శ్రద్ధ, విశ్వాసము తుపాకి గుండు వంటివి. సాధనావిధి దాని మీట నొక్కడం వంటిది.** ఈ విధంగా లక్ష్యాన్ని ఛేదించటం వల్ల మనోవాంఛాఫలసిద్ధి కలుగుతుంది. చంద్రలోకానికి, మంగళ గ్రహానికి యాత్రచేయడానికి తయారీలో వైజ్ఞానికులు అతివేగంతో ఫైర్ చేయబడే రాకెట్లను ఉపయోగిస్తారు. ఆరాకెట్లలో వైజ్ఞానికులున్న గోళం చంద్రమండలం వరకూ విసిరి వేయబడుతుంది. ఇటువంటి ప్రయోగాన్నే పూర్వ కాలంలో యోగ సాధనారూపంలో చేసి దేవశక్తులతో సంబంధం పొంది మనుష్యులకు లాభం కలిగే ఏవిధానాన్ని రూపొందించి సుఖ సంతోషాల నందించారు. ఈనాడు విద్యుత్తు ఆవిరిశక్తితో మనుష్యులకు సుఖసంతోషాలు అందించినట్లుగానే యోగసాధకుడు తనదేహము నందలి శక్తిని సుసంచాలితం చేసిదేవశక్తులను సమీపించి వారివల్ల లాభాన్ని వరదానాన్ని పొందగలడు. మన పురాణేతిహాసాలలో ఇటువంటి కథలు కోకొల్లలు.

విజ్ఞానము యొక్క మార్గం ఒకటే అయినా, వాని సాధనామార్గాలలో తేడాలుంటాయి. రేడియో విజ్ఞానం ఒకటైతే రేడియోను నిర్మించే విజ్ఞానం వేరు. గడియారాల, కార్ల తయారీలో గూడా యింతే. యోగసాధనలో గూడా అనేక మార్గాలున్నాయి. అందులో ఒకమార్గం "గాయత్రీ మార్గము". గాయత్రీ సాధనాపద్ధతితో ఆసూక్ష్మ శక్తులతో సాధకుడు సంబద్ధుడవుతూ కావలసిన లాభాన్ని పొందగలుగుతాడు.

గాయత్రీ తంత్ర గ్రంధాలలో 24 గాయత్రుల వివరాలున్నాయి. 24 దేవతలకూ ఒక్కొక్క గాయత్రి ఉన్నది. ఈవిధంగా 24 గాయత్రులద్వారా 24 దేవతలతో సంబంధం కలుగుతుంది.

గాయత్రీ మంత్రంలోని 24 అక్షరాల దేవతలు (1) గణేశ (2) నృసింహ (3) విష్ణు (4) శివ (5) కృష్ణ (6) రాధా (7) లక్ష్మి (8) అగ్ని (9) ఇంద్ర (10) సరస్వతీ (11) దుర్గా (12) హనుమాన్ (13) పృధ్వీ (14) సూర్య (15) రామ (16) సీతా (17) చంద్రమా (18) యమ (19) బ్రహ్మ (20) వరుణ (21) నారాయణ (22) హయగ్రీవ (23) హంస (24) తులసి.

ఇందులో కొన్నిపేర్లు మనుష్యులను అవతారాలను గ్రహాలను నక్షత్రాలను తత్వాలను పక్షులను వృక్షములను తలపింప జేస్తాయి. వాని చరిత్ర గూడా మనకు తెలుసు. కాని ఇక్కడ గుర్తుంచుకోవలసిన విషయం ఈపేర్లన్నీ గూడా తంత్ర విజ్ఞానాన్ననుసరించి దేవశక్తుల యొక్క రూపాలు మాత్రమే. ఈదేవశక్తుల భేదాలను తీసికొని, మనుష్యుల గ్రహముల తత్వముల, పక్షుల వృక్షముల రూపములు అలంకారిక వివరణమేనని హంస పక్షి, తులసి మొక్క, సూర్యుడు, చంద్రుడు, గ్రహములు. అగ్ని, వరుణుడు మొదలైన తత్వములు, రాముడు కృష్ణుడు సీత, రాధ, హనుమంతుడు మొదలైన అవతారములు ఆదేవశక్తుల స్థూల ప్రస్ఫురణములనీ తెలుసుకోవాలి. వస్తుతా ఆశక్తులు అత్యంత సూక్ష్మములు, ఈశ్వరీయ సూర్యకిరణములు. 24 గాయత్రుల ద్వారా ఆ 24 కిరణములతో మాత్రమే సాన్నిధ్యం కలుగుతుంది.

దైవీశక్తులు (దేవతలు) స్వయంగా చైతన్య వంతములనీ తమశక్తితో పరమాణువులను, తత్వములను పదార్థములను శాసిస్తాయనీ ఈవరకే చెప్పబడింది. అందువలన, దేవతలకు భౌతిక, ఆత్మికశక్తులు రెండూఉన్నవి. దేవతోపాసనతో మనుష్యుడు ఆవిధంగా గుణములను పొందుతాడు. దాంతోపాటు ఆశక్తికి సంబంధించిన పదార్థాలు జమ అవుతూఉంటాయి. తేనెటీగలకు ఒక శాసకురాలు రాణీ ఈగ ఉంటుంది. అది ఎక్కడికి పోతే దాంతోపాటు ఈగలన్నీ వెళ్లిపోతాయి. ఎక్కడ అయస్కాంతశక్తి ఉంటే అక్కడికి ఇనుపరజను ఆకర్షింపబడుతుంది. శక్తితాను ఆధారంగా తనవేపు ఆకర్షించు కుంటుంది. మనుష్యుడు దేవశక్తిని తనమనోభూమిలో ఎంతగా ధారణ చేయగల్గుతాడో అంతగా ఆశక్తితో సంబంధించిన పరిస్థితులను వస్తువులను ఆకర్షించుకోగల్గి, లాభం పొందుతాడు.

గాయత్రీ శక్తి యందలి 24 చైతన్య శక్తులూ ఏమిటి ఆశక్తులవల్ల ఏఏలాభాలు కలుగుతాయీ అనేది ఈక్రింది వివరింపబడింది.

(1) గణేశ – సాఫల్యశక్తి – ఫలు కష్టకార్యాలలో సాఫల్యము, విఘ్ననాశనము, బుద్ధివృద్ధి.

(2) నృసింహ – పరాక్రమశక్తి – ఫలం – పురుషార్థము, పరాక్రమ వీరత్వము, శత్రునాశనము, ప్రతాపము, దాడి నుండి రక్షణ.

(3) విష్ణు – పాలనశక్తి – ఫలం – ప్రాణుల పాలన, ఆశ్రితరక్షణ, యోగ్యత పెరుగుదల రక్షణ.

(4) శివ – కళ్యాణశక్తి –ఫలం – అనిష్టముల నాశము, కళ్యాణ వృద్ధి, నిశ్చయత, ఆత్మ పరాయణత.

(5) కృష్ణ – యోగశక్తి – ఫలం – క్రియాశీలత – ఆత్మనిష్ఠ, అనాసక్తి, , కర్మయోగము, సౌందర్యము, సరసత

(6) రాధ – ప్రేమశక్తి – ఫలం :– ప్రేమదృష్టి, ద్వేష భావసమాప్తి.

(7) లక్ష్మి – ధనశక్తి – ఫలం :– ధనము, పదవి, యశస్సు, భోగ్య పదార్థ ప్రాప్తి.

(8) అగ్ని – తేజోశక్తి – ఫలం :– వేడి వెలుతురు, శక్తి సామర్థ్యముల అభివృద్ధి, ప్రభావశాలి, ప్రతిభాశాలి, తేజస్వీకావటం.

(9) ఇంద్ర – రక్షాశక్తి – ఫలం :– రోగ, హింసా, చోర, శత్రుభూతప్రేత, అనిష్ట బాధల నుండి రక్షణ.

(10) సరస్వతీ – బుద్ధిశక్తి – ఫలం :– మేధావృద్ధి, బుద్ధిలో పవిత్రతత, చాతుర్యము, దూరదృష్టి వివేకశీలత.

(11) దుర్గా – దమనశక్తి – ఫలం – విఘ్నములపై విజయము, దుష్టసంహారము, శత్రుసంహరము, దర్పము యొక్క ప్రచండత.

(12) హనుమాన్ – నిష్ఠాశక్తి – ఫలం – కర్తవ్య పరాయణత్వము, నిష్ఠ, విశ్వాసము, బ్రహ్మచర్యము, నిర్భయత్వము.

(13) పృధ్వీ – ధారణశక్తి – ఫలం – గాంభీర్యము, క్షమాశీలత, సహిష్ణుత, ధార్ఢ్యము, ధైర్యము భారవహనశక్తి

(14) సూర్య – ప్రాణశక్తి – ఫలం – నిరోగిత, దీర్ఘాయువు, వికాసము, వృద్ధి, వేడిమి, వికారములను పోగొట్టుట.

(15) రామ – మర్యాదాశక్తి – ఫలం – తితీక్ష, కష్టములకు విచలితుడు కాకుండుట, ధర్మము, మర్యాద, సౌమ్యత, సంయమము, మైత్రి

(16) సీతా – తపోశక్తి – ఫలం – నిర్వికారము, పవిత్రతత, మాధుర్యము, సాత్వికత, శీలము, నమ్రత.

(17) చంద్ర - శాంతిశక్తి - ఫలం - ఉద్విగ్నతాశాంతి, శోక, క్రోధ, చింతా, ప్రతిహింసల శమనము, కామలోభ, మోహాది తృష్ణా నివారణ, నిరాశకుబదులు ఆశచిగురించడం.

(18) యమ - కాలశక్తి - ఫలం -సమయము యొక్క సదుపయోగము, మృత్యుభయం నశించుట, నిరాలస్యము, స్ఫూర్తి, మెలకువ.

(19) బ్రహ్మ - ఉత్పాదకశక్తి - ఫలం - ఉత్పాదనశక్తి వృద్ధిపొందుట, వస్తువుల ఉత్పాదనలో పెరుగుదల, సంతానవృద్ధి, పశు వ్యవసాయ, వృక్ష, వనస్పతి ఉత్పాదనలో పెంపుదల.

(20) వరుణ - రసశక్తి - ఫలం - భావుకత, సరళత, కళాప్రియత, కవిత్వము, ఆర్ద్రత, దయ, యితరులయెడదయార్ద్రత. కోమలత్వము, ప్రసన్నత, మాధుర్యము, సౌందర్యము.

(21) నారాయణ - ఆదర్శశక్తి - ఫలం -మహత్వా కాంక్షశ్రేష్ఠత, ఉన్నతాదర్శములు, దివ్య గుణములు, దివ్య స్వభావము, ఉజ్జ్వల చరిత్ర, మార్గదర్శనము, కార్యశీలత.

(22) హయగ్రీవ - సాహసశక్తి - ఫలం - ఉత్సాహము, సాహసము, వీరత, శూరత, నిర్భయత, కష్టములతో పోరాడటంలో అభిలాష, పురుషార్థము.

(23) హంస - వివేకశక్తి - బలం ఉజ్జ్వలకీర్తి, ఆత్మసంతోషము, సదసద్వివేకము, దూరదృష్టి సత్సంగతి, ఉత్తమ ఆహారవిహారములు.

(24) తులసి - సేవాశక్తి - ఫలం - దేశసేవాప్రవృత్తి, సత్యప్రాధాన్యత పతివ్రతము, పత్నీవ్రతము, ఆత్మశాంతి, పరదుఃఖ నివారణ.

ఎవరిలో ఏశక్తి ఏగుణం, ఏకర్మ, ఏ స్వభావం తక్కువగా ఉంటుందో లేదా వికృతి చెంది ఉంటుందో వారు ఆ శక్తి కలిగినదేవతను విశేషంగా ఉపాసిస్తే మంచిది. ఏదేవతకు సంబంధించిన గాయత్రిని జపంచేసినా అందుకు పదిరెట్లు గాయత్రీ జపం ముందుగా చేయాలి. ఆవిధంగా సంతానం లేనివారు సంతానం కోరుతూ జపించాలి. పదిమాలలు గాయత్రి (సహస్రం) చేసి ఒక మాల బ్రహ్మగాయత్రిని జపించాలి. ఒక్కబ్రహ్మ గాయత్రిని మాత్రమే జపిస్తే ఉపయోగం ఉండదు. అందుకు కారణం బ్రహ్మగాయత్రి స్వతంత్ర ప్రతిపత్తి గల శక్తికాకపోవటం దేవ గాయత్రులన్నీ కూడా వేదమాతగాయత్రిలోని చిన్నచిన్న శాఖలుమాత్రమే. ఒక్కొక్కటి విడదీస్తే ప్రాణం ఉండదు. మూల వృక్షంతో కలిపి ఉంటేనే ప్రాణవంతంగా ఉంటుంది. అందువల్ల గాయత్రీ జపం చేసిన తర్వాత మాత్రమే దేవగాయత్రులను చేయాలి.

ప్రారంభంలో దేవగాయత్రీ జపంచేయాలి. దాంతోపాటు ఆదేవత ఉపయోగాలను ధ్యానిస్తూ, ఆదేవత తన కోరికను నెరవేరుస్తున్నట్లు భావించాలి. రఃక్రింది యివ్వబడిన

24 గాయత్రీ మంత్రాలను జపించటం వల్ల అందుకు సంబంధించిన శక్తులు పదార్థాలు సాధకులకు లభిస్తాయి.

(1) గణేశ గాయత్రి. ఓం ఏకదంష్ట్రాయ విద్మహే, వక్రతుండాయ ధీమహి, తన్నో బుద్ధిః ప్రచోదయాత్

(2) నృసింహగాయత్రి – ఓం ఉగ్ర నృసింహాయ విద్మహే, వజ్రనఖాయ ధీమహి, తన్నో నృసింహః ప్రచోదయాత్.

(3) విష్ణు గాయత్రి – ఓం నారాయణాయ విద్మహే, వాసుదేవాయ ధీమహి తన్నోవిష్ణుః ప్రచోదయాత్

(4) శివ గాయత్రి – ఓం పంచవక్త్రాయ విద్మహే, మహాదేవాయ ధీమహి, తన్నో రుద్రః ప్రచోదయాత్

(5) కృష్ణ గాయత్రి – ఓం దేవకీ నందనాయ విద్మహే, వాసుదేవాయ ధీమహి, తన్నో కృష్ణః ప్రచోదయాత్.

(6) రాధాగాయత్రి – ఓం వృషభానుభాయై విద్మహే, కృష్ణ ప్రియాయై ధీమహి, తన్నో రాధా ప్రచోదయాత్

(7) లక్ష్మి గాయత్రి – ఓం మహాలక్ష్మ్యై విద్మహే, విష్ణుప్రియామై ధీమహి, తన్నో లక్ష్మీ ప్రచోదయాత్.

(8) అగ్ని గాయత్రి – ఓం మహాజ్వాలాయ విద్మహే, అగ్ని దేవాయ ధీమహి తన్నో అగ్నిః ప్రచోదయత్.

(9) ఇంద్ర గాయత్రి – ఓం సహస్ర నేత్రాయ విద్మహే, వజ్ర హస్తాయ ధీమహి, తన్నో. ఇంద్రః ప్రచోదయాత్

(10) సరస్వతీ గాయత్రి – ఓం సరస్వత్యై విద్మహే, బ్రహ్మపుత్ర్యై ధీమహి, తన్నో దేవీ ప్రచోదయాత్.

(11) దుర్గాగాయత్రి – ఓం గిరిజాయై విద్మహే, శివప్రియాయై ధీమహి, తన్నో దుర్గా ప్రచోదయాత్.

(12) హనుమాన్ గాయత్రి – ఓం అంజనీ సుతాయ విద్మహే, వాయుపుత్రాయ ధీమహి, తన్నో మారుతీ ప్రచోదయాత్

(13) పృధ్వీగాయత్రి – ఓం పృధ్వీదేవ్యై విద్మహే, సహస్ర మూర్త్యై ధీమహి, తన్నో పృధ్వీ ప్రచోదయాత్

(14) సూర్యగాయత్రి – ఓం భాస్కరాయ విద్మహే, దివాకరాయి ధీమహి, తన్నో సూర్యః ప్రచోదయాత్

(15) రామగాయత్రి - ఓం దాశరథాయ విద్మహే, సీతావల్లభాయ ధీమహి, తన్నో రామః ప్రచోదయాత్

(16) సీతాగాయత్రి - ఓం జనక నందిన్యై విద్మహే భూమిజాయై ధీమహి, తన్నో సీతా ప్రచోదయాత్

(17) చంద్ర గాయత్రి - ఓం క్షీరపుత్రాయ విద్మహే, అమృతత్వాయ ధీమహి, తన్నో చంద్రః ప్రచోదయాత్

(18) యమగాయత్రి - ఓం సూర్య పుత్రాయ విద్మహే, మహాకాలాయ ధీమహి, తన్నో యమః ప్రచోదయాత్.

(19) బ్రహ్మగాయత్రి - ఓం చతుర్ముఖాయ విద్మహే, హంసరూఢాయ ధీమహి, తన్నో బ్రహ్మ ప్రచోదయాత్.

(20) వరుణ గాయత్రి - ఓం జలబింబాయ విద్మహే, నీలపురుషాయ ధీమహి, తన్నో వరుణః ప్రచోదయాత్

(21) నారాయణ గాయత్రి - ఓం నారాయణాయ విద్మహే, వాసుదేవాయ ధీమహి, తన్నో నారాయణః ప్రచోదయాత్

(22) హయగ్రీవ గాయత్రి - ఓంవాణీశ్వరాయ విద్మహే హయగ్రీవాయ ధీమహి తన్నో హయగ్రీవః ప్రచోదయాత్

(23) హంసగాయత్రి - ఓం పరమహంసాయ విద్మహే మహా హంసాయధీమహి, తన్నోహంసః ప్రచోదయాత్

(24) తులసీగాయత్రి - ఓం శ్రీతులస్యై విద్మహే విష్ణు ప్రియాయై ధీమహి, తన్నో వృందా ప్రచోదయాత్

**ఈదేవ గాయత్రులతో పాటు వ్యాహృతులను చదవవలసిన ఆవశ్యకత లేదు. ఇవి వేదోక్తములు కాదు. తంత్రోక్తములు మాత్రమే.** అవసరమైన దేవశక్తులతో సంబంధం ఏర్పాటు చేసుకోవటానికి స్వతంత్రమైన, విశిష్టమైన విజ్ఞానం సాధనాగ్రంధాలలో సువిస్తారంగా వర్ణించబడింది. ఆసాధనయొక్క సంపూర్ణ ప్రగతి ఆదిశలోనే జరుగుతుంది. అందుకు సంబంధించిన విజ్ఞానాన్ని గురించి మనం యిక్కడ వర్ణించవలసిన పనిలేదు. ఈదేవశక్తుల గాయత్రుల ప్రభావం యిక్కడ వివరించటంలో **ఉద్దేశ్యం గాయత్రీ ఉపాసనతో పాటు వీనిని గూడా అవసరమైనప్పుడు ఉపాసన చేసి అందుకు సంబంధించిన ఫలితాలను పొందవచ్చునని.** ప్రత్యేక ప్రయోజనాల కోసం వీనిని అవశ్యం ఉపయోగించి ఫలితాలను పొందవచ్చు.

# గాయత్రీ పురశ్చరణ

పురః అనగా పూర్వము (అనగా ముందువైపు) చరణమనగా వెళ్ళుట. వెళ్ళుటకు పూర్వము ఏస్థితి ఉన్నదో, దానిని పురశ్చరణమందురు. చలనమునకు మూడు భాగములున్నవి. (1) గతి (2) ఆగతి (3) స్థితి. "గతి" అనగా ముందుకు పోవుట, "ఆగతి" అనగా తిరిగివచ్చుట, "స్థితి" అనగా ఉండుట. పురశ్చరణములో ఈ మూడు క్రియలు ఉండును. ఒకానొక విశేషమగు అభీష్టమును పొందుటకు ఏసాధన చేయబడునో దానితోపాటు ప్రగతి పథమున విశేషముగ బాధకములగు దోషములను వెనుకకుపంపుట గూడ ఉండును. ఈ గతికి-ఆగతికి ముందున్న శక్తిని ప్రస్ఫుటితము చేయుటకు ఏస్థితిని తనదిగా చేసికొనునో దానిని పురశ్చరణమందురు.

సింహము మృగముపై దాడి చేయునపుడు ఒక్క క్షణము నిలచి దాడిచేయను. ధనుస్సుపై బాణము నెక్కుపెట్టి విడచునప్పుడు కొంచెముసేపు ఆగి బాణమును విడచును. తుపాకిలోని గుండును పేల్చుటకు ముందు అది లక్ష్యమును చేరుటకై కొంచెముగ శరీరమును చక్కజేసి స్థిరపరచును. ఇట్లే అభీష్టమైన ఉద్దేశ్యమును పొందుటకై కావలసినంత ఆత్మబలమును ప్రోగు చేసికొనుటకు కొంతకాలము ఆంతరిక శక్తులను వికసింపజేయును. ఈ ప్రక్రియనె పురశ్చరణ మందురు. సవాలక్ష మంత్రములను అనుష్ఠానము చేయుట సర్వసులభము, సర్వజనోప యోగమునగు ఒకసాధన. పురశ్చరణము ఏదో ఒక కార్యవిశేషమునకై చేయబడును. దీని సాధన చాల విస్తారమైనది. ఇది పురోహితుని అధ్యక్షతన చేయబడును. అనుష్ఠానమును ఒంటరిగ మరొకని సాహాయ్యము లేకుండగనే చేయగలడు. పురశ్చరణకు కర్మకాండ తెలిసిన అనేక పండితుల సహకారమవసరము. ఏదో ఒక విశేష పాప ప్రాయశ్చిత్తమునకు, ఏదో ఒక విశేష ప్రయోజనమును పొందుటకు పురశ్చరణలు చేయబడును. దీనివలన తనలో ఒక విశేషమగు శక్తి ఉద్భవించును. దానివలన అభీష్టమైన ఉద్దేశ్యమును పొందుట సులభ మగును.

గాయత్రీ పురశ్చరణము ఏముహూర్తమున చేయవలెను? ఏ ఆహారవిహారములతో చేయవలెను? ఈ విషయము ఈ ప్రకరణమునందే మరొకచోట ఈయబడినది. సమయమును, నియమమును పాలించుచు ఈ పురశ్చరణ మహాసాధనను ఒకానొక విజ్ఞుడైన కర్మకాండపురోహితుని అధ్యక్షతన ఆరంభించవలెను.

ఉత్తమస్థానమును ఎన్నుకొని అక్కడ పూజావేదికను ఏర్పాటుచేయవలెను. (పిండి, కుంకుమ, పసుపు, గోరంటాకు, పసుపుపచ్చని మట్టి మున్నగు) మాంగలిక ద్రవ్యములతో పూజాస్థలమును నింపవలెను. మధ్యలో హోమవేదికను నిర్మించవలెను. వేదిక భూమినుండి నాలుగు అంగళముల ఎత్తు, ఇరువది నాలుగు అంగుళముల పొడవు,

ఇరువది నాలుగు అంగుళముల వెడల్పు ఉండవలెను. ఈ శానకోణమున కలశస్థాపన చేయవలెను. ఒక వేదికపై దేవస్థానమును, గాయత్రీ మంత్రమును స్థాపించవలెను. వేదిక దగ్గర నెయ్యితో దీపము వెలుగుచుండవలెను. గాయత్రీ పూజావిధానము ముందు ఈయబడినది. ఆపూజచేసిన పిమ్మట ఇతరకార్యములను ఆరంభించవలెను.

జపములో పదవవంతు హోమము, హోమములో పదవవంతు తర్పణము, తర్పణములో పదవవంతు మార్జనము, మార్జనములో పదవవంతు బ్రాహ్మణ భోజనము చేయించవలెను. ఇది పురశ్చరణ నియమము. ఈ నియమమును మనస్సులో పెట్టుకొని ఎంత జపమునకు పురశ్చరణ చేయవలెనను విషయమును మొదట నిశ్చయించుకొనవలెను. ఎందుకనగా ఇది వాని ఆర్థికస్థితికి సంబంధించినది కనుక. సవాలక్ష మంత్రములకు పురశ్చరణ చేయవలెనన్న 12,500 ఆహుతులను హోమము చేయవలెను. 1,150 తర్పణములను, 125 మార్జనములను చేయవలెను. 12 మంది బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. దీనికి ఎంతవ్యయమగునో అంచనా వేసికొనవలెను. జపతపముల సంఖ్య హెచ్చుతగ్గులుగా చేయబడవచ్చును.

పురశ్చరణ కార్యవిభజనమిట్లున్నది- (1) నిత్యకర్మ-స్నానాదులు (2) సంధ్య (3) గాయత్రీ పూజ (దానిప్రధానాంగములు పూజ, కవచము, న్యాసము ధ్యానము, స్తోత్రము) (4) శాపమోచనము (5) హోమము (6) తర్పణము (7) మార్జనము (8) ముద్ర (9) విసర్జనము (10) బ్రాహ్మణభోజనము. ఈకర్మ నిత్యము జరుగవలెను. ఇంతపెద్ద కార్యక్రమముతో పాటు ఎక్కువజపమును తనంతతాను చేయరాదు. అందువలన బ్రాహ్మణులను ఎన్నుకొని వారికి కేవలము జపమును నియమించవలెను. పురోహితుడు యజమానిచే పూజ, ధ్యానము, హోమము, తర్పణము మున్నగువానిని చేయించును. హోమమునకు తర్పణమునకు చాలమంది వ్యక్తుల సహాయ్యమును తీసికోనవలెను. దానివలన సమయము కలసి వచ్చును. పురశ్చరణము లక్షపాతికవేలు, ఇరువది నాలుగు లక్షలు, ఒకకోటి, కోటిపాతికలక్షలు లేదా కనీసము ఇరువదినాలుగు వేలు ఉండును. సామాన్యముగ 24 దినములలో దానిని పూర్తి చేయవలయును. ఈ విషయములన్నింటిని మనస్సులో పెట్టుకొని జపము చేయునట్టి, హోమములోను తర్పణములోను సహకరించునట్టి బ్రాహ్మణులను నియమించవలెను. అట్లున్నిర్ణయించిన బ్రాహ్మణులకు భోజనమును, నూతన వస్త్రములను, పాత్రలను, దక్షిణను సముచితరీతితో ఏర్పాటు చేయవలెను.

పురశ్చరణము పూర్తియైన తరువాత బ్రాహ్మణభోజనము, విందుభోజనము, పెద్దయజ్ఞము, కథ, కీర్తన, ప్రసాదవితరణము మున్నగు వానితో ఉత్సవమును ఘనముగా చేయవలెను. శుభము కలుగవలయునను కోరికతో పూజా సామగ్రిని ఏదో ఒక పరిశుద్ధమగు ప్రదేశమున విసర్జించుచు కార్యక్రమమును పూర్తిచేయవలెను.

ఇక పురశ్చరణకు సంబంధించిన పదిఅంగములు వేరువేరుగ వర్ణింపబడును.

# నిత్య కర్మ

ప్రతిదినము ప్రాతఃకాలమున బ్రాహ్మముహూర్తము నందే నిద్రనుండి లేవవలెను. కన్నులను తెరచినంతనె ఈశ్వరుని ధ్యానింపవలెను. పిమ్మట మలమూత్రములను విసర్జించి స్నానము చేయవలెను. మంచి ఉతికిన వస్త్రములను ధరించవలెను. ఆహారవిహారములను సరిగాపాటించవలెను. చెడు పనులనుండి విముక్తిపొందవలెను. చెడు ఆలోచనలనుండి దూరముగా ఉండవలెను. బ్రహ్మచర్యమును పాటించవలెను. పురశ్చరణకై పాలింపవలసిన నియమములు క్రింద వ్రాయబడుచున్నవి.

**పూజా త్రైకాలికీ నిత్యం జపస్తర్పణమేవచ ।**
**హోమం బ్రాహ్మణ భుక్తిశ్చ పురశ్చరణం తదుచ్యతే ।** (కులార్ణవతంత్రము)

నిత్యము మూడువేళల పూజ, జపము, తర్పణము, హోమము, బ్రాహ్మణ భోజనము చేయించుట-ఇవి పురశ్చరణము అని చెప్పబడుచున్నది.

**పర్వతాగ్రే నదీతీరే బిల్వమూలే జలాశయే ।**
**గోష్ఠే దేవాలయే ఽ శ్వత్థే ఉద్యానే తులసీవనే ।**
**పుణ్యక్షేత్రే గురోః పార్శ్వే చిత్తైకాగ్రస్థలేఽపివా**
**పురశ్చరణ కృన్మంత్రీ సిద్ధ్యత్యేవ న సంశయః ।** విశ్వామిత్రకల్పము

పర్వత శిఖరముమీద, నదీతీరమున, మారేడు చెట్టుక్రింద, నది లేదా చెరువులో, గోశాలలో, దేవాలయమునందు, రావిచెట్టుక్రింద, తోటలో, తులసీవనములో, తీర్థస్థానమునందు, గురువు దగ్గర, లేదా చిత్తైకాగ్రత పెరుగుచోట, మంత్రము నెరిగినవాడు పురశ్చరణ చేయవలెను. అక్కడ సిద్ధిలభించును. దీనిలో సందేహములేదు.

**క్షీరాహారీ ఫలాశీవా శాకాశీవా హవిష్యభుక్ ।**
**భిక్షాశీ వా జపేద్యస్తత్కృచ్ఛ్ర చాంద్రసమం భవేత్ ।**

క్షీరమునుత్రాగువాడు, పండ్లుతినువాడు, కూరలు తినువాడు (శాకాహారి), హవిష్యాన్నమును తినువాడు, లేదా భిక్షాన్నమును భుజించువాడు జపము చేసినచో అది కృచ్ఛ్రములతో సమానమగును. అనగా జపము చేయునప్పుడు పూర్ణకృచ్ఛ్రమును చేయనవసరము వానికి లేదు.

లవణం క్షారమమ్లంచ గృంజనాది నిషేధితమ్ ।
తాంబూలం చ ద్విభుక్తిశ్చ దుష్టవాసః ప్రమత్తతా ।

ఉప్పు, కారము, పులుపు, ఉల్లి మొదలైనవి తినరాదు. తాంబూలము, రెండుమారులు భోజనము, దుష్టసహవాసము, నిర్లక్ష్యము పనికిరాదు.

శ్రుతిస్మృతి విరోధంచ జపం రాత్రౌ వివర్జయేత్ ।

శ్రుతిస్మృతివ్యతిరేకత, రాత్రిజపము విడువదగినవి.

భూశయ్యా బ్రహ్మచారిత్వం మౌనచర్యా తథైవచ ।
నిత్యం త్రిషవణం స్నానం క్షౌరకర్మ వివర్జనమ్ ।
నిత్యపూజా నిత్యదానమానంద స్తుతి, కీర్తనమ్ ।
నైమిత్తి కార్చనం చైవ విశ్వాసో గురుదేవయోః ।
జపనిష్ఠా ద్వాదశైతే ధర్మాః స్యుర్మంత్ర సిద్ధిదాః ।

భూశయనము, బ్రహ్మచర్యవ్రతము, మౌనము, త్రికాలసంధ్య, స్నానము, క్షౌరకర్మ, నిత్యపూజ, దానము, స్తుతి కీర్తన, నైమితికార్చన, గురుదేవతల యందు విశ్వాసము, జపమునందు నిష్ఠ– ఈపన్నెండు మంత్రసిద్ధి కోరువాడు చేయవలసినపనులు.

జేష్ఠషాఢ భాద్రపదం పౌషంతు మలమాసకమ్ ।
అంగారశనివారౌ తు వ్యతీపాతం చ వైధృతిః ।
అష్టమీ నవమీషష్ఠీ చతుర్థీ చ త్రయోదశీ ।
చతుర్దశీమమావాస్యా ప్రదోషశ్చ తథా నిశా ।

జ్యేష్ఠము, ఆషాఢము, భాద్రపదము, పౌష్యము, అధికమాసము, మంగళ శనివారములు, వ్యతీపాతము, వైధృతియోగము, నవమి, షష్టి చతుర్థి, త్రయోదశి, చతుర్దశి, అమావాస్య, ప్రదోషకాలము, రాత్రికాలము, ఇవి పురశ్చరణకు పనికిరావు.

యమాగ్ని రుద్ర సర్పేంద్ర వసు శ్రవణం జన్మభమ్ ।
మేషకర్క తులాకుంభాన్మకరం చైవ వర్జయేత్ ।
సర్వాణ్యేతాని వర్జ్యాని పురశ్చరణ కర్మణి ।

భరణి, కృత్తిక, ఆర్ద్ర, ఆశ్లేష, జ్యేష్ఠధనిష్ఠ, శ్రవణము, జన్మనక్షత్రము, మేషము, కర్కాటకము, తుల, కుంభము, మకరము ఈలగ్నములలో పురశ్చరణము మొదలు పెట్టరాదు.

గురుశుక్రోదయే శుద్ధేంగ్నే సద్వార శోధితే ।
చంద్రతారానుకూల్యేచ శుక్లపక్షే విశేషతః ।
పురశ్చరణకం కుర్యాన్మంత్రసిద్ధిః ప్రజాయతే ।

గురు శుక్రులు ఉదయించినప్పుడు, శుద్ధలగ్నములో, మంచివారములో, చంద్రతారలు అనుకూలముగా ఉన్నపుడు, విశేషముగ శుక్లపక్షములో, పురశ్చరణము చేసిన మంత్రసిద్ధియగును.

కృష్ణాజినే జ్ఞానసిద్ధిః ముక్తిః శ్రీర్వ్యాఘ్రచర్మణి ।
స్యాత్పౌష్టికం చ కౌశేయం శాంతికం వేత్రవిష్టరమ్ ।
వంశాసనే వ్యాధినాశః కంబలే దుఃఖమోచనమ్ ।
సర్వార్థవేత్యాసనార్థం కుశవిష్టరముత్తమమ్ ।

జింకచర్మము జ్ఞానసిద్ధికి, మోక్షమునకు శ్రీకి వ్యాఘ్రచర్మము, పుష్టికార్యమునకు పట్టు, శాంతి కార్యమునకు బెత్తపుపీట, వ్యాధినాశనమునకు వెదురు, దుఃఖనివారణమునకు కంబళాసనము స్వీకరింపదగినవి.

ఆరంభదినమారభ్య సమాప్తిదివసావధి ।
అన్యూనం వాతిరిక్తం చ జపం కుర్యాద్దినేదినే ।
నైరంతర్యేణ కుర్వీత న స్వవృత్త్యా చ లింపయేత్ ।
ప్రాతరారభ్య విధివత్ జపేన్మధ్యం దినావధి ।
మనః సంహరణం శౌచం ధ్యానమంత్రార్థచింతనమ్ ।

మొదటి దినమునుండి చివరిదినము వరకు, ఒకేవిధముగ ఒకేసంఖ్యలో జపము చేయవలెను. ఎక్కువతక్కువలు చేయరాదు. నిరంతరము ఇట్లేచేయవలెను. తనవృత్తిలో నిమగ్నుడు కారాదు. ప్రాతఃకాలము నుండి మధ్యాహ్నము వరకు యథావిధిగ జపము చేయచునేయుండవలెను. మనస్సుతో పవిత్రముగా ఉండవలెను. మంత్రార్థమును చింతన చేయుచుండవలెను.

హోమస్య తు దశాంశేన తర్పణం సముదీరతమ్ ।
తర్పణస్య దశాంశేన చాభిషేకస్తతః పరమ్ ।
అభిషేక దశాంశేన కుర్యాత్ బ్రాహ్మణభోజనమ్ ।

హోమములో పదవంతు తర్పణము, తర్పణములో పదవవంతు అభిషేకము, అభిషేకములో పదవవంతు బ్రాహ్మణభోజనము చేయించవలెను.

## సంధ్య

పురశ్చరణ మొదలు పెట్టుటకు పూర్వము సంధ్యావందనము చేయవలెను. సంధ్యావందనమునకు సంబంధించిన విధులు చాల ఉన్నవి. యజుర్వేదీయ, ఋగ్వేదీయ, సామవేదీయ సంధ్యావందనములు ప్రసిద్ధములు, దాక్షిణాత్యుల సంధ్యావందనములు, ఉత్తరదేశములో ప్రచారమున ఉన్నసంధ్యావందనము, ధార్మికజనులలో నేడు ప్రచారములో ఉన్న సంధ్యావందనము శ్రుతిస్మృతులు రెండు కలిసిన మంత్రములు కలవి. ఆర్య సామాజికుల సంధ్యావందనము వేరుగా ఉన్నది. వీనిలో ఏ సంధ్యావందనము నైన తమదిగా చేసికొనవచ్చు. మాదృష్టిలో గాయత్రీ బ్రహ్మసంధ్య సర్వోత్తమమైనది. దానిని "గాయత్రీమహావిజ్ఞాన్" మొదటి భాగములో మేము చక్కగ వర్ణించితిమి.

## గాయత్రీ పూజ

ఒక వేదికపై గాయత్రీ ప్రతిమను నిలుపవలెను. ఈ ప్రతిమ గాయత్రీ మంత్రాక్షరములలోగాని లేదా దేవీ చిత్రరూపము లేదా విగ్రహరూపములోగాని ఉండవచ్చును. దానిని ధూపము, దీపము, గంధము, అక్షతలు, నైవేద్యము, తాంబూలము, పూగీఫలము (వక్కపలుకులు), దూర్వా, పుష్పము, అర్ఘ్యము, నమస్కారము మున్నగువానితో పూజింపవలెను. మానసిక పూజలో ధ్యానములో ఉండి భావనారూపముననే ఈ పూజాపదార్థములనన్నింటిని గాయత్రీ మాతయెదుట ఉంచి ఆమెను పూజింపవలెను.

పూజకు ముందు గాయత్రిని ఆహ్వానింపవలెను విశ్వవ్యాపియగు గాయత్రీ శక్తికి సంబంధించిన ఒక విశిష్టభాగము ఇక్కడ పూజను స్వీకరించుటకు విచ్చేసినది అని విశ్వసింపవలెను. ఆహ్వానమంత్రమిట్లున్నది.

**ఆయాతు వరదా దేవీ అక్షరే బ్రహ్మవాదినీ ।**
**గాయత్రీ ఛందసాం మాతా బ్రహ్మయోనే నమో ఽ స్తు తే ।**

పూజతరువాత ధ్యాన - కవచ - న్యాస - స్తోత్రముల ద్వారా గాయత్రిధారణ - ప్రతిష్ఠచేయవలెను. ఇది పంచోపచార పూజ అనబడును. ఆ అయిదు తరువాత వర్ణింపబడును.

# ధ్యానము

ధ్యానమనగా ఒకానొక వస్తువును శ్రద్ధతో, ఆసక్తితో, సమ్మానముతో మనస్సులో నిలుపుకొనుట. ఇట్లు ఏమూర్తి మనస్సులో నిలుపుకొనబడునో అది ఒక విధముగ తనకు ఆదర్శమగును. దానికి తగినట్లు తనగుణములు, కర్మలు, స్వభావము తయారగును.

గాయత్రిని ధ్యానించునపుడు ఆ మహాశక్తి యొక్క విశేషములు, మహత్తులు ధ్యానములోనికి వచ్చును. అది ఒక విధముగ తనకు ఆదర్శమగును. వానిలో ఆవిశేషములు స్వయముగనే వృద్ధిపొందును. శక్తిని ఉపాసించువాడు రోజు రోజుకు శక్తి మంతుడగును. ధ్యానము క్రింద యీయబడినది. ఒకటి వర్ణ పరకము, రెండు శక్తిపరకము. వీనిని ఇష్టమును బట్టి ధ్యానింపవలెను.

## వర్ణానాం ధ్యానమ్

**తత్కారం చంపకాపీతం బ్రహ్మ విష్ణు శివాత్మకమ్ ।**
**శతపత్రాసనారూఢం ధ్యాయేత్ సుస్థాన సంస్థితమ్ ।** 1

సంపెంగ పూవువలె పచ్చని రంగుగలదియు, బ్రహ్మ విష్ణు శివాత్మకమైనదియు, కమలాసనమునందు ఉన్నట్టిది యునగు 'తత్' కారమును ధ్యానించవలెను.

**సకారం చిన్తయేద్దేవ మలసీ పుష్పసన్నిభమ్ ।**
**పద్మమధస్థితం సౌమ్య ముపపాతక సంస్థితమ్ ।** 2

అవిసెపువ్వు వంటి శోభకలిగిన పద్మములో ఉన్నదియు, సౌమ్యమును మరియు ఉపపాతకములను నాశము చేయునదియునగు సకారమును ధ్యానించవలెను.

**వికారం కపిలం నిత్యం కమలాసన సంస్థితమ్ ।**
**ధ్యాయేచ్ఛాన్తో ద్విజశ్రేష్ఠో మహాపాతకనాశనమ్ ।** 3

కమలాసనమునందు ఉన్నదియు, మహాపాపములను నాశము చేయునదియునగు 'వి' కారమును ద్విజోత్తముడు శాంతచిత్తముతో ధ్యానించవలెను ।

**తుకారం చిన్తయేత్ప్రాజ్ఞ ఇంద్రనీల సమప్రభమ్**
**నిర్దహేత్ సర్వపాపాని గ్రహరోగ సముద్భవమ్ ।** 4

ఇంద్రనీల మణివంటి కాంతి గలదియు, గ్రహరోగములవలన ఉత్పన్నములగు సర్వపాపములను దహింపజేయునదియునగు 'తు' కారమును విద్వాంసుడు ధ్యానింపవలెను.

**వకారం చింతయేచ్ఛుద్ధం జాతీ పుష్ప సమప్రభమ్ ।**
**గురుహత్యా కృతం పాపం ధ్యానాత్ నశ్యతి తత్క్షణాత్ ।** 12

మల్లె పూవువంటి శోభకలది, శుద్ధమైనదియగు 'వ' కారమును ధ్యానించవలెను. దీని ధ్యానమువలన గురుహత్యాపాపము వెంటనే నశించును.

**స్యకారం తం తథా భానుం సువర్ణ సదృశప్రభమ్ ।**
**మనసా చిన్తితం పాపం ధ్యాత్వా దూర మపాహరేత్ ।** 13

బంగారు కాంతివంటి కాంతిగలగిన 'స్య' కారమును మనస్సుతో చింతన చేసి పాపములను పోగొట్టుకొనవలెను.

**ధకారం చింతయేత్ శుక్లం కుంద పుష్ప సమప్రభమ్ ।**
**పితృమాతృ వధాత్ పాపాన్ముచ్యతే నాత్ర సంశయః ।** 14

మొల్లపువ్వువంటి కాంతిగలది, శుక్లవర్ణము గలది యగు 'ధీ' కారమును చింతన చేయుటవలన తల్లి దండ్రులను వధించుటవలన గలిగిన పాపమునుండి ముక్తుడగును.

**మకారం పద్మరాగాభం చిన్తయేద్దీప్తతేజసమ్ ।**
**పూర్వజన్మార్జితం పాపం తత్ క్షణాదేవ నశ్యతి ।** 15

పద్మరాగము వంటి కాంతిగలది దీప్తమైన తేజస్సుతో సమానమైనది అగు 'మ' కారమును ధ్యానించిన పూర్వజన్మపాపములు వెంటనే నశించును.

**హికారం శంఖవర్ణం తు పూర్ణచంద్రసమప్రభమ్ ।**
**అశేషపాపదహనం ధ్యాయేన్నిత్యం విచక్షణః ।** 16

పూర్ణచంద్రునివంటి కాంతిగలది, శంఖవర్ణముగలది, సర్వపాపములను నాశనము చేయునట్టిది యగు 'హి' కారమును ధ్యానించవలెను.

**ధికారం పాండరం ధ్యాయేత్ పద్మస్యోపరి సంస్థితమ్ ।**
**ప్రతిగ్రహకృతం పాపం స్మరణాదేవ నశ్యతి ।** 17

పద్మముపై ఉన్నదియు, పాండువర్ణముగలదియునగు 'ధి' కారమును ధ్యానించవలెను. ప్రతిగ్రహపాపము స్మరణవలననే తొలగిపోవును.

**యోకారం రక్తవర్ణం తు ఇంద్రగోపసమప్రభమ్ ।**
**ధ్యాత్వా ప్రాణివధం పాపం నిర్దహేన్మునిపుంగవః ।** 18

రక్తవర్ణమైనదియు, ఆరుద్రపురుగుకాంతివంటిది కాంతిగలదియు నగు 'యో' కారమును ధ్యానించి మునిపుంగవులు ప్రాణివధపాపమునుండి ముక్తులగుదురు.

ద్వితీయస్త్వేవ యో ప్రోక్తో యోకారో రక్తసన్నిభః।
నిర్దహేత్ సర్వపాపాని పునః పాపం న లిప్యతే ॥ 19

రెండవ 'యో' కారము రక్తవర్ణముగలది. దానిని ధ్యానించిన సర్వపాపములు నశించును. మరల పాపము కలుగదు.

నః కారస్తు ముఖం పూర్వమాదిత్యోదయ సన్నిభమ్।
నకృద్ధాత్వా ద్విజః శ్రేష్ఠః న గచ్ఛేత్పరమం పదమ్ ॥ 20

ఉదయించుచున్న సూర్యుని కాంతివంటి కాంతిగలిగిన 'నః' కారమును తూర్పుదిక్కుగా ఉండి ధ్యానించినచో ద్విజశ్రేష్ఠుడు పరమపదమును పొందును.

నీలోత్పలం దళశ్యామం ప్రకారం దక్షిణాయనమ్।
నకృద్ధ్యాత్వా ద్విజః శ్రేష్ఠః నంగచ్ఛేదీశ్వరం పరమ్ ॥ 21

నీలకమలమువలె శ్యామలవర్ణముగల 'ప్ర' కారమును ధ్యానించిన బ్రాహ్మణోత్తముడు ఈశ్వరపదమును పొందును.

సౌమ్యం గోరోచనా పీతం 'చో' కారం చతురాననమ్।
నకృద్ధ్యాత్వా ద్విజః శ్రేష్ఠః నగచ్ఛే ద్వైష్ణవం పరమ్ ॥ 22

సౌమ్యమైనదియు, గోరోచనమువలెపచ్చని వర్ణముగలదియునగు 'చో' కారమును ఒక్కమారు ధ్యానించిన బ్రాహ్మణోత్తముడు విష్ణుపదమును పొందును.

శుక్ల వర్ణేస్తు సంకాశం దకారం పశ్చిమాననమ్।
నకృద్ధ్యాత్వా ద్విజఃశ్రేష్ఠః నంగచ్ఛేద్ బ్రహ్మణః పదమ్ ॥ 23

శుక్లపక్షచంద్రుని వంటి కాంతిగలదియు, పశ్చిమముఖముగలదియు నగు 'ద' కారమును ధ్యానించిన బ్రాహ్మణోత్తముడు బ్రహ్మపదమును పొందును.

యాత్కారంతు శివం ప్రోక్తం చతుర్వదన సమప్రభమ్।
ప్రత్యక్షఫలదో బ్రహ్మ విష్ణురుద్ర ఇతి స్మృతః ॥ 24

'యాత్' కారము కల్యాణకారకము అని చెప్పబడినది. ఇది బ్రహ్మతో సమానమైన కాంతిగలది. ప్రత్యక్షఫలము నొసగునది. బ్రహ్మవిష్ణురుద్రులవంటిది అనిచెప్పబడినది.

న భవేత్సూతకం తస్య మృతకశ్చ న విద్యతే।
యస్త్వేకం న విజానాతి గాయత్రీంచ తథావిధమ్ ॥ 25

ఇట్లు గాయత్రిని యథావిధిగ ఎరిగిన వానికి ఎప్పుడును సూతకము కలుగదు మృత్యువు కలుగదు.

**కథితం సూతకం తస్య మృతం చ మయానఘ ।**
**న చ తీర్థఫలం ప్రోక్తం తథైవ సూతకే సతి ।** 26

పాపరహితుడా! నేను వాని సూతకమును మరణమును గూర్చి చెప్పితిని. అవి ఉన్నప్పుడు దానిఫలము లభింపదు, తీర్థయాత్రకు వెళ్ళిన ఫలము లభింపదు.

## గాయత్రీ శక్తిధ్యానము

**వర్ణాస్త్ర కుండికాహస్తాం శుద్ధనిర్మల జ్యోతిషీమ్ ।**
**సర్వతత్త్వ మయీం వందే గాయత్రీం వేదమాతరమ్ ।**

వర్ణాస్త్రయుక్తకుండికా సహితమగు హస్తములు గలది, శుద్ధనిర్మల జ్యోతి స్వరూపిణియు, తత్త్వములన్నింటితో గూడినది వేదమాతయునగు గాయత్రికి నమస్కరించుచున్నాను.

**ముక్తావిద్రుమ హేమనీలధవళచ్ఛాయైః ముఖైస్త్రీక్షణైః**
**యుక్తామిందునిబద్ధరత్నమకుటాం తత్త్వార్థవర్ణాత్మికామ్ ।**

**గాయత్రీం వరదాభయాంకుశకశాం శూలం కపాలం తథా**
**శంఖం చక్రమథారవిందయుగళం హస్తైర్వహంతీం భజే ।**

ముత్యము, పగడము, బంగారము, నీలము శ్వేతము వంటి కాంతులు గలదియు, మూడు నేత్రములు గలదియు, చంద్రకాంతమణులు కూర్చిన ముకుటమును ధరించినదియు, తత్త్వార్థమును వెల్లడించునదియు, అభయమును వరములను ఇచ్చు నట్టిదియు, త్రిశూలమును, కపాలమును, అంకుశమును, చెంద్రకోలను, శంఖమును, చక్రమును, రెండుపద్మములను ధరించునదియు నగుగాయత్రీ దేవిని ధ్యానించుచున్నాను.

**పంచవక్త్రాం దశభుజాం సూర్యకోటి సమప్రభామ్ ।**
**సావిత్రీం బ్రహ్మవరదాం చంద్రకోటిసుశీతలామ్ ।**

**త్రినేత్రాం సితవక్త్రాంచ ముక్తాహారవిరాజితామ్ ।**
**వరాభయాంకుశకశాం హేమ పాత్రాక్షమాలికామ్ ।**

**శంఖచక్రాబ్జయుగలం కరాభ్యాం దధతీం పరామ్ ।**
**సితపంకజ సంస్థాం చ హంసారూఢాం సుఖస్మితామ్ ।**

**ధ్యాత్వైవం మానసాంభోజే గాయత్రీ కవచం పఠేత్ ।**

ఐదు ముఖములు, పది చేతులు గలదియు, కోట్ల కొలది సూర్యుల కాంతివంటికాంతిగలదియు, బ్రహ్మ వరదయు కోట్ల కొలది చంద్రుల వలె చల్లనైనదియు,

మూడు నేత్రములు గలదియు, శీతల వాక్కుగలదియు, ముత్యాలహారములను ధరించినదియు, వరము, అభయము, అంకుశము, సువర్ణపాత్ర, అక్షమాల, శంఖము, చక్రము చేతులయందు గలదియు, శ్వేతకములమునందు ఉన్నదియు, హంసారూఢయు, మందహాసము ముఖమునందు గలదియునగు గాయత్రిని హృదయకమలములో ధ్యానించి గాయత్రీ కవచమును పఠించవలెను.

## గాయత్రీ కవచము

కవచమనగా ఆచ్ఛాదన. దేనిచేతనైన తన్ను కప్పుకొనినచో వానిని కవచము కప్పుకొన్నవాడు అని అందురు. యుద్ధములో ప్రాచీనకాలమున యోధులు ఒకే విధమగు చర్మముతో లేదా లోహముతో చేసిన వస్త్రమును కప్పుకొనుచుండెడివారు. దానివలన ఇతరుల వలన కలుగుదెబ్బ ఆ వస్త్రములపైన తగులును. ఆ వస్త్రములను కవచములందురు. కవచముయొక్క పని రక్షించుట. రక్షించు వస్తువు కవచమని చెప్పబడును.

పదార్థములతో నిర్మింపబడిన కవచము శరీరమును రక్షించునట్లు ఆధ్యాత్మిక శక్తి సంపన్నములగు దైవీ కవచముల ఆవరణమును కప్పుకొనినచో మనకు రక్షణ కలుగును. మంత్రశక్తి, కర్మకాండ, శ్రద్ధ కలిసిన ఆధ్యాత్మిక కవచముతో తన్ను తాను ఆచ్ఛాదింపజేసికొనినచో శరీరమును మనస్సును ఆక్రమించు అనిష్టములకు సాఫల్యము కలుగదు.

క్రిందిరెండు కవచము లీయబడినవి. ఒక దానిలో గాయత్రీ అక్షరమును 'శక్తిబీజ' మని భావించి వానితో తన్ను ఆచ్ఛాదింప జేసికొనవలెను. రెండవ కవచములో గాయత్రిని శక్తిగా భావించి దానిని వివిధ రూపముల ద్వారా తనకు నలువైపుల ఆవరణను ఏర్పాటు చేసికొనవలెను. సౌకర్యము, రుచిననుసరించి వీనిలో ఏదో ఒక దానిని గాని, రెండింటిని గాని ఉపయోగించుకొనవచ్చును.

శాంతచిత్తుడై కవచమును పఠించుచు నాయొక్క ఫలానా అవయవముపై ఫలానా శక్తి యొక్క ఆచ్ఛాదన వ్యాపించియున్నదని ధ్యానించవలెను. యోధుని శరీరముపై ఉన్న కవచమును శత్రువు పగులగొట్టజాలనట్లు ఆ గాయత్రీ కవచముపై ఏ అనిష్టము దాడి చేయజాలదు. నా శరీరావయవములపై అధిరోహించి యున్న ఆధ్యాత్మిక కవచమును పగులగొట్టి ఏ విధముగు వికారము గూడ నన్ను శారీరిక మానసిక క్షతికి లోనగునట్లు చేయజాలదు. ఈ భావనతో ధరించి యున్న కవచము నిజముగ ఒకగొప్ప రక్షణ కార్యమును పూర్తి చేయును.

# అక్షర శక్తి కవచము

**తత్పదం పాతు మే పాదౌ జంఘే చ సవితుః పదమ్ ।**
**వరేణ్యం కటిదేశన్తు నాభిం భర్గస్తథైవచ ।** 1

'తత్' అనునది నా పాదములను రక్షించుగాక ! 'సవితుః' అనునది నా తొడలను రక్షించుగాక! 'వరేణ్యం' అను పదము నాకటి ప్రదేశమును (నడుమును) రక్షించుగాక! 'భర్గః' అను పదము నానాభిని రక్షించుగాక !

**దేవస్య మే తు హృదయం ధీమహీతి గలం తథా ।**
**ధియో మే పాతు జిహ్వాయాం యః పదం పాతు లోచనే।** 2

'దేవస్య' అనుపదము హృదయమును, 'ధీమహి' అనుపదము నాకంఠమును, "ధియో" అనుపదము నాజిహ్వను 'యః' అను పదము నారెండు నేత్రములను రక్షించుగాక !

**లలాటే నః పదం పాతు మూర్ధానం మే ప్రచోదయాత్ !**
**తద్వర్ణః పాతు మూర్ధానం సకారః పాతు భాలకమ్ ।** 3

'నః' పదము నాలలాటమును (నుదురును), 'ప్రచోదయాత్' అను పదము నా శిరస్సును రక్షించుగాక ! 'తత్' పదము తలను, 'స' కారము నుదురును రక్షించుగాక !

**చక్షుషీ మే వికారస్తు శ్రోత్రే రక్షేత్తు కారకః ।**
**నాసాపుటే వకారో మే రేకారస్తు కపాలకమ్ ।** 4

'వి' నానేత్రములను, 'తు' కారము చెవులను, 'వ' కారము ముక్కుపుటములను, 'రే' కారము కపాలమును రక్షించుగాక !

**ణికారస్త్వధరోష్ఠే చ యకార స్తూర్ధ్వ ఓష్ఠకే !**
**అస్య మధ్యే మకారస్తు గోకారస్తు కపోలయోః ।** 5

'ణి' కారము క్రింది పెదవిని, 'య' కారము పై పెదవిని, నోటిని 'భ' కారము, "గో" కారము రెండు కపోలములను రక్షించుగాక !

**దేకారః కంఠదేశేచ వకారః స్కంధదేశయోః ।**
**స్యకారో దక్షిణంహస్తం ధీకారో వామహస్తకమ్ ।** 6

'దే' కారము కంఠమును, 'వ' కారము రెండు భుజములను, 'స్య' కారము కుడి చేతిని, 'ధీ' కారము ఎడమ చేతిని రక్షించుగాక !

**మకారో హృదయం రక్షేద్ధికారో జఠరం తథా ।**
**ధికారో నాభిదేశం తు యోకారస్తు కటిద్వయమ్ ।** 7

'మ'కారము హృదయమును, 'హి' కారము ఉదరమును, 'ధి' కారము నాభిని, 'యో' కారము కటిద్వయమును రక్షించుగాక !

**గుహ్యం రక్షతు యోకార ఊరు మే నః పదాక్షరమ్ ।**
**ప్రకారోజానునీ రక్షే చ్చోకారో జంఘదేశయోః ।** 8

'యో' కారము గుహ్య ప్రదేశమును, 'నః' పదము రెండు తొడలను, 'ప్ర' కారము రెండు మోకాళ్ళను, 'చో' కారము పిక్కలను రక్షించుగాక !

**దకారో గుల్ఫ దేశేతు యాత్కారః పాదయుగ్మకమ్ ।**
**జాత వేదేతి గాయత్రీ త్ర్యంబకేతి దశాక్షరా ।** 9

'ద' కారము చీలమండలను, 'యత్' కారము రెండు పాదములను రక్షించుగాక ! జాతవేదత్ర్యంబక గాయత్రీ పది అక్షరములు కలది.

## న్యాసము

న్యాసపదమున కర్థము స్థాపన. ఒకానొక ప్రదేశమున ఒకానొక వస్తువును స్థాపించుటను న్యాసమందురు. సాధనలో ఉండి కుడిచేతిబొటన వ్రేలిని నడిమి. వ్రేలితోను, మరియు అనామిక(ఉంగరపు) వ్రేలితోను కలిపి వివిధములైన అవయవములను తాకుదురు. ఆ అవయవముల యందు గాయత్రీ శక్తులున్నవను భావన చేయవలెను.

ఇట్టి భావనతో సాధకుడు తన అంగప్రత్యంగములలో ఒక విధముగ దైవీశక్తిని అనుభవించును. ఈ భావన తన శ్రద్ధా విశ్వాసముల వలన నిజముగ దృఢత్వమును. పుష్టిని కలిగించును.

### న్యాసశక్తి

**సావిత్రీ మే శిరః పాతు శిఖాయామమృతేశ్వరీ ।**
**లలాటం బ్రహ్మదేవీ చ భ్రువౌ మే పాతు వైష్ణవీ ।** 1

సావిత్రి శిరస్సును రక్షించుగాక ! అమృతేశ్వరి శిఖను, బ్రహ్మదేవి లలాటమును, వైష్ణవి కనుబొమలను రక్షించుగాక !

**కర్ణౌ మే పాతు రుద్రాణీ సూర్యా సావిత్ర్యంబకే ।**
**గాయత్రీ వదనం పాతు శారదా దశనచ్ఛదమ్ ।** 2

రుద్రాణి చెవులను, గాయత్రి ముఖమును, శారద పెదవులను రక్షించుగాక !

**ద్విజాన్ యజ్ఞప్రియా పాతు రసనాం తు సరస్వతీ ।**

**సంఖ్యాయినీ నాసికాం మే కపోలం చంద్రహాసినీ ।** 3

యజ్ఞప్రియ ద్విజులను రక్షించుగాక ! నాలుకను సరస్వతి, సంఖ్యాయని నాసికను, కపోలమును చంద్ర హాసిని రక్షించుగాక !

**చిబుకం వేద గర్భా చ కంఠం పాత్వఘనాశినీ ।**

**స్తనౌ మే పాతు ఇంద్రాణీ హృదయం బ్రహ్మవాదినీ ।** 4

గడ్డమును వేదగర్భ, అఘనాశిని కంఠమును, ఇంద్రాణి స్తనములను, బ్రహ్మవాదిని హృదయమును రక్షించుగాక !

**ఉదరం విశ్వభోక్త్రీ చ నాభిం పాతు సురప్రియా ।**

**జఘనం నారసింహీ చ పృష్ఠం బ్రహ్మాండధారిణీ ।** 5

విశ్వభోక్త్రి ఉదరమును, సురప్రియ నాభిని, నారసింహ జఘనమును, బ్రహ్మాండ ధారిణి పీఠమును రక్షించుగాక !

**పార్శ్వౌ మే పాతు పద్మాక్షీ గుహ్యం మే గోత్రికావతు ।**

**ఊర్వోరోంకారరూపా చ జాన్వోః సంధ్యాత్మికావతు ।** 6

పద్మాక్షి పార్శ్వ భాగములను, గోత్రిక గుహ్యమును, ఓంకారూపిణి ఊరువులను సంధ్యాత్మిక జానువులను రక్షించుగాక !

**జఘనే పాతు అక్షోభ్యా గుల్ఫౌ చ బ్రహ్మ శీర్షకా ।**

**సూర్యా పదద్వయం పాతు చంద్రా పాదాంగులీంశ్చ వై ।** 7

అక్షోభ్య తొడలను, బ్రహ్మశీర్షక చీలమండలను, సూర్య రెండు పాదములను, చంద్ర రెండు కాళ్ళవ్రేళ్ళను రక్షించుగాక !

**సర్వాంగం వేదజననీ పాతు మే సర్వదా ఽ నఘా ।**

**ఇత్యేతత్కవచం బ్రహ్మగాయత్ర్యాః సర్వపావనమ్ ।**

**పుణ్యం పవిత్రం పాపఘ్నం సర్వరోగనివారణమ్ ।** 8

అనఘయగు వేదజనని నా శరీరమునంతటిని ఎల్లపుడు రక్షించుగాక ! సర్వపావన మగు ఈ బ్రహ్మ గాయత్రీ కవచము పుణ్యకరము, పవిత్ర కరము, పాపనాశకము, సర్వరోగనివారకము.

**త్రిసంధ్యం యః పఠేద్విద్వాన్ సర్వాన్ కామానవాప్నుయాత్ ।**
**సర్వశాస్త్రార్థ తత్త్వజ్ఞః స భవేద్వేదవిత్తమః ।** 9

మూడు సంధ్యలయందు పఠించిన విద్వాంసుని అన్ని కోరికలు తీరును. సర్వ శాస్త్రములను తెలిసిన వాడగును. వేదజ్ఞుడగును.

**సర్వయజ్ఞఫలం ప్రాప్తః బ్రహ్మాన్తే సమవాప్నుయాత్ ।**
**ప్రాప్నోతి జపమాత్రేణ పురుషార్థాంశ్చతుర్విధాన్ ।** 10

సర్వయజ్ఞ ఫలమును అతడు పొందును. చివరకు బ్రహ్మమును పొందును. జపమాత్రము వలననే అతడు నాలుగు పురుషార్థములను పొందును.

ప్రార్థన వలన, స్తుతివలన ఆ శక్తి యొక్క మహత్తుపై నీధ్యానము కేంద్రీకరించును. మహిమలో ఏ విశేషములు వర్ణింపబడునో అవి నీలో లేకపోవుటవలన మనస్సు ఆ వైపు ఆకర్షింపబడును. అటు ఆసక్తి శ్రద్ధ కలుగును. నిర్ధనుడు, ఆకలి గొన్నవాడునగు వ్యక్తి యెదుట గొప్ప ఐశ్వర్యమునుగూర్చి రుచికరమగు మంచి భోజనమును గూర్చి చక్కగ వర్ణించినచో వాడు ఆ వైపు ఆకర్షితుడగును. దానికై ఉవ్విళ్ళూరును. ఆ స్థితిని లేదా ఆ రుచికరములగు పదార్థములను పొందుటకు వాని మనస్సులో తీవ్ర వాంఛలు పెరుగును. ఇట్టి వాంఛ పెరుగుట ఒకానొక కార్యములో తత్పరతతో నిమగ్నుడగుటకు ప్రధాన కారణమగును. స్తోత్రపఠనము వలన సాధకునిలో శ్రద్ధ, భక్తి జాగృతములగును.

# గాయత్రీ స్తోత్రము

**సుకల్యాణీం వాణీం సురముని వరైః పూజిత పదామ్ ।**
**శివామాద్యాం వంద్యాం త్రిభువనమహీం వేదజననీమ్ ।**
**పరాంశక్తిం స్రష్టుం వివిధ విధిరూపాం గుణమయీమ్ ।**
**భజేఽమ్బాం గాయత్రీం పరమ సుభగానంద జననీమ్ ।**

గాయత్రీ వాక్కు శుభమును కలిగించునట్టిది. సురల (దేవతల) చేత, మునుల చేత పూజింపబడునట్టిది. ఈమెను శివ అందురు. ఆమె ఆద్య, ముల్లోకములలో నమస్కరింపదగినది. వేదజనని, పరాశక్తి, గుణమయి, వివిధ రూపములను ధరించి ప్రాదుర్భవించును. సౌభాగ్యమును ఆనందమును సృష్టించు ఈ గాయత్రీ మాతను నేను సేవించుచున్నాను.

**విశుద్ధాం సత్త్వ స్థా మఖిల దురవస్థాదిహరణీమ్**
**నిరాకారాం సారాం సువిమల తపో మూర్తిమతులామ్ ।**
**జగజ్జ్యేష్ఠాం శ్రేష్ఠా మసుర సురపూజ్యాం శ్రుతినుతాం**
**భజేఽమ్బాం గాయత్రీం పరమ సుభగానందజననీమ్ ।** 2

గాయత్రి విశుద్ధ తత్త్వము కలది. సత్త్వమయి, సమస్త దుఃఖమును దోషమును దురవస్థను పోగొట్టునట్టిది. ఆమె నిరాకార, సారభూత, సాటిలేని తపోమూర్తి, విమల. ఈమె ప్రపంచములో చాల గొప్పది. జ్యేష్ఠ, దేవతల చేత అసురుల చేత పూజింపబడునది. సౌభాగ్యమును ఆనందమును కలిగించు గాయత్రీ మాతను నేను సేవించుచున్నాను.

**తపోనిష్ఠా భీష్టాం స్వజనమన సన్తాప శమనీమ్**
**దయామూర్తిం స్ఫూర్తిం యతితతి ప్రసాదైక సులభామ్ ।**
**వరేణ్యాం పుణ్యాం తాం నిఖిల భవబంధాపహరిణీమ్**
**భజే ఽ మ్బాం గాయత్రీం పరమ సుభగానందజననీమ్ ।** 3

తపోనిష్ఠలో ఉండువారికి గాయత్రికి అభీష్టము. ఈమె స్వజనుల మానసిక బాధలను పోగొట్టునట్టిది. స్ఫూర్తిమయి, దయామూర్తి ఆమె ప్రసన్నతను పొందుట చాల సులభము. ఆమె సాంసారిక బంధనములనన్నింటిని తొలగించునట్టిది. వరించుటకు

తగినది. పరమ సౌభాగ్యమును ఆనందమును కలిగించు గాయత్రీ మాతను నేను సేవించు చున్నాను.

సదారాధ్యాం సాధ్యాం సుమతిమతి విస్తారకరణీమ్
విశోకామాలోకాం హృదయగత మోహాంధహరణీమ్ ।
పరాందివ్యాం భవ్యా మగమభవసింధ్వేక తరణీమ్
భజేఽమ్బాం గాయత్రీం పరమసుభగానందజననీమ్ । 4

గాయత్రి నిరంతరము ఆరాధించుటకు తగినది. ఆమె నారాధించుట మిగుల సాధ్యమైనది. ఆమె సుమతిని విస్తరింపజేయునట్టిది. ఆమె ప్రకాశమయమైనది. శోకరహిత యైనది. హృదయమున ఉండు మోహాంధకారమును పోగొట్టునట్టిది. ఆమె పర, దివ్య, అగమ సంసారసాగరమును దాటుటకు నౌకవంటిది. పరమసౌభాగ్యమును, ఆనందమును కలిగించు గాయత్రీ మాతను భజించుచున్నాను.

అజాం ద్వైతాం త్రైతాం వివిధగుణ రూపాం సువిమలామ్
తమో హంత్రీం తంత్రీం శ్రుతిమధురనాదాం రసమయీమ్ ।
మహామాన్యాం ధన్యాం సతత కరుణాశీల విభవామ్
భజే ఽ మ్బాం గాయత్రీం పరమ సుభగానందజననీమ్ । 5

గాయత్రి అజన్మ (పుట్టుకలేనిది), ద్వైత, త్రైత, త్రిగుణ, సువిమల రూపముగలది. తమస్సును పోగొట్టునది. విశ్వమును నడిపించునట్టిది. వాక్కు వినుటకు మధురము రసమయము. ఆమె మహామాన్య, ధన్య, ఆమె వైభవము నిరంతరము కరుణాశీలము. సౌభాగ్యమును, ఆనందమును కలిగించు ఆ గాయత్రీ మాతను సేవించుచున్నాను.

జగద్ధాత్రీం పాత్రీం సకల భవ సంహార కరణీమ్
సువీరాం ధీరాం తాం సువిమల తపోరాశి సరణీమ్ ।
అనేకామేకాం వై త్రిజగత్సదధిష్ఠాన పదవీమ్
భజే ఽ మ్బాం గాయత్రీం పరమ సుభగానందజననీమ్ । 6

గాయత్రి ప్రపంచమునకు తల్లి. ప్రపంచమునంతటిని సంహరించు శక్తి గూడ ఆమెదే. ఆమె వీర, ధీర. ఆమె జీవనము పవిత్రతతపోమయము. ఆమె ఒక్కతే అయినను అనేక, ముల్లోకములను అధిష్ఠించు పదవి కలది. ఆమె పరమ సౌభాగ్యమును, ఆనందమును కలిగించు ఆ గాయత్రీ మాతను సేవించుచున్నాను.

ప్రబుద్ధాం బుద్ధాం తాం స్వజనతతి జాడ్యాపహరణీమ్
హిరణ్యాం గుణ్యాం తాం సుకవి జనగీతాం సునిపుణీమ్ ।

సువిద్యాం నిరవద్యామమల గుణగాథాం భగవతీమ్
భజే ఽ మ్బాం గాయత్రీం పరమ సుభగానందజననీమ్ । 7

గాయత్రి ప్రసిద్ధ, బోధమయి, స్వజనుల జడత్వమును నశింపజేయునట్టిది, హిరణ్యమయి, గుణమయ, సుకవులచే కీర్తింపబడు నైపుణ్యము కలది. నిరవద్యయై నది. ఆమెగుణముల గాథ వర్ణింపనలవికానిది. భగవతియగు ఆ గాయత్రీ మాత పరమ సౌభాగ్యమును ఆనందమును కలిగించునట్టిది. ఆమెను నేను సేవించుచున్నాను.

అనన్తాం శాన్తాం యాం భజతి బుధ బృందః శ్రుతిమయీమ్
సుగేయాం ధ్యేయాం యాం స్మరతి హృది నిత్యం సురపతిః ।
సదా భక్త్యా శక్త్యా ప్రణతమతిభిః ప్రీతివశగామ్
భజేఽమ్బాం గాయత్రీం పరమసుభగానంద జననీమ్ । 8

గాయత్రి అనంత, శాంత. ఈమెను సేవించి పండితులు వేదమయులగుదురు. ఇంద్రుడు నిత్యము హృదయముతో ఈమెను గూర్చి గానము, ధ్యానము చేయును. ఈమెను నిత్యము స్మరించును. ఎల్లప్పుడు భక్తితో, శక్తితో, ఆత్మనివేదనలతో ప్రేమయుక్త మగును. ఆనంద సౌభాగ్యములనొసంగు గాయత్రీమాతను ఉపాసించు చున్నాను.

శుద్ధ చిత్తః పఠేద్యస్తు గాయత్ర్యా అష్టకం శుభమ్ ।
అహో భాగ్యో భవేల్లోకే తస్మిన్ మాతా ప్రసీదతి । 9

శుభమగు ఈ గాయత్రీ అష్టకమును శుద్ధ చిత్తముతో పఠించువారు ఈ ప్రపంచమున భాగ్యవంతులగుదురు. వారిపై గాయత్రీ మాత యొక్క కృప పూర్తిగా ఉండును.

# గాయత్రీ శాపవిమోచనము

గాయత్రికి శాపము వచ్చుటకు సంబంధించిన రెండు కథలు పురాణములలో లభించుచున్నవి. వానిలో ఒకటి ఇట్లున్నది. బ్రహ్మదేవుని మొదటి భార్య సావిత్రి తన భర్త ఆజ్ఞను పెడచెవిని బెట్టి యజ్ఞములో పాల్గొనలేదు. అప్పుడు ఆయన రెండవ భార్యయగు గాయత్రిని వెంటనిడుకొని యజ్ఞమును పూర్తి చేసెను. అందుకు సావిత్రి చాల కోపించి నీ శక్తి నశించు గాక యని గాయత్రిని శపించెను. ఈ శాపము వలన అంతటా కల్లోలము బయలు దేరెను. దేవతలు ఎంతగనో నచ్చచెప్పి గాయత్రిని శాపము నుండి విముక్తురాలుగా చేయమనియు, లేనిచో గొప్పహాని కలుగుననియు ప్రార్థించిరి. అపుడు సావిత్రి ఒక మంత్రమును చెప్పెను. దానిని పఠించువానికి గాయత్రి శాపముక్తయగును. దానిని ఎవడు ప్రయోగింపడో వానికి గాయత్రి శాపయుక్తయై యుండును.

రెండవ కథ ఇట్లున్నది. ఒకప్పుడు బ్రహ్మ, వశిష్ఠుడు, విశ్వామిత్రుడు తమ తమ సృష్టి స్థితిలయములను చేయు శక్తిని పొందుటకై గాయత్రీ ఉపాసన చేసిరి. కాని గాయత్రి వారి కోరికను తీర్చలేదు. అప్పుడు ఆముగ్గురు క్రుద్ధులై "నీ శక్తి నశించుగాక" యని గాయత్రిని శపించిరి. శాపఫలముగా గాయత్రి శక్తి హీనఅయ్యెను. అప్పుడు దేవతలు ప్రార్థించగా ఆ "ముగ్గురు ఏమనుష్యుడు శాపమోచన మంత్రములతో పాటు జపము చేయునో వానికి గాయత్రి శక్తి గలదియగును" అని శాపముక్తికి ఉపాయమును చెప్పిరి.

## శాపోద్ధార మంత్రములు

ఓమ్ అస్య గాయత్రీ శాపవిమోచన మంత్రస్య బ్రహ్మ ఋషిః, గాయత్రీ ఛందః, వరుణో దేవతా, బ్రహ్మ శాపవిమోచనే వినియోగః

ఈ గాయాత్రీ శాపవిమోచన మంత్రమునకు బ్రహ్మఋషి, గాయత్రీ ఛందస్సు, వరుణడు దేవత, బ్రహ్మశాపమోచనమునందు ఇది ప్రయోగింపబడును..

**ఓమ్ యద్ బ్రహ్మేతి బ్రహ్మవిదో విదుస్త్వాం పశ్యన్తి ధీరాః।**
**సుమనసా త్వం గాయత్రీ బ్రహ్మ శాపాన్ముక్తా భవ।**

ఓ గాయత్రీ ! బ్రహ్మవేత్తలు దేవిని బ్రహ్మనామముతో చెప్పుచున్నారో, ధీరపురుషులు తమ అంతఃకరణమున నిన్ను ఆరూపముతోనే చూచుచున్నారు. నీవు బ్రహ్మశాపమునుండి విముక్తిపొందెదవుగాక!

**గాయత్రీ వశిష్ఠశాప విమోచన మంత్రస్య వశిష్ఠ ఋషిః ।**

**అనుష్టుప్ ఛందః, వశిష్ఠదేవతా, వశిష్ఠశాపవిమోచనే వినియోగః ।**

గాయత్రీ వశిష్ఠ శాపవిమోచన మంత్రమునకు వశిష్ఠుడు ఋషి, అనుష్టుప్ ఛందస్సు, వశిష్ఠుడు దేవత, వశిష్ఠ శాపవిమోచనమునందు వినియోగము.

**ఓమ్ అర్క జ్యోతిరహం బ్రహ్మ బ్రహ్మజ్యోతి రహం శివః ।**

**శివజ్యోతి రహం విష్ణుః విష్ణు జ్యోతిః శివః పరః ।**

**గాయత్రీ త్వం వశిష్ఠ శాపాద్విముక్తా భవ ।**

నేను సూర్యజ్యోతినగు బ్రహ్మను. నేను బ్రహ్మజ్యోతినగు శివుడును, నేను శివజ్యోతినగు విష్ణువును. నేను విష్ణుజ్యోతినగు శివుడను. గాయత్రీ! నీవు వశిష్ఠ శాపమునుండి విముక్తవు అగుదువుగాక !

ఓమ్ విశ్వామిత్ర శాపమోచన మంత్రస్య విశ్వామిత్ర ఋషిః, అనుష్టుప్ ఛందః, ఆద్యాదేవతా, విశ్వామిత్ర శాపవిమోచనే వినియోగః.

విశ్వామిత్ర శాపవిమోచన మంత్రమునకు ఋషి విశ్వామిత్రుడు, అనుష్టుప్ ఛందస్సు, ఆద్యా దేవత, విశ్వామిత్ర శాపవిమోచనమున దీని ప్రయోగముండును.

**ఓమ్ అహోదేవి మహాదేవి దివ్యే సంధ్యే సరస్వతి ।**

**అజరే అమరేచైవ బ్రహ్మయోని నమోస్తు తే ।**

**గాయత్రి త్వం విశ్వామిత్ర శాపాద్విముక్తా భవ ।**

దేవి ! మహాదేవి ! జ్ఞానరూపిణి ! సంధ్యాస్వరూపిణి ! సరస్వతీ ! జరారహితా ! మరణరహితా ! నీకు నమస్కారము, గాయత్రీ ! నీవు విశ్వామిత్రుని శాపము నుండి విముక్తి పొందెదవుగాక.

## హోమము

గాయత్రీ హోమము గాయత్రీ మహావిజ్ఞాన్ ప్రథమభాగమున వివరింపబడి దీనిలో హోమమును ఎట్లు చేయవలెను? ఏ ఉద్దేశ్యమును సాధించుటకు ఏయః సామగ్రులతో హోమము చేయవలెను? కుండము లేదా వేదికను ఎట్లు నిర్మించవలెను? మున్నగు విషయములున్నవి. వానిని మాటిమాటికి చెప్పినందువలన ప్రయోజనములేదు. పాఠకులు దానిని చూచి హోమమునకు సంబంధించిన పరిచయమును చేసికొందురుగాక!

ఆహుతి మంత్రమునకు గాయత్రి యే ఏకైక మంత్రము. దాని చివర 'స్వాహా' శబ్దమును జోడించి ఆహుతి నీయవలెను.

## తర్పణము

తర్పణమునకు నదిలోగాని సరోవరములోగాని నిలుచుండి, దర్భలను చేతిలోనికి తీసికొని, యజ్ఞోపవీతమును బొటనవ్రేలు చూపుడువ్రేలు మధ్యలో ఉండునట్లుగా చేసికొని దోసిలిలో నీటిని నింపి అర్ఘ్యమువలె వ్రేళ్ళ చివరల ద్వారా అజిలమును వదలవలెను. తర్పణము విడచునప్పుడు రెండుచేతుల యొక్క ఉంగరపు వ్రేళ్ళకు దర్భలతో చేసిన ఉంగరములను ధరించవలెను. శిఖలోను, రెండుకాళ్ళక్రింద, యజ్ఞోపవీతమునందు, ధోవతి ముడిలోను దర్భఖండములను నిలుపుకొనవలెను.

## తర్పణమంత్రములు

ఓం భూర్భువః స్వః పురుషమృగ్యజుః సామమండలాంతర్గత సవితార మావాహయామిత్యావాహ్య తర్పణం కుర్యాత్.

ఓం భూః పురుషమృగ్వేదం తర్పయామి.
ఓం భువః పురుషం యజుర్వేదం తర్పయామి.
ఓం స్వః పురుషం సామవేదం తర్పయామి.
ఓం మహః పురుషమథర్వవేదం తర్పయామి.
ఓం జనః పురుషమితిహాస పురాణం తర్పయామి.
ఓం తపః పురుషం సర్వలోకం తర్పయామి.
ఓం సత్యం పురుషం సర్వలోకం తర్పయామి.
ఓం భూర్భువః స్వః (పురుషం) ఋగ్యజుః సామమండలాంతర్గతం తర్పయామి
ఓం భూరేక పాదం గాయత్రీం తర్పయామి.
ఓం భువర్ద్విపాదం గాయత్రీం తర్పయామి
ఓం స్వస్త్రిపాదం గాయత్రీం తర్పయామి.
ఓం భూర్భువః స్వశ్చతుష్పాదం గాయత్రీం తర్పయామి
ఓం ఉషసం తర్పయామి.
ఓం గాయత్రీం తర్పయామి
ఓం సావిత్రీం తర్పయామి
ఓం సరస్వతీం తర్పయామి

ఓం పృథివీం తర్పయామి
ఓం జయాం తర్పయామి
ఓం కౌశికీం తర్పయామి
ఓం సాంకృతీం తర్పయామి
ఓం సర్వాపరాజితాం తర్పయామి
ఓం సహస్రమూర్తిం తర్పయామి
ఏభిర్మంత్రైశ్చ యోచిత్యం చతుర్వింశతిభిర్ద్విజః,
సంతర్పయతి గాయత్రీం స సంధ్యాఫలమాప్నుయాత్ ।

## మార్జనము

దర్భతో ఒక చిన్న కూర్చను కట్టుకొనవలెను. దీనిని పూజించి, దీనిలో పవిత్రీకరణ శక్తి ఉన్నట్లుగా శ్రద్ధ చూపవలెను. తరువాత ఈ కూర్చను రాగిపాత్రలో ఉన్న నీటిలో ముంచుచు మాటిమాటికి పైన చల్లు కొనవలెను. ఇదియే మార్జన. మార్జన విధి, మరియు తొమ్మిది మంత్రములు క్రింద ఈయబడుచున్నవి. కొందరు ఆచార్యులు తొమ్మిది మంత్రములకు బదులు గాయత్రీ మంత్రముతోనే మార్జనము చేయుచున్నారు.

సంకల్ప్య మార్జనం కుర్యాదాపోహిష్ఠా కుశోదకైః
పాదేపాదే క్షిపేన్మూర్ధ్ని ప్రతిప్రణవ సంయుతామ్ । 1

సంకల్పము చేసి మార్జనము చేయవలెను. మార్జనమును ప్రణవముతో గూడిన 'ఆపోహిష్ఠా, మున్నగు మంత్రముద్వారా కుశోదకముతో చేయవలెను. ప్రతిపాదమునందును శిరస్సుపై జలమును చల్లుకొనవలెను.

ఆత్మానం ప్రణవైనైవ పరిషిచ్య జలేన సః ।
కుర్యాత్సప్రణవైః పాదై ర్మార్జనం తు కుశోదకైః ।
తతో హి పాణిస్థజలం సకుశం ప్రక్షిపేదధః । 2

ప్రణవముతో జలమును తనపై చల్లుకొనవలెను. మరల కుశోదకములతో ప్రణవపాదములతో మార్జనము చేసికొనవలెను. కుశలతో పాటు జలమును క్రింద చల్లవలెను.

స్పృష్ట్వా హస్తేన వామేన తటం నద్యాదికేషుచ ।
పాణినా దక్షిణేనైవ మార్జయేత్ సకుశేన తు । 3

నదిమొదలైన వాని తీరములను ఎడమ చేతితో స్పృశించి, కుడిచేతితో కూర్చను తీసికొని మార్జనము చేయవలెను.

**పాణిస్థితోదకేనైవ వామహస్తోదకేన వా।**

**గృహే తు మార్జనం కుర్యాన్నన్యథేత్యబ్రవీన్మనుః।** 4

కుడి చేతిలో ఉన్న జలములోగాని, ఎడమచేతిలో ఉన్న జలములోగాని గృహములో మార్జనము చేయవలెనని మనువుచెప్పెను.

**ఆపోహిష్ఠేతి ఋచః సింధుర్ద్వీప ఆపో గాయత్రీ మార్జనే వినియోగః.**

"ఆపోహిష్ఠా" మూడు ఋక్కులు ఉన్నవి. సింధు ద్వీపములు ఉన్నవి. ఆపః గాయత్రి మార్జనము దానివినియోగము.

**ఓం ఆపోహిష్ఠామయో భువః** 1

**ఓం తాన ఊర్జే దధాతనః** 2

**ఓం మహేరణాయ చక్షసే** 3

**ఓం యో వః శివతమోరసః** 4

**ఓం తస్య భాజయతే హనః** 5

**ఓం ఉశతీరివ మాతరః** 6

**ఓం తస్మా అరఙ్గ మామవై** 7

**ఓం యస్య క్షయాయ జిన్వథ** 8

**ఓం ఆపోజన యథా చ న**

దర్భాన్ విసృజ్య కుశపాణిః మార్జయేత్. ప్రణవయుక్త సమస్తయా వ్యాహృత్యా గాయత్ర్యా ఆపోహిష్ఠేతి నవపాదైః శన్నోదేవీరితి సప్తభిః మార్జయేత్.

దర్భలను విసర్జించి ఏ చేతిలో కుశ ఉన్నదో దానిని మార్జనము చేసికొనవలెను. ప్రణవయుక్తములైన వ్యాహృతులతో గాయత్రితో "ఆపోహిష్ఠా" మంత్రములోని తొమ్మిది పదములతో ఏడు మారులు మార్జనము చేసికొనవలెను.

నవపాదమతిక్రమ్య అథర్చా వసుసంఖ్యయా।

ఋతం ప్రణవేనైవ మార్జనం సముదాహృతమ్। 1

తొమ్మిది పదములను వదలి-అతిక్రమించి - ఎనిమిది మారులు ప్రణవసహితముగ "ఋతంచ" అను మంత్రములో మార్జనము చేయవలెను.

**భువిమూర్ధ్ని తథాకాశ ఆకాశే భువి మస్తకే।**

**మస్తకే భువి మూర్ధ్ని స్యా న్మార్జనం సముదాహృతమ్।**

భువియందు శిరస్సు ఆకాశము, ఆకాశమునందు భువి, మస్తకమునందు భువః మూర్ధ్న ఉన్నవి. ఈ విధముగ తెలిసికొని మార్జనము చేయవలెను.

# ముద్రలు

గాయత్రీ జపమునకు 24 ముద్రలున్నవి. హస్తమును విశేషమగు ఆకారములో వంచినచో వివిధములగు ముద్రలు ఏర్పడును. ముద్రలను గాయత్రీ ప్రతిమయెదుట, లేదా యంత్రము ఎదుట ఏకాంతమున చూపవలెను. ఇతరుని యెదుట వీనిని ప్రదర్శింపరాదు. చూపించవలసివచ్చినపుడు ఎవ్వరును చూడకుండునట్లు ఉన్నవారిని పొమ్మనవలెను. క్రింద ఇరువది నాలుగు ముద్రలు వర్ణింపబడును.

## 24 గాయత్రీ ముద్రలు

**అతః పరం ప్రవక్ష్యామి వర్ణముద్రాః క్రమేణ తు ।**
**సుముఖం సంపుటం చైవ వితతం విస్తృతం తథా ।** 1

ఇప్పుడు క్రమముగ వర్ణములలో ముద్రలు చెప్పబడును. 1. సుముఖము 2. సంపుటము 3. వితతము 4. విస్తృతము.

**ద్విముఖం త్రిముఖం చైవ చతుః పంచముఖం తథా ।**
**షణ్ముఖాధోముఖం చైవ వ్యాపకాంజలికం తథా ।** 2

5. ద్విముఖము 6. త్రిముఖము 7. చతుర్ముఖము 8. పంచముఖము 9. షణ్ముఖము 10. అధోముఖము 11. వ్యాపకాంజలి.

**శకటం యమపాశం చ గ్రంథితం సన్ముఖోన్ముఖమ్ ।**
**ప్రలంబం ముష్టికం చైవ మత్స్య కూర్మ వరాహకమ్ ।** 3

12. శకటము 13. యమపాశము 14. గ్రంథితము 15. సన్ముఖోన్ముఖము 16. ప్రలంబము 17. ముష్టికము 18. మత్స్యము 19 కూర్మము 20. వారాహకము.

**సింహాక్రాన్తం మహాక్రాంతం ముద్గరం పల్లవం తథా ।**
**చతుర్వింశతి ముద్రా క్షజ్ఞపాదౌ పరికీర్తితః ।** 4

21 సింహాక్రాంతము 22. మహాక్రాంతము 23. ముద్గరము 24. పల్లవము - ఈ 24. ముద్రలను జపమునకు ముందు చూపవలెను.

**చతుర్వింశతిరిమా ముద్రా గాయత్ర్యాః సుప్రతిష్ఠితాః ।**
**ఏతా ముద్రా న జానాతి గాయత్రీ నిష్ఫలా భవేత్ ।** 5

పైన చెప్పబడిన 24 ముద్రలు గాయత్రి యందు సుప్రతిష్ఠితములైయున్నవి. ఈ ముద్రలు తెలియనివానికి గాయత్రి నిష్ఫలయగును.


1
సుముఖమ్


2
సంపుటమ్


3
వితతమ్


4
విస్తృతమ్


5
ద్విముఖమ్


6
త్రిముఖమ్


7
చతుర్ముఖమ్


8
పంచముఖమ్



9
షణ్ముఖమ్



10
అధోముఖమ్



11
వ్యాపకాంజలికమ్



12
శకటమ్



13
యమపాశమ్



14
గ్రంథితమ్



15
ఉన్ముఖోన్ముఖమ్



16
ప్రలంబమ్



17

ముష్టికమ్



18

మత్స్యః



19

కూర్మః



20

వరాహకమ్



21

సింహాక్రాంతమ్



22

మహాక్రాంతమ్



23

ముద్గరమ్



24

పల్లవమ్

# విసర్జనము

పూజా సమయమున గాయత్రి ఆహ్వానింపబడును. ప్రతిదినము పురశ్చరణ పూర్తి చేయచు గాయత్రిని విసర్జింపవలెను. విసర్జన మంత్రము క్రింద ఉన్నది.

గాయత్రీ ఆహ్వానమంత్రము :-

**ఆయాతు వరదా దేవీ అక్షరే బ్రహ్మవాదినీ ।**

**గాయత్రీ ఛందసాం మాతా బ్రహ్మయోనిర్నమోస్తు తే ।**

*గాయత్రీ విసర్జన మంత్రము –*

**ఉత్తమే శిఖరే దేవీ భూమ్యాం పర్వత మూర్ధని ।**

**బ్రాహ్మణే భ్యోహ్యను జ్ఞాతా గచ్ఛదేవి యథాసుఖమ్ ।**

# అర్ఘ్య దానము

పురశ్చరణలో మిగిలిన జలమును సూర్యునకు అర్ఘ్యముగా నీయవలెను. ఈ జలమును పవిత్రమగు ప్రదేశమున విడువవలెను. లేదా వెడల్పాటి ముఖము కలిగిన పాత్రలో అర్ఘ్యమునుండి పడిన జలమును ఆవులచే త్రాగించవలెను.. అర్ఘ్యవిధి ।

**ముక్తహస్తేన దాతవ్యం ముద్రాం న తత్ర కారయేత్ ।**

**తర్జన్యంగుష్ఠ యోగం తు రాక్షసీ ముద్రికా స్మృతా ।**

అర్ఘ్యము నిచ్చునపుడు చూపుడువ్రేలి మూలమున బొటనవ్రేలిని కలిపి యుంచవలెను. అందువలన బొటనవ్రేలిని చూపుడువ్రేలితో కలుప కుండగనే అర్ఘ్యము నొసంగవలెను. బొటనవ్రేలు చూపుడువ్రేలితో కలిపినచో రాక్షసీముద్ర అగును.

**గాయత్ర్యా త్రిరర్ఘ్యం సూర్యాయ దద్యాత్ ।**

గాయత్రీ మంత్రముతో మూడు మారులు అర్ఘ్యమును సూర్యునకు ఈయవలెను. తరువాత క్రింద వ్రాయబడు మంత్రముతో సూర్యునకు అర్ఘ్యము నీయవలెను. మంత్రము –

**సూర్యదేవ సహస్రాంశో తేజో రాశే జగత్పతే ।**

**అనుకంపయ మాం భక్త్యా గృహాణార్ఘ్యం దివాకర ।**

సహస్రకిరణములుగల సూర్యుడా ! తేజో రాశి ! జగత్పతీ ! నాపై కృపజూపుము భక్తితో ఈయబడిన నా అర్ఘ్యమును స్వీకరింపుము.

# క్షమాప్రార్థన

ప్రతిసాధనయొక్క అంతమున ఈ క్షమాప్రార్థనా స్తోత్రమును చదువవలెను. దీనివలన తెలిసి తెలియని దోషముల దుష్పరిణామము శాంతమగును.

**న మంత్రం నోయంత్రం తదపి న చజానే స్తుతి హో**
**న చాహ్వానం ధ్యానం తదపి న చ జానే స్తుతికథా ।**
**న జానే ముద్రాస్తే తదపి నచ జానే విలపనమ్ ।**
**పరం జానే మాతస్త్వదను శరణం క్లేశహరణ మ్ ।** 1

నేను మంత్రమును ఎరుగను, యంత్రమును ఎరుగును. స్తుతిని ఎరుగను. ఆవాహనమును, స్తుతికథను, ధ్యానమును గూడ ఎరుగను. పూజను ముద్రను ఎరుగను. కాని నీశరణము క్లేశమును హరించునదియని మాత్రము ఎరుగుదును.

**విధేరజ్ఞానేన ద్రవిణ విరహేణాలసతయా ।**
**విధేయా శక్యత్వాత్తవ చరణయోర్యా చ్యుతిరభూత్ ।**
**తదేతత్ క్షన్తవ్యం జనని సకలోద్ధారిణి శివే ।**
**కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి ।** 2

అందరిని ఉద్ధరించు తల్లి శివా! ఇది తెలియక పోవుటవలన, ధనలోపమువలన, సోమరితనము వలన, సామర్థ్యము లేక పోవుటవలన, నీచరణములను సేవించుటలో పొరపాటు జరిగినది. క్షమించుము పుత్రుడు కుపుత్రుడగును. కాని తల్లి కుమాత కాదు.

**పృథివ్యాం పుత్రాస్తే జనని బహవః సన్తి సరలాః**
**పరం తేషాం మధ్యే విరల తరలోఽహం తవ సుతః**
**మదీయోఽయం త్యాగః సముచితమిదం నో తవ శివే**
**కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి ।** 3

తల్లీ ! ఈ పృథివిపై నీకు చాలమంది పుత్రులున్నారు. వారు సరళమైన వారు. కాని వారిలో నీయా కుమారుడనైన నే నొక్కడనే చంచలమైన వాడను. అయినను తల్లీ ! నీవునన్ను విడచుట తగదు. ఎందుకనగా పుత్రుడు కుపుత్రుడు కాగలడు. కాని తల్లి కుమాత కాదు.

**జగన్మాతర్మాతస్తవ చరణసేవా న రచితా**
**న వా దత్తం దేవి ద్రవిణమపి భూయస్తవ మయా ।**

**తథాపి త్వం స్నేహం మయి నిరుపమం యత్ప్రకురుషే**
**కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి ।** 4

జగన్మాతా ! నేను నీచరణములను సేవించలేదు. దేవీ ! దానము చేయుటకు నీవు నాకు కావలసినంత ధనమును గూడ ఈయలేదు. కాని నీవు నన్ను చక్కగా ప్రేమించుచున్నావు. పుత్రుడు కుపుత్రుడు కాగలడు. కాని తల్లి కుమాత కాదు.

**శ్వపాకో జల్పాకో భవతి మధుకోపమ గిరా**
**నిరాతంకో రంకో విహరతి చిరం కోటి కనకైః ।**
**తవాపర్ణే కర్ణే విశతి మనువర్ణే ఫలమిదం**
**జనః కో జానీతే జనని జపనీయం జపవిధౌ** 5

తల్లీ ! నిన్ను స్తుతించుటవలన నీచుడు, చండాలుడు గూడ మధురవాక్కులను పలుకు మహాకవులగుదురు. బీదవాడు గూడ దుఃఖాగ్నినుండి బయటపడి కోట్లకొలది సువర్ణనాణేములు గల ధనవంతుడగును. నీశబ్దము చెవిలో పడినంతనె మానవుడు మంచి బలముగల వాడగును. తల్లీ ! నిన్ను స్తుతించువిధానము ఎవరికి తెలియును?

**జగదంబ ! విచిత్రమత్ర కిం**
**పరిపూర్ణా కరుణాస్తి చేన్మయి ।**
**అపరాధ పరంపరావృతం**
**న హిమాతా సముపేక్షతే సుతమ్ ।** 6

జగదంబా! నీకు నాయందు దయుండుటలో విచిత్రమేమియున్నది. అపరాధపరంపర ఎంత ఉన్నను తల్లి తనకుమారుని ఎప్పుడును ఉపేక్షింపదు.

**మత్సమః పాతకీ నాస్తి పాపఘ్నీ త్వత్సమా నహి ।**
**ఏవం జ్ఞాత్వా మహాదేవి! యథాయోగ్యం తథా కురు!** 7

నావంటి పాతకి ఎవ్వడును లేడు. నీవలె పాపమును పోగొట్టువారు ఎవ్వరును లేరు. మహాదేవి ! ఇది యెరిగి నీకు ఏది ఉచితమో దానిని చేయుము.

## బ్రాహ్మణభోజనము

పురశ్చరణములో ప్రతిదినము బ్రాహ్మణులకు భోజనము పెట్టు విధానమున్నది. పురశ్చరణకార్యమున నియమింపబడిన వారికి భోజన వ్యవస్థను కల్పింపవలసి బాధ్యత యజమాని పైన ఉన్నది. ఇంతేకాక పక్షులకు గింజలను, చీమలకు బియ్యపుపిండిని చక్కెరతో కలిపి పెట్టవలెను. గోవులకు పిండిముద్దలను పెట్టవలెను. అక్కడ ఉన్న

వారికి పంచామృతమును-పాలు, పెరుగు, నెయ్యి, తేనె, చక్కెరనీరు, మరియు తులసీదళములు కలిపిన పంచామృతమును లేదా మరియేదైన మధుర పదార్థమును ప్రసాదముగా పంచవలెను.

సమాప్తిలో పాటు కీర్తనమును, సామూహికప్రార్థనను, ఆరతిని కలసి మధుర ...గ గానము చేయవలెను. అభివాదన ఆశీర్వాద భావనలతో అందరు కార్యమును పూర్తిచేయవలెను.

ప్రతి శుభకార్యము చివర దానము చేయు విధానమున్నది. దక్షిణలేని యజ్ఞము నిష్ఫలమని చెప్పబడినది. జ్ఞానప్రసారము చేయుసంస్థలకు, లోకసేవకులు బ్రహ్మపరాయణులు నగు సత్పురుషులకు, దీనులకు, దుఃఖితులకు, పండితులకు యథా శక్తి ప్రతి శుభకార్యము చివర దానమీయవలెను. ఈ దానము భోజన-ధన-వస్త్ర-పుస్తకరూపమునగాని లేదా ఉపయోగపడు ఇతరవస్తురూపమునగాని ఉండవలెను.

# గాయత్రీ లహరి

ఆమందా నందేనామరవర గృహే వాస పరతా –
పరం గాయన్తం యా భువి భవభయాత్త్రాయత ఇహ !
సురేశైః సంపూజ్యం మునిగణనుతాం తాం సుఖకరీం
నమామో గాయత్రీం నిఖిల మనుజాఘౌఘశమనీమ్ । 1

ఆనందముగ దేవలోకమున నివసించునట్టిది, తన భక్తులను సాంసారిక భయమునుండి రక్షించునట్టిది, దేవతలచే పూజింపబడునది. ప్రాణి మాత్రుని పాపములను పోగొట్టునట్టిది, మునులచే స్తుతింపబడునది. సుఖమును కలుగజేయునది యగు గాయత్రీ మాతకు మేము భక్తితో ప్రణమిల్లుచున్నాము.

అవామా సంయుక్తం సకలమను జైర్జాప్యమభితః ।
హ్యపాయాత్పాయాద్భూరథ భువి భువః స్వః పదమితి ।
పదం తన్మే పాదావవతు సవితు శ్చైవ జఘనే
వరేణ్యం శ్రోణిం మే సతతమవతాన్నాభిమపి చ 2

పదం భర్గో దేవస్య మమ హృదయం ధీమహి తథా
గలం పాయాన్నిత్యం ధియ ఇహపదం చైవరసనామ్ ।
తథా నేత్రే యోఽ వ్యాదలికమవతాన్నః పదమితి
శిరోదేశం పాయాన్మమ తు పరితశ్చాన్తిమ పదమ్ । 3

ఓంకారముతోను అనుస్వారముతోను కూడి ప్రతిప్రాణి జపించుటకు యోగ్యమైన "ఓం భూర్భువః స్వః" అను ఈ పదములు సర్వపాపములను నుండి నన్ను రక్షించుగాక ! అట్లే తత్ పదము పాదములను, సవితుః తొడలను, వరేణ్యం కటిని (నడుమును), భర్గో పదము నాభిని, దేవస్య హృదయమును, ధీమహి కంఠమును, ధియః జిహ్వను, యః నేత్రములను,నః లలాటమును, అంతిమపదమగు ప్రచోదయాత్ నాశిరస్సును అన్ని విధముల రక్షించుగాక ! ( ఈ రెండు శ్లోకములలో గాయత్రీమంత్రము పూర్తిగ ఉన్నది. దాని ద్వారా తన సర్వాంగ సంరక్షణ ప్రార్థన చేయబడినది. దీనిని యుగ్మకమందురు.)

అయే దివ్యే దేవి త్రిదశ నివహైర్వందితపదే
న శేకు స్త్వాం స్తోతుం భగవతి మహాన్తోఽపి మునయః।
కథంకారం తర్హి స్తుతితతి రియం మే శుభతరా
తథ పూర్ణా భూయాత్ త్రుటి పరియుతా భావరహితా। 4

దేవతలచే పూజింపదగిన చరణములు గలిగిన గాయత్రీ మాతా ! నిన్ను స్తుతించుటకు గొప్పగొప్పమునులు గూడ సమర్థులుగారు. అప్పుడు దోషములతో గూడిన భావములేని నాయీస్తుతి ఎట్లు ఉపయుక్తమగును. అయినను నేను స్తుతించుచున్నాను, స్వీకరింపుము.

భజన్తం నిర్వ్యాజం తవ సుఖదమంత్రం విజయినం
జనం యావజ్జీవం జగతి జనని త్వం సుఖయసి,
న వా కామం కాచిత్ కలుషకణికాఽపి స్పృశతి తం
సంసారః సంసారః పరిత్ సహసా తస్య సతతమ్। 5

తల్లీ ! సుఖకరము, విజయకరమునగు నీమంత్రమును జపించువానికి నీవు సుఖమును కలిగింతువు, వానిని ఏమాత్రము పాపముగూడ అంటదు. వాని సాంసారిక వాతావరణము ఆనందయుక్తమగును.

దధానా హ్యేధానం సిత కువలయాపాలన రుచాం
స్వయం విభ్రాజిష్ణీ త్రిభువన జనాహ్లాదన కరిమ్।
అలం చాలం చాలం మమ చకిత చిత్తం సుచపలం
చలచ్చంద్రాస్యే త్వద్వదనరుచమాచామయ చిరమ్। 6

చంచలచంద్రునివంటి ముఖము కలదానా! శ్వేత కమలముయొక్క కమనీయ కాంతి పుంజమును ధరించుచున్నట్టి, ముల్లోకములయందలి జనులకు ఆహ్లాదమును కలుగుచేయుచున్నట్టి నీముఖకాంతిని నాచంచలచిత్తముచే త్వరగ పానము చేయించుము.

లలామే భాలే తే బహుతర విశాలేఽతి విమలే
కలా చంచచ్చాంద్రీ రుచిర తిలకావేందుకలయా।
నితాన్తం గోమాయా నిబిడ తమసో నాశవ్యసనా
తమో మే గాఢం హి హృదయ సదనస్థం గ్లపయతు। 7

భగవతీ! నీవిశాలమగు నుదుటియందు చంద్రకళ లేదా చంద్రాకారమున ఉన్నతిలకము శోభిల్లుచున్నది. దాని కాంతి భూమండలమునందలి అంధ కారమును పారద్రోలునట్టిది. అది నాహృదయ సదనమునందలి అంధకారమును పోగొట్టుగాక !

**అయే మాతః కిన్తే చరణ శరణం సంశ్రయవతాం ।**
**జనానా మన్తస్థో వృజిన హుతభుక్ ప్రజ్వలతి యః ।**
**తదస్యాశు సమ్యక్ ప్రశమన హితాయైవ విధృత –**
**కరే పాత్రం పుణ్యసలిలభరితం కాష్ఠరచితమ్ ।** 8

తల్లీ గాయత్రీ ! నీ చరణములను శరణు వేడు ప్రాణుల హృదయములో పాపమను అగ్ని రగుల్కొనినది. దానిని చల్లార్చుటకు నీవు నీకరకములమునందు జలపూరితమగు కమండలమును ధరించి తివా యేమి ?

**అథాహోస్విన్మాతః సరిదధిపతేః సారమఖిలం**
**సుధారూపం కూపం లఘుతరమనూపం కలయతి**
**స్వభక్తేభ్యో నిత్యం వితరసి జనోద్ధారిణి శుభే**
**విహీనే దీనేఽస్మిన్ మయ్యపి సకరుణాం కురు కృపామ్ ।** 9

లేదా ఓతల్లీ ! సముద్రములోని సారభూతమగు అమృతమునె నీకమండలమనెడు చిన్న బావిలో నింపి నీప్రియభక్తులకు పంచుచున్నావు. జనులనుద్ధరించు శుభా ! దీనుడను హీనుడనునగు నాపై కొంచెము దయచూపుము

**సదైవ త్వత్పాణౌ విధృతమరవిన్దం ద్యుతికరం**
**త్విదం దర్శం దర్శం రవి శశిసమం నేత్రయుగళమ్ ।**
**విచిన్త్య స్వాం వృత్తిం భ్రమవివశజాలేఽస్తి పతిత–**
**మిదం మన్యే నో చేత్ కథమితి భవేదర్ధ వికచమ్ ।** 10

తల్లీ ! నీచేతిలో శోభిల్లు కమలము సూర్య చంద్రులవలె ఉన్న నీరెండు కన్నులను చూచి భ్రమపడి, తన వృత్తిని గూర్చి ఆలోచించి, సూర్యోదయమని భావించి వికసింప దలచినది, చంద్రుని చూచి ముకుళింపదలచినది. అ విధముగ నేను భావించు చున్నాను. లేనిచో ఆ కమలము రెయింబవళ్ళు సగము వికసించి యెందుకు ఉన్నది.

**స్వయం మాతః కింవా త్వమసి జలజానామపి ఖని ః**
**యతస్తే సర్వాంగం కమలమయమేవాస్తి కిము నో ।**
**తథా భీత్యా తస్మా త్తవశరణముపయాతః కమలరాడ్ –**
**ప్రయుంజానోఽ శ్రాయ్యం భవతి తదహ్హైవాసన విధౌ ।** 11

లేదా ! ఓతల్లీ ! నీవు స్వయముగ కమలములకు గని యైయున్నావా ? ఎందుకనగా నీ అవయవములన్నియు కమలమయములు కావా? అందువలన కమలములకు రాజు అయినవాడు భయపడి నిన్ను శరణు వేడినాడు. అతడే నిరంతరము నీ ఆసనవిధియందున్నాడు.

**దివాకారాద్యైర్వన్ద్యే వికసిత సరోజాక్షి సుఖదే**
**కృపాదృష్టే ర్వృష్టిః సువిపతతి యస్యోపరి తవ ।**
**తదీయాం వాంఛాం హి ద్రుతమను విదధాసి సఫలాం**
**దోషాన్ శూలాన్ మమ సపది ఛిత్వాఽమ్బ సుఖదా ।** 12

దేవతలచే పూజింపదగినదానా! వికసించిన కమలములవంటి నేత్రములు గలదానా ! సుఖముకలిగించుదానా! నీకృపాదృష్టివర్షము ఎవనిపై బడునో వాని వాంఛలన్నియు నెరవేరును. అందువలన నాయపరాధశూలములను ఛేదించి సుఖముల నొసంగుము.

**కరేఽక్షాణాం మాలా ప్రవిలసతి యా తేఽ తివిమలే**
**కిమర్థం సా కాన్ వా గణయసి జనాన్ భక్తి విరతాన్ ।**
**జపన్తీ కం మంత్రం ప్రశమయసి దుఃఖం జనిజుషా**
**మయే కా వా వాంఛా భవతి తవ త్వత్ర సువరదే ।** 13

తల్లీ! నీ యొక చేతిలో విరాజిల్లు అక్షమాల ఎందుకు? ఏభక్తులను దానితో లెక్కించుచున్నావు? లేదా ఏమంత్రమును జపించి ప్రాణుల కష్టములను పోగొట్టుచున్నావు? వరదాయినీ! లేదా మరియేమంత్రమును జపించి ఏమి చేయదలచుచున్నావు ?

**న మన్యే ధన్యేఽహం త్వవితథమిదం లోకగదితం**
**మమత్వోక్తి ర్మత్వా కమలతతి పుల్లం తవ కరమ్ ।**
**విజృమ్భా సంయుక్త ద్యుతి వితత మభికోకనదమి –**
**త్యరం జానానేయం మధుకరతతిః సంవిలసతి ।** 14

ధన్యురాలా ! పైనచెప్పబడిన లోకోక్తిని ఉపయుక్తమైనదిగా నేను భావించుటలేదు. నీచేతులను వికసించిన కమలములుగా భావించి ఈ భ్రమరపంక్తి తిరుగుచున్నది. అని నేను చెప్పినదే తగినదిగా ఉన్నది.

**మహామోహాంభోధౌ మమ నిపతితా జీవనతరి**
**ర్నిరాలంబాదోలా చలతి దురవస్థామధిగతా ।**
**జలావర్తవ్యాలో గ్రసితు మభితో వాంఛతి చ తాం**
**కరాలంబం దత్వా భగవతి ద్రుతం తారయ శివే ।** 15

గవతి! కల్యాణమయీ! విశాలమైన ఈ సంసారసముద్రమున నాజీవననౌక పడియున్నది. అది ఎట్టి సహాయములేకుండగ హాని కరమగు స్థితిలో ఉన్నది. దానిని సుడిగుండమనెడు సర్పము కాటు వేయదలచుచున్నది. అందువలన తల్లీ! ! దానిని ఒడ్డుకు చేర్చుము. నీ కరకమలమును అందిమ్ము.

దధానాసిమత్వం యత్ స్వవపుషి పయోధర యుగళ
మితి శ్రుత్వా లోకైర్మమ మనసి చిన్తా సమభవత్ ।
కథం స్యాత్ సా తస్మాదలక లతికా మస్తక భువి
శిరోద్వ్యోమ్న్యద్యేయం జలద పటలీ ఖేలతి కిల । 16

తల్లీ ! నీవు రెండు పయోధరములను ధరించి యున్నావని జనులవలన వింటిని. అప్పుడు నామనస్సులో మస్తకమనెడు భూమిమీద కేశపాశమయమగు లత ఎట్లుండును అను ఆలోచన కలిగినది. మస్తకాకాశముపై మేఘమండలము క్రీడించుచున్నది. ఇది నిశ్చయము.

తథా తత్రైవో పస్థితి మపి నిశీథిన్య ధిపతేః
ప్రపశ్యామి శ్యామే సహ సహచరై స్తారకగణైః ।
అహోరాత్ర క్రీడా పరవశమితా స్తేఽపి చకితా
శ్చిరం విక్రీడన్తే తదపి మహదాశ్చర్య చరితమ్ । 17

తల్లీ దానితో పాటు ఆ ఆకాశమంతట ఆచంద్రుని ఆయన సహచరులైన తారాగణములతో గూడ నేను చూచుచున్నాను. రేయింబవళ్ళు క్రీడలో మగ్నమై ఆశ్చర్యము కలుగునట్లు నిత్యము క్రీడించుచున్నవి. ఇది కూడ ఆశ్చర్యమయమగు చరిత్రయే. ఎందుకనగా సూర్యోదయమైన పిమ్మట పగటివేళ చంద్రుడు నక్షత్రములు అదృశ్యములగును. కాని ఇక్కడ కావు.

యదాహుస్తం ముక్తాపటల జటిలం రత్నముకుటం
న ధత్తే తేషాం సా వచనరచనా సాధుపదవీమ్ ।
నివేషా కేశాస్తు వేనహివిగత వేధ్రువమితి
ప్రసన్నాఽధ్యాసన్నా విధుపరిషదేషా విలసతి । 18

కొందరు చెప్పున దేమనగా ఇది అనేక మణులతో కూర్చబడినముకుటము. కాని నాదృష్టిలో ఈవిషయము సరిగలేదు. ఇది నిశ (రాత్రి), విగత వేషకేశములు లేవు. అని నిశ్చయించి సంతోషముతో ఈ చంద్రసభ శోభిల్లుచున్నది.

త్రిబీజే హేదేవి త్రి ప్రణవసహితే త్ర్యక్షరయుతే
త్రిమాత్రా రాజన్తే భువన విభవే హ్యోమితిపదే ।
త్రికాలం సంసేవ్యే త్రిగుణవతి చ త్రి స్వరమయి
త్రిలోకైః పూజ్యేత్రి భువన భయాత్త్రాహి సతతమ్ । 19

మూడు బీజములు కలదానా ! మూడు ఓంకారములతో గూడిన మంత్రముగలదానా! మూడు అక్షరములుగల దానా! 'ఓం' అను సారభూతమగు ఈ ఒక్కమంత్రము నందే

మూడు మాత్రలు శోభిల్లుచున్నవి. మూడు కాలములలోను సేవింపదగిన దానా! త్రిగుణములు గలదానా! మూడు స్వరములుగలదానా! త్రిలోకధిపతులచే పూజింపదగినా! దానా తల్లీ! మమ్ము సాంసారిక భయమునుండి కాపాడుము .

**న చంద్రో నైవేమే నభసి వితతా తారకగణాః**
**త్విషాం రాశిరమ్యా తవ చరణయోరంబునిచయే ।**
**పతిత్వా కల్లోలైః సహ పరిచయా ద్విస్తృతిమితా**
**ప్రభాసైవాఽనన్తా గగనముకురే దీవ్యతి సదా ।** 20

ఆకాశమునందు ఈచంద్రుడు నక్షత్రములు లేవు. కాని నీ చరణముల ఛాయ నీటిలో పడి తరంగములతో పరిచయమగుటవలన విస్తరించినది. ఆకాంతియే ఆ కాశమునెడు అద్దమున దేదీప్యమానమగుచున్నది.

**త్వమేవ బ్రహ్మాణీ త్వమసి కమలా త్వం నగసుతా**
**త్రిసంధ్యం సేవన్తే చరణయుగళం యే తవ జనాః ।**
**జగజ్జాలే తేషాం విపతిత జనానామిహ శుభే**
**సముద్ధారార్థం కింమతిమతి! మతోస్తే న భవతి ।** 21

నీవే బ్రహ్మాణివి (సరస్వతివి), నీవే రుద్రాణివి (పార్వతివి), నీవే కమలవు (లక్ష్మివి), మూడు కాలములలో నీచరణములను ఎవరు సేవించుచున్నారో జగజ్జాలమున ,చిక్కుకొనియున్న ఆప్రాణులను ఉద్ధరించుటకు ఓమతిమతీ! నీకు బుద్ధి పుట్టుట లేదా! అనగా తప్పక కలుగును.

**అనేకైః పాపౌఘైర్గలిత వపుషం శోకసహితం**
**లుఠన్తం దీనం మాం విమల పదయో రేణుషు తవ ।**
**గల ద్బాష్పం శశ్వద్ జనని సహసాశ్వాసనవచో**
**బ్రువాణోత్థాప్యైత్య మృత కణికాం పాస్యతి కదా ।** 22

అనేక పాపసమూహములచే జర్జర శరీరముగలవాడను, శోకయుక్తుడను. దీనుడను అగు నన్ను నీపాదధూళిలో పొర్లాడుచు అశ్రువులతో నిండిన కన్నులు గల పాపినగు నన్ను "నాయనా! లెమ్ము" అను ఓదార్పుమాటలను పలుకుచు ఇట్టి వాగమృత కణములను నాచే నెప్పుడు త్రాగింతువోకదా!

**న వా మాదృక్ పాపీ నహి తవ సమా పాపహరణీ**
**న దుర్బుద్ధి ర్మాదృక్ న చ తవ సమా ధీవితరణీ ।**
**సమాదృగ్గర్విష్ఠో నహి తవ సమా గర్వహరణీ**
**హృది స్మృత్వా హ్యేవం మా మయి! కురు యథేచ్ఛా తవ తథా ।** 23

నావంటి పాపిలేడు, నీవంటి పాపహారిణి లేదు. నావంటి మూర్ఖుడు లేడు, నీవంటి బుద్ధిదాయి లేదు. నావంటి గర్విష్ఠి లేడు, నీవంటి గర్వహారిణి లేదు. అందువలన తల్లీ! ఇది అంతయు విచారించి నీయిష్టము వచ్చినట్లు చేయుము.

**దరీధర్తి స్వాంతేఽక్షర వర చతుర్వింశతి మితం**
**త్వదంతర్మంత్రం యత్త్వయి విహితచిత్తో హి మనుజః।**
**సమనా ద్వ్యస్తం భవతి భువి సంజీవనవనం**
**భవాంభోధే పారం వ్రజతి న చిరాం సుఖయుతః।** 24

నీ ఇరువదినాలుగక్షరములు గల మంత్రమును హృదయమున నిలుపు కొను వాడు సుఖియగును. వాడు సంసారసముద్రమును దాటును. వాని జీవితవనము కళ కళలాడును.

**భగవతి! లహరీయం రుద్ర దేవప్రణీతా**
**తవ చరణ సరోజే స్థాప్యతే భక్తి భావైః।**
**కుమతి తిమిర పంకస్యాంకమగ్నం సశంకం**
**అయి! ఖలు కురు దత్త్వా వీతశంకం స్వమంకమ్।** 25

భగవతీ! రుద్రుదేవుడు రచించిన ఈ లహరి నీచరణకమలములయందు స్థాపింపబడుచున్నది. కుమతి యనెడు అంధకారపంకమున మగ్నుడనైన, శంకితుడనైన నన్ను నీయొడిలోనికి తీసికొని నిర్భయునిగా జేయుము.

ఇతి శ్రీరుద్రదేవవిరచితా గాయత్రీ లహరీ సమాప్తా

## గాయత్రీ హారతి

జయతి జయ గాయత్రీ మాతా! జయతి జయ గాయత్రీ మాతా!
సత్‌మారగ్ పర్ హమే చలావో జో హై సుఖదాతా!

ఆదిశక్తి తు అలఖ నిరంజన జగపాలన కర్త్రీ
దుఃఖ, శోక, భయక్లేశ కలహ, దారిద్ర్యదైన్య హర్త్రీ।

బ్రహ్మ రూపిణీ, ప్రణత పాలినీ, జగద్ధాత్రి అంబే
భవ భయ హారీ, జనహితకారీ, సుఖదా, జగదంబే।

భయహారిణీ, భవతారిణీ అనఘే, అజఆనందరాశీ
అవికారీ, అఘహారీ అవిచలిత, అమలే, అవినాశీ।

కామధేను సత్, చిత్ ఆనందా, జయగంగా గీతా
సవితాకీ శాశ్వతీ శక్తి తుం సావిత్రీ, సీతా ।
ఋగు, యజు,సామ అథర్వప్రణయినీ ప్రణవమహామహిమే
కుండలినీ సహస్రార సుషుమ్నా, శోభా, గుణగరిమే ।
స్వాహా, స్వధా, శచీ, బ్రహ్మాణీ, రాధా, రుద్రాణీ,
జయ సతరూపా, వాణి, విద్యా, కమలా, కల్యాణీ ।
జననీ హమ్ హై దీన హీన దుఃఖదారిద్ కేఘేరే
యద్యపి కుటిల కపటే కపూత తవూ బాలక్ హై తేరే ।
స్నేహసనీ, కరుణామయి మాతా చరణ శరణ దీజై
బిలఖ్ రహే హమ్‌శిశు సుతతేరే దయాదృష్టి కీజై ।
కామ, క్రోధ, మద, లోభ, దంభ, దుర్భావ ద్వేష హరియే
శుద్ధబుద్ధి, నిష్పాపహృదయ, మనకో పవిత్ర కరియే ।
తుం సమర్థ సబ్ భ్రాంతి తారిణీ తుష్టి పుష్టి మాతా
సత్ మారగ్ పర్ హమేచలావో జోహై సుఖదాతా ।
జయతి జయ గాయత్రీ మాతా
జయతి జయ గాయత్రీ మాతా ।

## గాయత్రీ ఛాలీసా

ఓం భూర్భువః స్వః తత్సవితుర్వరేణ్యం
భర్గో దేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్
దోహా ః హ్రీం, శ్రీం, క్లీం, మేధాం, ప్రభా జీవన జ్యోతి ప్రచండ ।
శాంతి. కాంతి, జాగృతి, ప్రగతి, రచనాశక్తి అఖండ ।
జగత్ జనని మంగళ కరని, గాయత్రీ సుఖదామ్ ।
ప్రణవోం సావిత్రీ, స్వధా, స్వాహా పూరన కామ్ ।
భూర్భువఃస్వఃఓం యుత జననీ । గాయత్రీ నిత కలిమల దహనీ ।
అక్షర చేబిస్ పరమపునీతా । ఇనమే బసే శాస్త్ర శ్రుతి గీతా ।

శాశ్వతసతో గుణీ సతరూపా । సత్యసనాతన సుధా అనూపా ।

హంసారూఢసితంబరధారీ । స్వర్ణకాంతి శుచిగగన విహారీ ।

పుస్తకపుష్ప కమండలు మాలా । శుభ్రవర్ణతను నయనవిశాలా ।

ధ్యాన ధరత పులకిత హియహోఈ । సుఖ ఉపజత దుఃఖ దుర్మతిఖోఈ ।

కామధేను తుమ సురతరుఛాయా । నిరాకరకీ అద్భుతమాయా ।

తుమ్హరీ శరణ్‌గహై జోకోయీ ! తరైసకల సంకటసోంసోయీ ।

సరస్వతీ లక్ష్మీ తుమ్‌కాలీ । దిపై తుమ్హరీ జ్యోతి నిరాలీ ।

తుంహరీమహిమా పార నపావైం । జోశారద శతముఖ గుణాగావైం ॥

చార్ వేదకీ మాతుపునీతా । తుంబ్రహ్మాణీ గౌరీ సీతా ।

మహామంత్రజితనే జగమాహీ । కోఊగాయత్రీసమ నాహీ ।

సుమిరత హియమేంజ్ఞాన్ ప్రకాసై । ఆలసపాప అవిద్యా నాసై ।

సృష్టి బీజ జగజనని భవానీ । కాలరాత్రి వరదా కళ్యాణీ ।

బ్రహ్మ విష్ణు రుద్రసురజేతే । తుమ్ సోంపావే సురతా తేతే ।

తుమ్ భక్తన్‌కీ భక్తతుమ్హారే । జననిహి పుత్ర ప్రాణతేప్యారే ।

మహిమా అపరంపార తుంహారీ । జై జై జై త్రిపదా భయహారీ ।

పూరిత సకల జ్ఞాన విజ్ఞానా । తుమ్ సమ అధిక నజగమే ఆనా ।

తుమహి జాని కఛురహై నశేషా । తుమహిపాయకఛు రహై నక్లేశా ।

జానత తుమహింతుమహిహై జాఈ । పారస పరసి కుధాతు సుహాఈ ।

తుమ్హరీ శక్తిదిపై సబఠాఈ । మాతా తుమ్ సబ్‌ఠౌర్ సమాఈ ।

గ్రహ నక్షత్ర, బ్రహ్మాండ ఘనేరే సబ్ గతివాన్ తుమ్హారే ప్రేరే ।

సకల సృష్టికీ ప్రాణవిధాతా పాలక, పోషక, నాశక త్రాతా ।

మాతేశ్వరీ దయవ్రత ధారీ । తుమ్, సన్‌తరే పాతకి భారీ ।

జా పర్ కృపా తుమ్హరీ హోయీ । తాపర్ కృపాకరేం సబ్‌కోయీ ।

మంద బుద్ధితే బుద్ధిబలపావేం । రోగీ రోగ రహిత హై జావే ।

దారిద మిటై కటై సబపీరా । నాసై దుఃఖ హరై భవభీరా ।

గృహ క్లేశ చితచింతా భారీ । నాసై గాయత్రీ భయహారీ ।

సంతతిహీన సుసంతతి పావేం । సుఖ సంపత్తి యుత మోదమనావే ।

భూత పిశాచ సబై భయఖావేఁ। యమకే దూత్ నికట నహిఁ ఆవే ।
జో సధవాసుమిరై చిత లాయీ । అఛత సుహాగ్ సదా సఖదాయీ ।
ఘరవర సుఖ ప్రద లహైఁ కుమారీ । విధవారహేఁ సత్యవ్రతధారీ ।
జయతి జయతి జగదంబ భవానీ । తుమ్‌సమ్ ఔర్ దయాలు న దానీ ।
జోసద్గురు సోఁదీక్షాపావే । సోసాధన్ కో సఫల బనావే ।
సుమిరన్ కరైసురుచి బడభాగీ । లహైమనోరథ గృహి విరాగీ ।
అష్టసిద్ధి నవనిధికీ దాతా । సబ సమర్థ గాయాత్రీమాతా ।
ఋషి, ముని, యతి, తపస్వీయోగీ । ఆరత, అర్థీ చింతితభోగీ ॥
జోజో శరణ తుమ్హారీ ఆవే । సోసోనిజ వాంఛిత ఫలపావేం ।
బల, బుద్ధి, విద్యా, శీల, సుభాఊ । ధనవై భవ, యశ తేజ ఉఛాఊ ।
సకల బడేఁ ఉపజైఁ సుఖనానా । జోయహ్ పాఠ కరై దరిధ్యానా ॥
దోహా : యహ్ చాలీసా భక్తియుత, పాఠకరే జోకోయ్ ।
తాపర్ కృపా ప్రసన్నతా, గాయత్రీకీ హోయ్ ॥

# గాయత్రీ సహస్రనామ విజ్ఞానము

గాయత్రి భగవంతుని దివ్యశక్తులపుంజము (ప్రోగు). ఆ పుంజమున ఎన్ని యో శక్తులు ఉన్నవి. వాని సంఖ్య చెప్పనలవికానిది. దానిలో శక్తుల గనియున్నది. శాస్త్రములలో సహస్రశబ్దము అనంతమను అర్థమున ప్రయోగింప బడుచున్నది. స్థూలార్థమున సహస్రమనగా వెయ్యి. కాని ఇతరచోట్ల అనంత సంఖ్య కు సహస్రశబ్దము ప్రయుక్తమగుచున్నది. ఈశ్వరుని ప్రార్థన 'సహస్రశీర్షా' అని యున్నది.

ఈ ప్రార్థనలో ఈశ్వరుడు సహస్రమస్తకుడు , సహస్రబాహుడు, సహస్ర పాదుడు, సహస్రనేత్రుడు అని చెప్పబడినాడు. ఇక్కడ ఆ సహస్రమునకు అర్థము అనంతము, ఒక్క వెయ్యికాదు. ఇట్లు ఎన్నో ప్రమాణములున్నవి. వానివలన సహస్రమునకర్థము అనంతమని సిద్ధమగుచున్నది. గాయత్రికి సంబంధించిన అనంత శక్తులలో మనుష్యునకు చాల తక్కువ శక్తులను గూర్చియే తెలిసినది. తెలిసిన వానిలో గూడ చాలతక్కువ శక్తులే ఉపయోగములోనికి వచ్చినవి. ఏ శక్తులు ఇంతవరకు తెలిసికోనబడినవో వాని సంఖ్య దాదాపు ఒక్కవెయ్యి.

ఈ వేయిశక్తుల నామములు వానిగుణముల ననుసరించి ఏర్పడినవి. ఆ వేయినామముల వర్ణన ప్రాచీనగ్రంథములలో "గాయత్రీ సహస్రనామము" రూపమున లభించుచున్నది.

ఈ శక్తులను ఎరుగుట, తెలిసికొనుట, పఠించుట అవసరము. ఈ శక్తి పుంజమున ఏయేవిశేషములు దాగియున్నవి? మరియు గాయత్రి ప్రాప్తితో పాటు మనము ఏయేవిశేషములను మనలో నిలుపుకోనుచున్నాము. అను విషయము మనకు అవగాహనయగును. ఇది తెలిసినప్పుడే వానియుపయోగము, ప్రయోగము అగును. ఏవస్తువు యొక్క గుణమైన మహత్వమైన తెలియనంతవరకు, దాని శక్తి యొక్క పరిచయము కానంతవరకు ఆ వస్తువువలన లాభమును పొదజాలము.

గాయత్రిలో ఏ యే శక్తులున్నవి. ఆశక్తుల సహాయమును పొందుటవలన మనము ఏ యే లాభములను పొందగలము - ఈవిషయమే సహస్రనామములో పరిచయము చేయబడినది. ఎందుకనగా ఈ నామములపై చక్కగ మనస్సు నుంచుట వలన గాయత్రియొక్క సంప్రదాయము, శక్తి, ప్రకృతి, ఉపయోగము మున్నగునవి

పరిచితములగును. ఈ పరిచయము ఆ లాభప్రాప్తికి సోపానమగును. ఈ తెలివిని ఆధారము చేసికొని సాధకుడు - గాయత్రీ శక్తిలో ఫలానా ఫలానా విశేషములున్నవి. వానిని అవసరము ననుసరించి లేదా రుచిననుసరించి పొంద వచ్చును అని ఆలోచించును. ఇది తెలిసిన మీదట దాని ఉపయోగమువైపు మనస్సు పోవును, మరియు జీవితమును సంపూర్ణముగ మలచు కొనుటకు ఆ లాభములు ప్రోగుచేసికోను ప్రవృత్తి పెరుగును. దానితో పాటు ఈ మహాతత్త్వము యొక్క మహిమను గూర్చిన సమాచారము తెలియును. దానివలన ఇది యెంత అసాధారణవస్తువో తెలియగలదు. ఒకదానియొక్క మహిమను, విశేషమును, శ్రేష్ఠతను గూర్చిన సమాచారము తెలిసినమీదట దానిపై శ్రద్ధ ఉత్పన్నమగును. పరుసవేదిగుణములను తెలిసికొనిన వాడే దానిని అన్వేషించును, దానిని పొందుటకు ప్రయత్నించును. లభించిన పిమ్మట దానిని సురక్షితముగా ఉంచును. దానిని ఉపయోగించి తగిన లాభమును పొందును. ఎవనికి ఈ విషయము తెలియదో, పరుసవేది విశేషములు తెలియవో వాడు దీనిని సామాన్యమైన రాతిముక్కగా భావించును.

అందువలన సహస్రనామమును శ్రద్ధగా పఠించుటవలన కలుగు మాహాత్మ్యము శాస్త్రములలో చెప్పబడినది. రండు, శ్రద్ధగా గాయత్రీ సహస్రనామమును పఠింతము, దానిలో వర్ణింపబడిన నామములను గూర్చి ఆలోచించుచు గాయత్రీ మహిమను తెలిసికొందముగాక! దానివలన లాభమును పొందెదముగాక !

## అథ గాయత్రీ సహస్రనామస్తోత్రమ్

**నారాయణ ఉవాచ :**

**సాధు సాధు మహాప్రాజ్ఞ సమ్యక్ పృష్టం త్వయానఘ ।** 1

**శృణు వక్ష్యామి యత్నేన గాయత్ర్యష్టసహస్రకమ్ ।**
**నామ్నాం శుభానాం దివ్యానాం సర్వపాపవినాశనమ్ ।** 2

**సృష్ట్యాదౌ యద్భగవతీ పూర్వం ప్రోక్తం బ్రవీమి తే ।**
**అష్టోత్తర సహస్రస్య ఋషిర్బ్రహ్మా ప్రకీర్తితః ।** 3

**ఛన్దోఽనుష్టుప్ తథా దేవీ గాయత్రీ దేవతా స్మృతా**
**హలో బీజాని తస్యైవ స్వరాః శక్తయ ఈరితాః ।** 4

**అంగన్యాసకరన్యాసావుచ్యేతే మాతృకాక్షరైః ।**
**అథ ధ్యానం ప్రవక్ష్యామి సాధకానాం హితాయ వై ।** 5

రక్తశ్వేత హిరణ్యం నీలధవలర్యై క్తాం త్రినేత్రోజ్జ్వలామ్ ।
రక్తాం రక్తనవస్రజం మణిగణైర్యుక్తాం కుమారీ మిమామ్ ।
గాయత్రీం కమలాసనాం కరతల వ్యానద్ధకుండాంబుజాం।
పద్మాక్షీం చ వరస్రజం చ దధతీం హంసాధిరూఢాం భజే । 6

అచింత్య లక్షణా వ్యక్తాప్యర్థమాతృమహేశ్వరీ ।
అమృతార్ణవమధ్యస్థాప్యజితా చాపరాజితా । 7

అణిమాది గుణాధారా ప్యర్కమండల సంస్థితా ।
అజరా జపరాధర్మా అక్షసూత్రధరా ధరా । 8

అకారాదిక్షకారాన్తా ప్యరిషడ్వర్గ భేదినీ ।
అంజనాద్రి ప్రతీకాశాప్యంజనాద్రి నివాసినీ । 9

అదితిశ్చాజపావిద్యా ప్యరవింద నిభేక్షణా ।
అంతర్బహిఃస్థితా విద్యాధ్వంసినీ చాన్తరాత్మికా । 10

అజా చాజముఖావాసాప్యర విందనిభాననా ।
అర్ధమాత్రార్థ దానజ్ఞా ప్యరి మండలమర్దినీ । 11

అసురఘ్నీ హ్యమావాస్యాప్యలక్ష్మీ ఘ్న్యన్త్యజార్చితా ।
ఆదిలక్ష్మీ శ్చాది శక్తి రాకృతిశ్చాయతాననా । 12

ఆదిత్యపదవీచారా ప్యాదిత్య పరిసేవితా ।
ఆచార్యాఽఽవర్తనా చారాప్యాది త్యపరిసేవితా। 13

ఆగ్నేయీ చామరీ చాద్యా చారాధ్యా చాసనస్థితా ।
ఆధారనిలయాఽఽధారా చాకాశాంత నివాసినీ । 14

ఆద్యక్షర సమాయుక్తా చాంతరాకాశరూపిణీ ।
ఆదిత్యమండలగతా చాంతర ధ్వాంతనాశినీ । 15

ఇందిరా చేష్టదా చేష్టా చేందీవర నిభేక్షణా ।
ఇరావతీ చేంద్రపదా చేంద్రాణీ చేందురూపిణీ । 16

ఇక్షుకోదండ సంయుక్తా చేషు సంధానకారిణీ ।
ఇంద్రనీల సమాకారా చేడా పింగలరూపిణీ । 17

ఇంద్రాక్షీ చేశ్వరీ దేవీ చేహాత్రయవివర్జితా ।
ఉమా చోషాహ్యుడునిభా ఉర్వారుకఫలాననా । 18

ఉడుప్రభా చోడుమతీ హ్యుడుపా హ్యుడు మధ్యగా ।
ఊర్ధ్వం చాప్యూర్ధ్వ కేశీ చాప్యూర్ధ్వాధోగతిభేదినీ । 19
ఊర్ధ్వ బాహుప్రియా చోర్మిమాలా వాగ్గ్రంథదాయినీ ।
ఋతం చర్షిర్ఋతుమతీ ఋషిదేవనమస్కృతా । 20
ఋగ్వేదా ఋణభర్త్రీచ ఋషిమండల చారిణీ ।
ఋద్ధిదా ఋజుమార్గస్థా ఋజుధర్మా ఋతుప్రదా । 21
ఋగ్వేదా ఋణహర్త్రీ చ ఋషిమండలచారిణీ ।
లూతా వరసంభూతా లూతాదివిషహారిణీ । 22
ఏకాక్షరా చైకమాత్రా చైకా చైకైక నిష్ఠితా ।
ఐంద్రీ హ్యైరావతారూఢా చైహికాముష్మికప్రదా । 23
ఓంకారా హ్యోషధీ చోతాచోతప్రోత నివాసినీ ।
ఔర్వాహ్యౌషధ సంపన్నా ఔపాసన ఫలప్రదా । 24
అండమధ్య స్థితా దేవీ చాఃకారమను రూపిణీ ।
కాత్యాయనీ కాలరాత్రిః కామాక్షీకామసుందరీ । 25
కమలా కామినీ కాన్తా కామదా కలకంఠినీ ।
కరికుంభస్తనభరా కరవీర సువాసినీ । 26
కల్యాణీ కుండలవతీ కురుక్షేత్ర నివాసినీ ।
కురువిందదలాకారా కుండలీకుముదాలయా । 27
కాలజిహ్వా కరాలాస్యా కాలికా కాలరూపిణీ ।
కమనీయగుణా కాన్తిః కలాధారా కుముద్వతీ । 28
కౌశికీ కమలాకారా కామచార ప్రభంజినీ ।
కౌమారీ కరుణా పాంగీ కకుద్వంతీ కరిప్రియా । 29
కేసరీ కేశవనుతా కదంబ కుసుమప్రియా ।
కాలిందీ కాలికా కాంచీ కలశోద్భవసంస్తుతా । 30
కామమాతా క్రతుమతీ కామరూపా కృపావతీ ।
కుమారీ కుండనిలయా కిరాతీ కీరవాహనా । 31
కైకేయీ కోకిలాలాపా కేతకీ కుసుమప్రియా ।
కమండలుధరా కాలీ కర్మనిర్మూల కారిణీ । 32

కలహంసగతిః కక్షా కృతి కౌతుకమంగళా ।
కస్తూరీ తిలకా కంప్రా కరీంద్ర గమనా కుహూః ॥ 33

కర్పూరలేపనా కృష్ణా కపిలా కుహరాశ్రయా ।
కూటస్థా కుధరా కమ్రా కుక్షిస్థాఖిల విష్టపా ॥ 34

ఖడ్గ ఖేట ధరా సర్వా ఖేచరీ ఖగవాహనా ।
ఖట్వాంగ ధారిణీ ఖ్యాతా ఖగరాజోపరిస్థితా ॥ 35

ఖలఘ్నీ ఖండితజరా ఖండాఖ్యానప్రదాయినీ ।
ఖండేందు తిలకా గంగా గణేశ గుహపూజితా ॥ 36

గాయత్రీ గోమతీ గీతా గాంధారీ గానలోలుపా ।
గౌతమీ గామినీ గాధా గంధర్వాప్సర సేవితా ॥ 37

గోవింద చరణా క్రాన్తా గుణత్రయ విభావితా ।
గంధర్వీ గహ్వరీ గోత్రా గిరీశా గహనా గమీ ॥ 38

గుహావాసా గుణవతీ గురుపాపప్రణాశినీ ।
గుర్వీ గుణవతీ గుహ్యా గోప్తవ్యా గుణదాయినీ ॥ 39

గిరిజా గుహ్యా మాతంగీ గరుడధ్వజ వల్లభా ।
గర్వాపహారిణీ గోదా గోకులస్థా గదాధరా ॥ 40

గోకర్ణ నిలయా సక్తా గుహ్యామండలవర్తినీ ।
ఘర్మదా ఘనదా ఘంటా ఘోరదానవ మర్దినీ ॥ 41

ఘృణిమంత్రమయీ ఘోషా ఘనసంపాత దాయినీ ।
ఘంటారవప్రియా ఘ్రాణా ఘృణి సంతుష్టకారిణీ ॥ 42

ఘనారిమండలా ఘూర్ణా ఘృతాచీ ఘనవేగినీ ।
జ్ఞానధాతుమయీ చర్చా చర్చితా చారు హాసినీ ॥ 43

చటులా చండికా చిత్రా చిత్ర మాల్య విభూషితా ।
చతుర్భుజా చారుదన్తా చాతురీ చరితప్రదా ॥ 44

చూలికా చిత్రవస్త్రాన్తా చంద్రమః కర్ణకుండలా ।
చంద్రహాసా చారుదాత్రీ చకోరీ చంద్రహాసినీ ॥ 45

చంద్రికా చంద్రధాత్రీచ చౌరీ చౌరాచ చండికా ।
చంచ ద్వాగ్వాదినీ చంద్ర చూడా చోర వినాశినీ ॥ 46

చారు చందన లిప్తాంగీ చంచచ్చామరవీజితా ।
చారుమధ్యా చారుగతి శ్చందిలా చంద్రరూపిణీ ॥ 47

చారుహోమప్రియా చార్వాచరితా చక్రబాహుకా ॥
చంద్రమండల మధ్యస్థా చంద్రమండల దర్పణా ॥ 48

చక్ర వాకస్తనీ చేష్టా చిత్రా చారు విలాసినీ ।
చిత్స్వ రూపా చంద్రవతీ చంద్రమాశ్చన్దనప్రియా ॥ 49

చోదయిత్రీ చిరప్రజ్ఞాచాకా చారుహేతుకీ ।
ఛత్రయాతా ఛత్రధరా ఛాయా ఛన్దః పరిచ్ఛదా ॥ 50

ఛాయాదేవీ ఛిద్ర నఖా ఛిన్నేంద్రియ విసర్పిణీ ।
ఛన్దోనుష్టుప్ ప్రతిష్ఠాన్తా ఛిద్రోపద్రవ భేదినీ ॥ 51

ఛేదా ఛత్రేశ్వరీ ఛిన్నా ఛురికా ఛేదనప్రియా ।
జననీ జన్మరహితా జాతవేదా జగన్మయీ ॥ 52

జాహ్నవీ జటిలా జేత్రీ జరామరణ వర్జితా ।
జంబూద్వీపవతీ జ్వాలా జయన్తీ జలశాలినీ ॥ 53

జితేంద్రియా జితక్రోధా జితామిత్రా జగత్ప్రియా ।
జాతరూపమయీ జిహ్వా జానకీ జగతీ జరా ॥ 54

జనిత్రీ జహ్ను తనయా జగత్త్రయ హితైషిణీ ।
జ్వాలా ముఖీ జపవతీ జ్వరఘ్నీ జితవిష్టపా ॥ 55

జితాక్రాన్తమయీ జ్వాలా జాగ్రతీ జ్వరదేవతా ।
జ్వలన్తీ జలదా జ్యేష్ఠా జ్యాఘోషా స్ఫోట దిఙ్ముఖీ ॥ 56

జమ్భినీ జృమ్భణాజృమ్భా జ్వలన్మాణిక్య కుండలా ।
ఝం ఝకా ఝణ నిర్ఘోషా ఝంఝా మారుత వేగినీ ॥ 57

ఝల్లరీ వాద్యకుశలా ఞరూపా ఞభుజా స్మృతా ।
టంకబాణసమాయుక్తా టంకినీ టంకభేదినీ ॥ 58

టంకీగణ కృతా ఘోషా టంకనీయమహోరసా ।
టంకారకారిణీ దేవీ ఠఠ శబ్ద నినాదినీ ॥ 59

డామరీ డాకినీ డింభా డుండు మారైక నిర్జితా ।
డామరీ తంత్ర మార్గస్థా డమడ్డమరునాదినీ ॥ 60

డిండీరవనహా డింభలసత్క్రీడా పరాయణా ।
ఢుంఢివిఘ్నేశ జననీ ఢక్కాహస్తా ఢిలివ్రజా ॥ 61

నిత్యజ్ఞానా నిరుపమా నిర్గుణా నర్మదా నదీ ।
త్రిగుణా త్రిపదా తంత్రీ తులసీ తరుణా తరుః ॥ 62

త్రివిక్రమ పదాక్రాన్తా తురీయ పదగామినీ ।
తరుణాదిత్య సంకాశా తామసీ తుహినాతురా ॥ 63

త్రికాలజ్ఞాన సంపన్నా త్రివేణీచ త్రిలోచనా ।
త్రిశక్తి స్త్రిపురా తుంగా తురంగ వదనా తథా ॥ 64

తిమింగిలగిలా తీవ్రా త్రిస్రోతా తామసాదినీ ।
తంత్రమంత్ర విశేషజ్ఞా తనుమధ్యా త్రివిష్టపా ॥ 65
త్రిసంధ్యా త్రిస్తనీ తోషా సంస్థా తాలప్రతాపినీ ।
తాటంకినీ తుషారాభా తుహినాచలవాసినీ ॥ 66

తంతుజాల సమాయుక్తా తారహారావలి ప్రియా ।
తిలహోమ ప్రియా తీర్థా తమాల కుసుమాకృతిః ॥ 67

తారకా త్రియుతా తన్వీ త్రిశంకు పరివారితా ।
తలోదరీ తిలాభూషా తాటంక ప్రియవాహినీ ॥ 68

త్రిజటా తిత్తిరీ తృష్ణా త్రివిధా తరుణా కృతిః ।
తప్తకాంచన సంకాశా తప్త కాంచన భూషణా ॥ 69

త్రైయంబకా త్రివర్గా చ త్రికాలజ్ఞానదాయినీ ।
తర్పణా తృప్తిదా తృప్తా తామసీ తుంబురుస్తుతా ॥ 70

తార్క్ష్యస్థా త్రిగుణా కారా త్రిభంగీ తను వల్లరిః ।
థాత్కారీ థారవా థాన్తా దోహినీ దీనవత్సలా ॥ 71

దానవాన్తకరీ దుర్గా దుర్గాసుర నిబర్హిణీ ।
దేవరీతిర్దివా రాత్రిః ద్రౌపదీ దుందుభి స్వనా ॥ 72

దేవయానీ దురావాసా దారిద్ర్యో ద్భేదినీ దివా ।
దామోదరప్రియా దీప్తా దిగ్వాసా దిగ్విమోహినీ ॥ 73

దండకారణ్య నిలయా దండినీ దేవపూజితా ।
దేవవంద్యా దివిషదా ద్వేషిణీ దానవాకృతిః ॥ 74

దీవానాథస్తుతా దీక్షా దైవతాది స్వరూపిణీ ।
ధాత్రీ ధను ర్ధరా ధేను ర్ధారిణీ ధర్మచారిణీ ॥ 75

ధరన్ధరా ధరాధారా ధనదా ధాన్యదోహినీ ।
ధర్మశీలా ధనాధ్యక్షా ధనుర్వేద విశారదా ॥ 76

ధృతిర్ధన్యా ధృతపదా ధర్మరాజప్రియా ధ్రువా ।
ధూమావతీ ధూమకేశీ ధర్మశాస్త్ర ప్రకాశినీ ॥ 77

నందా నందప్రియా నిద్రా నృనుతా నందనాత్మికా ।
నర్మదా నళినీ నీలా నీల కంఠ సమాశ్రయా ॥ 78

నారాయణ ప్రియా నిత్యా నిర్మలా నిర్గుణా నిధిః ।
నిరాధారా నిరుపమా నిత్యశుద్ధా నిరంజనా ॥ 79

నాదబిందు కలాతీతా నాదబిందు కలాత్మికా ।
నృసింహనీ నగధరా నృపనాగ విభూషితా ॥ 80

నరకక్లేశ శమనీ నారాయణ పదోద్భవా ।
నిరవద్యా నిరాకారా నారదప్రియ కారిణీ ॥ 81

నానాజ్యోతిః సమాఖ్యాతా నిధిదా నిర్మలాత్మికా ।
నవసూత్రధరా నీతిర్నిరుపద్రవకారిణీ ॥ 82

నందజా నవరత్నాఢ్యా నైమిశారణ్యవాసినీ ।
నవనీతప్రియా నారీ నీలజీమూత నిస్వనా ॥ 83

నిమేషిణీ నదీరూపా నీలగ్రీవా నిశీశ్వరీ ।
నామావలిర్నిశుంభఘ్నీ నాగలోకనివాసినీ ॥ 84

నవజాంబూనదప్రఖ్యా నాగలోకాధిదేవతా।
నూపురాక్రాన్తచరణా నరచిత్త ప్రమోదినీ ॥ 85

నిమగ్నా రక్తనయనా నిర్ఘాతసమనిస్వనా ।
నందనోద్యాన నిలయా నిర్వ్యూహోపరిచారిణీ ॥ 86

పార్వతీ పరమోదారా పరబ్రహ్మాత్మికా పరా ।
పంచకోశ వినిర్ముక్తా పంచపాతకనాశినీ ॥ 87

పరచిత్త విధానజ్ఞా పంచికా పంచరూపిణీ ।
పూర్ణిమా పరమా ప్రీతిః పరతేజః ప్రకాశినీ ॥ 88

పురాణీ పౌరుషీ పుణ్యా పుండరీక విభేక్షణా ।
పాతాలతల నిర్మగ్నా ప్రీతా ప్రీతివివర్ధినీ ॥ 89
పావనీ పాదసహితా పేశలా పవనాశినీ ।
ప్రజాపతిః పరిశ్రాన్తా పర్వతస్తన మండలా ॥ 90
పద్మప్రియా పద్మసంస్థా పద్మాక్షీ పద్మసంభవా ।
పద్మపత్రా పద్మపదా పద్మినీ ప్రియభాషిణీ ॥ 91
పశుపాశ వినిర్ముక్తా పురంధ్రీ పురవాసినీ ।
పుష్కలా పురుషా పర్వా పారిజాత సుమప్రియా ॥ 92
పతివ్రతా పవిత్రాంగీ పుష్పహాసపరాయణా ।
ప్రజ్ఞావతీ సుతా పౌత్రీ పుత్రపూజ్యా పయస్వినీ ॥ 93
పట్టి పాశధరా పంక్తి పితృలోక ప్రదాయినీ ।
పురాణీ పుణ్యశీలా చ ప్రణతార్తి వినాశినీ ॥ 94
ప్రద్యుమ్న జననీ పుష్టా పితామహ పరిగ్రహా ।
పుండరీక పురావాసా పుండరీకసమాననా ॥ 95
పృథుజంఘా పృథు భుజా పృథుపాదా పృథూదరీ ।
ప్రవాల శోభా పింగాక్షీ పీతవాసాః ప్రచాపలా ॥ 96
ప్రసవా పుష్టిదా పుణ్యా ప్రతిష్ఠా ప్రణవాగతిః ।
పంచవర్ణా పంచవాణీ పంచికా పంజరస్థితా ॥ 97
పరమాయా పరజ్యోతిః పరప్రీతిః పరాగతిః ।
పరాకాష్ఠా పరేశానీ పావినీ పావకద్యుతిః ॥ 98
పుణ్యభద్రా పరిచ్ఛేద్యా పుష్పహాసా పృథూదరీ ।
పీతాంగీ పీతవసనా పీతశయ్యా పిశాచినీ ॥ 99
పీతక్రియా పిశాచఘ్నీ పాటలాక్షీ పటుక్రియా ।
పంచభక్ష ప్రియాచారా పూతనా ప్రాణఘాతినీ ॥ 100
పున్నాగవనమధ్యస్థా పుణ్యతీర్థనిషేవితా ।
పంచాంగీ చ పరాశక్తిః పరమాహ్లాదకారిణీ ॥ 101
పుష్పకాండ స్థితా పూషా పోషితాఖిల విష్టపా ।
ప్రాణప్రియా పంచశిఖా పన్నగోపరి శాయినీ ॥ 102

